శ్రీమదాంధ్ర మహాభారత

# శిల్పకళా దర్శనము

ద్వితీయ భాగము



డా॥ శోభిరాల సత్యనారాయణ,
యం.ఏ., పిహెచ్.డి.

శ్రీ విశ్వకర్మా విజ్ఞాన కేంద్ర
శ్రీకాకుళం

శ్రీమదాంధ్ర మహాభారత

# శిల్పకళా దర్శనము

## ద్వితీయ భాగము

[ యజ్ఞ శిల్పము - పూర్త శిల్పము ]

డా॥ శోభిరాల సత్యనారాయణ,
యం. ఏ., పిహెచ్ డి.

తెలుగు విశ్వ విద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురితం



1990

ప్రతులు : వేయి    మూల్యము : రూ. 50/-

శ్రీ విశ్వకర్మా విజ్ఞాన కేంద్ర
శ్రీకాకుళం - 532 001

**SRIMADANDHRA MAHABHARATA**

# SILPAKALADARSANAMU - Part II

( YAGNA SILPA AND POORTHA SILPA )

**By Dr. Sobhirala Satyanarayana**



ప్రతులు దొరకుచోటు :

1) డాక్టర్ యస్. ఎన్. శోభిరాల
సంచాలక్, శ్రీ విశ్వకర్మ విజ్ఞానకేంద్ర
1-4/6-7, శాంతినగర్,
శ్రీకాకుళం - 532 001

2) కుమారి శోభిరాల శ్రీవిద్య
శ్రీవిద్యా నికేతన్,
1-4/6-7, శాంతినగర్,
శ్రీకాకుళం - 532 001

ముద్రణ : మహోదయ పవర్ ప్రెస్, శ్రీకాకుళం.

# Srimadandhra Mahabharata
# SILPAKALADARSANAMU

## Part - II

Dr. Sobhirala Satyanarayana,
M. A.. (Quadruple) Ph. D.,



శ్రీలక్ష్మీ రమణుండగు
బాలాజీ భవ్యపాదపద్మములకున్
వాలాయము ప్రణమిల్లెదఁ
బాలించెడుఁగాక సకలభాగ్యప్రదుఁడై

— శోభిరాల



This book is Published
with the financial assistance of
**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**
Under their Scheme
" AID to Publish Religious Books "

# AWARD OF GOLD MEDAL

## Andhra University

No, S. I. (3) /6/85, Waltair, Dt. 22-5-1985.

## NOTIFICATION

### AWARD OF RESEARCH MEDALS / PRIZES

The following candidates whose Ph. D, theses have been adjudged to be the best among those accepted by the University, during the years mentioned, have been awarded the Research Medals/Prizes noted against each.

**Faculty of Arts :**

| Name of the Candidate | Prize/Medal | Year |
|---|---|---|
| 1) ... ... ... | ... ... | ... |
| 2) Dr. S. Satyanarayana, Lecturer in Telugu, Govt. Arts College, SRIKAKULAM. | Srr Tripuraneni Gopichand Memorial Medal | 1984 |

University Office,
Waltair,
Date : 28-5-1985.

Sd/- C. V. APPA RAO,
Controller of Examinations.

/ True Extract /



నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్ ॥

విశ్వకర్మన్ నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వసంభవ ।
అపవర్గోఽసి భూతానాం పంచానాం పరతః స్థితః॥

*　　　　*　　　　*

నారాయణః పరంబ్రహ్మ నారాయణ పరం తపః
నారాయణః పరో దేవః సర్వం నారాయణః సదా ॥

— మహాభారతము - శాంతిపర్వము.

నరనారాయణతత్త్వము
నరోత్తముని ధర్మమును మనంబున వెలుఁగన్
విరచింతును జయగ్రంథము
సరస్వతీదేవి కెఱిగి సకలార్థముగా.

# చైతన్య దీప్తి

సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమాం
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్.

సిద్ధపురుషుఁడు కైలాసశిఖరవాసి
యొక మహాయోగి యేతెంచి యొకదినమ్ము
వెలుఁగుఁ జూపించె విద్యావివేకదీప్తి
నమ్మహాత్మునిఁ దలఁతు నత్యంతభక్తి.

రాగమయికావ్యతత్త్వార్థరామణీయ
కములు విని మెచ్చి హర్షబాష్పముల తోడ
శిరముపై హస్తముంచి యాశీస్సు లిడిన
శ్రీ శ్రియానందనాథ దేశికు స్మరింతు.

వేదాధ్యయనపరాయణుఁ
డాదర్శగురుండు లింగయాచార్యునకున్
స్వాదిష్టున కస్మత్ పితృ
పాదుల కభివాదనములు ప్రత్యర్షులకున్,

తన తనయుని బహువిద్యా
ధనయుతునిగఁజేయ సంతతము దైవతపూ
జనములఁ గడపిన జననికి
మనస్వినికి నాగరత్నమకు వందనముల్.

శతసంఖ్యాకవిమర్శకాగ్రణులు విస్తారంబు శోధించి భా
రత మందున్న విశేషముల్ తెలిపి రశాగ్రంతంబుగా మత్పురా
కృతభాగ్యోన్నతి నే మనీషియుఁ గళాదృష్టిన్ గనన్లేదు, సు
వ్రతుఁడై శిల్పకళారహస్యములు తెల్పన్లేదు నా కిమ్ముగా

చూచితి నాంధ్రభారతముఁ జూచితి వ్యాసకృతార్థవేదమున్,
జూచితి నిందు నందుఁ గల సుందరశిల్పకళాప్రబంధముల్;
సూచనలన్ గ్రహించి పరిశోధనఁ జేయుచు భవ్యభారతీ
శ్రీ చరణాబ్జసేవనము చేసితిఁ బ్రాజ్ఞులు చూచి మెచ్చఁగా.

మధురాక్కర :

చెలిమి శ్రీమహాభారతశిల్పకళాదర్శనా
కలనఁ జేదోడువాదోడుగా నిల్చిన కులపాలిన్
బలుకుఁజెలి వంటి నేర్పరిన్ బాలాత్రిపురసుందరిన్
గలిమిచూపుల కాంలంటి కరుణతోఁ బ్రోచుఁ గాత

కూచిపూడి నృత్యకుశల, రాష్ట్రస్థాయి
పాటవంపు స్పర్ధఁ బ్రథమగణ్య ;
కొమరుమిగులు కూర్మి కొమరిత శ్రీవిద్య
నేలుఁగాత జగము నేలు తల్లి.



# సకలాంజలి

ఓం ఐం హ్రీం శ్రీం
సకలాయై నమః

★ ★ ★ ★

సకలజగజ్జనయిత్రిని
సకలాధిష్ఠానరూప సర్వాధారన్
సకల మనోన్మని సమరస
సకలేష్టద శాస్త్రసార సన్నుతిఁ జేతున్

కంజలోచన కమనీయ కారయిత్రి
కంబుకంఠి కలాలాప కావ్యలోల
కర్మఫలదాత్రి కామేశి కల్పవల్లి
కరుణ మమ్మేలు గాత విజ్ఞానకలన.

లక్షణోజ్జ్వలదివ్యాంగి లబ్ధరూప
లబ్ధనానాగమస్థితి లబ్ధభోగ
లక్షకోట్యండనాయిక లలిత మాకు
లబ్ధసంపత్సమున్నతి లభ్య మగుత :

హ్రీంకారాంగణదీపిక
హ్రీంకారసువర్ణసౌధశృంగకపోతిన్
హ్రీంకారాధ్వరదక్షిణ
హ్రీంకారేశ్వరిఁ దలంతు హృత్కమలమునన్.



— శోభిరాల

# ప్రస్తావన

శ్రీదేవి కరుణాకటాక్షవీక్షణముల వలన శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళాదర్శనము చేసి మనోరథసిద్ధి పొందితిని.

శ్రీనివాసుని యనుగ్రహము వలన నా గ్రంథము వెలుఁగుచూచుచున్నది.

శ్రీమదాంధ్రమహాభారతశిల్పకళాదర్శనము ప్రథమభాగమున సాహిత్యము-శిల్పము, వాస్తుశిల్పము మాత్రమే ప్రచురింపఁగలిగితిని.

ఈ ద్వితీయభాగము యజ్ఞశిల్పము పూర్తశిల్పము నను నంశము లున్నవి.

మహాభారతకాలమునందు ప్రజలు ఇష్టాపూర్తముల వలన పుణ్యలోకములు గలుగు నని విశ్వసించిరి.

యజ్ఞముల వలన వర్షములు గురియు నని భగవద్గీత చెప్పుచున్నది. మాంధాత యనేకయజ్ఞములు చేసి వర్షములు గురియించినాఁడు.

రాజులు ముఖ్యముగా రాజసూయాశ్వమేధయాగములు చేయుచుండిరి.

ధర్మరాజొనరించిన రాజసూయయాగమును నన్నయ రమణీయముగా వర్ణించినాఁడు.

సహదేవుఁడనేకశిల్పివరుల రావించి, శాస్త్రోపదిష్టప్రమాణలక్షణముల యజ్ఞోపకరణతతుల యజ్ఞాయతనమున నతిరమణీయముగ నుండ నొనరించి నట్లు వర్ణింపఁబడినది.

జనమేజయుఁ డొనరించిన సర్పయాగమున యజ్ఞాయతనము 'శాస్త్రోపదిష్ట ప్రమాణలక్షణనిపుణశిల్పాచార్యవినిర్మిత' మని నన్నపార్యుడు వర్ణించినాఁడు.

శిల్పాచార్యులు పాటింపవలసిన శాస్త్రోపదిష్టప్రమాణములేవి? లక్షణము లేవి ? యజ్ఞోపకరణము లేవి ?

ఈ యంశములను సాయణభాష్యోపేతమయిన కృష్ణయజుర్వేదము, శుక్లయజుర్వేదము, శతపథబ్రాహ్మణము, తాండ్యమహాబ్రాహ్మణము మున్నగు వైదికగ్రంథము లాధారముగా పరిశీలించి వివరించితిని.

అశ్వమేధపర్వమున తిక్కన సోమయాజి యశ్వమేధయాగ విధాన విశేషములను విపులముగా వర్ణించినాఁడు.

ధర్మజుని అశ్వమేధయాగమునందు స్థపతులు - తదితరశిల్పులు తమ శిల్పచాతుర్యమును జూపి చతుశ్చిత్యంబును గరుడాకృతియునుంగా యజ్ఞవేదికను నిర్మించిరి.

ఈ యజ్ఞవేదికానిర్మాణమున శిల్పాచార్యు లనుసరించిన పద్ధతులు, ఇష్టకోపధానము, యూపనిర్మాణస్థాపనములు మొదలుగాఁ గల వివిధాంశములు వివరించితిని.

అశ్వమేధయాగమునం దెక్కడఁ జూచినను శిల్పాచార్యులు శిల్పాభిమాని దేవతలు దర్శన మిచ్చుచున్నారు.

శిల్పప్రాధాన్యములగు వాజపేయము, బృహస్పతిసవము. విశ్వజిద్యాగము మున్నగు యజ్ఞవిశేషములను తెలిపితిని.

ఎఱ్ఱన గయాశ్వమేధములను, వైష్ణవయాగమును సంగ్రహముగా వర్ణించినాడు. చయనక్రతువులను గుఱించి కొంత చెప్పినాఁడు.

పంచమహాయజ్ఞములందును, షోడశసంస్కారములందును శిల్పుల పాత్ర ప్రశంసనీయముగ నున్నది.

వాపీకూపతటాకదేవతాయతనాది పూర్తశిల్పములు పుణ్యలోకములు ప్రసాదించు నని మహాభారతకాలీనప్రజలు విశ్వసించిరి.

మహాభారతకాలమున మూర్తిపూజ ప్రచురముగనెయున్నది. శివాలయములు దుర్గాలయములు నున్నవి.

జనులు తీర్థయాత్రాసక్తులై యుండిరి. యాత్రాస్థలములందు వివిధ దేవతలకు పూజాస్థానములున్నవి.

ప్రతిమాశిల్పము ప్రాథమికదశను దాటి పరిణతదశోన్ముఖమై యున్నది. దేవతా ప్రతిమానిర్మాణమున కవసరమగు రూపలక్షణములు మహాభారతము నందు వర్ణింపఁబడియున్నవి. ఆ వర్ణనముల ననుసరించి ప్రతిమాకారులు వివిధదేవతలకు రూపకల్పనము చేసి మృణ్మయాదిద్రవ్యములతో ప్రతిమలను నిర్మించి దేవాలయములందు స్థాపించుచుండి రని యూహింపవచ్చును.

విగ్రహస్థాపనపూజనాదుల దేవకార్యములందు దేవకర్మకర్తలు శిల్పాచార్యులకు సహాయకులుగా నుండిరి.

ఈ విధముగా శిల్పాచార్యులు యజ్ఞపూర్తశిల్పములందు ప్రధానపాత్ర వహించి తత్కాలానుగుణమయిన ప్రజాహితకార్యములుచేయుచుండి రని తెలియుచున్నది.

యజ్ఞపూర్తశిల్పములవిషయమై బహుగ్రంథావలోకనముచేసి చేసిన నా సారస్వతయజ్ఞము సాహిత్యోపాసకుల కామోదయోగ్యమై సాఫల్యము నొందుఁగాక !

ఇతి శమ్.

# అనుక్రమణిక

## న్మేషము : యజ్ఞశిల్పము


| | |
|---|---|
| ం | 1 |
| ండు | 9 |
| | 15 |
| | 18 |
| హాయజ్ఞ ప్రాశస్త్యము | 21 |
| రాజసూయము | 23 |
| ము | 39 |
| ాగము | 42 |
| హితాధ్వరము | 46 |
| శ్వమేధయాగము | 48 |
| హ్మణము స్థపతుల శిల్ప చాతుర్యము | 58 |
| ధములు | 67 |
| యజ్ఞాయతనములు | 71 |
| హుయజ్ఞములు | 73 |
| ము | 79 |
| యజ్ఞము | 81 |
| ం | 86 |
| పము | 89 |
| యజ్ఞము | 90 |
| వ విశ్వకర్మయజ్ఞము | 98 |
| ని యజ్ఞవేది | 101 |
| ము | 162 |
| | 104 |
| ని సర్పయాగము | 110 |
| యజ్ఞములు | 113 |
| ారములు | 124 |
| ధులలో శిల్పులపాత్ర | 125 |
| సమీక్ష | 138 |

# చతుర్థోన్మేషము : పూర్తశిల్పము.


పూర్తశిల్పము
పూర్తశిల్పము - పుణ్యలోకములు
వాపీకూప తటాకములు
దేవతాయతనములు : చైత్యములు
చైత్యములు
దేవాలయనిర్మాణపద్ధతులు
స్థపతి స్థాపకులు
పరమాత్మ స్వరూపము
సగుణోపాసనము మూర్తికల్పనము
ప్రతిమాశిల్పము
ఇంద్రోత్సవము : ప్రతీకపూజ
అగ్నిపూజ
అగ్నిదేవుని రూపకల్పన
సూర్యోపాసనము
సమాజము : పశుపతిపూజ
మాతృదేవతారాధనము
బ్రహ్మపూజ : బ్రహ్మోత్సవము
బ్రహ్మ - విశ్వకర్మ
ప్రసన్న సరస్వతి
విష్ణువు
లక్ష్మి
గణపతి
దేవతాప్రతిమలు - ప్రతిమాకారకులు
పూర్తశిల్ప సమీక్ష




Prof. S. V. JOGA RAO
M. A. Ph. D., Hon. D. Litt. (A. U. & U. S. A.)
National Professor of Telugu,
U. G. C Emeritus Fellow
Andhra Universtiy
National Sahitya Acadamy Awardee 1989

Visakhapatnam

2-9-90

# సహృదయభూమిక

రాగమయి అని ఒకే ఒక్క రసవత్ ఖండకావ్యరచనతో అద్యతనాంధ్ర కవి ప్రపంచమున అఖండ ప్రతిష్ఠ నార్జించిన డా॥ శోభిరాల సత్యనారాయణగారి శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము అను మహా గ్రంథమును సమీక్షించితిని. ఆ పరిశోధనానిబంధ నిర్మాణము నందు ప్రదర్శితమైన వారి ప్రజ్ఞాపరిణాహమునకు ఆశ్చర్య చకితుడనైతిని.

భారతీయ విజ్ఞాన భాండాగారమైన మహాభారతము లోని వివిధాంశముల గురించి ఇప్పటికెందరో మహానుభావులు విస్తృతమైన పరిశోధనలు చేశారు. కాని అందులో తత్రతత్ర నిక్షేపింపబడిన అనేక శిల్పకళా రహస్యముల గురించి పరిశోధన ఇంతవరకు జరగలేదు. ఆ విషయాన్ని డాక్టర్ పట్టా కొఱకు విషయంగా గ్రహించడం ఎంతో సాహస మనిపించుకుంటుంది.

అయితే కవితాశిల్ప దర్శనప్రదర్శనములందు కృతహస్తులు, లబ్ధ ప్రతిష్ఠులు నయిన సత్యనారాయణగా రందుకు సమర్థులు కనుక ఆవిషయం చేపట్టి, ఆధార గ్రంథేతరము లనేకములు కూడ సంప్రదించి సప్రమాణంగా తన పరిశోధన నిబద్ధమునకు అపురూపమైన రూపకల్పన చేసి నిపుణ నిర్వహణము చక్కగా నిరూపించుకున్నారు. ఇందులో వారి పాండిత్య శౌండీర్యము బహుధా ప్రదర్శితమైనది.

సత్యనారాయణ గారి భారతాధ్యయనం ఒక కర్మిష్ఠుని కఠోరనిష్ఠతో కొనసాగింది. ఈ గ్రంథమునందు ప్రతిఫలించిన శిల్పకళా దర్శనము మరీ అద్భుతము. అపూర్వము. శ్రీ శోభిరాల వారిని నేను మనసారా అభినందిస్తున్నాను.

ఈ గ్రంథానికి వారు చేసిన వ్యపదేశము శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళా దర్శన మని. నిజంగా ఇది ఒక దర్శన గ్రంథస్థాయి నందుకొంది.

(సం) యస్వీ

Veda Meemamsa Saarvabhouma
Vedardha Samrat
Sastra Ratnakara
**Remella Suryaprakasa Sastry**
Retd. Principal
S. G. V. P. Oriental College
T. T. D. Vedaparayana Scheme
Executive Committee Member.

వేదమీమాంసా సార్వభౌమ
సాంగవేదార్థ సమ్రాట్
శాస్త్ర రత్నాకర
రేమెళ్ల సూర్యప్రకాశ శాస్త్రి
టి. టి. డి. వేదపారాయణ స్కీమ్
ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబరు

Sithampeta
Rajahmundry - 533 404

Dt. 12-9-1990.

# వైదికవాణి

శ్రీ శోభిరాల సత్యనారాయణ, యమ్. ఎ., పిహెచ్. డి., గారు రచించిన శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము - ద్వితీయభాగము - నామూలాగ్రముగఁ జదివితిని. గ్రంథకర్త ఈ భాగమున యజ్ఞశిల్పము - పూర్తశిల్పము సప్రమాణముగ వర్ణించుటయే లక్ష్యమని గ్రంథాదిలోఁ బ్రస్తావించిరి.

శిల్ప శాస్త్రము చాల ప్రాచీనమైన దని నిరూపించుటకు కేవలము సంస్కృతాంధ్ర భారతములనేగాక. ఆయా శ్రౌతకర్మలయందు వినియోగింపఁ బడు మంత్రములను ఆ మంత్రములను చూపుటకై వేదమందలి బ్రాహ్మణ వాక్యములను ఆయా శ్రౌత సూత్రములను గూడ పెక్కుచోట్ల ఉదాహరించిరి. వీటిని బట్టి వీరి సర్వతోముఖ పాండిత్య మాశ్చర్యము కలిగించుచున్నది.

శిల్పశాస్త్రము ప్రాచీనమైన దని దీనియొక్క ఆవశ్యకత యజ్ఞ సంభార యజ్ఞశాలాదుల నిర్మాణమునందును, ధర్మరాజాదుల రాజసూయ అశ్వమేధాది క్రతువులను వీక్షించుటకై వచ్చినవారికి విశ్రాంతి గృహ నిర్మాణములందును, పూర్త (అలయ, ఆరామాదుల) నిర్మాణములందును శిల్పశాస్త్రము, శిల్ప శాస్త్రజ్ఞులయొక్క అవసరము కలిగియున్నట్లు నిరూపించుటకై బహుగ్రంథములను పరిశోధించి సమయోచితముగ నుదాహరించుటలో వీరి పాండిత్యప్రకర్ష అద్వితీయ మని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

వేదశాస్త్రములయొక్క అర్థములను నిర్ణయించుటకై నిరుక్త మీమాంసా కల్పసూత్రముల అవశ్యకత యెంతేని గలదు. వాని ననుసరించి గ్రహింపఁదగిన విశేషార్థములను కొన్నింటిని దిఙ్మాత్రముగా సూచించుచున్నాను.

36వ పుటలో అభిషేచనీయ పదమునకు రాజసూయాంగమయిన అభిషేచనీయాఖ్య సోమయాగమని యర్థము.

60వ పుటలో చయన - పంచచితుల విషయమున చయన మనునది అగ్నిసంస్కారకర్మమనియు, ఉఖ్యాగ్నిధారణ మొక సంవత్సరకాలమనియుఁ దెలియవలెను.

64వ పుటలో "యూపాంశ్చశాస్త్రపఠితాన్" అనగా వేదశ్రౌత సూత్రము లందు పఠింపఁబడిన యూపము లని యర్థము.

84వ పుటలో "విశ్వజిచ్ఛిల్పః విశ్వంవా ఏష స్తోమానాం" అను శ్రుతికి (శిల్పాఖ్యస్తోమము లనునవి లేనేలేవు గనుక) సోమక్లప్తి శిల్పమువలె నున్నదని యర్థము చెప్పవలెను.

89వ పుటలో బృహస్పతి సవము (స్థపతి సవము) ఇచ్చట స్థపతి శబ్దమునకు ప్రకరణము ననుసరించి ధర్మార్థ మభిషిక్తుడైన వాడని యర్థము చెప్పవలెను.

110వ పుటలో జనమేజయ సర్పయాగము నందు,

తతస్తే ఋత్విజ స్తస్య శాస్త్రతో ద్విజసత్తమ।

అనుటచే ఋత్విక్కులే యజ్ఞవేదీ యజ్ఞసంభరణ నిర్మాణ కౌశల్యము గలవారు.

116వ పుటలో "ఋక్సామయోః శిల్పే స్థః" అను నప్పుడు కృష్ణాజినము నందలి శుక్లకృష్ణ రేఖలు ఋక్సామవేదములకు సంబంధించిన వనియు వానిని స్పృశించుట యనియు నర్థము.

షోడశ సంస్కారములందును, ఇంద్ర వజ్రోత్సవాదుల యందును, దేవాలయ ప్రతిమా నిర్మాణాదులందును ముందుగా శిల్పకారుల యవసర మున్నది. కాని వారే ఆ కర్మలను, అలయ ప్రతిష్ఠాదులను నిర్వహించు

చున్నారనియు, వా రెల్లరు విశ్వబ్రాహ్మణవంశమునకుఁ జెందినవా రనియుఁ జెప్పుటకంటె ఆయా కర్మములందు శిల్పశాస్త్రము - శిల్పశాస్త్రజ్ఞుల యవసరము గూడ నున్నట్లు వేదమున సూచింపఁబడిన దనియు అగ్నీంద్రాది దేవతలందరికి శిల్పము గూడ తెలియు ననియుఁ జెప్పికొనుట మంచిది.

వేదములందు ఒకే శబ్దమునకు భిన్న భిన్న స్థలములందు భిన్న భిన్నార్థములు చెప్పఁబడినవి.

ఉదాహరణమునకు వివిధ ప్రకరణములలో వినియోగింపఁబడు మంత్రములందలి విశ్వకర్మన్ శబ్దమునకు తత్తత్ ప్రకరణానుసారము ప్రజాపతి, అగ్ని, ఇంద్రుడు, పరమాత్మ - ఇత్యాద్యనేకార్థముల నాశ్రయింప వలసియున్నది.

92వ పుటలో "ధ్రువాసి ధరుణా స్తృతా విశ్వకర్మణా సుకృతా" అను మంత్రమున విశ్వకర్మన్ శబ్దమునకు ప్రజాపతి యనియు,

చోశేష్టకోపధానమున వినియోగింపబడు "అయం దక్షిణా విశ్వకర్మణా" అను మంత్రమున విశ్వకర్మ శబ్దమునకు అగ్ని యనియు,

సాయణభాష్యానుసారముగ నన్వయము చేసికొనవలెను.

ఈ విధముగా ప్రకరణానుసారముగా సాయణ, ఉవ్వట, మహీధర, భట్టభాస్కరాది వైదిక సంప్రదాయజ్ఞులైన వారల భాష్యానుసారముగ యౌగి కార్థమును రూఢ్యర్థమును, యోగ రూఢ్యర్థములను గ్రహించుచు, వేదములు ధర్మ బ్రహ్మములను బోధించుటయందే పరమ తాత్పర్యమనియు, అవాంతర తాత్పర్యవిధముగ శిల్పవాస్తు వృక్ష విద్యుద్ వ్యవసాయ రాజనీత్యాద్యనేక విషయక విజ్ఞానమునకు గూడ నాకరము లనియు తదనుసారముగనే వేద వ్యాస భారతాది రచనలు కొనసాగిన వనియు గ్రహించి తదనుకూలముగ గ్రంథమును సమన్వయపరచి ఇతోధిక పారమ్యమును పొందవలె ననియు నేను కాంక్షించుచున్నాను.

(సం॥) రేమెళ్ల సూర్యప్రకాశశాస్త్రి

మానాప్రగడ శేషశాయి
రిటైర్డ్ ప్రిన్సిపాల్
మహారాజా సంస్కృత కళాశాల

విజయనగరం
18-9-90

# వెలుఁగు రేక

శిల్పకళాదర్శనం డాక్టరు శోభరాలవారి బహుముఖ ప్రజ్ఞా ప్రాభవాలను పట్టి చూపించే మణిదర్పణం.

శిల్పసుందరమైన భారతామ్నాయ పారావారాన్ని మథించి అరచేతులతో అమృతకలశాన్ని పైకెత్తారు ఇది ఏతన్మాత్రుల కయ్యేపని కాదు.

తెలుఁగు సంస్కృతాలు తెలియాలి. శ్రుతి స్మృతి సంప్రదాయాలు తెలియాలి. పరభాషాతత్త్వ పరిజ్ఞానం ఉండాలి. సంస్కృతి సంప్రదాయాల అందచందాలు తెలియాలి పురాణ కావ్యధోరణి బోధపడాలి. అన్నింటినీ ఆకళింపుచేసికొని - ఇంపైన మార్గంలో చెప్పగలగాలి. శిల్పంలో ఉన్న జీవలక్షణాన్ని భావించగలగాలి. చిత్తం శ్రీమంతంగా చెలువందితేనే ఒక సిద్ధాంతాన్ని దర్శించగలగడం !

శ్రీ సత్యనారాయణగారు ఉత్తమ సంస్కారం కలవారు. బహు భాషాతత్త్వరహస్య విజ్ఞాతలు. పరమ సాత్త్వికులు. తాత్త్వికమైన అవగాహనం - శిల్పకలా పరమార్థ చింతనం వాసనారూపంలో వారికి వన్నె కలిగించాయి.

ఆభిజాత్యం - అభిజ్ఞత సమకూరాయి కనకనే ఇంతపని చేసి లోకంలో సేబా సనిపించుకొన్నారు.

వ్యాసభగవానుని భారతం దేశానికి వెన్నెముకలాంటిది. దిక్కూ - తీర్థం మాని, రక్కసీ గాలులకు చిక్కి, నడి సముద్రంలో కొట్టుమిట్టాడే నావలకు త్రోవలు చూపించే మాణిక్య దీపం. మనుగడకు అవసరమైన తెలివి - మార్గం అందులో పొందు పరిచారు. అందులో లేనిది మరెందులోనూ లేదు. ఏమున్న దన్నచో - ఎందఱో మహానుభావులు అందలి నిధినిక్షేపాలు త్రవ్వి తలకెత్తారు.

డాక్టరు శోభిరాల శిల్పకళాదర్శన మన్న పేరుతో కలకండం లాంటి పరమాద్భుత కళాఖండాన్ని దేశాని కందించారు.

మాంధాత మున్నగు మహా సార్వభౌములు ఎన్నో జన్నాలు చేసారనీ, జల్లులు జల్లులుగా సుకృతాలు కురిపించారనీ జనశ్రుతి. ఆ యజ్ఞాయతనములు రూపొందించుటలో శిల్పాచార్యుల ప్రసక్తి ఎచ్చు. శాస్త్రములు - అవి నిర్దేశించు ప్రమాణములు - లక్షణములు - అందులో ఆరితేరిన శిల్పులు - వారు అవతరింప చేసిన యజ్ఞవేదికలు - సాహిత్య వాస్తు యజ్ఞపూర్త శిల్పముల లోతులు తడవి, లోలోని వెలుగులను వింగడించి, ఒక సిద్ధాంత శిల్పకళా రహస్యంగా దీనిని ఆవిష్కరించారు.

శోభిరాల వారి పరిశోధన పాండిత్యానికి ఇదొక కలికితురాయి. వీణాపాణి, పలుకులరాణీ, సొగసుల కర్ణావతంసంగా తురుముకొన్న పారిజాతప్రసవ మంజరి. వేదములు - ఉపనిషత్తులు - ఇతిహాసములు - పురాణములు - ఎన్నిటినో చూచి - అన్నిటిలో ఉన్న శిల్పాంశములనూ క్రోడీకరించి, తన చిరంతన తపస్సారంగా ఈ మణిహారాన్ని మన ముందుంచారు.

ఇది అనిదంపూర్వమైన పరిశోధనం. అచ్చమైన ఆవేదనతో వెలువడిన శిల్పనివేదనం.

అఖిలాంధ్రం ఆమోదంగా అలంకరించుకొనే మణిహారం!

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సువర్ణపదకంతో మెచ్చిన ముచ్చటైన బంగారు నగ!

విద్వత్ పరితోషాన్ని చూఱగొన్న విశేషరచన!

దీన్ని గుఱించి నే చెప్పగలిగిందేముంది? ఉన్నది నాయందు వారి కొక తీయన, ఆయనగారి మాటను కాదనలేని మైత్రీమాధుర్యం ఈ పని చేయించినది.

జీవుని వేదనకూ - భావించిన పరమార్థానికీ ఒక చిత్రమైన శిల్పం ఇందులో ద్యోతక మవుతుంది.

(సం॥) మా. శేషశాయి

18-9-90

Prof. P. S. SASTRI,
M A., M. Litt., Ph. D., D. Litt.,
Rtd. Prof. & Head; Dept. of English
University of Nagapur
Life Member :
Trinidad Acadamy of Hinduism

Malladivari Street,
TENALI (A. P.)

Dt. Sept. 12, 1990

# ILLUMINATING

The sciences of sculpture, architecture, and painting were well known to the Vedic seers. This was established in my books **Rig Vedic Aesthetics** and **Bharatiya Devalayam.** The Samhitas mention the divine architects and sculptors like Tvasta, Visvakarma and the Ribhus. This Visvakarma being identified with Brahma, Vishnu and Rudra, appears as the Absolute Brahman in Rig Veda X-81,82 As such the meaning given to that name today does not appear to us to be valid. But we have an open mind on this point.

The various sacrifices mentioned in the Vedic texts make the recitation of an itihasa an integral part of the sacrifice. This has led Mr. Koegi (Sagenstoffe des Rig Veda) to prove conclusively that the present Mahabharata in some form or other was anterior to the Vedas. Mr. Hogg had shown that the Yajurveda was prior to the Rig Veda. Then the cult of sacrifice is the most ancient one. Evidenty then the various branches of geometry were known to our ancients. Otherwise the Yupa, Homakundas and the like are not possible.

It is to explore the knowledge of and the use made of sculpture and architecture by the ancient seers that Dr. Sobhirala Satyanarayana has undertaken the present study. Though the title of this work is **Srimad Andhra Maha Bharata Silpakala Darsanam** the author has drawn heavily on Bhagavan Vyasa's text. There are given also relevant passages from Valmiki Ramayana and other puranas.

A certain evolution of these sciences is clearly brought out in the present work. The work would have been of greater value if he had also considered texts like Manasara, Kasyapasilpa, Silpa Ratna, Sesha Samuchaya and Samarangana Sutradhara. The work then would become unwieldy. The author has wisely kept the work within bounds.

The third chapter devoted to Y a g n a S i l p a is illuminating. Many facts are brought to light. Here are some controversial points. This is because the author is eager to see Visvakarma everywhere.

Vacaspati is Visvakarma (P 83) only in the sense that he taught Indra the science of grammar, the science of words and designations (name) as Patanjali stated.

The part played by sculpture, architecture, and wood work in the various sacrifices like Rajasuya, Asvamedha, Putrakamesti, Vajapeya, Brihaspati sava, Sarpayaga, and Visvajit are very eloborately and clearly enunciated.

The fourth chapter deals with Purta Silpa in the architectural part involved in digging wells tanks, in the construction of temples and in the preparation of idols and icons deserves special mention here. In addition to the works mentioned above much valuable information can also be derived from works like Vishnu Dharmottara, Sukra Niti, Matsya and other puranas and Varaha Mihira's Brihatsamhita

Within limits and without enlarging the scope of the text Dr. Sobhirala Satyanarayana has done a commendable job. This work is a valuable addition. It is a work which cannot be ignored by any one interested in our ancient heritage and in the sciences of sculpture, architecture, wood work and rituails.

This book is a must for all lovers of our culture.

*(Sd.) P. S. Sastri*

కవిత్రయము వారు వ్యాసభారతమును యథాతథముగా ననువదించి యుండలేదు. వారు కొన్నిచోట్ల దానిని పెంచిరి. కొన్నిచోట్ల తగ్గించిరి. కొన్నిచోట్ల ఔచిత్యమునకై అన్యథాకరించియుండిరి. వారితిహాసమును కూడ మహాకావ్యముగా రూపొందింపఁదలచినవా రగుటచే ధర్మతత్త్వనీతిప్రతిపాదకము లయిన విషయములను వైదికకర్మశిల్పాదిశాస్త్రసంబంధము లగు విషయములను కొన్నిచోట్ల తగ్గించిరి. కొన్నిచోట్ల పూర్తిగా విడిచివైచిరి. అందుచే శ్రీ సత్యనారాయణగారు ఆంధ్రమహాభారతమునే కాక వ్యాసరచితసంస్కృత భారతమును కూడ నెడనెడ పరిశీలింపవలసివచ్చినది వ్యాసునిది పౌరాణిక నైతికదృష్టి. కవిత్రయము వారికి గూడ నా దృష్టి లేకపోలేదు, కాని వారిది ప్రధానముగా కావ్యకళాదృష్టి. అందుచే కథకుగాని కావ్యత్వమునకు గాని భంగకరములని తోచినచోట్ల వారు కొన్నిభాగములను సంగ్రహించిరి.

మహాభారతమున అనేకనగరములయు, సౌధములయు, యజ్ఞవేదికలయు, యుద్ధవ్యూహములయు వర్ణనములు పెక్కు సన్నివేశములందు కానవచ్చును వానిని వర్ణించునపుడు కవిత్రయము వారు కూడ తమకు గల శిల్పపరిజ్ఞానమును ప్రదర్శించియుండిరి. ఉదాహరణమునకు ఇంద్రప్రస్థ నగరమును నిర్మించునపుడు నన్నయ వ్రాసిన తొమ్మిది పురవర్ణనమునకు సంబంధించిన పద్యములు అమూలకములు. ఆ పురవర్ణనమే తరువాత ప్రబంధములలో ఆరంభమునందు కనవచ్చు పురవర్ణనమునకు మార్గదర్శకమైనది. పైన పేర్కొనఁబడిన విషయములలో కొన్ని లౌకికములు, కొని వైదికములు. మహాభారతమును రచించునపుడు వానిలో వేనిని కాని పూర్తిగా విడిచివేయుట ఉచితము కాదు. అందుచే కవిత్రయము వారు వారిని కొన్నిచోట్ల విశదముగా వర్ణించినను, కొన్నిచోట్ల సూచ్యమాత్రములుగా నైన ప్రకటించి యుండిరి.

వేదకాలము నాటి నుండియు మహర్షులకు శిల్పకళ యందు అభిమానమును ఆదరమును కల వని సూచించుటకు శ్రీ సత్యనారాయణగారు ఋగ్వేదాదుల నుండియు, ఉపనిషదాదుల నుండియు పెక్కు వాక్యముల నుదాహరించియుండిరి.

వేదముల అర్థము తెలిసికొనవలె నన్న మొన్న మొన్నటి వఱకును సాయణాచార్యులు రచించిన భాష్య మొక్కటియే ఆధారముగా నుండెను. తరువాత దయానంద సరస్వతియు, అరవిందఘోషును కొందఱు పాశ్చాత్య పండితులును వేదమంత్రములకు కేవలకర్మపరముగా కాక జ్ఞానలౌకికశాస్త్ర

పరముగా గూడ అర్థములు చెప్పియుండిరి. శ్రీసత్యనారాయణగారు వానిని కూడ చూచియుండుట వారివిషయమున కావించిన సర్వతోముఖయయిన పరిశ్రమకు తార్కాణము. దయానందాదులకు సాయణాదులపై గౌరవములేక పోలేదు. కాని అవసరమును ఉచితమును అని తోచినపుడు వారు తమ హృదయములకు తట్టిన అర్థాంతరములు కూడ ప్రదర్శించియుండిరి.

నన్నయ్య రచించిన భాగమున రాజసూయయాగము, మయసభ, నారదుఁడు వర్ణించిన దిక్పాలురసభలు, ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు క్రొత్తగా నిర్మించి యిచ్చిన సభ మున్నగు వాని వర్ణనములున్నవి. మహాభారతము నందలి వర్ణనములలోని కెల్ల మయసభ వర్ణనము అద్భుతమును, అతిలోకమును అయినట్టిది. దానిని నిర్మించిన మయుఁడు రాక్షసుల విశ్వకర్మ యైనను, శిల్పశాస్త్రమునందు అద్వితీయమైన ప్రజ్ఞ కలవాఁడు. నిజమునకు మహాభారతకథ యంతయు అతని మయసభానిర్మాణము పయి ఆధారపడి యున్న దనియే చెప్పవచ్చును. ఏల యన అది చూచిన తరువాతనే దుర్యోధనుఁడసూయాగ్రస్తుఁడగుటయు, పాండవులను జూదమున కాహ్వానించి స్వపక్షమున శకునిచే జూదమాడించి వారిని అడవులకు పంపుటయు సంభవించినది. ధృతరాష్ట్రుఁడు నిర్మించిన నూతనసభలో ద్యూతమును, ద్రౌపదీవస్త్రాపహరణమును జరిగినవి. మహాభారతయుద్ధమున కవియే కారణములు. ఈ మహాసభను వర్ణించుపట్లను, రాజసూయయాగమును వర్ణించు సందర్భమునను నన్నయ ప్రదర్శించిన శిల్పకళాపరిజ్ఞానము ప్రశంసాపాత్రమైనది ఆవర్ణనములు వ్యాసభారతమున అంతకంటె విస్తృతతరములుగనున్నవి. అయినను మూలము నందలి భావమునకు భంగము రాకుండ వాని నుచితరీతి వర్ణించుట కెంతో ప్రతిభాసంపద కావలయును

పరీక్షిత్తు ప్రాయోపవేశమునకు ముందు ఏ క స్తం భ నిర్మితసౌధమున నుండెనని భారతమును భాగవతమును కూడ తెలుపుచున్నవి. దీని నిర్మాణమునకు శిల్పశాస్త్రపరిచయ మెంతో కావలయును.

తిక్కన రచించిన భాగములో అశ్వమేధయాగము చాల ముఖ్యమైనది. ఆ యాగమునకు వేదికల నెట్లు నిర్మించెనో తిక్కన విశదముగా వర్ణించి యుండెను ఆ వర్ణనములు యథేచ్ఛాకల్పితములు కావు; శాస్త్రసమ్మతములు. అట్లే యుద్ధపర్వములైదింట నతఁడెన్నో వ్యూహములను విస్పష్టముగా వర్ణించి యుండెను. వ్యాసుని రచనలో సంకీర్ణములుగా నున్న ఆ వ్యూహవర్ణనములు తిక్కన తీర్చి దిద్దెనని విమర్శకులు చెప్పుచుందురు. అందు కతఁడు కేవల

# అపూర్వ సిద్ధాంత వ్యాసము

## కళాప్రపూర్ణ

డా॥ దివాకర్ల వేంకటావధాని M. A, (Hons) Ph. D.

ఆంధ్రాంగ్లభాషలయందే కాక తత్త్వశాస్త్రము నందునిష్ణాతులైన మిత్రులు శ్రీ శోభిరాల సత్యనారాయణ గారు రచించిన "శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళా దర్శన" మను అపూర్వసిద్ధాంతవ్యాసమును బఠించి యమందమైన యానందము నందితిని. రథనాభి యం దరముల వలె పరమపురుషుని యందు సర్వకళలు ప్రతిష్ఠితములై యున్నవనియు, వేద్యుఁడయిన యా పురుషుని తెలిసికొనుమనియు ప్రశ్నోపనిషత్తు తెలుపుచున్నది.

వేదఋషులు తమ మంత్రములను రథశిల్పముతో పోల్చుకొని యున్నారు. శిల్పసంబంధులగు వర్ణనలు సహృదయులగు పాఠకులకు ఆనందకరములుగా నుండును. పూర్వకవులు వట్టి సాహిత్యశాస్త్రము నందే కాక ఇతర శాస్త్రము లందును నిష్ణాతులై ఆయా సందర్భములయందు తత్తచ్ఛాస్త్రముల యందలి విషయములను వివరించియుండిరి.

ధర్మేచార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ ।
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్ ॥

- అని వ్యాసమహర్షి మహాభారతమును గూర్చి చెప్పినవిషయము పరమ సత్యశోభితము. అందు లేని విషయ మేదియు లేదనుటలో అతిశయోక్తి లేదు

అసలు శిల్పకళలను గూర్చి కాని, ప్రత్యేకముగా మహాభారతము నందలి శిల్పకళలను గూర్చి కాని సంపూర్ణముగా పరిశోధన చేసిన వారింతవఱకెవ్వరును లేరు.

ఆ విషయము నందు సమగ్రజ్ఞానము కలవారు అరుదుగా నుండుటయే అందుకు కారణము. డా॥ సత్యనారాయణ గారు శిల్పవాస్తుశాస్త్రమునందే కాక ఆంధ్రసంస్కృత తత్త్వశాస్త్రము లందును ప్రవీణులగుటచే తమ సిద్ధాంత వ్యాసమున కీ విషయము గ్రహించి న్యాయము చేయజాలిరి.

కవియే కాక మంత్రియు, సంగ్రామశాస్త్ర విశారదుఁడును అయి యుండుటయే కారణము. అతని తండ్రి కొమ్మన దండనాథుఁడు. అతని పెదతండ్రికొడుకు ఖడ్గతిక్కన మహాసేనానాయకుఁడు. అట్టి వారి వంశమున పుట్టిన తిక్కనకు వ్యూహరచనావిషయమున సమగ్రపరిజ్ఞాన ముండుటలో ఆశ్చర్యములేదు.

ఎట్టిన కూడ ఆయా సందర్భములందు నగరములను యజ్ఞాదులను వర్ణింప వలసివచ్చినది. ఎట్టిన వాని నెంతో సమగ్రసుందరముగా వర్ణించి యుండెను.

అరణ్యపర్వశేషమున పురదుర్గవర్ణనములు, విశ్వకర్మ-నలవిశ్వకర్మల ప్రసంగములు, అంగిరోభృగుప్రముఖప్రభావములకు సంబంధించిన ప్రసంగ ములు గలవు. వీని కన్నింటికి శిల్పశాస్త్రముతో చాల సన్నిహితసంబంధ మున్నది.

శిల్పకళతో పరిచయము లేని కవులైనచో నట్టి శిల్పశాస్త్ర సంబంధముగల విషయములను విడచివేసియుందురు. ఏల యన వానిని విడచినను కథాగమన మున కెట్టి భంగమునురాదు. కవిత్రయము వారు క్రాంతదర్శనులును, సర్వ శాస్త్రపండితులు నగుటచే అట్టి వానిని గూడ యథోచితముగ వర్ణించియుండిరి.

లౌకికవైదికములయిన శిల్పనిర్మాణముల నన్నింటిని శ్రీసత్యనారాయణ గారు పరిశీలించి అందలి శాస్త్రపరిజ్ఞానము వెల్లడించియుండిరి. ఊరక వెల్ల డించుటయేకాదు వేదములనుండియు ఆంగ్లేయుల అనువాదములనుండియు ఎన్నో భాగములను ఉదాహరించియుండిరి. ఈ సిద్ధాంతవ్యాసమును చదువు చుండగా రచయితకు గల సర్వశాస్త్రపరిజ్ఞానము పాఠకులకు ఆశ్చర్యము గలిగించకమానదు.

శ్రీ సత్యనారాయణగారు శిల్పసంబంధమయిన సిద్ధాంత వ్యాసమునే వ్రాసినను. భాషావిషయమున గూడ విశేషమైన జాగరూకత వహించిరి. వారి శైలి నిర్దుష్టము, సర్వసుబోధము సరళమునైయున్నది. అన్యదుర్లభమైన యిట్టి సిద్ధాంత వ్యాసము వ్రాసి మన పూర్వులకు గల శిల్పశాస్త్రపరిజ్ఞానమును ప్రకటించిన శ్రీ శోభశాల సత్యనారాయణ గారికి నా అభినందనములను తెలుపు చున్నాను. వారి సిద్ధాంత వ్యాసము పెక్కు ఇట్టి సిద్ధాంత వ్యాసములకు మార్గ దర్శకము కాగల దని నా అభిప్రాయము.

హైదరాబాదు
9-5-1985

(సం.) దివాకర్ల వేంకటావధాని

# సిద్ధాంతసిద్ధాన్నము

**Dr. V. V. NARASIMHA RAO,** M. A; Ph, D
*Director*

A.P Govt Oriental Manuscripts
Library and Research Institute
Abids, **HYDERABAD** - 500 001.

ఈ గ్రంథము కేవలము డిగ్రీ కొఱకు వ్రాసినది కాదు. సొమ్ము చేసుకొనుట కంతకంటెను కాదు. డిగ్రీకొరకే యైనచో సముద్రమంత లోతు గల గహనమైన ఇట్టి విషయము నెన్నుకో నక్కర లేదు, సొమ్ము చేసికొనుట కైనచో తెనుగునాట ఇట్టి గ్రంథము వ్రాయతలపెట్టిన వాడు వట్టి వెంగలి.

మరి శ్రీ శోభిరాల సత్యనారాయణ గా రీగ్రంథము నెందుకు వ్రాసినట్లు? చిరకాలముగా గుండెలో కుతకుతలాడుచు ఆత్మ నెరియించుచున్న ఒక వేదనను చల్లార్చు కొనుటకు. మరుగున పడిన ఒక మహాసంస్కృతిని త్రవ్వి తలకెత్తి లోకమునకు వెలుగుబాట చూపుటకు. ఆ తపనయే ఈ సత్యశోధకుని ఆత్మవేదన. దానికి రూపకల్పనయే ఈ పరిశోధనవ్యాసము.

భారతగ్రంథముపై వందలకొలది పరిశోధనవ్యాసములు పొటమరించినవి. తెలుగుభారతమును గూర్చియు తెంపు లేకుండ పెక్కు వ్యాసములు వెలువడినవి. కాని "భారతశిల్పకళాదర్శన" మను నీ విషయము అదృష్టపూర్వము. అదృష్ట వశమున అది శ్రీ శోభిరాల చేతిలో పడినది. సంస్కృతాంధ్రాంగ్లతత్త్వమనస్తత్త్వ శాస్త్రవిదుఁడగు ఈ సవ్యసాచికి "చక్రధర" (డాక్టర్ లకంసాని చక్రధరరావు గారు) చోదకత్వ మబ్బినది. ఇదియు నొక విశేషము.

"శిల్ప" మనగా కేవలశిలాశిల్పమో, చిత్రశిల్పమో, సాహిత్యశిల్పమో, ఛందశ్శిల్పమో, అక్షరశిల్పమో కాక కర్మకౌశల మభివ్యక్త మగు నెల్ల

శిల్పములను పరిశీలనార్థములే. అట్టి శిల్పము యొక్క చరిత్ర ఆద్యమానవుని హస్తకౌశలస్ఫూర్తితో మొదలయినది. కూడు, గుడ్డ, ఇల్లు వాకిలి, పనిముట్టు కొరముట్టు ఇట్టి అవశ్యక వస్తునిర్మాణముతో మొదలైన ఆద్యమానవ హస్తకౌశలము భారతకథాకాలము నాటి కెట్టి పరిణామవికాసము లంది మహాశిల్పకళగా రూపొందెనో దానికి లక్ష్యలక్షణ నిరూపణము చేయుటే ప్రకృతవ్యాస పరమార్థము. ఇంత గ్రంథమున్నది కనుకనే ఇది సముద్రమంత లోతు గల గహనమైన విషయ మని చెప్పవలసెను.

వ్యాసావకాశము ననుసరించి శిల్పపరిణామచరిత్రను పరిమిత మొనర్చి భారతకాలము నాటి వివిధశిల్పముల నిర్మాణచరిత్రను మాత్రము సరహస్యముగా వివరించుట జరిగినది. భారతకథాపాత్రలలో తానును ఒకడైన వ్యాసమహర్షి సంస్కృత భారతములో తన కాలమునాటి శిల్పనిర్మాణముల విశేషములే తాను ప్రస్తావించియుండును. భారతమును తెనిగించిన కవిత్రయము కాలము నాటికి ఆయా శిల్పనిర్మాణములలో పెక్కు మార్పులు వచ్చియుండును. భారతకథా స్థలము ప్రధానముగా ఉత్తరభారతము. వ్యాసు డచ్చటి వానినే ప్రస్తావించి యుండును. కవిత్రయమునకు దక్షిణభారత శిల్పకృతులు మాత్రమే పరిచితములు. సంస్కృతాంధ్రభారతములు రెండింటి శిల్పకళాదర్శనములో పొడచూపు భేదములను పసిపట్టి, పరిశీలించి, పరిశోధించి బహిర్గత మొనర్చుటే ప్రకృతవ్యాసరచనము నందలి పరమక్లిష్టమగు వ్యాసఘట్టము. ఈ ఘట్టమును దాటుటకే రచయిత శిల్పకృతుల నిర్మాణములో సంస్కృతభారతము నుండి తెలుగుభారతము ఎచ్చ టెచ్చట భేదించుచున్నదో తెలుపుచు మూలానువాదములను యథాతథముగా నుటంకించెను. శ్రమసాధ్యమైన ఈ పని శ్రద్ధతో నిర్వహించుట వలననే పరిశోధితవిషయమునకు సునిశితత్వమును సమగ్రతయును సిద్ధించినవి.

పురదుర్గరాజసభాభవనాదులకు సంబంధించిన వాస్తుశిల్పము భూజలాంతరిక్ష యానములకు సంబంధించిన రథనౌకావిమానాదిశిల్పము యుద్ధతంత్రాయుధ నిర్మాణసంబంధి యంత్రశిల్పము, ఇష్టాపూర్తాదిక యజ్ఞ శిల్పము, రూపప్రతిరూప ప్రతిమాలంకరణాదిక రూపశిల్పము మున్నగా, అనంతరూప వైవిధ్యము గల "శిల్పకళ"ను ఆంధ్రభారతము నడ్డుపెట్టుకొని దర్శించి, భారతీయమగు నొక ప్రాచీన మహాసంస్కృతిని పరిశోధనగ్రంథ రూపమున నుదరించిన మనీషి డాక్టరు శోభిరాల అవశ్య మభినందనీయుఁడు.

విశ్వకర్మ - త్వష్ట - స్థపతి-శిల్పాచార్య-రథకార - కర్మారవర్ధకి-స్వర్ణకార - దేవబ్రాహ్మణ - విశ్వబ్రాహ్మణ - పాంచాలబ్రాహ్మణాది పర్యాయవాచకములతో పిలువబడు శిల్పి జాతి యొక్క పుట్టుపూర్వోత్తరములను సప్రమాణముగా నిరూపించుట యందు రచయిత పరమజాగరూకుడై వర్తించెను. ప్రమాణ నిరూపితములుగాని యంశములకు పరిశోధనగ్రంథమున స్థానము లేదను సత్యమును విస్మరింపక రచన సాగించెను.

* * * *

సువిమలవిద్యావిశారదుడును, సకలగుణవరిష్ఠుడును, సర్వశాస్త్రార్థవేత్తయును మహాత్ముడును నగు విశ్వకర్మ సురగణములకు సూత్రధారుడు.

రావణ బ్రహ్మకు పిల్లనిచ్చిన మామగారును, పతివ్రతాతిలకమగు మండోదరికి తండ్రియు, మయసభానిర్మాతయు నగు మయుడు ఎల్లదానవులకును సూత్రధారుడు. మయశిల్పమే మధ్యపాతాళము (సెంట్రల్ అమెరికా) వరకు ప్రాకి, నేటికిని వాస్తుపూజ లందుగొనుచున్నట్లు పరిశోధకమతము.

సూత్రధార శబ్దము వాస్తుశాస్త్రమందే కాక నాట్యశాస్త్రమందును ప్రసక్తము.ప్రాచీనకాలములో నాట్యప్రయోగదక్షులగు సూత్రధారులును శిల్పులే యనుట కిదియెంతయు నుపబలకము. ఇట్టివే నా దృష్టిలో ననేకాంశములు గలవు. వాని నుటంకించుట కిది సమయము కాదు - సందర్భమును గాదు.

డాక్టర్ శోభిరాల వారి కృషి నభినందించుటయే ప్రకృతకార్యము. ఈ సిద్ధాంతవ్యాసమునకు ఆంధ్రవిశ్వవిద్యాలయమున శ్రీ త్రిపురనేని గోపీచంద్ స్మారక స్వర్ణపతక బహూకృతి లభించుటయు ముదావహము. ప్రగాఢ మగు పరిశోధనకృషి కిదియు నొక గుర్తింపు గదా !

ఈ పరిశోధనకృషి నొక్కమాటలో చెప్పవలె నన్న ఇట్లు చెప్పవచ్చును "హరప్పా మొహంజొదారో త్రవ్వకముల వలన ప్రాచీనభారతీయసంస్కృతి యెంత బయల్పడెనో ఈ పరిశోధనవ్యాసము వలన అంత కిబ్బడి ముబ్బడి యగు పురాభారతీయశిల్పసంస్కృతి సిద్ధాంతసిద్ధాన్నమై బయలుపడినది.

తథాస్తు !

హైదరాబాద్ 22-6-1985 } (సం॥) వి. వి. యల్. నరసింహారావు

# కృతజ్ఞతా నివేదనము


నా పరిశోధనమునకు పర్యవేక్షకులై సన్నుచరితార్థుని చేసిన

డా॥ లకంసాని చక్రధరరావు గారికి

నిరంతరపరిశోధనా ప్రత్యయ ప్రతిరూపమయిన నా

శ్రీమదాంధ్రమహాభారతశిల్పకళాదర్శనమునకు

1984 సం॥లో నాకు డాక్టరేట్ పట్టమును ప్రసాదించుటయేకాక

దాని నా సంవత్సరము పరమోత్కృష్ట సిద్ధాంత గ్రంథముగా పరిగణించి

త్రిపురనేని గోపిచంద్ స్మారక స్వర్ణపదకబహూకృతి

నొసగిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారికి

పండితప్రకాండులయిన పరీక్షక పారిషదులకు,

విశిష్టపరిశోధన గ్రంథనిర్ణాయక సంఘసభ్యులకు

తమ యమూల్యాభిప్రాయము లొసఁగి యాశీర్వదించిన

విద్వద్వరేణ్యులకు విమర్శక చక్రవర్తులకు

నా కృతజ్ఞతాపూర్వకాభివాదనములు

♦ ♦ ♦

ఈ గ్రంథ ముద్రణమునకు పదివేల రూపాయలు ఆర్థికసహాయము నొసఁగిన తిరుమల తిరుపతి దేవస్థానము కార్యనిర్వహణాధికారిగారికి సర్వదా కృతజ్ఞుఁడను.

♦ ♦ ♦

ఈ గ్రంథ ప్రచురణమునం దనేకవిధములుగా సాయపడిన సాహితీ బంధువులకు, ఆప్తమిత్రులకు హార్దికాభివందనములు

♦ ♦ ♦

ఈ గ్రంథమును సర్వాంగసుందరముగా ముద్రించి యిచ్చిన మహోదయ పవర్ ప్రెస్, శ్రీకాకుళం వారికి తదధిపతులు సహృదయ మిత్రులు శ్రీ టి. వి. శివరావు గారికి, శ్రీ టి. వీరభద్రయ్య గారికి, వారి సిబ్బందికి హృదయ పూర్వక ధన్యవాదనములు

—శోభిరాల సత్యనారాయణ

# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము

## తృతీయోన్మేషము

## యజ్ఞశిల్పము

యజ్ఞస్య చక్షుః ప్రభృతి ర్ముఖం చ
వాచా శ్రోత్రేణ మనసా జుహోమి ।
ఇమం యజ్ఞం వితతం విశ్వకర్మణా
దేవాయంతు సుమనస్యమానాః ॥

—అథర్వ 2-35-5 *

యజ్ఞస్వరూపుఁడగు పరమేశ్వరుని వాక్ఛ్రవణమననపూర్వకముగా ధ్యానించుచు యజ్ఞచక్షువును, యజ్ఞపోషకుఁడును, యజ్ఞముఖమును నగు అగ్ని దేవుని యందు హోమము చేయుచున్నాను.

---

* 'విశ్వం కర్మ కరణీయం యస్య స ప్రజాపతిః ।
విశ్వకర్మా విశ్వకృద్ దేవః ॥' — సాయణ

'తతః విశ్వకర్మణా దేవేన వితతమ్ విస్తృతమ్ ఉత్పాదితమ్ ఇమం అనుష్ఠీయమానం యజ్ఞం దేవా ఇంద్రాద్యా యష్టవ్య దేవతాః సుమనస్యమానాః సుమనస ఇవ అచరంతః అనుగ్రహబుద్ధ్యోపేతాః సంతః ఆయంతు ఆగచ్ఛంతు' — సాయణ

విశ్వకర్మ ప్రజాపతి చేత విస్తృతము చేయఁబడిన యీ యజ్ఞమునకు ఇంద్రాదిదేవత లనుగ్రహపూర్ణులై వత్తురుగాక !

యజ్ఞము విజ్ఞానదాయకమైన సత్కార్యము. [1]

లోకమునందు మానవులను సృజించిన ప్రజాపతియే వారి యోగ క్షేమములు కోరి సకలాభీష్ట ప్రదమగు యజ్ఞమును కల్పించినాఁడు -

సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్॥

—వ్యా.భా భీష్మ. 27-10
(భగవద్గీత - 3-10)

ప్రజాపతి కల్పాది యందు మానవులను యజ్ఞసహితముగా సృష్టించి, 'ఈ యజ్ఞానుష్ఠానముతో మీ రభివృద్ధి నొందుఁడు. ఇది మీ కోరికలను దీర్చు కామధేనువు వంటి' దని వారితోఁ బలికినాఁ డని శ్రీ కృష్ణ భగవానుఁ డర్జునునికి దెలిపినాఁడు.

మానవుని కర్మబంధమోక్షణమునకు సాధనముగా యజ్ఞము సృష్టింపఁ బడన దని వ్యాఖ్యాతలు వివరించినారు. [2]

---

1 చూడు :- శ్రీ క్షేమంకరదాస్ త్రివేది : అధర్వణవేద - భాషాభాష్యము - పుట-35
—శ్రీ దయానంద సంస్థాన్ ప్రచురణ

"విశ్వకర్మ పరమేశ్వరునిచే విస్తృతము చేయఁబడిన విజ్ఞానదాయకమును పూజనీయము నైన యీ సత్కర్మకు [యజ్ఞమ్] వ్యవహారకుశలులైన మహాత్ములు [దేవాః] శుభసంకల్పములతో [సుమనస్యమానాః] వత్తురు గాక"

2 చూడు :- శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు. గీతామకరందము. పుట.335

యజ్ఞ మన దేవతల నుద్దేశించి యగ్నియందు ఘృతాహుతు లర్పించుచుఁ జేయు నొకానొక వైదికకర్మ మను భావము లోకమునందు ప్రసిద్ధముగా నున్నది. కాని యజ్ఞశబ్దమున కనేకార్థము లున్నవి.

నిఘంటువు లిచ్చిన యర్థము లివి :

యజ్ఞము : యాగము, క్రతువు. 2) వైదికకార్యము [పంచమహాయజ్ఞములు :- బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము అని యైదు] 3) అగ్ని, 4) విష్ణువు, 5) శివుడు, 6) ఆత్మ.

— సూర్యరాయాంధ్రనిఘంటువు

యాగ మనగా హోమముచేసి దేవతలకు హవిర్భాగము లిచ్చుట.

యజ్ఞశబ్దము యజ ధాతువు నుండి నిష్పన్నమైనది.

"యజ - దేవపూజా సంగతికరణ దానేషు" అను ధాతుపాఠము ననుసరించి యజ్ఞశబ్దమున కీ క్రింది యర్థములు చెప్పబడినవి.

1 వేదమంత్రములతో పరమాత్మను స్తుతించుట - పూజించుట. హోమము చేసి దేవతలకు హవిర్భాగము లర్పించుట.

2 సజ్జన సాంగత్యముతో, వివిధపదార్థసంయోజనముతో నూతన వస్తువులను సృష్టించుచు శిల్పవిద్యను ప్రత్యక్షీకరించుకొనుట.

3 దానమన ద్రవ్యత్యాగము వివిధవస్తువులను, విద్యలను దానము చేయుట, అన్నదానము, భూదానము, సువర్ణదానము ఇత్యాదులు.

కావున యజ్ఞము మూఁడువిధములని శ్రీ దయానంద స
తెలిపినాఁడు.[1]

1. అగ్నిహోత్రము మొదలు అశ్వమేధపర్యంతముగల యజ్ఞ
2. ప్రకృతి మొదలు స్థూలప్రకృతి వఱకుఁ గల జగద్రచనారు
   శిల్పవిద్యయు
3. సత్సంగాదుల వలనఁ గలుగు విజ్ఞానము, యోగమును.

యజ్ఞమన శ్రేష్ఠతమమైన కర్మమని యజుర్వేదము చెప్పుచున

'శ్రేష్టతమాయకర్మణే'. శుక్ల - యః
'యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ' - అని శతపథబ్రాహ్మణము

బభూవ యజ్ఞో వేదేభ్యో యజ్ఞః ప్రీణాతి దేవత
—వ్యా.భా - శాంతి ।

యజ్ఞము వేదముల వలననే యావిష్కరింపఁబడినది. య
దేవతలను సంతృప్తులను జేయును.[2]

ఋగ్వేదము యజ్ఞప్రశంస తోడనే ప్రారంభమగుచున్నది.

అగ్ని మీళే పురోహితమ్।
యజ్ఞస్య దేవ మృత్విజమ్।
హోతారం రత్నధాతమమ్॥ —ఋగ్వేద

ఈ మంత్రమునకు శ్రీ దయానంద సరస్వతి అగ్నిహోత్రప
నర్థమునే కాక, శిల్పయజ్ఞ పరమగు నర్థమును గూడ వివరించినాఁడు.

---

1. స్వామి దయానందసరస్వతి : వేదతత్త్వప్రకాశము.
   ఆంధ్రానువాదము - :
2. పోల్చు : వ్యా.భా అను 145. (దాక్షిణాత్యప్రతి)
   'యజ్ఞాదీనాం సమారంభః శ్రుతేనైవ విధీయతే।
   యజ్ఞస్య ఫలయోగేన దేవలోకః సమృధ్యతే॥

' శిల్పక్రియలచే నుత్పన్న మొనరింపఁదగిన పదార్థముల నొసఁగువాఁడును ఆ పదార్థముల నుత్పన్న మొనరించుటకు ముందె ఛేదనధారణాదిగుణములు కలిగి యుండువాఁడును, శిల్పవిద్యాసాధనహేతు వయిన వాఁడును, సువర్ణాది రత్నములను ధరించువాఁడును నగు భౌతికాగ్నిని నేను స్తోత్రము చేయు చున్నాను '.[1]

యజ్ఞేషు దేవ మీళతే ॥

—ఋ. 1-15-7

అగ్నిహోత్రాద్యశ్వమేధ పర్యంతము అగ్నికార్యముతో పరమేశ్వర పూజచేయు మనుష్యులు - శిల్పవిద్యామయ యజ్ఞముతో వివిధపదార్థములను సంయోజనము చేయు శిల్పులు - ఆనందయుక్తు లగుదురు. [2]

ఆ నో యజ్ఞాయ తక్షతు ఋభుమద్ వయః ॥

—ఋ. 1-111-2

ఓ విద్వాంసులారా! పదార్థసంయోజనముతో నూతనవస్తూత్పత్తిని చేయు శిల్పక్రియాసిద్ధికి వలయు శక్తిని మా కొసంగుడు. [3]

ఈ విధముగా శ్రీదయానందసరస్వతి ఋగ్వేదమునందలి అగ్ని - అశ్వి - ఋభుదేవతాకములగు సూక్తములందలి యజ్ఞశబ్దమునకు హవన మనియే కాక శిల్పవిద్యామయయజ్ఞ మను నర్థము చెప్పుట యుక్తి సహముగా నున్నది.

కావున యజ్ఞ మన హోమకార్యమనియే కాక సందర్భమునుబట్టి శిల్పమనియు నర్థము చెప్పికొనవచ్చును.

యజ్ఞో భవతి శిల్పం శిల్పం వై భవతు యజ్ఞః
పుణ్యం భవతు శిల్పమ్॥

— యాజుషాథర్వణశిల్పోపనిషత్తు

---

1. చూడు :- శ్రీదయానందసరస్వతి - ఋగ్వేద - భాషాభాష్యము - పుట 1
2. —అదే— పుట 25
3. —అదే— పుట 143

యజ్ఞము వైదిక మనియు లౌకిక మనియు రెండు విధము లని భారతము చెప్పుచున్నది.

యజ్ఞంబు తెఱంగెఱింగింపవే యని పార్వతి ప్రార్థించినం బరమేశ్వరుం డిట్లనియే.

సీ॥ విను మింతి! వైదికంబును లౌకికంబును
  నను రెండు తెఱఁగులు యజ్ఞవిధులు
వర్ణయోగ్యార్జకవర్ధనాంచితధన
  ధాన్యముల్ గొని దేవతలకుఁ దృప్తి
యగు నట్లుగా ఋత్విగర్చన మొప్పఁగాఁ
  గావించునది వైదికంబు; 
దేవతలకు మహోత్సంబులు చేయుటయు గీత
  వాద్యనృత్తము లనవద్యములుగ
సంఘటించుటయును, సద్గంధమాల్యధూ
పప్రదీపభోజ్యభక్ష్యములు స
మాదరంబుతో నివేదించుటయు లౌకికంబు
రెండు నమరగణహితములు.

— తిక్కన. అనుశాసన - 5-198

ఇది కొంత వఱకు మూలానుసరణమే. కాని మూలము వలన మఱికొన్ని యంశములు తెలియుచున్నవి.

వేదవిహితములైన అగ్నిష్టోమాదియజ్ఞములు నిర్వహించుటకు శుద్ధమయిన యజ్ఞద్రవ్యములతోపాటు యజ్ఞోపకరణములు కావలయును - ఇది శాస్త్రవిధి.

అగ్నిష్టోమాదిభిర్యజ్ఞై ర్వేదేషు పరికల్పితైః
సుశుద్ధై ర్యజమానైశ్చ ఋత్విగ్భిశ్చ యథావిధి
శుద్ధైర్ ద్రవ్యోపకరణై ర్యష్టవ్య మితి నిశ్చయః

— వ్యా.భా అనుశాసన-145*

* చూడు :- మహాభారతము హిందీ అనువాదసహితము
గీతాప్రెస్ - గోరఖ్‌పూర్ —పు. 6001

దేవాలయముల యందలి దేవతావిగ్రహముల నభిషేకాదులతో సంస్కరించి, గంధమాల్యధూపదీపనైవేద్యాదులతో పూజించి నృత్యగీత గానములతో కనులపండువుచేయు వివిధకార్యకలాపములతో నుత్సవములు చేయుట లౌకికయజ్ఞము. ఇట భక్తిప్రధానము.

దేవసత్కారముద్దిశ్య క్రియతే లౌకికోత్సవః
దేవగోష్ఠేఽధిసంస్కృత్య చోత్సవం యః కరోతి వై
యాగాన్ దేవోపహారాంశ్చ శుచిర్భూత్వా యథావిధి
దేవాన్ సంతోషయిత్వా స దేవి ధర్మమవాప్నుయాత్ ॥

.................................................................

నృత్తైర్వాద్యైశ్చ గాంధర్వై రన్యైర్ దృష్టివిలోభనైః ।
దేవసత్కార ముద్దిశ్య కుర్వతే యే నరా భువి ।
తేషాం భక్తికృతేనైవ సంస్కారేణైవ పూజితాః ।
తేనైవ తోషం సంయాంతి దేవి దేవాస్త్రివిష్టపే ॥

—వ్యా.భా. అనుశాసన - 145*

వైదికయజ్ఞములందు యజ్ఞశాలలు, యజ్ఞవేదికలు, సుక్స్రువాది యజ్ఞోపకరణములు, యూపస్తంభములు నిర్మించుటకు స్థపతులు, దారుశిల్పులు కావలయును.

లౌకికయజ్ఞములందు ముఖ్యములయిన దేవాలయములు, దేవతావిగ్రహములు నిర్మించెడువారుస్థపతులే. ఉత్సవాదులందు సకల విధాలంకారములు చేయువారు శిల్పులే.

వైదికలౌకికయజ్ఞ నిర్వహణమునందు శిల్పాచార్యుల యవసర మెంతేని గలదు.

---

* చూడు :- మహాభారతము — గీతాప్రెస్. పు. 6001

దేవమానవలోకము లందలి సకలద్రవ్యములు యజ్ఞార్థమే సృష్టింపఁబడిన వని మహేశ్వరుఁ డుమాదేవికిఁ దెలిపినాఁడు.

ఇదం తు సకలం ద్రవ్యం దివి వా భువి వా ప్రియే
యజ్ఞార్థం విద్ధి తత్సృష్టం లోకానాం హితకామ్యయా॥

—వ్యా.భా. అను-145*

భగవత్ప్రీత్యర్థము చేయు పూజ - యజ్ఞము - వైదికమయినను లౌకికోత్సవమయినను వానిని నిర్వహించుటకుఁ దగిన ద్రవ్యోపకరణములు సంపాదించుటకు ధనము కావలయును.

ధనసంగ్రహంబు............
భోగార్థకృతంబు దుష్ట మగుటయుఁ గలదు
యజ్ఞార్థకృతంబైన నదియు నిచ్చెన బ్రహ్మపదము నొంద॥

—తిక్కన. శాంతి. 1-144

మూలము నం దిట్లున్నది.

యజ్ఞాయ సృష్టాని ధనాని ధాత్రా
యజ్ఞాయ సృష్టః పురుషో రక్షితా చ॥
తస్మాత్ సర్వం యజ్ఞమేవోపయోజ్యం
ధనం న కామాయ హితం ప్రశస్తమ్॥

—వ్యా.భా. శాంతి. 26-25

ప్రజాపతి యజ్ఞోపయోగార్థము ధనమును సృష్టించినాఁడు. ఆ ధనమును కాపాడి యజ్ఞము చేయుటకు పురుషుని సృష్టించనాఁడు. ధనమును కేవల మైహిక సుఖముల కొఱకు వినియోగించుట శ్రేయస్కరము కాదు; ప్రశస్తమును గాదు.

ఈ విధముగా మానవులను, లోకహితముఁగోరి యజ్ఞార్థము ధనమును సృష్టించిన సకలజగత్సృష్టికర్తను - ప్రజాపతిని - పూజించుట మానవ ధర్మము.

---

* చూడు :- మహాభారతము - గీతాప్రెస్, పుట 6001

# యజ్ఞపురుషుండు

యజ్ఞో వై ప్రజాపతిః ।
యజ్ఞ మేవ ప్రజాపతి మారభతే ॥

— కృ. య. 2-5-7 *

యజ్ఞము ప్రజాపతిస్వరూపము. కావున హోత యజ్ఞస్వరూపుండయిన ప్రజాపతిని ప్రాజాపత్యమంత్రముతో స్తుతింప వలయును.

యజ్ఞము ప్రజాపతి చేత సృష్టింపఁబడినది.

చమసపాత్రల యందున్న సోమరసము ప్రజాపతి స్వరూపము. సోమయాగము ప్రజాపతిస్వరూపము. కావున ప్రజాపతిని తృప్తిపఱపవలయును తృప్తుండయిన ప్రజాపతి యజ్ఞకర్త కైశ్వర్యము నొసఁగును.

బభూష న్నవేక్షేతైష వై పాత్రియః ప్రజాపతిర్
యజ్ఞః ప్రజాపతి స్తమేవ తర్పయతి ।
స ఏన తృప్తో భూత్వాఽభి పవతే ॥

— కృ. య. 2-3-2 **

అట్లే బ్రహ్మవర్చస్కాముఁడును ప్రజాపతిని సంతృప్తునిఁ జేయవలయును

---

* " యజ్ఞస్య ప్రజాపతిసృష్టిత్వాత్ తత్స్వరూపః తస్మాత్ ప్రాజాపత్య మంత్రస్య ప్రథమపాఠేన యజ్ఞరూప మేవ ప్రజాపతిం ప్రారబ్ధవాన్ భవతి. "

— సాయణ

" He (Hota) repeats a verse addressed to Prajapati - Prajapati is the Sacrifice. Verily he grasps the sacrifice as Prajapati " — A. B. Keith. T. S. ii-5-7

** " బభూషన్ భవితు మిచ్ఛ న్నైశ్వర్యకామ ఇత్యర్థః పాత్రియః పాత్రేఽవస్థిత ఏష సోమః ప్రజాపతిస్వరూపః అనేన సాధ్యో యజ్ఞోఽపి ప్రజాపతిస్వరూపః అతోఽనేనావేక్షణేన తమేవ ప్రజాపతిం తర్పయతి స చ తృప్త ఏనం యజమాన మైశ్వర్యార్థమభితః శోధయతి " — సాయణ

Cf :- A. B. Keith : T. S. iii-2-3

ప్రజాపతి ర్విశ్వకర్మా [శు.య. 18-43] *

ప్రజాపతి ర్విశ్వకర్మా విముంచతు [కృ.య. 4-2-5-2] **

అను యజుర్వాక్యముల వలన సృష్టికర్తయైన విశ్వకర్మయే యజ్ఞపురుషుఁడని తెలియనగును.

అట్లే విశ్వవ్యాపకత్వము వలన యజ్ఞము విష్ణుస్వరూప మనియుఁ జెప్పఁబడినది.

యజ్ఞో వై విష్ణుః ॥ — కృ. య. 3-1-10 ◘

[విష్ణో ర్వ్యాపకత్వేన యజ్ఞస్వరూపత్వాద్ వైష్ణవమంత్రేణ
యజ్ఞ మేవ పునరపి ప్రవర్తితవాన్ భవతి. — సాయణ]

**యజ్ఞో వై విష్ణుర్ యజ్ఞమేవాఽఽరభ్య ప్రతనుతే ॥**
— కృ. య. 3-5-1 ◘◘

[యజ్ఞస్య సర్వాంగవ్యాపిత్వాద్ విష్ణుత్వ మతో వైష్ణవేన హవిషా
యజ్ఞమేవోపక్రమ్య ప్రకర్షేణ విస్తృతవాన్ భవతి. — సాయణ]

మహాభారతకాలమున విష్ణువే యజ్ఞస్వరూపుఁడు - యజ్ఞపురుషుఁడు నను భావము ప్రాచుర్యము నొందినది.

విష్ణు నెఱుఁగు టధికవిమలబోధము యజ్ఞ
మూర్తి యజ్ఞకర్తృమూర్తి యజ్ఞ
కలనమూర్తి యజ్ఞఫలమూర్తి విష్ణుఁ డ
తండు కృష్ణుఁ డమలతరచరిత్ర. ।

అని వ్యాసమహర్షి శల్యునికిఁ జెప్పినట్లు భీష్ముడు ధర్మజునకుఁ దెలిపినాఁడు. — తిక్కన - అను. 1-167

---

* " The Lord of Creatures, Omnific........."
— Ralph T. H. Griffith - The Texts of the White YEJURVEDA.

** " Let Prajapati, All-worker, release it. "
— A. B. Keith : T. S. iv-2-5-2.

◘ " Vishnu is the Sacrifice; Verily he makes the Sacrifice. "
— A. B. Keith : T. S. iii-1-10

◘◘ " Vishnu is the Sacrifice, Verily commencing the sacrifice he continues it. "
— A. B. Keith : T. S. iii-5-1

అహం విష్ణు రహం బ్రహ్మ శక్రశ్చాహం సురాధిపః ॥
అహం శివశ్చ సోమశ్చ కశ్యపోఽథ ప్రజాపతిః ।
అహం ధాతా విధాతా చ యజ్ఞశ్చాహం ద్విజోత్తమ ॥
—వ్యా. భా. వన. 180-5,6 *

నారాయణాఖ్యుండ నైన నేను శాశ్వతుఁడ ననియు సకల జగత్ప్రభువు ననియు, సృష్టి స్థితి లయకారకుఁడను నేనే యనియు, బ్రహ్మాదిసురలు నాయాకృతులే యనియు, యజ్ఞము నా స్వరూపమే యనియు, యజ్ఞకర్తలు, నన్నే స్తోత్రము చేయుదురనియు నారాయణుఁడు మార్కండేయమహామునికి తన ప్రభావమును దెలిపినాఁడు.[1]

అతులితదక్షిణాన్వితమహాధ్వరసంఘము లే నొనర్చితిన్
జతురమనీషితాప్రచురసౌఖ్యులు భూసురముఖ్యు లంచిత
వ్రతులు మహీపతుల్, సుగుణవశ్యులు వైశ్యులు భక్తి నన్ను సం
తతమును గొల్తు రీ క్షితి నుదాత్తమహాక్రతుకర్మశీలురై.
—ఎఱ్ఱన. అరణ్య. 4-269

క్రతుపరులు నన్నుఁ దగ సం
స్తుతించి ఫలమందఁ గండ్రు; దోషయుతులు స
మ్మతిఁ బ్రాయశ్చిత్తంబునఁ
గృతాత్మ లగుదురు మదీయకీర్తనపరులై.

అని శ్రీకృష్ణుఁడు భృగూద్వహుం డయిన యుదంకునకుఁ దెలిపినాఁడు.
—తిక్కన. అశ్వమేధ. 3-40

మూలమునం దీవిషయ మత్యంతవిపులముగా నున్నది.

---

* పోల్చు :- వ్యా.భా. ఆశ్వమేధిక. 54-14, 15

అహం విష్ణు రహం బ్రహ్మ శక్రోఽథ ప్రభవావ్యయః ।
భూతగ్రామస్య సర్వస్య స్రష్టా సంహార ఏవ చ ।

"భవవర్ధనవిలయంబులు
నవలీలన వరుస బ్రహ్మ యన విష్ణుఁ డనన్
శివుఁ డన నిర్వర్తింతును
భువనంబుల నేన చూవె భూరిమహిమలన్ "—తిక్కన. అశ్వమేధ, 3-42

1. చూడు :- ఎఱ్ఱన. అరణ్య. 4-266-269 —(వ్యా.భా వన. అ 189)

ఓంకారప్రముఖాన్ వేదాన్ విద్ధి మాం త్వం భృగూద్వహ ।
యూపం సోమం చరుం హోమం త్రిదశాప్యాయనం మఖే ॥

హోతార మపి హవ్యం చ విద్ధి మాం భృగునందన ।
అధ్వర్యుః కల్పకశ్చాపి హవిః పరమసంస్కృతమ్ ॥

ఉద్గాతా చాపి మాం స్తౌతి గీతఘోషైర్మహాధ్వరే ।
ప్రాయశ్చిత్తేషు మాం బ్రహ్మన్ శాంతిమంగళవాచకాః ॥
స్తువంతి విశ్వకర్మాణం సతతం ద్విజసత్తమ ।

—వ్యా.భా. ఆశ్వమేధిక-54. 8-1

"ఓ భృగువంశవర్ధనా ! ప్రణవాది వేదములు, యజ్ఞ సంబంధములగు యూపము, సోమము, చరువు, దేవతలను సంతృప్తి పఱచు హోమము హోత, హవ్యము, అధ్వర్యుఁడు, కల్పకము, సుసంస్కృతహవిష్యాన్నము నన్నియు నేనే యని తెలిసికొనుము.

ఓ బ్రాహ్మణోత్తమా ! మహాయజ్ఞము లందు సామగానము చేయు నుద్గాతలు నన్నే స్తుతింతురు. ప్రాయశ్చిత్తకర్మములందు శాంతిమంగళవాచకముల పఠించు బ్రాహ్మణు లెల్లపుడు విశ్వకర్మనైన నన్నే స్తోత్రము చేయుదురు.

మధుసూదన ! నీవే విష్ణుండవు. నీవే యజ్ఞస్వరూపుఁడవు. యజ్ఞము చేయువాఁడవు-చేయించుకొనువాఁడవు నీవే యని పరశురాముఁడు చెప్పినాఁడు.

విష్ణుత్వమసి దుర్ధర్ష త్వం యజ్ఞో మధుసూదన ।
యష్టా త్వమసి యష్టవ్యో జామదగ్న్యో యథాబ్రవీత్ ॥

—వ్యా.భా. వన. 12-5

"నిన్ను నాది ప్రజాసర్గంబునఁ బ్రజాపతి వని యసితుం డయిన దేవలుండును, సత్యంబు వలన యజ్ఞంబు నుద్ధరించుటం జేసి నిత్యసత్త్వ మయుండ వయిన యజ్ఞ పురుషుండ వని కశ్యపుండును...... జెప్పిరి.

యోగధరులకు సాధుజనులకు గతి వీవ"
యని ద్రౌపది శ్రీకృష్ణుని ప్రశంసించినది.

—ఎఱ్ఱన. అరణ్య 1-133

వ్యాసప్రోక్త మగు విష్ణుసహస్రనామస్తోత్రము నందు విష్ణువే యజ్ఞస్వరూపుఁడుగా యజ్ఞపురుషుఁడుగాఁ గొనియాడఁబడినాఁడు.

యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః ॥
యజ్ఞభృద్ యజ్ఞకృద్ యజ్ఞీ యజ్ఞభుగ్ యజ్ఞసాధనః ।
యజ్ఞాంతకృద్ యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ ॥

—వ్యా.భా. అను. 149–117, 119

పై విష్ణునామములకు వ్యాఖ్యాత లిచ్చిన యర్థము లివి :

1 యజ్ఞః : యజ్ఞస్వరూపుఁడు

2 యజ్ఞపతిః : యజ్ఞములకు ప్రభువు; యజ్ఞములను కాపాడువాఁడు.

3 యజ్వా : యజ్ఞము నాచరించు యజమానస్వరూపుఁడు.

4 యజ్ఞవాహనః : స్వర్గాదిఫలములకు హేతుభూతములగు యజ్ఞములను నడుపువాడు.

5 యజ్ఞాంగః : యజ్ఞసాధనములె యవయవములుగాఁ గలవాఁడు.

6 యజ్ఞభృత్ : యజ్ఞమును ధరించువాడు.

7 యజ్ఞకృత్ : సర్గాత్మకమగు యజ్ఞము చేసి సకల జగములను సృష్టించినవాఁడు.

8 యజ్ఞీ : సమస్త యజ్ఞములు ఎవనియందు సమాప్తమగుచున్నవో వాఁడు; పరమాత్ముఁడు.

9 యజ్ఞభుక్ : యజ్ఞఫలభోక్త; యజ్ఞఫలమును జీవులచే ననుభవింపఁ జేయువాఁడు.

10 యజ్ఞసాధనః : పరమాత్ముఁ డయిన తనను పొందుటకు ఫలత్యాగబుద్ధితోఁ జేయు యజ్ఞములే సాధనములుగాఁ గలవాఁడు.

11 యజ్ఞాంతకృత్ : పూర్ణాహుతితో యజ్ఞఫలము నొసఁగువాఁడు.

12 యజ్ఞగుహ్యమ్ : యజ్ఞములతో గుప్తమైన నిష్కామయజ్ఞస్వరూపుఁడు.

విష్ణువు వలె శివుఁడును యజ్ఞస్వరూపుఁడే.

బ్రహ్మప్రోక్తమయిన మహాదేవసహస్రనామ స్తోత్రము నందు శివునకు యజ్ఞుఁడు (530), యజ్ఞసమాహితుఁడు (531) అను నామము లున్నవి.

........యజ్ఞో యజ్ఞసమాహితః —వ్యా.భా. అను. 17-94

విశ్వేశ్వరునకు 'విశ్వకర్మమతి' (555) అనునది మఱొక నామము. జగద్రచనారూపకర్మమునందుఁ గుశలుఁ డని యర్థము.

వేదములు, యజ్ఞములు, సోమరసము, దక్షిణలు, అగ్ని, హవిస్సు, యజ్ఞోపకరణములు - అన్నియు నీ రూపములే సందియము లే దని శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుని ప్రస్తుతించినాఁడు.

వేదాశ్చ యజ్ఞాః సోమశ్చ దక్షిణా పావకో హవిః ।
యజ్ఞోపగం చ యత్ కించిత్ భగవాం స్తదసంశయమ్ ॥
—వ్యా. భా. అను. 14-411

జగదాదికారణుఁడు, విశ్వకర్మ (సృష్టికర్త), పుట్టుక లేనివాఁడు, జగదీశ్వరుఁడు, నాశరహితుఁడు, చరాచర జగత్తులను సృష్టించువాఁడు - సంహరించువాఁడును నగు పరమేశ్వరునకు శ్రీకృష్ణుఁడు నమస్కరించినాఁడు.

లోకాదిం విశ్వకర్మాణ మజ మీశాన మవ్యయమ్ ।

..............................................
చరాచరస్య స్రష్టారం ప్రతిహర్తార మేవ చ ॥
వవందే తం తదా కృష్ణో వాఙ్మనోబుద్ధికర్మభిః ॥
—వ్యా. భా, శాంతి. 80, 44-47

యజ్ఞము, యజ్ఞకర్త, అగ్నిహోత్రము, హవనము, - వీని రూపమున నున్న నీకు నమస్కార మని దక్షప్రజాపతి శివునికి మ్రొక్కినాఁడు.

నమో యజ్ఞాయ, యజినే, హుతాయ ప్రహుతాయ చ ॥
—వ్యా.భా. శాంతి. 284-101

ఈ విధముగా సృష్టికర్తయు, యజ్ఞపురుషుడు నైన జగత్ప్రభువును ప్రజాపతి యనియు, విశ్వకర్మ యనియు, విష్ణు వనియు శివుఁ డనియు, వేర్వేఱు నామములతోఁ బిలుచుచున్నారు.

నామ మేదైనను పరమేశ్వరుఁ డొక్కఁడే.

# యజ్ఞఫలము

స్వర్గకామో యజేతేతి సతతం శ్రూయతే శ్రుతిః
ఫలం ప్రకల్ప్యపూర్వం హి తతో యజ్ఞః ప్రతాయతే ॥

—వ్యా. భా. శాంతి. 268-18

స్వర్గము కోరు మనుజుఁడు యజ్ఞము చేయవలయు నని వేదము చెప్పుచున్నది. స్వర్గఫలప్రాప్త్యర్థమీ యజ్ఞము చేయుచున్నా నను సంకల్పముతో యజమానుఁడు యజ్ఞకర్మము నారంభింపవలయును.

యజ్ఞము చేయు ధర్మాత్ము లిహపరసౌఖ్యము లందఁగలరు.

ధర్మము సల్పుచున్ దగిలి ధర్మపథంబునఁజేసి యర్థముం
బేర్మియుఁ గాంచి ధర్మవిధి బెండిలియై ప్రజలన్ సృజించి స
త్కార్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ పొనరించు సజ్జనుల్
ధర్మజ యిందు నందును ముదంబును గాంతు రభీష్టసౌఖ్యముల్

అని మార్కండేయమహర్షి ధర్మరాజునకుఁ దెలిపినాఁడు.

—ఎఱ్ఱన - ఆరణ్య. 4-178 *

యజ్ఞము నందు భగవదర్పణము చేయఁగా మిగిలిన పదార్థములను భుజించు సజ్జనులు సర్వపాపవినిర్ముక్తులగుదురు.

యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యన్తే సర్వకిల్బిషైః ॥ —భగవద్గీత

అశ్వమేధాది యజ్ఞములు పాపభంజకములు.

అవనీశ ! యశ్వమేధము
నవభృథమున నీరఁ గ్రుంకి యన్యుఁడు శుద్ధుం
డవుఁ బాపుఁడైనఁ ; దత్క
ర్తృ విశేషము లోకపూజితం బగు టరుదే.

—తిక్కన. శాంతి. 1-305 **

---

* వ్యా. భా. వన. 183-91

** వ్యా. భా. శాంతి, 35-9

యజ్ఞము చేయుట వలన యజ్ఞకర్తకే కాక సమాజమునకుఁ గూడ మేలు కలుగుచున్నది.

యజ్ఞము లన్నింటిలో హోమకార్యము శ్రేష్ఠమయినది.

'యజ్ఞవిధానముల హూతంబు పెద్ద'[1]

హోమము వలన ధూమము, ధూమము వలన మేఘము, మేఘము వలన వర్షము కలుగును.

అగ్నే ర్వై ధూమో జాయతే ధూమాదభ్రం, అభ్రాత్ వృష్టిః ॥

—శతపథబ్రాహ్మణము. కాం. 5-3

అగ్నియందు వేల్వఁబడు హోమద్రవ్యముల నుండి ధూమము బాష్పము నుత్పన్నము లగును. అగ్ని వృక్షములు, ఓషధులు, వనస్పతులు, జలము మున్నగు పదార్థములందు ప్రవేశించి వానిని వేరుచేసి, వాని యందలి రసమును వానినుండి వేరుచేయును. అదియే దాని స్వభావము. ఆ రస మేకమై వాయువు ద్వారమున నాకాశమునఁ జేరును. అందలి జలాంశము బాష్ప మనఁబడును. శుష్కాంశము పార్థివము. ఈ రెండింటి సమ్మేళనమే ధూమము. ఆ పరమాణువులు వాయ్వాధారమున అకాశమునం దొండొంటితోఁ గలసి మేఘము లగును. వాని వలన వృష్టి యేర్పడును.[2]

ఈ విషయము భగవద్గీత యందుఁ జెప్పఁబడినది.

అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్న సంభవః ।
యజ్ఞాద్ భవంతి పర్జన్యః యజ్ఞః కర్మ సముద్భవం ॥
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥

వ్యా. భా. భీష్మ. 27-14,15.

---

1. తిక్కన. అశ్వమేధ 2-161. [ వ్యా. భా. అశ్వ. 44- ]
యజ్ఞానాం హూత ముత్తమమ్ ।

2. చూడు :- దయానంద వేదతత్త్వప్రకాశము - పు. 74. గోపదేవ్ అనువాదము.

"అన్నము వలన ప్రాణులు కలుగుచున్నవి. మేఘము వలన అన్నము కలుగుచున్నది. యజ్ఞము వలన మేఘము కలుగుచున్నది. యజ్ఞము సత్కర్మాచరణము వలనఁ ఫలప్రదమగుచున్నది. సత్కర్మాచరణము వేదాధ్యయనము వలనఁ గలుగుచున్నది [బ్రహ్మోద్భవమ్]. వేదము [బ్రహ్మ] అక్షర పరబ్రహ్మము వలనఁ గలుగుచున్నది. అందువలన సర్వవ్యాపక మగు బ్రహ్మము నిరంతరము యజ్ఞము నందుఁ బ్రతిష్ఠితమై యుండు నని తెలిసికొనుము". —అని శ్రీకృష్ణభగవానుఁ డర్జునునకుఁ దెలిపినాఁడు.

కావున దేశసౌభాగ్యమునకు మూలకారణము యజ్ఞమే.

మహాభారతకాలమున రాజులు లోకకల్యాణార్థము యజ్ఞయాగాదులు చేయుచుండిరి. అది రాజధర్మము.

రాజు ధర్మరక్షణము చేయవలయును. ధర్మ సంస్థాపనము వలన స్వర్లోక ప్రాప్తి కలుగును. కావున రాజు చేత సకలయజ్ఞక్రియలు నిర్వహింపఁబడును. యజ్ఞమువలన దేవతాప్రతిష్ఠ జరుగును. దేవతలు ప్రసన్నులయినచో వర్షములు కురియును. వర్షముల వలన ఓషధు లుద్భవించును. ఓషధుల వలన మనుష్యులు పోషింపఁబడుదురు. అనగా ప్రాణులకు అన్నము లభించును.

ఈవిధముగా ధర్మనిరతితో రాజ్యపాలనము చేయు రాజు ప్రజలకు ధారణ - పోషణకర్త యగుచున్నాడు. అట్టి రాజు పదిమంది శ్రోత్రియులతో సమాన మని మనువు చెప్పినాఁడు.

రాజ్ఞా ప్రతిష్ఠితో ధర్మో ధర్మాత్ స్వర్గః ప్రతిష్ఠితః
రాజ్ఞో యజ్ఞక్రియాః సర్వాన్ యజ్ఞాద్ దేవాః ప్రతిష్ఠితాః
దేవాద్ వృష్టి ప్రవర్తేత వృష్టే రోషధయః స్మృతాః
ఓషధిభ్యో మనుష్యాణాం ధారయన్ సతతం హితమ్
మనుష్యాణాం చ యో ధాతా రాజా రాజ్యకరః పునః
దశశ్రోత్రియసమో రాజా ఇత్యేవం మను రబ్రవీత్ ॥

—వ్యా.భా. ఆది. 41-29-31

ఒకానొకప్పుడు పండ్రెండేళ్ల పాటు భూమి కనావృష్టి కలుగఁగా మాంధాత యజ్ఞములు చేసి తద్వారా వర్షములు గురియించి నట్లు భారతమునందుఁ జెప్పఁబడినది.

ఈ విషయము నన్నయ కవితారీతిలో నిట్లు వర్ణించినాఁడు.

“ మాంధాతృఁడు సంపూర్ణదక్షిణక్రతువు లనేకంబులు చేసి పద్మసంఖ్యలు గోదానంబుల బ్రాహ్మణులం దనిపి నిజ శాసనంబునఁ బ్రజల నెల్ల నిలిపి

భూమికనావృష్టియైనఁ గడు నల్గి పురుహూతు తోడ
భీమసంగ్రామంబుఁ జేసెఁ దన దివ్యపృథుసాయకముల
సామజావలి నేయు నట్లు మేఘసంచయముల నేసి
భూమికిఁ గురియించె వర్షములు సస్యముల్ వృద్ధిఁ బొంద ”

—నన్నయ్య - అరణ్య. 3-205,06 *

## కారీరిష్టి

వర్షముఁ గోరువారు కారీరిష్టి చేయవలయు నని యజుర్వేదము చెప్పుచున్నది

కారీర్యా వృష్టికామో యజేత । —కల్పము.

సౌమ్యాని వై కరీరాణి సౌమ్యా ఖలు వా ఆహుతిర్ ।
దివో వృష్టిం చ్యావయతి యత్ కరీరాణి భవంతి ॥
సౌమ్యయైవాఽఽహుత్యా దివో వృష్టి మవ రుంధే ॥

—కృ. య. 2-4-9 **

సోమవల్లీసదృశములై సౌమ్యము లయిన కరీరాంకురములతో ఆహుతులు చేసినచొ నాకాశము వర్షించును.

కారీరిష్టి యందు చేయు హోమము వలన పడమటిగాలి బంధింపఁబడి వర్షానుకూలమయిన తూర్పుగాలి యుత్పాదింపఁబడును.

---

* వా. భా. వన. 126-37-42.

** Cf. :- A. B. Keith. T. S. ii-2-9.

“ The Kariras are connected with Soma; The offering connected with Soma makes the rain to move from the sky; in that there are Kariras (in the sacrifice) by means of an offering which is connected with Soma he wins the rain from the sky. ”

విశ్వకర్మ యజ్ఞము చేసినను వర్షములు కురియు
నని యజుర్వేదము వలనఁ దెలియుచున్నది.

యజ్ఞపతి - యజమానుఁడు - వసంతర్తువు నందు జ్యోతిష్టోమ యజ్ఞానుష్ఠానము చేయక యపరాధము చేసి పాపుఁ డగుచున్నాడు. అతని యపరాధము వలన వర్షాభావము కలిగి యన్నము లేక ప్రజలు క్షామముతోఁ బీడింపఁబడు చున్నారు. ఆ పాపపరిహార్థము చైత్రవైశాఖమాసము లందు జ్యోతిష్టోమాదిక్రతువు లొనరించుటకు విశ్వకర్మ యజ్ఞపతుల మైన మమ్ము ప్రేరేపించుఁ గాక !

యజ్ఞపతి మృషయ ఏనసా ఆహుః ।
ప్రజా నిర్భక్తా అనుతప్యమానా ।
మధవ్యౌ స్తోకా వప తౌ రరాధ ।
సం న స్తాభ్యాం సృజతు విశ్వకర్మా ॥

—కృ. య. 3-2-7 *

'యజ్ఞపతి మృషయ ఏనసా ఆహుః' - అను మంత్రములచే నాగ్నీధ్రుఁ డైదు వైశ్వకర్మణ హోమములను జేయవలయు' నని కల్పము నందుఁ జెప్పఁబడినది.

[యజ్ఞపతి మృషయ ఏనసాఽహురిత్యగ్నీధ్రేయే
పంచ వైశ్వకర్మణాని హుత్వా ఇతి] —**కల్పః

జగత్సృష్టికర్తయుఁ బ్రజాపతియు నగు విశ్వకర్మను ధ్యానించి హోమము చేయుట వలన యజ్ఞపతి యొనర్చిన పాపము పరిహరింపఁబడు ననుట సమంజసమే. [1]

---

* Cf :- A B. Keith - T. S. iii-2-7
" To the Lord of the sacrifice the Rishis said,
By thy sin creatures are faminishing and troubled,
He did not secure the two drops of honey,
May Visvakarma unite us with them "

** చూడు :- కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత.
—సాయణభాష్యము - పు. 1584, ఆనందముద్రణాలయము, పూనా

1. చూడు :- వడ్డెపాటి నిరంజనశాస్త్రి; విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము
—పు. 44-48

మాంధాత ధర్మాత్ముఁడై విష్ణువవలె త్రిలోకములు జయించి, సదక్షిణముగా నానా విధ యజ్ఞములు, చయనక్రతువులు చేసి, యా పుణ్యఫలమువలన స్వర్లోకమునకేగి యింద్రునర్ధసింహాసన మధిష్ఠించినట్లును, ఆ యజ్ఞములు నిర్వహించుటకు యజ్ఞమండపములతో నాతని రాజ్యము నందలి భూభాగ మంతయు నిండియున్నట్లును వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

సోఽభిషిక్తో మఘవతా స్వయం శక్రేణ భారత ।
ధర్మేణ వ్యజయల్లోకాంస్త్రీన్ విష్ణురివ విక్రమైః ॥ 35

.........................................

తేనేష్టం వివిధైర్యజ్ఞైర్బహుభిః స్వాప్తదక్షిణైః । 37
చితచైత్యో[1] మహాతేజా ధర్మాన్ప్రాప్య చ పుష్కలాన్ ।
శక్రస్యార్ధాసనం రాజన్ లబ్ధవా నమితద్యుతిః ॥ 38

.........................................

తస్య చైత్యైర్ మహారాజ క్రతూనాం దక్షిణావతామ్ ।
చతురంతా మహీ వ్యాప్తా నాసీత్ కించి దనావృతమ్ ॥ 40

వ్యా.భా. వన. 126. 35-40

చయనక్రతువులనఁగా నగ్నిచయన మంతర్భాగముగాఁగల యశ్వమేధాది యజ్ఞములు కావచ్చును.

షోడశచక్రవర్తులలో నొకఁడయిన మాంధాతృఁడు 'రాజసూయములును నశ్వమేధములుఁజేసె' నని ద్రోణపర్వమునందుఁజెప్పఁబడినది.

—తిక్కన. ద్రోణ. 2-204 *

మాంధాత నూఱేసి రాజసూయాశ్వమేధయాగములు చేసినట్లు మూలమునందున్నది.

సోఽశ్వమేధశతై రిష్ట్వా రాజసూయశతేన చ ।

—వ్యా.భా. ద్రోణ 62-12

ఈ విధముగా నెందఱో మహారాజులు యజ్ఞములుచేసి స్వర్గలోకమునకుఁ జనినట్లు మహాభారతమునందు వర్ణింపఁబడినది.

1. చితచైత్యః కృతచయనక్రతుః ॥38॥—నీలకంఠ - వ్యా.భా. చిత్రశాలాప్రతి
* పోల్చు : తిక్కన - శాంతి 1-236. [ వ్యా.భా. శాంతి 29.21 ]

# రాజసూయమహాయజ్ఞప్రాశస్త్యము

రాజా స్వారాజ్యకామో రాజసూయేన యజేత ॥ —ఆపస్తంబ

"జయశీలుఁడయి హరిశ్చంద్రుఁడు నిశ్శేషితశత్రుఁడై రాజసూయముఁ జేసి యెల్లరాజులకు నధికుండయి రాజసూయ మహాయజ్ఞకరణంబునం జేసి దేవేంద్రసాలోక్యంబు వడిసె నట్టి హరిశ్చంద్రు మహిమాతిశయంబు రాజసూయ నిమిత్తంబున నయినదిగా నెఱింగి

జనపతులు రాజసూయం
బొనరించినవారు శక్రు నొద్దను సురపూ
జన లొందుచుండుదురు కో
రిన కోర్కులు వడయుచును హరిశ్చంద్రు క్రియన్"

—నన్నయ. సభా. 1. 85-89

ఈ విషయము ధర్మరాజునకుఁ దెలిపి వానిచే రాజసూయము చేయింపు మని వైవస్వతసభయందున్న పాండురాజు నారదునిఁ గోరఁగా నాతఁడు భూలోకమునకు వచ్చి 'న్యాయమున రాజసూయము సేయు' మని ధర్మజు నుద్బోధించినాఁడు.

పితృగణహితార్థము రాజసూయము సేయఁదలచి[1] "తమ్ములం జూచి ధర్మతనయుండు ధౌమ్యద్వైపాయనసుహృద్బాంధవ మంత్రి సమక్షంబున నిట్లనియె......

" పితృగణహితార్థముగ స
త్క్రతు వొనరింప బుద్ధి గలదు, వ్రిజాసం
హృతి తత్క్రతువున నగు నని
మతి నాశంకయును గలదు మానుగ నాకున్.

ఏమి చేయుదు" నని డోలాయమానమానసుం డయి యున్న ధర్మరాజునకు ధౌమ్యప్రభృతు లిట్లనిరి.

చేయుము రాజసూయ మెడసేయక దానన చేసి దోషముల్
వాయు నిలేశ భూప్రజకుఁ బార్థివు లెల్ల భవత్ప్రతాపని
ర్జేయులు సర్వసంపదలు చేకొనఁగాఁ దఱి యయ్యెఁ గౌరవా
మ్నాయలలామ నీ కెనయె మానవనాథులు మానుషంబునన్ ॥

—నన్నయ. సభా. 1. 93-98

---

1. రాజసూయం క్రతుశ్రేష్ఠం చింతయామాస పార్థివః ॥ —వ్యా.భా. సభా. 12-34

మూలమునం దిట్లున్నది.

యుధిష్ఠిరం మహాప్రాజ్ఞం యియక్షు మిద మబ్రువన్ ।
తేనాభిషిక్తో నృపతి ర్వారుణం గుణ మృచ్ఛతి ।
తేన రాజాపి తం కృత్స్నం సమ్రాడ్గుణ మభీప్సతి ।
తస్య సమ్రాడ్గుణార్హస్య భవతః కురునందన ।
రాజసూయస్య సమయం మన్యంతే సుహృదస్తవ ॥
తస్య యజ్ఞస్య సమయః స్వాధీనః క్షత్రసంపదా
సామ్నా షడగ్నయో [1] యస్మిం శ్చీయన్తే శంసితవ్రితైః
దర్వీహోమానుపాదాయ సర్వాన్ యః ప్రాప్నుతే క్రతూన్
అభిషేకం చ యస్యాంతే సర్వజిత్ తేన చోచ్యతే ॥ *

—వ్యా.భా. సభా. 13 20-24

రాజసూయ యాగమునం దభిషిక్తుం డయిన రాజు సకలైశ్వర్యములతోఁ దులఁదూగుచు వరుణదేవునితో సమానుఁ డగును. కావున నరేంద్రు లెల్లరు నా యజ్ఞము చేసి సమ్రాడ్గుణసంపన్నులు కావలయు నని కోరుకొందురు.

రాజసూయ యజ్ఞము నందు బ్రాహ్మణులు సామవేద మంత్రములతో నగ్నిస్థాపనార్థ మాఱు యజ్ఞవేదికలు నిర్మింతురు. దాని వలన దర్వీహోమాది సమస్తయజ్ఞఫలములు యజ్ఞకర్తకు సంప్రాప్తము లగును. యాగాంతమునం దభిషిక్తుం డయిన రాజును సమ్రాట్టనియు సర్వజిత్తనియు నందురు.

అట్టి మహాక్రతువును జేయుటకు నీవ సమర్థుండ వనియు నిఁక నెక్కువగా నాలోచింపక యజ్ఞమును ప్రారంభింపు మనియు మంత్రులు, మిత్రులు ధర్మరాజును ప్రోత్సహించిరి.

---

1 షడగ్నయః షడ్ యజ్ఞాః తే చ అగ్నిష్టోమ ఉక్థ్య షోడశి
వాజపేయ అతిరాత్ర అప్తోర్యామాః ॥ —దేవబోధ.

* Rajasuya :- A Royal Sacrifice. A great sacrifice performed at the installation of a king, religious in nature but political in its operation, because it implied that he who instituted the sacrifice was the supreme Lord, a king over kings and his tributory princes were required to be present at the rite. —John Dowson

A clasical Dictionery of Hindu Mythology, Religion Geography, History and Literature. P-254

# ధర్మరాజు రాజసూయము

ధర్మరాజు రాజసూయ యాగంబు సేయ సమకట్టి దీని నిర్విఘ్నంబున నిర్వహించుట కనాదినిధనుం డాదిపురుషుం డజుం డయ్యును జగద్ధితంబుగా మర్త్యంబున జనియించిన యమ్మహాత్ముండు వాసుదేవుండ యోపుంగాని యన్యుల కశక్యం బని శ్రీకృష్ణుని రావించి తన సంకల్పమును దెలిపెను.

"కురువృషభ ! సర్వగుణముల
సురుచిరతేజమున రాజసూయాఖ్య మహా
ధ్వరమునకు నీవ యర్హుఁడ
వరిసూదన శౌర్యు లయిన యనుజుల బలిమిన్."

—నన్నయ. సభా. 1. 109*

ఇట్లు నారాయణదేవు చేత ననుజ్ఞాతుం డయి తమ్ములయు ధౌమ్యద్వైపాయనాదులయు ననుమతంబున ధర్మరాజు రాజసూయంబు సేయ నుపక్రమించి సహదేవుం జూచి

నీవు ధౌమ్యోపదిష్టంబు లయిన యజ్ఞోపకరణ ద్రవ్యంబులు దేర నింద్రసేన ప్రముఖులను నర్జును సారథి రుక్మను సమర్పించి యజ్ఞాయతనంబున నానాదేశాగతులైన రాజులకు సన్నివేశంబులు సేయించి నిఖిల మహీతలంబున గల బ్రాహ్మణక్షత్రియాదుల నెల్ల రావింపు మని పంచిన నతండును దద్వాక్యానంతరంబున నింద్రసేనాదుల ననేక శిల్పివరుల నియోగించి

శాస్త్రోపదిష్ట పరిశస్త పరిమాణలక్షణముల యజ్ఞోపకరణతతుల
యజ్ఞాయతనమున నతిరమణీయంబు లయి యుండ నొనరించి యందు సర్వ
సంభారములు నించి సకలదిక్కుల హరిప్రస్థంబు చుట్టు నపారభూరి
బహువిధాగారముల్ ప్రమదవనంబుల వాపుల దీర్ఘికావలుల వెలసి
యాజ్యతైలతండులాదినానావస్తుపూరితంబు లయి విభూతి దనర
జననుతుండు సేసె సహదేవుఁ డపరభూతలముఁ బోలి యొప్పెఁ దత్పురంబు.

—నన్నయ్య : సభా. 1. 282, 283

* సర్వైర్గుణై ర్మహారాజ రాజసూయం త్వమర్హసి ॥ —వ్యా భా. సభా 14-1

## యజ్ఞోపకరణములు

యజ్ఞోపకరణము లనఁగా యజ్ఞనిర్వహణమునకుఁ గావలసిన యజ్ఞశాల, యజమానశాల, పత్నీశాల, సభ్యశాల, యజ్ఞవేదికలు, యజ్ఞకుండములు, అగ్నిమంథన యంత్రకము, స్రుక్స్రువాదులు, చమసములు, ద్రోణకలశములు గ్రహములు మున్నగు యజ్ఞపాత్రలు యూపచషాలాదులు తదితర సాధనములు.

యజ్ఞోపకరణములగు "స్రువము చమసము ఇధ్మము, ఉపమంథని అను నీ పాత్రలను మేడిమ్రానుతోఁ జేయవలయు" నని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది.[1]

చతురౌదుంబరీ భవతి - ఔదుంబరః స్రువః ఔదుంబర శ్చమసః
ఔదుంబర ఇధ్మః ఔదుంబర్యాం ఉపమంథన్యౌ ॥

శిల్పివరు లిట్టి యజ్ఞోపకరణములను శాస్త్రోపదిష్ట ప్రమాణలక్షణ యుక్తముగా నిర్మించినా రని నన్నయ్య వ్రాసినాఁడు.[2]

ఇట శాస్త్ర మనఁగా శుల్బశాస్త్రము (శిల్పశాస్త్రము).

యజ్ఞాయతన యజ్ఞవేదికా నిర్మాణాదులకుఁ గావలసిన కొలతలు శిల్పశాస్త్రము నుండి గ్రహింపవలయు నని కాత్యాయనశుల్బసూత్రము నందుఁ చెప్పఁబడినది.

అంగుళై రథసంమితాయాః ప్రమాణమ్ ॥ —కా.శు. 2-1

"రథకృ చ్ఛాస్త్రే చైతద్ దృష్టమ్" —అని కర్కటుఁడును
"రథకారశాస్త్రేఽంగుళై రేవ రథమానస్యోక్తత్వాత్" —అని మహీధరుఁడును వివరించినారు.[3]

రథకృద్ రథకార శబ్దములు స్థపతి పర్యాయములు కావున రథకారశాస్త్ర మనఁగా విశ్వకర్మ కృత స్థాపత్యవేద మని తెలియవలెను.

---

1 చూడు :- ద్వాదశోపనిషత్తులు. పుట. 286 - వావిళ్లప్రతి. 1950
బృహదారణ్యకోపనిషత్తు. 6-3-13

2. పోల్చు :- నన్నయ్య. ఆది. 2. 209

3. చూడు :- కాత్యాయన శుల్బసూత్రమ్ - వ్యాఖ్యాన సహితము.
—చౌకాంబ ప్రెస్ - బనారసు.

'ఇంద్రసేనాదుల ననేకశిల్పివరుల నియోగించి' యనుచోట ఇంద్రసేనాదులు శిల్పివరు లని కొందఱు భ్రాంతిపడుచున్నారు. కాని యది సరికాదు.

ఇంద్రసేనాదులు - ఇంద్రసేనుఁడు, విశోకుఁడు, రుక్మ (పూరుఁడు) - అనువారు భోజనపదార్థములు సేకరించుటకు నియమింపఁబడిరి. [1]

శిల్పివరులు యజ్ఞాయతనములు నిర్మించుటకు, యజ్ఞోపకరణద్రవ్యములు సమకూర్చుటకు, యజ్ఞమును జూడవచ్చినవా రుండుటకుఁ దగిన యతిథి గృహములు నిర్మించుటకు నియోగింపఁబడిరి.

## అగ్న్యగారనిర్మాణము

ఈ యజ్ఞమునకు బ్రహ్మనిష్ఠుఁ డయిన యాజ్ఞవల్క్యుఁ డధ్వర్యుఁడుగా వేదవేదాంగపారగు లయిన మహర్షులు కల్పోక్తవిధిప్రకారము పుణ్యాహవచన పూర్వకముగా సంకల్పము చేసి శాస్త్రానుసారముగ విశాలమయిన యజ్ఞభూమిని పూజించిరి. తరువాత వారిచే ననుజ్ఞాతు లయిన శిల్పు లచట దేవతాగృహములవలె సుగంధపూర్ణములు, సువిశాలములు నగు యజ్ఞశాలలు నిర్మించిరి.

తే వాచయిత్వా పుణ్యాహ మూహయిత్వా [2] చ తం విధిం ।
శాస్త్రోక్తం పూజయామాసు స్తద్దేవయజనం మహత్ ॥
తత్ర చక్రు రనుజ్ఞాతాః శరణాన్యత శిల్పినః ।
గంధవంతి విశాలాని వేశ్మానీవ దివౌకసామ్ ॥

—వ్యా. భా. సభా. 33-37,38

ఇట శరణ మనగా అగ్నిశరణము. అగ్న్యగారము, యజ్ఞశాల.

యజ్ఞవేది, యజ్ఞకుండాదులు యజ్ఞశాలాంతర్భాగములే. వీనివి నిర్మించువారు శిల్పులే.

---

1. చూడు :- వ్యా. భా. సభా 33-30

'ఇంద్రసేనో విశోకశ్చ పూరుశ్చార్జునసారథిః ।
అన్నాద్యాహరణే యుక్తాః సంతు మత్ప్రియకామ్యయా'

2. 'రాజసూయేన యక్షే స్వారాజ్యమవాప్నువాని'—వ్యా.భా. గీతాప్రెస్ - పు767
"రాజసూయేన యాగేన స్వారాజ్యం భావయేత్" — ఇతి

— కృ. య. సాయణభాష్యము. పు 816

యజ్ఞశాలయందు కల్పసూత్రానుసారము పచ్చియిటుకలతో వివిధాకృతులు గల యజ్ఞవేదికలు నిర్మింపవలెను. త్రేతాగ్నులలో ప్రధానమైన ఆహవనీయమును తూర్పుదిక్కునను, గార్హపత్యాగ్నిని పశ్చిమదిక్కునను, దక్షిణాగ్నిని దక్షిణదిక్కునను స్థాపించవలెను. [1]

గార్హపత్యాగ్ని మండలాకారముగను, దక్షిణాగ్ని అర్థమండలాకారముగను ఆహవనీయాగ్ని చతురస్రాకారముగను నుండును.

మండలం గార్హపత్యస్య, అర్థమండలం దక్షిణాగ్నేః
చతురస్ర మాహవనీయ స్యైతిహాసికాః సర్వాణి
చాఽఽయతనాని క్షేత్రత స్తుల్యా నీత్యాహు రితి చ॥ *

ఇవి కాక యజ్ఞావసరములను బట్టి బహువిధాగ్నికుండములు నిర్మింపవలసియుండును.

యుధిష్ఠిరుఁ డొనరించిన రాజసూయయాగము నందు షడగ్నులు స్థాపింపఁబడినవి.

షడగ్ని నాథ యజ్ఞేన సోఽయజద్ దక్షిణావతా॥—వ్యా భా సభా-35-16

ఆరంభణీయ క్షత్రధృతి వ్యుష్ట్యతిరాత్ర దశసప్తపేయ సభ్యాదులు షడగ్నులని దేవబోధ వ్యాఖ్య. [2]

---

1. Cf. :- Vishva Bandhu : The Vedas and Sastras
— A General Veiw P. 18

"The actual performance of these rites was preceded by the construction in the open of platform like altars (vedis) of varied designs (citis) built of unbaked bricks. Separate places were provided therein for kindling the three sacrificial fires (Tretagni), the main one called Ahavaniya being placed in the East with the other two namely the Garhapatya in the West and the Dakshina in the South."

* చూడు : అగ్నిహోత్రచంద్రికా. పు. 1 సం. వినాయక గణేశఆప్టే.
—ఆనందాశ్రమ ముద్రణాలయ - పూనా. 1921

2 "ఆరంభణీయ క్షత్రధృతి వ్యుష్ట్యతిరాత్ర దశసప్తపేయసభ్యా ఇత్యాఖ్యాః షడగ్నయః ॥
—దేవబోధ.

## అగ్నిమంథనయంత్రము

శమీగర్భస్యాశ్వత్థస్యారణీ ఆహరతి ॥ —ఆపస్తంబ శ్రౌతసూత్ర 5-1-2*

పవిత్రభూమిపైఁ బుట్టిన శమీవృక్షగర్భము నందుద్భవించిన యశ్వత్థవృక్షము యొక్క ప్రాఙ్ముఖముగాఁ గాని ఉత్తరముఖముగాఁ గాని, ఊర్ధ్వముఖముగాఁగాని పెఱిగిన కొమ్మతో అగ్నినిష్పత్త్యర్థము అధరారణిని, ప్రమంథార్థము ఉత్తరారణిని, సారవంతమయిన ఖదిరాదిదారువులతో చాత్రమును, మంథనదండమును, చాత్రోపరిభాగమునందుండు ఓవలిని నిర్మింప వలయును. అరణులు, ప్రమంథము, చాత్రము, ఓవలి యను నీ యవయవములతో నేర్పడు అగ్న్యుత్పాదన సాధనమునకు మంథనయంత్ర మని పేరు.

చతుర్వింశతి రంగుష్ఠా దైర్ఘ్యం షడపి పార్థవమ్ ।
చత్వార ఉచ్ఛ్రయో మాన మరణ్యోః పరికీర్తితమ్ ।
అష్టాంగులః ప్రమంథస్యా చ్చాత్రం స్యాద్ ద్వాదశాంగులమ్ ।
ఓవలీ ద్వాదశైవ స్యా దేత న్మంథనయంత్రకమ్ ॥
—అగ్నిహోత్రచంద్రిక. పు 61, 62

అరణుల పరిమాణము :- పొడవు × వెడల్పు × ఎత్తు
24 × 6 × 4 అంగుష్ఠములు
[18" × 4½" × 2"]

| | | | | |
|---|---|---|---|---|
| ప్రమంథము | - 8 | అంగుష్ఠములు | (6") | పొడవు |
| చాత్రము | - 12 | ,, | (9") | ,, |
| ఓవలి | - 12 | ,, | (9") | ,, |

ఈ యగ్నిమంథనయంత్రసాహాయ్యముతో నగ్ని నుత్పాదించి దానితో నగ్న్యాధానము చేయుట కల్యాణప్రద మని చెప్పఁబడినది.

యత్త ద్ గుహ్య మితి ప్రోక్తం దేవయోనిస్తు సోచ్యతే ।
తస్యాం యో జాయతే వహ్నిః స కల్యాణకృదుచ్యతే ॥
—అగ్నిహోత్రచంద్రిక. పు. 63

---

* అశ్వత్థాచ్ఛమీగర్భా దరణీ ఆహరేత్ ॥ —ఆశ్వలాయన శ్రౌ.సూ. 2-1-16
అశ్వత్థశమీగర్భారణీ ప్రయచ్ఛతి ॥ —కాత్యాయన. శ్రౌ.సూ. 4-194

చూడు :- శివనాథ ఆహితాగ్ని :- ఋగ్వేదసారసంగ్రహ పు. 14
—వైదికజీవన్ ఆశ్రమ డెహ్రాడూన్. 1976

## యజ్ఞాయుధములు : యజ్ఞపాత్రలు :

యజ్ఞానుష్ఠానమున కుపయుక్తములగు సాధనములు, యజ్ఞపాత్రలు వాని లక్షణములు కొన్ని వివరింపఁబడినవి.

స్ఫ్యశ్చ కపాలాని చాగ్నిహోత్రహవణీ చ శూర్పం చ కృష్ణాజినం చ శమ్యా చోలూఖలం చ ముసలం చ దృషచ్చోపలా చైతాని వై దశ యజ్ఞాయుధాని ॥*

స్ఫ్యము : స్ఫ్యో నామ బాహుమాత్రః ఖడ్గాకారః కాష్ఠవిశేషః అరత్నిమాత్రం ఖాదిరం ఖడ్గాకృతిః వజ్రమ్. చంద్రకొయ్యతో బారెడు పొడవున గాని మూరెడు పొడవునఁ గాని ఖడ్గాకృతిగాఁ జేయఁబడినది.

అగ్నిహోత్రహవణి : వైకంక త్యగ్నిహోత్రహవణీ బాహుమా త్ర్యరత్నిమాత్రీ వా ప్రసృతాకృతిః ॥

శమ్యా : గదాకారం. ప్రాదేశమాత్రీ వారణీ శమ్యా ॥
ఉలిమిరి కఱ్ఱతో ప్రాదేశమాత్రము గదాకారముగాఁ జేయబడినది.

ఉలూఖల ముసలములు : ఖాదిరం ముసలం కార్యం పాలాశస్యా దులూఖలః

"వైకంకతాని పాత్రాణి ఖాదిరః స్రువః స్ఫ్యశ్చ పాలాశీ జుహూర్భవతి అశ్వత్థ ముపభృత్ వారణా న్యహోమ సంయుక్తాని" — కాత్యాయన**

స్రువములు రెండు :- 1) మూరెడుపొడవు - అంగుష్ఠపర్వమాత్రబిలము గలిగినది. చంద్రకొయ్యతోఁ జేయవలయును.
2) అట్టిదే మఱొకటి వికంకతదారువుతోఁ జేయవలెను.

అరత్నిమాత్రః ఖాదిరః స్రువః । అంగుష్ఠపర్వమాత్రబిలః స్రువ ఇతి భరద్వాజః । తథా విధో ద్వితీయో వైకంకతః స్రువః ॥

స్రుచములు నాలుగు :-

1) జుహూస్రుక్ - పాలాశీ జుహూర్భవతి - బాహుమాత్రః
2) ఉపభృత్స్రుక్ - అశ్వత్థ ముపభృత్ - ,,
3) ధ్రువాస్రుక్ - వైకంకతీ ధ్రువా - ,,
4) పుష్కరస్రుక్ - అరత్నిమాత్రః స్రుచోఽంగుష్ఠపర్వ వృత్త పుష్కరః

* కృ.య. 1. 6. 8. సాయణభాష్యము. పుటలు 691-93.
** శ్రీమద్వాజసనేయ మాధ్యందిన శతపథ బ్రాహ్మణమ్॥ ప్రథమభాగం॥
— గంగ విష్ణు శ్రీకృష్ణదాస్ - కల్యాణ్ - బొంబాయి-1948
శ్రీ దయానంద సరస్వతి :- సంస్కారవిధిః 1 పు. 15-18

ఘృతము నుంచు పాత్ర.

ఃస్థాలి లోహమయము గాని దారుమయము గాని 12 అంగుళముల
ాదేశమాత్రము ఎత్తు గలిగియుండవలెను.

)దేశ మనఁగా చూపుడు వ్రేలిని బొటనవ్రేలిని చాఁచిపట్టిన కొలత.]
ఆజ్యస్థాలి వంటిదే

ి : యజ్ఞార్థమైన యపూపము లుంచు పాత్ర. నలుచదరముగా
డి మధ్యగుంట యుండును.

: పంద్రెండంగుళములు ఎత్తు, దోసిలి వలె లోతు గలిగి
ండును. వరణ వృక్షకాష్ఠముతో నిర్మింపవలెను.

ఆజ్యస్థాలీ తైజసీ మృణ్మయీ వా ప్రకీర్తితా।
ద్వాదశాంగులవిస్తీర్ణా ప్రాదేశోచ్చా శుభా స్మృతా।
ఆజ్యస్థాలీ సమేనైవ చరుస్థాలీ ప్రశస్యతే॥

పురోడాశపాత్రీ తు చతురస్రా సమానతః,
ఖాతేన వర్తులేనైవ యుతా యజ్ఞే ప్రశస్యతే॥

ప్రణీతా వారణా గ్రాహ్యా ద్వాదశాంగులసంమితా।
ఖాతేన హస్తతలవదాకృత్యా పద్మ పాత్రవత్॥

—శతపథబ్రాహ్మణము

కే హవిర్ధానపాత్రి, ప్రాశిత్రహరణము, ఇడాపాత్రి, యజమానపాత్రి,
ఇత్యాదిగా మఱికొన్ని యజ్ఞపాత్రలు గలవు.

) నిర్మించువారు శిల్పులే.

ఃభూమాపన, వేదీనిర్మాణ, యజ్ఞోపకరణ సాధనాది సమస్త యజ్ఞ
కలాపములను నిర్వహించు ఋత్విజుఁ డధ్వర్యుఁడే[1] ఆతని
మునఁ దక్కిన శిల్పులీ యజ్ఞశిల్ప కార్యములను చేయుచుందురు.
ర్యుఁడు స్థాపత్య వేదవిదుఁడై యుండవలెను.

Adhvaryu priest, distinct from Hota and Udgata had nume-
functions, like measuring the ground, building the altar
ring sacrificial vessels etc. - quoted by Dr. Bali Nath
in the Book "India in the time of Patanjali." —PP. 175-6

## ఋత్విగ్వరణము

ఈ రాజసూయ మహాయజ్ఞమును పదునార్వురు ఋత్విజులు నిర్వహించిరి.

"అంతననంతవేదమూర్తులైన పైలధౌమ్యులు హోతలుగా యాజ్ఞవల్క్యుం డధ్వర్యుండుగా ద్వైపాయనుండు బ్రహ్మగా సుసాముం డుద్గాతగా వీరల పుత్రశిష్యగణంబులు క్రమంబున మైత్రావరుణుండును, నచ్ఛావాకుండును, గ్రావస్తుతుండును బ్రతిష్ఠాతయు నేష్టయు నున్నేతయు బ్రాహ్మణాచ్ఛంసియు నాగ్నీధ్రుండును బోతయుఁ బ్రస్తోతయుఁ బ్రతిహర్తయు సుబ్రహ్మణ్యుండునుంగా నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా భీష్మాదిరాజర్షుల సహాయులుగా సర్వక్రియాసమగ్రంబయి షడంగసమృద్ధంబయి సంపూర్ణదక్షిణాసనాథంబయి సకల ధనధాన్యసమన్వితంబయి జగన్నాథపరిరక్షితంబయి సకల జనానందకరంబయి రాజసూయం బతి రమణీయం బయినది" అని నన్నయ మూలాతిశాయిగా వర్ణించినాడు. —నన్నయ. సభా 1-294

షోడశఋత్విజులలో హోత, అధ్వర్యుఁడు, ఉద్గాత, బ్రహ్మ యను నలువురు ప్రధానఋత్విజులు. తక్కినవారు వీరికి సహాయులుగా నుందురు.

1. హోత : ఋగ్వేదమంత్రములు చదువుచు దేవతల నాహ్వానించును.
   సహాయకులు : 1) మైత్రావరుణుఁడు, 2) అచ్ఛావాక్, 3) గ్రావస్తుతుఁడు.

2. అధ్వర్యుఁడు : కల్పోక్తవిధిప్రకారము యజ్ఞశిల్ప క్రియా నిపుణుఁడై యజుర్వేదమంత్రములు పఠించును.
   సహాయకులు : 1) ప్రతిప్రస్థాత, 2) నేష్ట, 3) ఉన్నేత.

3. ఉద్గాత : శర్వరీనామక సామవేదమంత్రములను గానము చేయును.
   సహాయకులు : 1) ప్రస్తోత, 2) ప్రతిహర్త, 3) సుబ్రహ్మణ్యుఁడు.

4. బ్రహ్మ : అథర్వణవేదవేత్తయై శిల్పవిద్యారహస్యములు తెలిసినవాఁడై యజ్ఞక్రియాకలాపమును పర్యవేక్షించును.
   సహాయకులు : 1) బ్రాహ్మణాచ్ఛంసి, 2) పోత, 3) అగ్నీధ్రుఁడు.

ఋగ్వేదవిద మేవ హోతారం వృణీష్వ యజుర్విదధ్వర్యుం
సామవేదవిద ముద్గాతారం అథర్వాంగిరసోవిదం బ్రహ్మాణం
తథా హాస్యయజ్ఞ శ్చతుష్పాత్ భవతి ॥

—గోపథబ్రాహ్మణము. 2-24

మూలము నందిట్లున్నది.

యాజ్ఞవల్క్యో బభూవాథ బ్రహ్మిష్ఠోఽధ్వర్యుసత్తమః ।
పైలో హోతా వసోఃపుత్రో ధౌమ్యేన సహితోఽభవత్ ॥

ఏతేషాం పుత్రవర్గాశ్చ శిష్యాశ్చ భరతర్షభ ।
బభూవు ర్హోత్రగాః సర్వే వేదవేదాంగపారగాః ॥

—వ్యా.భా. సభా. అ 33-39,36

హోత్రగాః అన సప్తహోత లని టీకాకారుఁడు వివరించి నాడు. [హోత్రగ - సప్త హోతా] *

షోడశ ఋత్విజులలో హోత, పోత, నేష్ట, అగ్నీత్ ప్రశాస్త మైత్రావరుణుఁడు అధ్వర్యుఁడు బ్రహ్మ అను నేడుగురు ముఖ్యు లయినట్లు ఋగ్వేదము వలనఁ దెలియుచున్నది.

తవాగ్నే హోత్రం తవ పోత్ర మృత్వియం తవ నేష్ట్రం త్వమగ్ని దృతాయతః
తవ ప్రశాస్త్రం త్వ మధ్వరీయసి బ్రహ్మాచాపి గృహపతిశ్చ నో దమే.

—ఋగ్వేద 2-1-2

ఈ సప్తహోతృ యజ్ఞవిధాన మత్యంతప్రాచీన మయిన దనియు వేదర్షుల కంటె పూర్వమే ప్రప్రథమయజ్ఞసంస్థాప్రవర్తకు లయిన మనువు, భృగువు, అంగిరసుఁడు, అథర్వుడు, మొదలగు నాది ఋషులచేఁ గనుఁగొనఁబడిన దనియు శివనాథ ఆహితాగ్ని వ్రాసినాఁడు.[1]

---

* చూడు :- వ్యా.భా సభా. 33-36 గీతా ప్రెస్. పు. 769

1. Cf :- 1) Sivanath Aahitagni : Rigveda Sara Samgraha
—P. 18 Notes on R. V. 2-1-2

"The ritual of the yajnas existed in some form even before the time of inspired Rishis, probably revealed to the prime-val Rishis Manu, Bhrigu Angirus, Atharva & C, the first institutors of sacrifice."

2) Ralbh T. H. GRIFFITH : Hymns of the Rigveda Vol 1
—Notes on R. V. 2-1-2

## యజ్ఞదీక్ష

తగిన సమయ మాసన్నమయినపుడు బ్రాహ్మణులు ధర్మరాజును యజ్ఞదీక్షితుని గావించిరి.

ప్రాజ్ఞుడు విశేషధర్మవి
ధిజ్ఞుఁడు ధర్మజుఁడు యజ్ఞదీక్షితుఁ డయి వి
ప్రజ్ఞాతి పరివృతుండయి
యజ్ఞాయతనమున కరిగె నధిక విభూతిన్. —నన్నయ. సభ 1-289

యజమానుఁడు యజ్ఞదీక్షితుఁ డగుటకు ముందు యజ్ఞభూమిని నాగలితో దున్ను సంప్రదాయ మున్నది.

వ్యాస ప్రణీత మైన భాగవత మహాపురాణమునం దీవిషయము వర్ణింపఁబడినది.

తతస్తే దేవయజనం బ్రాహణాః స్వర్ణలాంగలైః *
కృష్ట్వా తత్ర యథా న్యాయం దీక్షయాంచక్రిరే నృపమ్ ॥
హైమాః కలోపకరణా వరుణస్య యథా పురా ।
—వ్యాస. భాగవత - దశమ - ఉత్తర. 74-12, 13

పోతన యీ శ్లోకముల నిట్లనువదించినాఁడు.

భూమిసురులు విధ్యుక్తనియతులై -

"కడఁగి సవనభూమిఁ గనకలాంగలముల నర్థి దున్ని పాండవాగ్రజునకు
నచట దీక్ష చేసి యంచిత స్వర్ణమ యోపకరణముల నలోపముగను"
సముచిత క్రియాకలాపముల నడుపు చుండిరి.

—పోతన. ఆంధ్రభాగ-దశమ-ఉత్తర. 767

సాధారణముగా నాగళ్ళను చేయువారు వర్ధకులు. దారు శిల్పులు. రాజసూయయాగము నందు యజ్ఞభూమిని దున్నుటకు 'కనకమయలాంగలము' లుపయోగింపఁబడినవి. యజ్ఞోపకరణములును స్వర్ణమయములే.

కావున నీ రాజసూయయాగము నందు దారుశిల్పులు, స్వర్ణకారులును యాజ్ఞికులకుఁ దోడ్పడి నారని చెప్పవచ్చును.

---

* పోల్చు :- వ్యా. భా. వన 256-2 (వైష్ణవయాగము)
"సౌవర్ణం చ కృతం సర్వం లాంగలం చ మహాధనమ్."

## విశ్రాంతి గృహములు

"...చతుస్సముద్ర ముద్రిత వసుంధరాచక్రంబునం గల రాజచక్రంబును సమగ్రవేదవేదాంగవిదులైన యగ్ర జన్మలును స్వకర్మనిరతులయిన వైశ్యశూద్రులును వచ్చి యథా పరికల్పిత సన్నివేశంబుల నుండిరి".

—నన్నయ. సభా. 1-284

వేలకొలంది శిల్పులీ సన్నివేశములను బహురమణీయముగా నిర్మించినట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

తేషామావసథాంశ్చక్రు ర్ధర్మరాజస్య శాసనాత్
బహ్వన్నాచ్ఛాదనై[1] ర్యుక్తాన్ సగణానాం పృథక్ పృథక్
సర్వర్తు గుణసంపన్నాన్ శిల్పినోఽథ సహస్రశః
తేషు తే న్యవసన్ రాజన్ బ్రాహ్మణా నృపసత్కృతాః ॥

——వ్యా.భా. సభా. 33-47-49

ధర్మరాజు నాజ్ఞతో వేలకొలంది శిల్పులు రాజసూయ యాగమునకు వచ్చిన బ్రాహ్మణులు తమ శిష్యగణములతో నుండుటకు వారికి వేఱువేఱుగా విడిఁదిగృహములు నిర్మించి వాని యందు బహువిధాన్నములు, శయనాసనములు నుంచి సర్వర్తుసుఖదాయకముగా నొనరించిరి. రాజుచేత సత్కృతు లయిన బ్రాహ్మణు లందు నివసింపఁదొడఁగిరి.

ధర్మరాజుచే నృపులకు విడిదిగా నొసఁగఁబడిన గృహములు బహుకక్ష్యాన్వితములై దీర్ఘికలతోను వృక్షముల తోడను నొప్పుచున్నవి. ధర్మజునిచే సత్కృతులైన రాజులు తమకు నిర్దేశింపఁబడిన గృహములలో ప్రవేశించిరి.

దదు స్తేషా మావసథాన్ ధర్మరాజస్య శాసనాత్ ।
బహుకక్ష్యాన్వితాన్ రాజన్ దీర్ఘికావృక్ష శోభితాన్ ॥
తథా ధర్మాత్మజః పూజాం చక్రే తేషాం మహాత్మనాం ।
సత్కృతాశ్చ యథోద్దిష్టాన్ జగ్మురావసథాన్ నృపాః ॥

—వ్యా.భా. సభా. 34. 18-20*

---

1. పాఠాంతరము :- "బహ్వన్నాన్ శయనై ర్యుక్తాన్"
—సాతవలేకర్ ప్రతి. సభా. 30-47

* వ్యా భా. సభా. 32. 18, 19 —సాతవలేకర్ ప్రతి

ఆ రాజగృహములు కైలాసశిఖరముల వలె నున్నతములై మనోహరము లైన వస్తువులతో నలంకరింపఁబడియున్నవి. వాని చుట్టు నెత్తైన ప్రాకారములు చక్కగా నిర్మింపఁబడినవి. వెల్లవేయుట చేత నవి తెల్లగా నున్నవి.

ఆ భవనములు సువర్ణజాలాన్వితములైన గవాక్షములతో సొబగులీనుచున్నవి గృహాంతర్భాగములు మణికుట్టిమములతో మహాసనములతో నలంకరింపఁబడినవి. సుఖముగా మేడపై కెక్కుటకు దిగుటకు వీలుగా మెట్లున్నవి.

భవనము లన్నియు పుష్పమాలికలతో పరిమళ ద్రవ్యములతో సురభీకృతములై యున్నవి. హంసలవలెను చంద్రుని వలెను తెల్లగా నొక యోజనము దూరము చక్కగాఁ గనిపించుచున్నవి.

భవనద్వారములన్నియు విశాలములై సమములై విశిష్టగుణసంపన్నము లయియున్నవి. వాని వివిధావయవములు బహువిధములయిన ధాతువులతో చిత్రింపఁబడి హిమవచ్ఛిఖరముల వలె నున్నవి.

కైలాసశిఖరప్రఖ్యాన్ మనోజ్ఞాన్ ద్రవ్యభూషితాన్ ।
సర్వతః సంవృతా నుచ్చైః ప్రాకారైః సుకృతైః సితైః ॥

సువర్ణజాలసంవీతాన మణికుట్టిమశోభితాన్ ।
సుఖారోహణసోపానాన్ మహాసనపరిచ్ఛదాన్ ॥

స్రగ్దామ సమవచ్ఛన్నా నుత్తమాగురు గంధినః ।
హంసేందు వర్ణసదృశా నాయోజనసుదర్శనాన్ ॥

అసంబాధాన్ సమద్వారా న్యుతా నుచ్చావచైర్గుణైః ।
బహుధాతుపినద్ధాంగాన్ హిమవచ్ఛిఖరా నివ ॥

—వ్యా. భా. సభా. 34 20–23

రాజసూయమునకు వచ్చిన రాజులతో బ్రాహ్మణులతో మహర్షులతో నిండిన యజ్ఞమండపము - సభ్యశాల - దేవతలతో నిండిన స్వర్గలోకము వలె శోభిల్లుచున్నది.

తత్ సదః పార్థివైః కీర్ణం బ్రాహ్మణైశ్చ మహర్షిభిః ।
భ్రాజతే స్మ తదా రాజన్ నాకపృష్ఠం యథామరైః ॥

—వ్యా. భా. సభా. 34–25

యజ్ఞదీక్షితుఁడై యజ్ఞసభామండపము (సదము)నందు విభవోజ్జ్వలుఁడై విరాజిలుచున్న ధర్మరాజునకు నానాదేశములనుండి వచ్చిన రాజపుత్రులు బహుప్రకారములయిన బహుమతులు దెచ్చియిచ్చిరి.

ఈవిధముగా సకలైశ్వర్యసంపన్నుఁడై వరుణదేవునితో స్పర్ధపడు యుధిష్ఠిరుఁడు షడగ్నులతో రాజసూయ యజ్ఞమును గావించినాడు.

రాజాభిశ్చ సమావృతై రతీవ శ్రీ సమృద్ధిభిః ।
అశోభయత సదో రాజన్ కౌంతేయస్య మహాత్మనః ।
బుద్ధయా తు వరుణం దేవం స్పర్ధమానో యుధిష్ఠిరః ।
షడగ్ని నాథ యజ్ఞేన సోఽయజద్ దక్షిణావతా ॥

—వ్యా.భా, సభా. 35-16

అమ్మహామఖమునం దగ్నిముఖంబున
విపులమంత్రాహుతి వితతిఁజేసి
సకలదేవతలును సంపూర్ణదక్షిణా
దానోత్సవంబుల ధరణిసురులు...
......సంతృప్తులయిరి. —నన్నయ. సభా. 1. 294

కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత ప్రకారము రాజసూయ యాగము ఫాల్గుణ ప్రతిపత్తున ప్రారంభమై, అనుమతి, చాతుర్మాస్యములు, త్ర్యంబకహోమము, శునాసీర్యము, దేవికాదిషట్కము, రత్నినాంహవీంషి, దేవసువాంహవీంషి, అభిషేకజల గ్రహణసంస్కారములు, దిగ్వ్యాస్థాపనము, అభిషేకము, రథవిజయము, ఆసనోపవిష్టము. సంసృపాంహవీంషి, దశపేయము, సాత్యదూతహవీంషి, ప్రయుజాంహవీంషి, సౌత్రామణి అను వివిధక్రతువులతో సుమారు రెండుసంవత్సరములు నిర్వహింపఁబడును.

ఈ క్రతువులన్నింటిలో ప్రధానమయినది అభిషేచనీయము,* భారతమునం దదియే వర్ణింపఁబడినది.

* Cf :- A B. Keith : The Vedas of the Black Yajus School entitled Taittiariya Samhita. Introduction. P. cxi.

" In the ritual texts the Rajasuya is an offer of great complication extending over two years the centre being Abhisechaneya day when actual anoiting of the king took place.

## అభిషేచనీయము

తతోఽభిషేచనీయేఽహ్ని బ్రాహ్మణా రాజాభిః సహ ।
అంతర్వేదీం ప్రవివిశుః సత్కారార్హా మహర్షయః ॥

—వ్యా.భా. సభా. 36-1

రాజసూయ యజ్ఞాంతమునం దభిషేచనీయ దినమున బ్రాహ్మణులు, మహర్షులు రాజులతోఁగలిసి సత్కారార్థము యజ్ఞసదనాంతర్వేదిని ప్రవేశించిరి. వీరిలో విధిదృష్టవిశిష్టపూజనాయతికి అర్హుఁడయిన వాని కొక్కనికి అర్ఘ్యప్రదానము చేయుట సంప్రదాయము.

"స్నాతకుండు ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్
భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు వీరిలోఁ
బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టి మహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయవర్ధనా.

..................................................

అబ్జనాభుఁడుండ నర్ఘ్యంబునకు నిందు
నర్హు లొరులు గలరె యజ్ఞపురుషు
నఖిలలోకపూజ్యు నచ్యుతుఁ బూజింపు
మధిప యదియె చూవె యజ్ఞఫలము"

అని భీష్ముఁడు చెప్పగా సహదేవోపనీతం బయిన యర్ఘ్యం బర్హణీయుం డయిన వాసుదేవునకు శాస్త్రదృష్ట విధానంబున ధర్మతనయుం డిచ్చి సత్కరించినాడు.

—నన్నయ. సభా 2. 4-7

దాశార్హుండు పూజార్హుఁడే యని యధిక్షేపించిన శిశుపాలుని శ్రీకృష్ణుఁడు తన చక్రాయుధముచే నంతమొందించి వాని కొడుకుం జేదిరాజ్యంబున కభిషిక్తుంజేసినాఁడు.

యజ్ఞాంతమున త్రిలోకపూజ్యుఁడయిన పురుషోత్తమునిచే ధర్మజుఁ డభిషిక్తుఁడయినాడు.

---

* అభిషేచనీయ మన పూజనీయపురుషున కభిషేకము చేసి అర్ఘ్యసమర్పణము చేయుట. అభిషేచనీయము రాజసూయ యజ్ఞమున కంగభూతమైన సోమయాగవిశేష మని పండిత రామనారాయణదత్త శాస్త్రీ పాండేయ (రామ) వివరించినాడు.

[చూడు :- మహాభారత - గీతాప్రెస్ - పు. 774]

## అవభృథాభిషేకము

రాజసూయాధ్వరంబున నవభృథసమయంబునందు బ్రహర్షి రాజర్షి లోకపాలపరిభృతుం డయిన మహేంద్రుండునుం బోలె నున్న ధర్మతనయు నారదపారాశర్యాదిమహామునిసమేతుండయి ధౌమ్యుం దశేషతీర్థజలంబుల నభిషిక్తుంజేసె నట్లు నన్నయ వర్ణించినాఁడు. —నన్నయ. సభా, 2 118

కల్పసూత్రానుసారము రాజసూయాంతర్గత రాజాభిషేకవిధానము కృష్ణయజుర్వేదభాష్యము నందు వివరింపఁబడినది.

తీర్థజలములతో రాజు నభిషేకించుటకు వివిధవృక్ష దారువులతో నిర్మింపఁబడిన పాత్రలను, శతచ్ఛిద్రసువర్ణపాత్రను ఉపయోగింతురు. [1]

1. చూడు ;- కృష్ణయజుర్వేదము - సాయణభాష్యము -
ప్రథమకాండ - అష్టమప్రపాఠకము - 11-14 అనువాకములు.

సరస్వత్యాది నదీనదముల నుండియు సముద్రము నుండియు పవిత్రజలములనుదెచ్చి

దేవీ రాపః సం మధుమతీ ర్మధుమతీభిః సృజ్యధ్వం
మహి వర్చః క్షత్రియాయ వన్వానా ॥

అను మంత్రముతో వేతసదారునిర్మితమయిన సత మను ద్రోణకలశసదృశపాత్రియం దుంచి దానిని హోతృధిష్ణ్యమునకు బ్రాహ్మణాచ్ఛంసి ధిష్ణ్యమునకు మధ్య నుంచ వలెను. ఆ పాత్రియం దొక హిరణ్యశకలము నుంచి, దానిని దర్భలతో గ్రహించి

శుక్రా వః శుక్రేణోత్పునామి చంద్రాశ్చంద్రేణా మృతా
అమృతేన స్వాహా రాజసూయాయ చితానాః ॥

అను మంత్రముతో నా జలములను శుద్ధి చేసి, ఆ శుద్ధోదకములను మోదుగు, మేడి, రావి, మఱ్ఱి కఱ్ఱలతో నిర్మింపఁబడిన నాలుగు పాత్రలలో నింపవలెను.

తరువాత చండ్రకొయ్యతోఁగాని, మేడికఱ్ఱతోఁ గాని నిర్మింపఁబడిన పీఠము [ఆసంది]పై వ్యాఘ్రచర్మమును పఱచి, దానిపై యజ్ఞకర్త నాసీనునిఁజేసి యాతని శీర్షముపై శతచ్ఛిద్రయుక్త హిరణ్యపాత్ర నుంచి యా హిరణ్యపాత్ర ద్వారా మొట్టమొదట అధ్వర్యుడు యజమానునకు ముందు నిలిచి పాలాశపాత్రతోను, తరువాత వరుసగా బ్రాహ్మరాజన్యులు కుడివైపునుండి ఔదుంబరపాత్రతోను, వైశ్యుఁడు వెనుకవైపునుండి ఆశ్వత్థ పాత్రతోను, జన్యుఁడు [సఖుఁడు] ఎడమవైపు నుండి న్యైయగ్రోధ పాత్రతోను అభిషేకింపవలెను.

ఇది యజుర్వేదోక్తవిధానము.

ధౌమ్యాదుల తరువాత ధర్మరాజును శ్రీకృష్ణుఁడు విశ్వకర్మ నిర్మితసువర్ణకలశము నందలి జలములతో నభిషేకించినాఁడు. ఇందుకు సాక్ష్యము సుయోధనసార్వభౌముఁడే.

వ్యాసభారతమునం దిట్లు వర్ణింపఁబడినది.

ఉపాగృహ్ణాద్ య మిందాయ పురాకల్పే ప్రజాపతిః ।
తమస్మై శంఖమాహార్షీద్ వారుణం కలశోదధిః ।
శైక్యం నిష్కసహస్రేణ సుకృతం విశ్వకర్మణా ।
తేనాభిషిక్తః కృష్ణేన తత్ర మే కశ్మలో భవేత్॥

—వ్యా.భా, సభా. 53. 14-16

పూర్వకల్పమున ప్రజాపతిచే నింద్రున కొసఁగఁబడిన వారణ శంఖమును కలశోదధి ధర్మరాజునకు బహూకరింపఁగా, వేయిబంగారునాణెములతో విశ్వకర్మ చేతఁ జక్కఁగా నిర్మింపఁబడిన సువర్ణకలశము (శైక్యం) నందలి జలముల నా శంఖముతో గ్రహించి శ్రీకృష్ణుఁడు ధర్మజు నభిషేకించినాఁడు. ఆ మహావైభవమును జూచి వివర్ణుఁడ నయితి నని దుర్యోధనుఁడు తన తండ్రికిఁ జెప్పినాడు.

ఇట వారణ శంఖము దేవశిల్పియగు విశ్వకర్తనిర్మిత మను నొక యభిప్రాయము గలదు. 1

శంఖ మయినను శైక్య మయినను అది విశ్వకర్మ నిర్మితమే.

అవభృథాభిషేకముతో రాజసూయమహాధ్వరంబు సమాప్తసంప్రయోగం బయినది.

ఈ వర్ణనములను బట్టి రాజసూయాధ్వరమున కవసర మగు వివిధయజ్ఞోపకరణములు, యజ్ఞపాత్రలు నిర్మించి యజ్ఞనిర్వహణమునందు యాజ్ఞికులకు శిల్పులు తోడ్పడుచుండి రని తెలియుచున్నది.

---

* చూడు :- (1) మహాభారత - ప్రథమఖండ. పుట. 867 - గీతా ప్రెసు.
అనువాదము - పండిత రామనారాయణదత్త శాస్త్రీ పాండేయ (రామ్)

(2) హిందీ మహాభారత - వచనానువాదము - పు. 119
అనువాదము - చతుర్వేదీ ద్వారకాప్రసాద్ శర్మ.

1 Cf :- Mahabharata Eng Tr - P. C Roy P. 148.
" And the ocean himself brought in a sling that big conch of Varuna which the celestial artificer Viswakarma had constructed with a thousand Niskas of gold and which Prajapati presented unto Indra. It was with that conch that Krishna bathed Yudhistira after the conclusion of the sacrifice. "

## వైష్ణవయాగము

ధర్మరాజు చేసిన రాజసూయమును చూచి వచ్చినప్పటినుండియు దుర్యోధనుఁ డట్టి మహితాధ్వరము సేయవలె నని తలఁచుచుండెను.

కర్ణుఁడు వానిని ప్రోత్సహించెను.

రాజులఁ బిల్వఁబంపుము ధరామరసంఘము నామతింపు పే
రోజ నుదాత్తయజ్ఞగృహయూపతతుల్ సమకట్టఁబంపు వి
భ్రాజిత భక్ష్యభోజ్యవిధిభవ్యపదార్థము లానయింపు మ
వ్యాజవిభూతిమై నమరవల్లభు చాడ్పునఁ జేయు జన్నమున్.

—ఎఱ్ఱన. ఆరణ్య. 6-7*

కురుపతి సంతోషించి రాజసూయయజ్ఞంబు సదక్షిణంబుగాఁ జేయవలయు నని పురోహితునికిఁజెప్పఁగా నాతఁడు,

"జనవర నీకుఁ బాండవులు శత్రులు కావున నీవు వారి నో
ర్చిన మఱి కాక మున్న యిటు సేయఁగ శక్యమె రాజసూయమున్.
రాజసూయము నట్టిద రాజవర్య
వైష్ణవం బను యాగంబు, వాసుదేవుఁ
డిమ్మఖము సేసెఁ దొల్లి యభీష్ట మదియ
సేయు నిర్విఘ్నముగ నిది చెల్లు నీకు.

అని సూచించెను, —ఎఱ్ఱన. ఆరణ్య. 6, 72-73

మూలమునం దిట్లున్నది :

అస్తి త్వన్యన్మహత్ సత్రం రాజసూయసమం ప్రభో ।
తేన త్వం యజ రాజేంద్ర శృణు చేదం వచో మమ ।
య ఇమే పృథివీపాలాః కరదాస్తవ పార్థివ ॥
తే కరాన్ సంప్రయచ్ఛంతు సువర్ణం చ కృతాకృతమ్ । [1]
తేన తే క్రియతా మద్య లాంగలం నృపసత్తమ ॥

---

* వ్యా. భా. వన. 255-8

ఆహూయంతాం ద్విజవరాః సంభారాశ్చ యథావిధి ।
సంభ్రియంతా కురుశ్రేష్ఠ యజ్ఞోపకరణాని చ ॥

1. కృతమ్ ఘటిత మలంకారాదిరూపమ్. అకృత మన్యత్ ॥ —నీలకంఠ.

యజ్ఞవాటస్య తే భూమిః కృష్యతాం తేన భారత ।
తత్ర యజ్ఞో నృపశ్రేష్ఠ ప్రభూతాన్నః సుసంస్కృతః ॥
ప్రవర్తతాం యథా న్యాయం సర్వతో హ్యనివారితః ।
ఏష తే వైష్ణవో నామ యజ్ఞః సత్పురుషోచితః ॥
ఏతేన నేష్టవాన్ కశ్చిదృతే విష్ణుం పురాతనమ్ ।
రాజసూయం క్రతుశ్రేష్ఠం స్పర్ధత్యేష మహాక్రతుః ॥

—వ్యా. భా. వన. 255 15–20

కప్పము గట్టు రాజులు సమర్పించిన బంగారముతో నాగలిని చేయించి దానితో యజ్ఞభూమిని దున్ని చక్కఁజేసి యజ్ఞవాటమును నిర్మింపవలయును. ఇది సత్పురుషోచితమయినది. రాజసూయముతో సమానమయిన యీ వైష్ణవయజ్ఞమును నీవు చేయు మనెను.

వైష్ణవయాగము నందు ప్రధానమైన సువర్ణలాంగల ప్రస్తావన ఎఱ్ఱన యాంధ్రానువాదమునందు లేదు.

సుయోధనుఁ డందుల కంగీకరించి జననీజనకులకు ద్రోణవిదురాదినిఖిలమాన్యజనములకు నెఱిగించి,

"వారిచేత ననుజ్ఞాతుండయి నగరసమీపంబున నొక్క పుణ్యస్థలంబునం దఖిలయజ్ఞగృహంబులు రమణీయంబులుగాఁజేయించి యజ్ఞోపకరణంబులును సమస్తవస్తువిశేషంబులును సమకట్ట నియోగించి శుభదినంబునం బరమ బ్రాహ్మణసహాయుడై నియత దీక్షాశోభనంబు వహించె." —ఎఱ్ఱన. అరణ్య. 6–76

మూలమునం దిట్లున్నది -

సందిదేశ తతో రాజా వ్యాపారస్థాన్[1] యథాక్రమమ్ ॥
హలస్యకరణే చాపి వ్యాదిష్టాః సర్వశిల్పినః ।
యథోక్తం చ నృపశ్రేష్ఠ కృతం సర్వం యథాక్రమమ్ ॥

—వ్యా. భా. వన. 255. 24–25

పురోహితుని సూచన ననుసరించి దుర్యోధనుఁడు శిల్పులను బిలిపించి సువర్ణహలమును జేయ నాజ్ఞాపించెను. శిల్పు లెల్లరు యథావిధిగా యజ్ఞోపకరణములను జేసిరి.

---

1. వ్యాపారస్థాన్ శిల్పినః ॥ 24 ॥ నీలకంఠ. మహాభారతమ్ చిత్రశాలాప్రతి. పు. 406

తతస్తు శిల్పినః సర్వే అమాత్యప్రవరాశ్చయే ।
విదురశ్చ మహాప్రాజ్ఞో ధార్తరాష్ట్రే న్యవేదయన్ ॥
సజ్జం క్రతువరం రాజన్ కాలప్రాప్తం చ భారత ।
సౌవర్ణం చ కృతం సర్వం లాంగలం చ మహాధనమ్ ॥

—వ్యా భా. వన. 286. 1, 2

తరువాత శిల్పులు మంత్రివర్యులు, మహాప్రాజ్ఞుఁడయిన విదురుఁడు దుర్యోధనునితో "మహారాజా! సమస్తయజ్ఞోపకరణములను, పెద్దనాగలిని స్వర్ణమయములుగా నొనరించితిమి. అన్నియు సిద్ధముగ నున్నవి. యజ్ఞారంభమునకు సుముహూర్త మాసన్నమయినది" - అని విన్నవించిరి.

యజ్ఞమారంభమయినది. ధరణిగల రాజులెల్లరు, మునిగణములు' సమస్త జనములును దుర్యోధనుని యజ్ఞము చూచుటకుఁ గరిపురమునకు వచ్చిరి. వారికెల్లను డగిన సత్కారంబులు సేయను, బాత్రదానంబులు గావింపను ధృతరాష్ట్రుఁడు విదురుం బనిపెను.

"ఇవ్విధంబునఁ బ్రసిద్ధదక్షిణాన్వితంబై
ప్రభూతాన్నపాన సంతర్పిత సకలజనంబై
యభిమతాంబరాభరణ పరిపూరితభూసురప్రకరంబై
యథాకాలవిహితకర్మకలాపంబై యథాశాస్త్రీయంబై
వైష్ణవయాగంబు నిర్విఘ్నంబుగఁ బరిసమాప్తంబయినది."

—ఎఱ్ఱన. అరణ్య. 6. 83, 84

యజ్ఞమును జూడవచ్చిన రాజు లుండుటకుఁదగిన గృహములను దుర్యోధనుఁడు నిర్మింపించి యిచ్చినట్లు మూలమునందుఁ గలదు.

కృత్వాహ్యావసథాన్ వీరో యథా శాస్త్రమ్ యథా క్రమమ్ ॥

—వ్యా. భా. వన. 256-25

అధ్వరోత్సవాగతులయిన జను లనేకులు ధృతరాష్ట్ర నందను సమ్ముఖంబున పొగడిరి.

ఈ వైష్ణవయాగము నందు స్వర్ణశిల్పుల పని యెక్కుడుగా నున్నది.

## అశ్వమేధయాగము

రాష్ట్రం వా అశ్వమేధః । వీర్యం వా అశ్వః ॥

—శతపథ. 13. 1.6*

అశ్వశబ్దము వీర్యవాచకము. అశ్వమేధ మన రాష్ట్ర ప్రజలను వీర్యవంతులను జేసి రాష్ట్రము నభివృద్ధిచేయుట.

అశ్వమేధము = అశ్వమును పశువుగా నేర్పఱచి సార్వభౌముఁడు చేయు యాగవిశేషము. —[సూ.ని.]

అశ్వమేధము సర్వపాపములను తొలగించు క్రతురాజము.

యథాశ్వమేధః క్రతురాట్ సర్వపాపాపనోదనః ॥

—మనుస్మృతి. 11-261

ఇంద్రుఁ డశ్వమేధము చేసి బ్రహ్మహత్యాపాతకమును బోఁగొట్టుకొనినట్లు మహాభారతము చెప్పుచున్నది.

తత్రాశ్వమేధః సుమహాన్ మహేంద్రస్య మహాత్మనః ।
వవృతే పావనార్థం వై బ్రహ్మహత్యాపహో నృప ॥

—వ్యా.భా. ఉద్యోగ. 13-18

త్వష్టృప్రజాపతి తన తపశ్శక్తిచే నగ్నిముఖమున వేల్చి సృజించిన వృత్రుని సంహరించుట వలన దేవేంద్రునకు బ్రహ్మహత్యాపాతక మంటుకొనినది. దాని వలన నాతని ప్రభుత్వ సంపద సెడినది. అమరగణము విష్ణుదేవుని ప్రార్థింపఁగా శౌరి కరుణాయత్తచిత్తుండై -

"హయమేధంబున నాకును బ్రియమొనరింపంగ
వృత్రభేదికిఁ బుణ్యోదయ మగు"నని చెప్పినాఁడు.

అమరులెల్లరు పురుహూతుని చేత నశ్వమేధముచేయించి కల్మషరహితుని గావించినారు. [1]

---

* చూడు :- పండిత ధర్మదేవ్ విద్యామార్తండ - వేదోంకా యథార్థస్వరూప్ [హిందీ] పుట - 180 దయానందసంస్థాన్ - నయాఢిల్లీ.

1. తిక్కన :- శ్రీమదాంధ్రమహాభారతము - ఉద్యోగపర్వము. ప్రథమాశ్వాసము, 117-168 = వ్యా భా. ఉద్యోగ. 8-13 అధ్యాయములు

## వైశ్వకర్మణ హోమము

వృత్రహంతకుఁడయిన యింద్రుడు వైశ్వకర్మణ హోమము చేసి వృత్రవధవలనఁ గలిగిన పాపమునుండి విముక్తుఁ డయినట్లు కృష్ణయజుర్వేదము వలనఁ దెలియుచున్నది.

ఇంద్రునిచే హతుఁడయిన వృత్రుఁడు అసురమాయచే షోడశభోగ యుతమయిన సర్పాకృతి ధరించి యింద్రుని పీడింపఁదొడఁగెను. ఇంద్రుఁ డంతట 'అగ్నిస్తిగ్మేన' - ఇతి మంత్రద్వయముతో ముందటనున్న యగ్నియం దాహుతులిడఁగా నగ్ని తృప్తుఁడై యా వృత్రుని షోడశభోగములను దహించివైచెను.

తదుపరి యింద్రుడు 'య ఇమా విశ్వే'తి సూక్తద్వయసాధ్యమయిన వైశ్వకర్మణ హోమము చేసి యా పాపమునుండి విముక్తుఁ డయినాఁడు.[1]

> తత ఊర్ధ్వ మింద్రో య ఇమా విశ్వేతి సూక్తద్వయసాధ్యేన
> వైశ్వకర్మణ హోమేన వృత్రవధజన్యాత్ పాప్మనో నిర్ముక్తః ॥

---

1. చూడు :- కృష్ణయజుర్వేదము - సాయణభాష్యము 4-6-2 విశ్వకర్మ సూక్తద్వయ వినియోగము పు. 2168

— ఆనందాశ్రమ ముద్రణాలయము, పూనా. 1866

> ఇంద్రో వృత్రహంతం వృత్రో హతః షోడశభిర్ భోగైరసినాత్
> ఏతామగ్నయేఽనీకవత ఆహుతి మపశ్యత్తామజుహో
> త్తస్యామగ్నిరనీకవాంత్స్వేన భాగధేయేన ప్రీతః
> షోడశధా వృత్రస్య భోగానప్యదహద్
> వైశ్వకర్మణేన పాప్మనోనిరముచ్యత॥ —(కృ.య. 5-4-5)

> యదగ్నయేఽనీకవత ఆహుతిం జుహోత్యగ్నిరేవా
> స్యానీకవాంత్స్వేన భాగధేయేన ప్రీతః పాప్మానమపి దహతి
> వైశ్వకర్మణేన పాప్మనో నిర్ముచ్యతే ॥ —(కృ.య. 5-4-5)

Cf :- A. B. Keith : T. S. 5 - 4 - 5.
"Indra slew Vritra ......... he is set free from his evil by the offering to VISVAKARMAN."

అశ్వమేధమున కంగభూతమయిన అగ్నిచయనక్రతువు నందు శతరుద్రీయ హోమము తరువాత దురితక్షయార్థము వైశ్వకర్మణ హోమము చేయవలయును.

"షోడశగృహీతేన స్రుచం పూరయిత్వా వైశ్వకర్మణాని జుహోతి
య ఇమా విశ్వా భువనాని జుహ్వత్
చక్షుషః పితా మనసా హి ధీర -ఇతి
నానా సూక్తాభ్యాం ద్వే ఆహుతీ యే కామయేన
చిరం పాప్మనా నిర్ముచ్యతే" -ఇతికల్పః ॥ *

పదునాఱు స్రువముల ఘృతము నొక స్రుక్కునందు నింపి ఎనిమిదేసి మంత్రములు గల (1) య ఇమా విశ్వాని జుహ్వత్ (2) చక్షుషః పితా మనసా హి ధీర -ఇతి విశ్వకర్మసూక్త ద్వయమంత్రములతో విశ్వకర్మ పరమేశ్వరునకు రెండు ఆజ్యాహుతు లిచ్చినచో యజమానునకు పాపవిమోచనము కలుగును.

అటుపిమ్మట మఱొకమాఱు గూడ విశ్వకర్మకు ఘృతాహుతి యొసఁగవలెను.

పత్యే విశ్వస్యభూమనో జుహోమి విశ్వకర్మణే ॥–శు.య. 17-78*

---

* చూడు :- కృష్ణయజుర్వేదము - సాయణభాష్యము. 4-6-2. పుట 2161

Cf :- (1) A. B. Keith : T. S. 4 - 6 - 2 Notes
This section gives Mantras for two oblations to Visvakarman each with eight mantras.

(2) Ralph T. H. Griffith : The Texts of the WHITE YAJURVEDA - Book - XVII - 17

"He (the Adhvaryu) offers clarified butter in a ladle filled with sixteen spoonfuls in two oblations with eight formulas for each."

"VISVAKARMAN, the Omnific the Universal Father and Generator, the Architect of the worlds and Creator of all things, here identified with Prajapati Agni, the FireAlasr"

"He offers again to Visvakarman, the Omnific Agni."
—XVII - 78

దీనిని(బట్టి యశ్వమేధయాగమునందు యజమానుఁడు పాపవిమోచనార్థము విశ్వకర్మ పరమేశ్వరుని గాని తత్స్వరూపుఁ డయిన విష్ణువును గాని పూజింపవలయునని తెలియుచున్నది.

కురుక్షేత్రసంగ్రామమునం దసువులఁ బాసిన బంధుమిత్రులను గూర్చి పొగులుచున్న ధర్మరాజును జూచి వ్యాసుఁడు,

"........నీ మదిఁ బాపకర్మశంక కలిగెనేనియును
యాగముల దానంబుల నది పాపికొనరాదె
యశ్వమేధ మధికదక్షిణాన్వితముగ ననఘ చేయు
మంతతో భవదీయచిత్తానుతాప మంతయును బాయు
రఘురామునట్లు పూరుభరతులను బోలె,
దానతత్పరుఁడ వగుము" - అని ప్రబోధించినాఁడు.

—తిక్కన. అశ్వమేధ. 1-12

"అశ్వమేధయాగనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁజాలు" నని వింటిని [1] గాని హయమేధము నధికదక్షిణాన్వితముగఁ జేయుటకు జాలినంత ధనము లేదు కావున కర్తవ్యం బుపదేశింపు మని ధర్మజుఁడు కోరఁగా వ్యాసమహర్షి యమ్మహీపతిం బరమాదరంబున నాలోకించి మరుత్తుని పుణ్యచరితంబును ధనసంపాదనోపాయంబును దెలిపెను.

మనువంశసంభవుండయిన కరంధముఁడను భూపతి 'నిజతపః ప్రభావంబునను మహానుభావుండగు నంగిరసుండు తన కుపద్రష్టయయి యనేకాశ్వమేధంబులు చేయించుటఁజేసి యావహిల్లిన మాహాత్మ్యంబు వలనను మహీపతులెల్లఁ గొలువం బూజ్యసామ్రాజ్యం బనుభవించి తనవలచినయప్పుడ తనువుతోడన యూర్ధ్వలోకంబునకుం జనియె నమ్మనుజపతి తనయుం డవిక్షిన్నామధేయుండు ధరాభారధౌరేయుండయి యతనిని పోలి ప్రజలంబాలించె అతని సుతుఁడగు మరుత్తుఁడు,

హిమగిరిసానుదేశమున నెక్కుడు వైభవ ముల్లసిల్ల య
జ్ఞము తగఁజేసి భూమిసురసంఘము లెల్లను దృప్తిఁబొంద హే
మ మొసఁగెఁ గుప్పఁగూరలు సమగ్రకుతూహలుఁడై కనత్సువ
ర్ణమయగృహక్రియోపకరణప్రకరంబులు నిచ్చె భక్తితోన్.

—తిక్కన. అశ్వమేధ. 1. 31,32

---

1. చూడు :- తిక్కన. అశ్వమేధ. 1-13 = వ్యా. భా. అశ్వమేధిక. 3-11
"అసంశయం వాజిమేధః పావయేత్ పృథివీమపి॥"

# మరుత్తుని మహితాధ్వరము

మరుత్తో నామ ధర్మజ్ఞ శ్చక్రివర్తీ మహాయశాః ॥
నాగాయుతసమప్రాణ స్సాక్షాద్ విష్ణు రివాపరః ।
స యక్ష్యమాణో ధర్మాత్మా శాతకుంభమయాన్యుత ॥
—వ్యా భా. ఆశ్వమేధిక 4. 23. 24

అమ్మనుజేశ్వరుండు విభవాతిశయంబు వెలుంగ నశ్వమే
ధ మ్మొనరించుచుండి వివిధస్ఫురితాలయముల్ ప్రదీప్తభాం
డమ్ములు సత్పదార్థములిడందగు తక్కును గల్గు సిద్ధపా
త్రమ్ము లసంఖ్యముల్ పసిఁడిఁ బ్రస్తుతికెక్క ఘటించె భూవరా
—తిక్కన. ఆశ్వమేధ. 1. 28. 29

యజ్ఞశాలలు, కుండములు, వర్తనములు, పితరములు, ఆసనములు మున్నగు యజ్ఞోపకరణములను సువర్ణకారులు స్వర్ణమయములుగా నిర్మించి నట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

తతః కుండాని పాత్రీశ్చ పిఠరాణ్యాసనాని చ ।
చక్రు స్సువర్ణకర్తారో యేషాం సంఖ్యా నవిద్యతే ।
తస్యైవ తు సమీపేన యజ్ఞవాటో బభూవహ ॥
ఈజే తత్ర స ధర్మాత్మా విధివత్ పృథివీపతిః ।
మరుత్త స్సహితైః సర్వైః ప్రజాపాలై ర్నరాధిప ॥
--వ్యా.భా ఆశ్వ. 4. 26-28

తన యజ్ఞమున కుపద్రష్టయయిన సంవర్తుని సూచనపై మరుత్తమహీపతి ముంజవంతంబను పర్వతంబునకుఁబోయి యందు శ్రీకంఠుని భక్తితోఁ బ్రార్థించి "శివు నకుంఠితకరుణన్ గనక మసంఖ్యము మోపులు గొనివచ్చె మంచుకొండ యివులకున్."

"ఇట్లు మహాధనవంతుండై మరుత్తుండు సువర్ణమయంబులుగా యజ్ఞవాటంబును భాండప్రముఖసకలక్రియాసాధనంబులును శయ్యాసనాదులుం గావించుకొని తత్ప్రదేశంబున నతిమానుషం బగు విభవం బెసంగ యజనంబున కుపక్రమించి" నట్లు తిక్కన వర్ణించినాఁడు. —తిక్కన. ఆశ్వమేధ. 1. 63. 64

యజ్ఞవాటమును, యజ్ఞోపకరణములను శిల్పులు నిర్మించినట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

తతోఽతిమానుషం సర్వం చక్రే యజ్ఞస్య సంవిధిమ్ ।
సౌవర్ణాని చ భాండాని సంచక్రు స్తత్ర శిల్పినః ॥ —వ్యా.భా. అశ్వ. 8. 36

ఈ శిల్పులు సువర్ణశిల్పులే.

యజ్ఞాంతమున మరుత్తుఁడు, 'ప్రస్ఫురితకాంచనరాసు లనేకములు' బహుద్విజులకు భక్తితో నొసఁగి,

"అంతఁ బోవక హేమమయత్వమహిత
యజ్ఞవాటభాండాది పదార్థములను
బ్రాహ్మణావళికిచ్చె నప్పాట నతఁడు
హిమగిరిప్రాంతమునఁ గ్రతు వెలమిఁ జేసి"

బ్రాహ్మణులు తమ యోపినంతయుంబసిండి త్రవ్వితండంబులు తెచ్చికొని తక్కనదాని నచ్చట నొక్కెడ నిధిగా నిక్షేపించిరి. అమ్మహా కాంచనసంచయంబు గొనివచ్చి విచ్చలవిడి నశ్వమేధ యాగంబున సకలదేవతలం దృప్తులఁ జేయు మని వ్యాసుఁడు ధర్మజున కుపాయము చెప్పినాడు. [తిక్కన అశ్వమేధ.1. 105-7]

ఆ యుపాయమును బురస్కరించుకొని,

'తెత్తముగాక నరేంద్రమరుత్తకలితమైన దానరూపము సుమహో
దాత్తస్థితి నున్న కనక మిత్తఱి నిలదెసఁ దలఁప నేటికి మనకున్'

అని భీముఁడుత్సహింపఁగాఁ బాండవులు హిమశైలము పోయి త్ర్యంబకపూజలు చెల్లించి యా పెన్నిధిని సాధించి భారవహుల చేత మోపించుకొని తెచ్చినారు.

'ఆ నిధియందు ........ యాగనిలయంబుఁ గలపయుఁ గలశములును
నలుఁకులుఁ గాగులు నాదిగాఁగల భాండములును
బీఠములు శయ్యలునుజోళ్లు రోఁకళులుఁ జట్టువమ్ములు
స్రుక్స్రువాజ్యపాత్రదండకమండలుదాత్రములును
లోనుగాఁగల్గు వస్తువుల్ శుద్ధహేమమయములు' గలవు.

—తిక్కన. అశ్వమేధ 3. 156

ఆ ధనకనకవస్తుసంపదతో ధర్మజుఁ డశ్వమేధాధ్వరము సేయ సమకట్టినాఁడు.

# ధర్మజుని అశ్వమేధయాగము

తురగమేధ మఖిలదుష్కృతహరము నీ
వది సమగ్రదక్షిణాన్వితముగఁ
జేసి నిర్మలత్వభాసమానుండవై
వెలయు మమృతకిరణకులవరేణ్య

వేదోక్తవిధిసహిత భవ్యాదరమున విడువఁబడిన యశ్వం బీ
మేదినిఁ గలయందిరుగును నీదగునిర్మలయశంబు నెఱయమెఱయగన్

సర్వసంభారములును సమకట్టింపుము.

'స్రుక్స్రువాది క్రతుసాధనంబులు క్రొత్తలుగాఁగనకంబునంగావింపఁబనుపు' మని వ్యాసమునీంద్రుడు చెప్పగా

ధర్మరాజు తురగపరీక్షావిదులను బిలిపించి, నిరుపమలక్షణములుగల మేధ్యాశ్వమును దెప్పించినాఁడు; యజ్ఞంబునకువలసినట్టి భాండప్రముఖంబు లయిన సాధనంబులును, స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణ మయంబులుగా వేగంబచేయింపవలయు' నని కర్మాధికారుల నియోగించినాఁడు.[1]

## యాగదీక్ష

శ్రుతి॥ చిత్రానక్షత్రం భవతి చిత్రం వా ఏతత్కర్మ
యదశ్వమేధః సమృద్ధ్యై॥ — తై.బ్రా. 3-8-1

బహువిధములుగా ననుష్ఠింపఁదగిన ఋష్టిపశుసోమాది రూపములు గలదనుటవలన నశ్వమేధయజ్ఞము చిత్రమయినది. చిత్ర మన శిల్పమే.

చిత్రానక్షత్రమున కధిపతి శిల్పాధిపతియైనత్వష్ట. ఇంద్రుఁడని కొందఱందురు. ఇంద్రుఁడును శిల్పకళాభిమానియే. కావున యజ్ఞకర్మాభివృద్ధి కొఱకు అశ్వమేధమును చిత్రానక్షత్రమునం దారంభింపవలయును.[2]

---

1. తిక్కన. అశ్వమేధ. 3. 209-220
2. చూడు : వడ్డెపాటి నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము - పు. 107

ధర్మజుఁడు చైత్రపౌర్ణమాసి అశ్వమేధమాగ దీక్షితుఁడైనాఁడు.[1]

మౌహూర్తికదత్త శుభముహూర్తంబునం గృష్ణద్వైపాయనాదులైన ఋత్విజులు వేదవిహితమహితంబుగ దీక్షితుంజేయ నక్కురుపతి

సంవృతక్షౌమ కృష్ణాజినుండును దండపాణియునయి[2] .... ....

కనత్కాంచనాభరణ భూషితుండును నయి

బహుళప్రభలుఁనిగుడ సందీప్తపావకసన్నిభుండును నగుచువెలింగె.

—తిక్కన. అశ్వమేధ. 4.1

హేమమాలీ రుక్మకంఠః ప్రదీప్త ఇవ పావకః।

కృష్ణాజినీ దండపాణిః క్షౌమవాసాః స ధర్మజః ॥

—వ్యా. భా అశ్వమేధిక. 73.5

రుక్మ మనఁగా ఫలకాకారము గల సువర్ణాభరణము.

దీక్షాసమయమునం దధ్వర్యుఁడు సువర్ణాభరణయుక్తమై ఇరువది యొక్క ముడులు గల సూత్రమును యజమానుని మెడలో వైచి ఆయుర్వృద్ధి కొఱకు.

"తేజోఽసి శుక్ర మమృత మాయుష్యాఽఆయుర్మేపాహి"

అను మంత్రమును పఠింపఁజేయును.[3] —శు. య. 22.1

రుక్మధారణ మాయుర్వృద్ధిని సంపత్సమృద్ధిని కలిగించును.

దృశానో రుక్మ ఉర్వ్యా వ్యద్యౌ దుర్మర్ష మాయుః

శ్రియే రుచానః ॥ — కృ. య. 4. 1-10*

---

1. తిక్కన - అశ్వమేధ 3. 214 = వ్యాభా. అశ్వ 72-4.

2 చూడు :- కృ. య. సం. కాం. 6-1-1

"దండేన దీక్షయతి మేఖలయా దీక్షయతి కృష్ణాజినేన దీక్షయతి"

"వాససా దీక్షయతి సౌమ్యం వై క్షౌమం దేవతయా

సోమ మేష ముపైతి యో దీక్షితే."

3. Cf :- The Adhvarya ties an ornament of gold, perhaps a chain, round the neck of the sacrificer and makes him recite the formnla. (22-1) —GRIFFITH.

* చూడు :- కృ.య, సాయణభాష్యము. 4-1-10; 5-1-10:

"దృశానో దర్శనీయరూపో రుక్మః సువర్ణనిర్మితః

ఫలకాకార ఆభరణవిశేష ఉర్వ్యా మహత్యా దీప్త్యా

వ్యద్యౌద్ విద్యోతతే స్మ - కిం కుర్వన్ - దుర్మర్ష

మతిరస్కార్య మాయుర్జీవన శ్రియేం శ్రయితుం వాంఛన్. —సాయణ,

# యజ్ఞాశ్వము

దీక్షితుండైన ధర్మరాజు "పశుబంధనము" చేసినాఁడు.

కృత్వా స పశుబంధాంశ్చ దీక్షితః పాండునందనః ॥

—వ్యా.భా. అశ్వ. 73-2

యజ్ఞియమైన తురగోత్తమమును పూజించి విడచుటకు ముందుగా శుభలక్షణములుగల హయము జన్మించుటకుఁ గారణభూతుఁడైన త్వష్టృదేవుని పూజింపవలయును.

త్వష్టా వీరం దేవకామం జజాన
త్వష్టు రర్వాజాయత ఆశు రశ్వః ।*
త్వష్టేదం విశ్వం భువనం జజాన
బహోః కర్తార మిహ యక్షి హోతః ॥** —కృయ. 5-1-11

[త్వష్టృదేవుఁడు దేవతలను గోరువాఁడును, కర్మకారుఁడు నగు పుత్రుని సృష్టించినాఁడు. ఆ త్వష్ట వలననే గమనకుశలయు శీఘ్రగామియు నగు నశ్వము పుట్టినది. త్వష్టయే యీ విశాలవిశ్వమును సృష్టించినాఁడు. ఓ హోతా! యీ యజ్ఞకర్మమునందు సకలజగత్ స్రష్టయైన త్వష్టృదేవుని పూజింపుము.]

వేదవ్యాసుఁడు స్వయముగా శాస్త్రప్రకారము యజ్ఞాశ్వమును విడిచినాఁడు అర్జునుఁ డశ్వరక్షకుఁడుగా నయ్యశ్వరత్నము ననుసరించినాఁడు. అక్కవ్వడి తోడ యజ్ఞకర్మకుశలుండైన యాజ్ఞవల్క్యశిష్యుం డర్హవిధానంబుల కయి మాననీయ విప్రజన సహితంబుగాఁ జనియె. అప్పరమతురంగంబు ధరణిఁ బ్రదక్షిణ రూపంబునం దిరిగి యుత్తరాభిముఖంబై యల్లనల్లన నరిగెను.

—తిక్కన, అశ్వమేధ. 4. 1.

ఇట్లాయశ్వ మొకసంవత్సరము దేశసంచారము చేయును.

---

* పోల్చు :- శు.య. 9-8 త్వష్టా పత్సు జవం దధాతు.

** చూడు :- కృ.య. 5-1-11 సాయణభాష్యము

అశ్వమేధసంబంధి ప్రయాజ యాజ్యాభిధానమ్ - ఆప్రీసూక్తము

త్వష్టా త్వష్టృనామకో దేవః ॥ ....సాయణ.

త్వష్టా రూపాణాం జనితా పశూనామ్॥ ....అథర్వ. 9. 4.

## ధృతిహోమము

ఈశ్వరో వా అశ్వః ప్రముక్తః పరాం పరావతం గంతోః ఇహ ధృతిః స్వాహేహ విధృతిః స్వాహేహరంతిః స్వాహేహ రమతి స్వాహేతి చతస్ర ఆహుతీ ర్జుహోతి ॥ —యజుర్బ్రాహ్మణము 3-8-12, 45*

ముక్తంబయిన యజ్ఞాశ్వము యథేచ్ఛగా దేశసంచారము చేయునపుడు సాయంకాలమగు సరికి ఇతరత్ర సంచరించు నేమో యను భీతిచే నశ్వరక్షకులు ఋత్విజులు రథకారగృహమున దానిని నిలిపి యా యశ్వము యొక్క నాలుగు పాదములయందు, "ఓం ఇహ ధృతి స్వాహా" ఇత్యాది నాలుగు ధృతిమంత్రములతో హోమము చేయవలెను.
యదుక్తం సూత్రకారేణ॥

"రథకారస్య కులే వసతి భవతీహధృతిస్వాహేతి
సాయ మశ్వస్య చతుష్షు పత్సు చతస్రో ధృతీర్జుహోతి॥"
రథకారకుల మనఁగా రథకారగృహము.

'వర్షాసు రథకారోఽగ్నీనాదధీత '[1] అను శ్రుతి ప్రకారము అగ్న్యాధానాధికారము గల రథకారబ్రాహ్మణులు తృతీయసవనము నందు హవిర్భాగములు స్వీకరించు ఋభుదేవతలకు ప్రతినిధులు. కావున యాగాశ్వమునకు సంబంధించిన సాయంహోమము వైదిక రథకార గృహమునందుఁ జేయవలయు నని చెప్పఁబడినది [2]

ధర్మజుని యజ్ఞాశ్వము ననుసరించిన యర్జునుఁడు, యజ్ఞకర్మకుశలుఁ డయిన యాజ్ఞవల్క్యశిష్యుఁడు, వేదపారగు లయిన బ్రాహ్మణులు సాయం సమయములందు, శాస్త్రోక్త విధిప్రకారము రథకారబ్రాహ్మణగృహములందు యజ్ఞాశ్వమునకు ధృతి హోమములు చేసియుందురని చెప్పవచ్చును.

---

* చూడు :- కృష్ణయజుర్వేదే బ్రాహ్మణభాగః॥
సం. గోమఠం రామానుజ జ్యౌతిషిక - మైసూరు

పోల్చు :- శుక్ల యజుర్వేదము. 8-51
"ఇహరతి రిహరమధ్య మిహధృతి ఇహస్వధృతి స్వాహా॥"

1. వామనశర్మ :- ఆధానపద్ధతిః॥ ఆధానమీమాంసా. పు-5.
ఆపస్తంబీయశ్రౌతాధాన సూత్రమ్ - ఆనందాశ్రమ - పూనా. 1947

2. చూడు :- వడ్డెపాటి నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము
—పుటలు. 288-289

# యజ్ఞశాలాదినిర్మాణము

యాగాశ్వమును విడిచిన పదినెలల తరువాత మాఘ పౌర్ణమాసి ధర్మనందనుఁడు కొలువుదీఱి యనిలనందను నాననంబాలోకించి, నీ తమ్ముఁడు తురగముఁగొని యేతెంచుట వింటి, చైత్రమింకఁ దడవు లేదు.

"యాగశాలయు శిల్పిజనులం గొని కల్పింపుము తగు వారలకు విడియుందగియెడు వివిధగృహంబుల నొనరింపు" మని పనిచిన నతండు,

యజ్ఞవాటమును జనాధిపులకు మునివ్రాతమునకు విడియవలయు నట్టి
మందిరములుఁ గనకమణిమయంబులుగా నొనర్చెఁ దజ్ఞమగు జనంబు పొగడ.

—తిక్కన. అశ్వమేధ. 4. 132,33

వ్యాసభారతమునం దీవర్ణనము విపులోదాత్తముగ నున్నది.

తతో యయౌ భీమసేనః ప్రాజ్ఞైః స్థపతిభిః సహ ।
బ్రాహ్మణానగ్రతః కృత్వా కుశలా యజ్ఞకర్మణి ॥
తం స సాలచయం శ్రీమత్ సప్రతోళీసుఘట్టితమ్ ।
మాపయామాస కౌరవ్యో యజ్ఞవాటం యథావిధి ॥

వ్యా.భా. ఆశ్వమేధిక. 85-14

స్థపతు లనఁగా స్థాపత్యమునందు - యజ్ఞశిల్పము నందు నిష్ణాతులయిన శిల్పిబ్రాహ్మణులు.* అథర్వణులు. విధి యన శిల్పశాస్త్రవిధి.

---

*చూడు :- (1) వాల్మీకి రామాయణము బాలకాండ. 13-6
తతోఽబ్రవీద్ ద్విజాన్ వృద్ధాన్ యజ్ఞకర్మసునిష్ఠితాన్
స్థాపత్యే నిష్ఠితాంశ్చైవ వృద్ధాన్ పరమధార్మికాన్.

2) E. B. HAVELL : THE HISTORY OF ARYAN RULE -pp 19-20
"The RAMAYANA records the fact that some of the higher ranks of craftsmen had a social status equal to that of Brahmins Included among them were those who were versed in the canons of craft ritual, the SILPA SASTRAS, such as the craftsmen, who wrought the sacrificial posts at tribal religious ceremonies and the master builders, who laid out the plans of the village communities and designed public buildings and irrigation works.

But it was only when a craftsmen was regarded as operating in sacred rites that he took the status of a Brahmin and was entitled to the privileges of the highest class.

భీమసేనుఁడు స్థాపత్యవేదవిదులయిన శిల్పిబ్రాహ్మణులతోఁగూడి యజ్ఞక్రియాకుశలులయిన బ్రాహ్మణులు ముందు నడవఁగా హస్తిపురోపాంతము నకుఁబోయి, యచట సాలవృక్షములతో నిండియున్న యొక సుందరస్థానము నందు నలువైపులకు చక్కనిమార్గములు గల యజ్ఞ వాటమును శిల్పశాస్త్రాను సారము మాపనము చేయించినాఁడు.

ఆ యజ్ఞభూమి యందు స్థపతుల చేత మణికుట్టిమములతో మనోహరములు, రత్నకాంచనాలంకృతములు నయిన ప్రాసాదములను నిర్మింపఁజేసినాఁడు. యజ్ఞాయతన దేశమంతయు సువర్ణచిత్రితస్తంభముల తోడను, తోరణములతోడను నిండి శుద్ధకాంచనమయమై శోభిల్లుచున్నది.

ప్రాసాదశతసంబాధం మణిప్రవరకుట్టిమమ్
కారయామాస విధివ ద్ధేమరత్న విభూషితమ్
స్తంభాన్ కనకచిత్రాంశ్చ తోరణాని బృహంతి చ
యజ్ఞాయతన దేశేషు దత్వా శుద్ధం చ కాంచనమ్ ॥

—వ్యా.భా ఆశ్వ. 85. 13. 14

నానాదేశాగతులయిన రాజులు, అంతఃపురస్త్రీలు, బ్రాహ్మణాదులు విడిఁదిచేయుటకుఁదగిన గృహములు నిర్మింపఁబడినవి. వీని నన్నింటిని భీమసేనుఁడు శిల్పశాస్త్రానుసారము నిర్మింపించినాఁడు.

కారయామాస కౌంతేయో విధివత్ తాన్యనేకశః

....వ్యా.భా. ఆశ్వమేధిక. 85. 16

ఇట విధి యనఁగా శిల్పశాస్త్రవిధి యని హిందీటీకాకారుఁడు పండిత రామనారాయణదత్త శాస్త్రి పాండేయ వ్రాసినాఁడు.[1]

యజ్ఞమండపనిర్మాణకార్యక్రమము పూర్తియైన తరువాత శిల్పాచార్యు లయిన స్థపతులు, వారికి సహాయకులుగా నుండు తక్షకరథకారసువర్ణకారాది తదితరశిల్పకళాకారులు వచ్చి యా విషయము ధర్మరాజునకు నివేదించిరి.

తతః కృత్వా స్థపతయః శిల్పినోఽన్యే చ యే తదా।
కృత్స్నం యజ్ఞవిధిం రాజ్ఞో ధర్మజ్ఞాయ న్యవేదయత్॥

—వ్యా.భా. ఆశ్వ. 85-25

---

1. చూడు :- మహాభారతమ్ - గీతాప్రెస్. పు. 6282
"ఉన్ సబ్‌కా నిర్మాణ్ కుంతీనందన్ భీమ్‌నే శిల్పశాస్త్రకీ విధికే
అనుసార్ కరాయా థా॥"

ధర్మరాజు సంతోషించి,

యజ్ఞవాటంబుఁ దక్కటియాలయములు
లలితభంగి రమ్యములు సలక్షణములు
గా నొనర్చిన శిల్పినికాయమునకుఁ
బసదనం బిచ్చె సంతసం బెసకమెసఁగ.

—తిక్కన అశ్వమేధ. 4.139

ధర్మజుని యజ్ఞశాలాకరణాదులైన కృత్యములు కనుఁగొని కృష్ణుఁడు కడుఁ బ్రీతిఁ బొందినాఁడు.

శాతకుంభమయములయిన తోరణములతో శయ్యాసనములతో విహారస్థానములతో రత్నరాసులతో దేవేంద్రుని యజ్ఞవాటిక వలె సర్వాంగ సుందరముగా నున్న ధర్మజు యజ్ఞమండపాదినిర్మాణకళను జూచియు, కనకమయము లయిన ఘటపాత్రీకటాహవర్ధమానకాది యజ్ఞపాత్రలను హేమభూషితములయిన యూపములను జూచియు యజ్ఞమునకు వచ్చిన నృపాలు రచ్చెరు వొందిరి.

దదృశు స్తం నృపతయో యజ్ఞస్య విధి ముత్తమమ్ ।
న హి కించి దసౌవర్ణ మపశ్యన్ వసుధాధిపాః ।
యజ్ఞవాటం నృపా దృష్ట్వా పరవిస్మయమాగతః ॥

—వ్యా.భా. అశ్వ. 85. 28-35

ద్వాదశమాసములు దేశసంచారము చేసి యజ్ఞాశ్వ మగ్రేసరముగ నర్జునుఁడు యజ్ఞవాసమునకు వచ్చినాఁడు.

చైత్రపౌర్ణమాసి వ్యాసుఁడు వచ్చి, నేఁడు యజనంబు నకుం దొడంగుము యాజకులు శుభముహూర్త మాసన్నమైన దనుచున్నవారు దక్షిణలు ముమ్మడుగులుగా నిడి మూఁడు మఖంబుల ఫలంబు నొందుము. అశ్వమేధావభృథంబున నీ మనంబునఁ గల భారతరణకృతజ్ఞాతివధంబు పాతకం బను మెరమెర నిశ్శేషంబయి సమస్తశుభంబులు నావహిల్లు నని యాజ్ఞాపనంబు చేయఁగా ధర్మరాజు హయమేధక్రియా కలాపంబునకుఁ జొచ్చి యుదాత్తభంగి నడపినాఁడు.

క్రమయుక్తము యుక్తముగా నమరగురుపరితిములైన యాజ్ఞికులు క్రియా
సముదయము నడపగా స్ఖలితములే కపహూతము చొరక తత్క్రతు వొప్పెన్.

—తిక్కన. అశ్వమేధ. 4. 171-75

## ప్రవర్గ్యము

అవహితులై ప్రవర్గ్యము బుధాభినుతంబుగఁ జేసి ఋత్విజుల్
సవనము లుక్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేదవా
క్యవిహితవృత్తిమై నభినవాభ్యుదయం బొనరించి రద్ధి మా
ధవుఁ గొనియాటలం దమకృతంబులకున్ మెఱుఁగిడ్డ యట్లుగన్.

—తిక్కన. అశ్వమేధ. 4. 174

మూలమునం దిట్లున్నది.

కృత్వా ప్రవర్గ్యం ధర్మాఖ్యం యథావత్ ద్విజసత్తమాః ।
చక్రుస్తే విధివద్ రాజన్ స్తథైవాభిషవం ద్విజాః ॥
అభిషూయ తతో రాజన్ సోమం సోమపసత్తమాః ।
సవనాన్యానుపూర్వేణ చక్రుః శాస్త్రానుసారిణః ॥

—వ్యా. భా, అశ్వమేధిక. 88. 21, 22*

బ్రాహ్మణోత్తములు యథోచితముగా ప్రవర్గ్య మను క్రతువును జేసిరి. విధిపూర్వకముగా సోమలతనుండి రసము పిండి (అభిషవము) సోమపీథు లయిన యాజ్ఞికులు శాస్త్రానుసారము క్రమముగా మూఁడు సవనములు చేసిరి.

ప్రవర్గ్య మనగా అగ్నిష్టోమాది యాగముల కంగభూతమైన యాగవిశేషము. (శబ్దరత్నాకరము)

ఇది యజ్ఞకర్త పరిశుద్ధాంతరంగుఁడగుటకు దీక్షా సమయమున చేయు క్రతువిశేష మని కొందఱు చెప్పుచున్నారు. [1]

ఇట నిది యశ్వమేధయాగమున కంగభూతముగా నున్నది.

---

* పోల్చు :- వాల్మీకి రామాయణము - బాలకాండ. 14. 4-7

1. Cf. :- Ralph T. H. Griffith : THE WHITE YAJURVEDA. Notes.
"PRAVARGYA is a preperatory rite of the Soma sacrifice" — P. 291

"The object of PRAVARGYA which is preperatory and introductory ceremony like Diksha or consecration (iv. 2, v. 6) is the bodily regeneration of the sacrificer, the provision of a heavenly body with which alone he is permiitted to enter the residence of the Gods" —P 302

ప్రవర్గ్యము నందు ఋత్విజులు "మహావీరపాత్ర" యను ఘర్మము (వేడిపాలకుండ) నందు ఆవుపాలు పోసి మరగించి ఇంద్రాదిదేవతల కర్పింతురు. ఈ దేవతలలో ఋభువులకును స్థానమున్నది.

సవితకు ప్రతినిధియైన "మహావీరపాత్ర" నుద్దేశించి అధ్వర్యుఁ డిట్లు పలుకుచున్నాడు.

సవిత్రే త్వా ఋభుమతే విభుమతే వాజవతే స్వాహా ॥

—శు. య, 38-8 *

[ఓ ఘర్మమా! నిన్ను ఋభు విభ్వ వాజయుతుండయిన సవితృదేవున కర్పించుచున్నాను.]

ఇట సూర్యునితోఁగలిసి ఋభు విభ్వ వాజ యను మువ్వురు దేవతలు (ఋభువులు) హవిర్భాగము లందుకొనుట గమనింపఁదగినది.

సుధన్వుని పుత్రులయిన ఋభువులు తమ శిల్పచమత్కారములతో నమృతత్వసిద్ధి పొంది దేవతలయిన మహాత్ములు.

## త్రిషవణము

ప్రవర్గ్యానంతరము ఋత్విజులు చేయు సవనాహుతు లందును ఋభువులకు స్థానమున్నది.

సోమయాగమున ప్రాతఃసవనమునం దగ్నిదేవునకు, మాధ్యందిన సవనమునందు విశ్వేదేవులకు, సాయంసమయమున తృతీయసవనమున ఋభువులకు సోమరసముతో హోమము చేయవలయును. [1]

ఈమూఁడు సవనములు వరుసగా శిల్పకర్మములకు ముఖ్యుఁడయిన యగ్నిదేవునకు, శిల్పవిద్యాపరీక్షకులయిన విశ్వేదేవులకు, శిల్పచమత్కారముచే దేవతలయిన ఋభువులకు సంబంధించియుండుట యొకవిశేషము.

---

* Cf :- Ralph T. H. Grirfith : THE WHITE YEJURVEDA — 38-8
''Thee with swaha to Savitar attended by Ribhu, Vibhu, Vaja (Ribhu, Vibhu more generally known as Vibhvan and Vaja = the Ribhus. sons of Sudhanvan, raised to heaven and Godhead for their deeds.)

1 చూడు :- కృ. య. సం. కాం. 3-1-9. సాయణభాష్యము. పుటలు. 1516-20.

దశరథుని హయమేధమునందు ఇంద్రప్రీత్యర్థము ప్రాతస్సవనము చేసినట్లు వాల్మీకిరామాయణము నందు వర్ణింపఁబడినది. [వా.రా. బాల. 14-5, 6]

## తృతీయసవన వైశిష్ట్యము

ఇదం తృతీయసవనం కవీనామ్ ఋతేన యే చమస మైరయంత ।
తే సౌధన్వనాః సువరానశానాః స్విష్టిం నో అభివసీయో నయంతు ॥
—కృ. య 3-1-9; అథర్వ. 6.47-3*

ఈ తృతీయసవనము సత్యధర్మముతో చమసాదియజ్ఞపాత్రలు నిర్మించిన శిల్పర్షులకుఁజెందినది. ఆ యజ్ఞశిల్పమువలన స్వర్గలోక ప్రాప్తి గలిగి దేవతలయిన సౌధన్వులు - ఋభువులు - మాకు ఇతోధికధనప్రాప్తిఁ గూర్ప నభిలషించి, శోభనకరమయిన మా యజ్ఞమునకు వత్తురుగాక !

ఇట కవులనఁగా విద్వాంసులైన ఋత్విజులు; కారువులు (శిల్పులు).

సౌధన్వు లనఁగా అంగిరసుండయిన సుధన్వనిపుత్రులు. యజ్ఞ శిల్పమునందు సిద్ధహస్తులై ఋభువులుగా ప్రసిద్ధిఁగాంచి దేవతలైన రథకార బ్రాహ్మణులు.

యథా సోమ స్తృతీయే సవనే ఋభూణాం భవతి ప్రియః ।
ఏవా మ ఋభవో వర్చః ఆత్మని ధ్రియతామ్ ॥ -అథర్వ. 9-1-13**

తృతీయసవనమున సోమరసము ఋభువులకుఁ బ్రియమైనట్లు ఋభువులు వర్చస్సును నా యాత్మయందు నిలుపుదురుగాక !

మానవమాత్రులయిన ఋభువులు దేవతలై సాయం సమయములందు సవనకర్తలచే యాగ ఫలసిద్ధికై ప్రార్థింపఁబడుచుండుటయే యీ తృతీయ సవనవైశిష్ట్యము.

---

* చూడు :- (1) కృ య సాయణభాష్యము. పుటలు. 1516-20
"యే దేవా శ్చమసం చమసగణ మైరయంత ప్రేరితయంత స్తే దేవా సౌధన్వనాః సుధన్వన ఇంద్రస్య సంబంధిన ఋభునామానః సువరానశానాః స్వర్గః ప్రాప్నువంతః తాదృశా దేవా నయంతి "- ఇత్యన్వయః ॥ - సాయణ.

(2) అథర్వవేదము 6-47-3. హిందీభావార్థము.
పం. శ్రీరామశర్మా ఆచార్య - సంస్కృతి సంస్థాన్- బరేలీ. (ఉ.ప్ర.)

(3) A. B. Keith : T. S iii-1-9.
"May these Soudhanvas, who have attained heaven"
(The reference is of course to the Ribhus and their deeds.)

** Maurice Bloomfield : Hymns of the Atharva Veda 9-1-13
"As the soma at the third pressure (evening) is dear to the Ribhus thus in my own person O Ribhus lusture shall be sustained."

## యజ్ఞవేదీనిర్మాణము : స్థపతుల శిల్పచాతుర్యము

యజ్ఞవాటికను యజ్ఞోపకరణములను నిర్మించిన స్థపతివర్యులే బంగరుటిటికలతో గరుడపక్ష్యాకృతిగా యజ్ఞవేదికను నిర్మించిరి.

"ధర్మతనయుని యశ్వమేధము... పసిఁడియిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశకరాత్మకంబును గరుడాకృతియునుంగా యజనంబొనర్చి మహనీయంబై యొప్పుచుండు" నని తిక్కన వర్ణించినాఁడు. —(ఆశ్వమేధ. 4-180)*

వ్యాసభారతము వలన మఱికొన్ని విశేషములు దెలియుచున్నవి.

ఇష్టకాః కాంచనీశ్చాత్ర చయనార్థం కృతాఽభవన్ ।
శుశుభే చయనం తచ్చ దక్షస్యేవ ప్రజాపతేః ॥
చతుశ్చిత్యశ్చ తస్యాసీ దష్టాదశకరాత్మకః ।
స రుక్మపక్షో నిచిత స్త్రికోణో గరుడాకృతిః ॥

— వ్యా. భా. ఆశ్వమేధిక. 88-31, 32

చయనార్థము బంగారుతో నిటికలు చేయింపఁబడినవి. ఆహిరణ్యేష్టకలతో చయనము చేసి నిర్మింపఁబడిన యజ్ఞవేది దక్షప్రజాపతి యజ్ఞ వేదికవలె శోభాయమానముగా నున్నది. ఆ యజ్ఞ మండపము నం దగ్నిచయ నార్థము పదునెనిమిదిహస్తములు పొడవు - వెడల్పులు గల నాలు గగ్నికుండములును, సువర్ణపక్షములుగల గరుడ పక్ష్యాకృతిగా త్రికోణాకారముగా నొకప్రత్యేక వేదియు నిర్మింపఁబడినవి. [1]

---

పోల్చు :- జక్కన : విక్రమార్క చరితము 5.127

సురుచిరమై యష్టాదశకరమితమై పసిఁడియిట్టికల నిర్మితమై
యరయఁ జతుశ్చిత్యంబై గరుడాకృతి వేది యొప్పెఁ గడునద్భుతమై

1. చూడు :- పండిత రామనారాయణదత్త శాస్త్రీ పాండేయ 'రామ్'
మహాభారత – హిందీటీకా సహితము – గీతాప్రెస్

"ఉస్ యజ్ఞమండప్ మే అగ్నిచయన్‌కే లియే చార్ స్థాన్ బనేథే ఉన్‌మే
ప్రత్యేక్ కీ లంబాయీ చౌడాయీ అఠారహ్ హాథ్‌కీథీ ప్రత్యేక్ వే
సువర్ణమయపంఖ్ సే యుక్త ఏవం గరుడ్‌కే సమాన్ ఆకార్ వాలీథీ వహ్
త్రికోణాకార్ బనాయీ గయీ థీ"

# హిరణ్యేష్టకలు

యజ్ఞవేదీనిర్మాణమునందు పశుశిరస్సులఁ బఱచునపుడు యజమానుఁడాయా పశువుల కధిపతు లయిన దేవతలకు ద్రోహి యగుచున్నాడు. కావున తత్పరిహారార్థము "విశ్వకర్మా దిశాంపతిః" మొదలుగాఁగల యైదు మంత్రములతో ప్రతిదిశయం దొక్కొక్కటి చొప్పున నైదు హిరణ్యేష్టకల నునుపవలెను.

యదుక్తం సూత్రకారేణ॥

"విశ్వకర్మా దిశాంపతి రితి పంచ హిరణ్యేష్టకాః ప్రతిదశ మేకాంమధ్యే"-ఇతి

శృతి॥ ఓం విశ్వకర్మా దిశాంపతిః ।
స నః పశూన్ పాతు సోఽస్మాన్ పాతు తస్మై నమః॥
ప్రజాపతీ రుద్రో వరుణోఽగ్ని ర్దిశాంపతిః ।
స నః పశూన్ పాతు సోఽస్మాన్ పాతు తస్మై నమః ॥

ఏతావై దేవతా ఏతేషాం పశూనా మధిపతయ స్తాభ్యోవా ఏష ఆవృశ్చ్యతే యః పశుశీర్షాణ్యుపదధాతి హిరణ్యేష్టకా ఉపదధాత్యేతాభ్య ఏవ దేవతాభ్యో నమస్కరోతి॥ —కృ. య. 5-5-5*

విశ్వకర్మ దిక్కులను పాలించువాఁడు. అట్టి విశ్వకర్మ మా పశువులను మమ్ములను రక్షించుఁగాక! అట్టి విశ్వకర్మ కొఱకు నమస్కారము.

పురుషుఁడు, అశ్వము, వృషభము, పొట్టేలు, మేకపోతు అను నీయైదు పశువులకు వరుసగా విశ్వకర్మ, ప్రజాపతి, రుద్రుఁడు; వరుణుఁడు, అగ్ని యను వీ యేగురు పరిపాలకులు. ఆయా దేవతలులకు నమస్కార మనుచు తత్తన్మంత్రపూర్వకముగా హిరణ్యేష్టక లునుచుట వలన యజమానుని యపరాధము పరిహరింపఁబడుచున్నది హిరణ్యశకలములే హిరణ్యేష్టకులు.[1]

"హిరణ్యేష్టక లునుచుటకు ప్రథమకారణుఁడు సర్వశిల్పకర్త యగు విశ్వకర్మ యనియే తెలియుచున్నది."[2]

---

* Cf :- A. B Keith : T-S. 5-5-5
"VISWAKARMAN' lord of the quarters, may he protect our cattle, may he protect us, to him homage..."

1. చూడు :- కృ. య. సాయణభాష్యము

2. చూడు :- వడ్డిపాటి నిరంజనశాస్త్రి = విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము పు. 159

## ో గరుడాకృతిః

అగ్ని సంవత్సరాత్మకము. ప్రాజాపత్యము, వైష్ణవము, వైశ్వకర్మణ్యము ాఁడు విధములయిన యిష్టకలతో నిర్మింపఁబడిన యగ్నికుండము ష్పాదింపఁబడు నగ్ని త్రిగుణాత్మకము.

"సంవత్సరో వా ఏష యదగ్ని స్తస్య త్రేధా విహితా ఇష్టకాః।
ప్రాజాపత్యా వైష్ణవ్యో వైశ్వకర్మణీః।...........
తస్మా దాహు స్త్రివృదగ్ని రితి" —కృ. య. 5-6-9*

అగ్ని పక్షిస్వరూపుఁ డని వేదములు చెప్పుచున్నవి.

సుపర్ణోఽసి గరుత్మాన్ దివం గచ్ఛ స్వః పత ॥

(ఓ అగ్నీ నీవు గరుత్మంతుని వలె పక్షిరూపుఁడవు ఆకాశమున కెగిరి మునకుఁ బొమ్ము.)

తపుఁడను పహ్నితనయులు పదునేగురు కపటవృత్తి నిపుణులై నుల యజ్ఞఫలము లాహరించుచుండుదురు. తత్ప్రశాంత్యర్థమై ంలందు నగ్నిచయనంబు సేయునది.

అదిప। విహగాకృతుల నొప్పు నగ్నిచయన
ముల నుదగ్రపక్షఘాతములను, విప్ర
వరుల మంత్రఘోషములను వారు నిహతు
లై భయంపడి చేరరు యజ్ఞభూమి"

ర్కండేయుఁడు ధర్మరాజునకుఁదెలిపినాడు. —ఎఱ్ఱన అరణ్య. 5. 162-164

గరుడపక్షి చాఁచిన ఱెక్కలను, తోకను గలిపినచో త్రికోణాకృతి ను. కావున నీ యజ్ఞవేదిక త్రికోణాకారముగను గరుడాకృతిగను వర్ణింపఁబడినది.

---

:- కృ. య. సాయణభాష్యము - పు. 2484

ంవత్సరో వా ఇతి । యోఽయం చీయమానో అగ్నిః స ఏవ సంవత్సరధారణాత్ ంవత్సరాత్మకః । తస్య చ సంవత్సర రూపాగ్నేః సంబంధినస్య ఇష్టకా స్త్రేధా హిత స్త్రిప్రకారాః సంపాదితాః కారితా ఇతి । తా ఉచ్యంతే ।

ాజాపత్యా వైష్ణవ్యో వైశ్వకర్మణ్యశ్చ ।...... తదేవం ప్రాజాపత్యాదిభి ్టకాభి ర్నిష్పాదితత్వాత్ అగ్ని స్త్రిగుణ ఇత్యభిజ్ఞా ఆహుః ॥ —సాయణ.

B Keith : T S 5-6-9(d)

he fire is the year; its bricks are arranged three fold, those of ajapati, of Vishnu or Visvakarman... Therefore they say hree fold is Agni."

# ో గరుడాకృతిః

అగ్ని సంవత్సరాత్మకము. ప్రాజాపత్యము, వైష్ణవము, వైశ్వకర్మణ్యము ాండు విధములయిన యిష్టకలతో నిర్మింపఁబడిన యగ్నికుండము ష్పాదింపఁబడు నగ్ని త్రిగుణాత్మకము.

"సంవత్సరో వా ఏష యదగ్ని స్తస్య త్రేధా విహితా ఇష్టకాః।
ప్రాజాపత్యా వైష్ణవ్యో వైశ్వకర్మణీః।............
తస్మా దాహు స్త్రివృదగ్ని రితి" —కృ. య. 5-6-9*

అగ్ని పక్షిస్వరూపుఁ డని వేదములు చెప్పుచున్నవి.

సుపర్ణోఽసి గరుత్మాన్ దివం గచ్ఛ స్వః పత ॥

(ఓ అగ్నీ నీవు గరుత్మంతుని వలె పక్షిరూపుఁడవు ఆకాశమున కెగిరి మునకుఁ బొమ్ము.)

తపుఁడను పహ్నితనయులు పదునేగురు కపటవృత్తి నిపుణులై నుల యజ్ఞఫలము లాహరించుచుండుదురు. తత్ప్రశాంత్యర్థమై ంలందు నగ్నిచయనంబు సేయునది.

అదిప। విహగాకృతుల నొప్పు నగ్నిచయన
ముల నుదగ్రపక్షఘాతములను, విప్ర
వరుల మంత్రఘోషములను వారు నిహతు
లై భయంపడి చేరరు యజ్ఞభూమి"

ర్కండేయుఁడు ధర్మరాజునకుఁదెలిపినాడు. —ఎఱ్ఱన అరణ్య. 5. 162-164
గరుడపక్షి చాఁచిన ఱెక్కలను, తోకను గలిపినచో త్రికోణాకృతి ను. కావున నీ యజ్ఞవేదిక త్రికోణాకారముగను గరుడాకృతిగను వర్ణింపఁబడినది.

---

:- కృ య. సాయణభాష్యము - పు. 2484
ంవత్సరో వా ఇతి। యోఽయం చీయమానో అగ్నిః స ఏవ సంవత్సరధారణాత్ ంవత్సరాత్మకః। తస్య చ సంవత్సర రూపాగ్నేః సంబంధినస్య ఇష్టకా స్త్రేధా హిత స్త్రిప్రకారాః సంపాదితాః కారితా ఇతి। తా ఉచ్యంతే।
ాజాపత్యా వైష్ణవ్యో వైశ్వకర్మణ్యశ్చ।...... తదేవం ప్రాజాపత్యాదిభి నృభి ర్నిష్పాదితత్వాత్ అగ్ని స్త్రిగుణ ఇత్యభిజ్ఞా ఆహుః॥ —సాయణ.
B Keith : T S 5-6-9(d)
he fire is the year; its bricks are arranged three fold, those of ıjapati, of Vishnu or Visvakarman... Therefore they say nree fold is Agni."

దశరథుని హయమేధమునందును రుక్మపక్ష గరుడాకారవేది నిర్మింపఁబడినట్లు వాల్మీకి రామాయణమునందు వర్ణింపఁబడినది.

ఇష్టకాశ్చ యథాన్యాయం కారితాశ్చ ప్రమాణతః।
చితోఽగ్నిర్ బ్రాహ్మణై స్తత్ర కుశలైః శిల్పకర్మణి॥
స చిత్యో రాజసింహస్య సంచితః కుశలై ర్ద్విజైః।
గరుడో రుక్మపక్షో వై త్రిగుణోఽష్టాదశాత్మకః॥

—వా. రా. బాల. 14-28,29

శాస్త్రమునందుఁ జెప్పఁబడిన కొలతల ప్రకారము ఇటికలు చేయింపఁబడినవి. ఆ యిష్టకలతో యజ్ఞశిల్ప కుశలులైన శిల్పిబ్రాహ్మణుల చేత యజ్ఞవేదిక నిర్మింపఁబడినది. [ Constructed by Priests skilled in architecture pertaining to Sacrifices ] *

ఋత్విజులందు రాజసింహుఁడయిన దశరథుని కొఱకు అగ్నిప్రణయనము చేసినారు.

యజ్ఞవేదిక గరుడాకృతిగ నుండుటచే నందు స్థాపింపఁబడిన యగ్ని ఱెక్కలు చాఁచి, పుచ్ఛము నిగిడించి, యథోదృష్టితో ప్రాఙ్ముఖముగా నిలిచియున్న గరుడపక్షి వలె నున్నది. హిరణ్యేష్టకలచే నిర్మింపఁబడుటచే పక్షములు సువర్ణపక్షముల వలె నున్నవనియు, సాధారణయజ్ఞవేదిక కంటె మూఁడింతలు పెద్దదిగ నున్న యా యజ్ఞవేదిక పదునెనిమిది యగ్నికుండములు గలిగియున్న దనియు నది వాజసనేయకసంహితానుసారము నిర్మింపఁబడి యుండు ననియు వ్యాఖ్యాతలు వివరించినారు. [1]

---

* శ్రీ మద్వాల్మీకిరామాయణము - ఆంగ్లానువాదసహితము - గీతాప్రెస్.

1. చూడు - శ్రీ మద్వాల్మీకిరామాయణమ్ - శ్రీ గోవిందరాజీయ వ్యాఖ్యోపేతమ్
అగ్నిః అగ్న్యాధారవేదిః చితః తాభిః ఇష్టకాభిః కృతచయనః అభూత్।
సః చిత్యః చయననిర్వర్త్యోగ్నిః॥ కుశలైః రీతిభేదం వినా
చయననిర్మాణసమర్థైః ద్విజైః ఋత్విగ్భిః॥

గరుడాకారః పక్షౌ పుచ్ఛం చ ప్రసార్యాధోవీక్షమాణః ప్రాఙ్ముఖం తిష్ఠన్ గరుడ ఇవ స్థితః। శ్యేనచితం చిన్వీతేతి శ్రుతౌ శ్యేన శబ్దో గరుడ పర ఏవ సుపర్ణోఽసి గరుత్మానితి మంత్రలింగాత్ రుక్మపక్షః స్వర్ణగర్భపక్షః సహస్ర హిరణ్యశకలైః ప్రతిదిశ మగ్నిం ప్రోక్షతీతి సూత్రాత్॥... త్రిగుణ ఇత్యుక్తే పంచదశాత్మకం ప్రతీయతే తైత్తిరీయకే పంచ చితయో భవంతీతి విధానాత్. తదిదం వాజసనేయకపక్షావలంబనం ద్యోతయతు మష్టాదశాత్మకత్వోక్తిః॥

# యజ్ఞసంస్తరవేత్తలు

ధర్మరాజుచేత అశ్వమేధయాగము చేయించిన యాజకులు ఇష్టకోపధానక్రమయజ్ఞవేదీ నిర్మాణ శిల్పమునందును, యజ్ఞసంబంధములగు సకలకార్యములందును, సర్వశాస్త్రములందును ప్రవీణులు.

సంస్తరే కుశలాశ్చాపి సర్వకార్యాణి యాజకాః ॥ —అశ్వ 88-25*

సర్వశాస్త్రప్రణేతారః కుశలా యజ్ఞసంస్తరః ॥ —అశ్వ. 88-39

ఈ యాజకులలో యజ్ఞకర్మకుశలుఁడయిన యాజ్ఞవల్క్య శిష్యుఁడును గలఁడు.

"సుపర్ణోఽసి గరుత్మాన్" అను మంత్రము శుక్లయజుర్వేదమునందును కృష్ణయజుర్వేదమునందును గలదు. —[శు. య. 12. 4; కృ. య. 4-1-10]

చయనక్రతువునం దిష్టకోపధానమున వాజసనేయసంహితయందుఁ గనరాని కొన్నినూతనాంశములు కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహితయందుఁ గలవు.

ప్రాచీనకాలమున మహారాజులు అశ్వమేధాదిమహాయజ్ఞములు చేయు సందర్భములను పురస్కరించుకొని శిల్పశాస్త్రజ్ఞులు వివిధపరిమాణములుగల యజ్ఞవేదికలను వివిధాకృతులతో నిర్మించుచు తమ శాస్త్రపరిజ్ఞానమునకు మెఱుఁగులు పెట్టుకొనుచు, నూతనాంశములు కనుఁగొని శిష్యులకు బోధించుచు గణిత క్షేత్రగణిత శుల్బాదిశాస్త్రాభివృద్ధికిఁ దోడ్పడుచుండిరి. [1]

మహాభారతమునందు వర్ణింపఁబడిన చతుశ్చిత్య గరుడాకారయజ్ఞవేది కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత ననుసరించి నిర్మింపఁబడినదనిచెప్పవచ్చును.

ఈ యజ్ఞవేదీనిర్మాణము భారతీయశిల్పకళాదృష్టికొక తార్కాణము.

---

* "యజ్ఞకో వేదీ బనానామే నిపుణ యాజకగణ్"

—పండిత రామనారాయణదత్తశాస్త్రీ పాండేయ

పోల్చు :- వ్యా. భా. ఆది. 70-42 (చిత్రశాలావర్ణితి)

యజ్ఞసంస్తరవిద్భిశ్చ క్రమశిక్షావిశారదైః ॥

"యజ్ఞసంస్తరః ఇష్టకాద్యుపధానక్రమః" —నీలకంఠ.

1. Cf:- G. K. Pillai = THE WAY OF THE SILPIS —P. 157

"The Silpis took advantage of such circumstances, and in the construction of the altars, though presumably for sacrifices, they revised their mathematical knowledge, tested their formulae, instructed the pupils and demonstrated their geometry and applied mathematics."

# యూప నిర్మాణ స్థాపనములు

యూపాంశ్చ శాస్త్రపఠితాన్ దారవాన్ హేమభూషితాన్ ।
ఉపక్లృప్తాన్ యథాకాలం విధివద్ భూరివర్చసః ॥

—వ్యా. భా అశ్వమేధిక, 85-3

శిల్పులచేత శాస్త్రానుసారము నిర్మింపఁబడిన ఖదిరాది దారుమయ యూపములు స్వర్ణపట్టాలంకృతములై వేదోక్త విధిప్రకారము ప్రతిష్ఠింపఁబడి తేజోమయములై యొప్పారుచున్నవి.

"ఇట శాస్త్రమనఁగా శిల్పశాస్త్రము"1 విధి యనఁగా వేదవిధి.

సర్వయజ్ఞములందును పశుబంధనార్థము నిర్మింపఁబడు యూపములు ఎనిమిదికోణములు - పలకలు - గలిగియుండవలయును.

యూపశ్చాష్టాశ్రి ర్విహితః సర్వయజ్ఞే ॥ —వ్యా.భా, వన. 134-15*

ఇందుకు ప్రమాణము యజుర్వేదము.

"అష్టాశ్రిర్భవత్యష్టాక్షరా గాయత్రీ గాయత్రీ తేజో గాయత్రీ గాయత్రీ యజ్ఞముఖం తేజసైవ గాయత్రియా యజ్ఞముఖేన సంమితః ॥

—కృ య. 6-3-3**

యజ్ఞముఖమయిన గాయత్రి అష్టాక్షరి. కావున యూపములను ఎనిమిదికోణములుగాఁ జెక్కవలయును.

అట్లే ప్రతిష్ఠాకాముఁడు ఏకవింశత్యరత్ని ప్రమాణముగల యూపములను ప్రతిష్ఠింపవలయును.

---

1 చూడు :- నా. రా. బాల 14-24 తిలక వ్యాఖ్య -

"కారితాః సర్వ ఏవైతే శాస్త్రజ్ఞై ర్యజ్ఞకోవిదైః ॥"

—[శాస్త్రజ్ఞైః శాస్త్రం శిల్పశాస్త్రం శుల్బశాస్త్రం చ.]

*"యూపశ్చ యోపయతి మోహయతీతి యూపో నృపశోర్బంధనస్థానమ్ జ్ఞానం తదేవ అష్టాశ్రి రష్టకోణం అష్టధారం సత్ సర్వయజ్ఞేషు గ్రహాతిగ్రహసంజ్ఞకవిషయేంద్రియ సంయోగేషు వర్తత ఇతి శేషః ॥" —నీలకంఠ —చిత్రశాలాప్రతి పు. 211

** చూడు :- కృ. య. 1-3-4 సాయణభాష్యము. పు. 338

"గాయత్ర్యా స్తేజ స్త్వమగ్నినా సహోత్పన్నాత్ । యజ్ఞముఖత్వం చ ప్రాతఃసవనే ప్రయోజ్యత్వాత్ । అతోఽష్టసంఖ్యాద్వారా తేజో గాయత్రీ యజ్ఞముఖైః సమానో భవతి । తస్మాత్ తక్షణేన యూపస్యాష్టాశ్రయః కార్యా ॥" —సాయణ

"ఏకవింశత్యరత్నిం ప్రతిష్ఠాకామస్యైకవింశతిస్తోమానాం
ప్రతిష్ఠా ప్రతితిష్ఠిత్యై ॥" —కృ. య. 6-3-3

దశరథుని యశ్వమేధయాగము నందు స్థాపింపఁబడిన యూపములు శాస్త్రోక్తములయిన సమస్తలక్షణములు గలిగియున్నట్లు వాల్మీకిరామాయణము వలనఁ దెలియుచున్నది.

ఏకవింశతిరూపాస్తే ఏకవింశత్యరత్నయః ।
వాసోభిరేకవింశద్భి రేకైకం సమలంకృతాః ॥
విన్యస్తావిధివత్ సర్వే శిల్పిభిః సుకృతా దృఢా ।
అష్టాశ్రయః సర్వ ఏవ శ్లక్ష్ణరూపసమన్వితాః ॥—వా. రా. బాల. 14-25, 26

(శిల్పులచేత శాస్త్రానుసారముగ ఎనిమిదేసి పలకలతో నునుపుగా చక్కగా దృఢముగా నిర్మింపఁబడిన 21 మూరలు పొడవు గల 21 యూపములు 21 వస్త్రములతో నలంకరింపఁబడి వేదోక్త విధి ప్రకారము స్థాపింపఁబడినవి.)

ధర్మజుని యశ్వమేధయాగము నందును, "ఏకవింశత్యశ్వమేధస్య" అను సూత్రము ననుసరించి, "యూపక్రియాసమయంబున ఖాదిరంబు లాఱును, బైల్వంబు లాఱును, బాలాశంబు లాఱును, దేవదారుమయంబులు రెండును, శ్లేష్మాతకతరుకల్పితం బొకండునుంగా నిరువదియొక్క యూపంబులు తక్కను శోభార్థంబుగా ననేక కాంచనయూపసంచయంబును శాస్త్రోక్త ప్రకారంబున యాజకులు నిలిపిరి." —తిక్కన. ఆశ్వమేధ. 4-180*

ఆ యూపములు శిల్పశాస్త్రజ్ఞులచే శాస్త్రప్రకారము (యూపాంశ్చశాస్త్ర పఠితాన్) నిర్మింపఁబడినవి. కనుక నవి అష్టాశ్రయాది లక్షణయుక్తములై యుండు ననియు నందుఁ గొన్ని కాంచనపట్టాలంకృతములు గావున వానిని తక్షకస్వర్ణకారులు కలిసి నిర్మించియుందు రనియుఁ జెప్పవచ్చును.

రాజర్షి యగు ధర్మజుని యశ్వమేధము నందు స్థాపింపఁబడిన యా యూపములు వస్త్రాలంకృతములై యాకసమునందు సప్తర్షిగణపరివృతులయిన మహేంద్రానుచరులగు దేవతల వలె విరాజిల్లుచున్నవి.

తే వ్యరాజంత రాజర్షే ర్వాసోభిరుపశోభితాః ।
మహేంద్రానుగతా దేవా యథా సప్తర్షిభి ర్దివి ॥
—వ్యా. భా. ఆశ్వమేధిక. 88-30

* చూడు :- వ్యా భా. ఆశ్వమేధిక. 88. 27-29
పోల్చు :- వా. రా. బాల. 14. 22-24

## పశూపాకరణము : త్వష్టృదేవతాస్తుతి

నలుగాని వానిఁ బశుల జలచరముల విధియుతముగ సంయోజింపం
బొలిచెం బశువులు మున్నా అలఘుయశోమహిత యమ్మహాయజనమునన్
వరయూపసుయోజితమగు
తురంగమము చుట్టుఁ బశుతతుల నిల్పిన సుం
దరభావము దక్షమఖ
స్ఫురణం బిట్టి దని చూపుపోలిక మెఱసెన్ —తిక్కన, అశ్వమే. 4. 181-2

పశూపాకరణసమయంబున (పశువులను యూపములకు గట్టునపుడు - చంపునపుడు) పశుద్రవ్యమును రమణీయముగా వొనర్పు మని త్వష్టృదేవుని ప్రార్థింతురు.

దేవ త్వష్ట ర్వసు రణ్వ ॥ —కృ. య 1-3-1*

ఏల యన త్వష్ట మిథునరూపపశువుల నొసఁగువాఁడు.

"దేవ త్వష్ట ర్వసు రణ్వేత్యాహ । త్వష్టా వై పశూనాం
మిథునానామ్ రూపకృ ద్రూపమేవ పశుషు దదాతి ॥
— సం, కాం 6-3-6

ఇట్లు ప్రార్థించిన తరువాత

సర్వపశువిశంబు లాచరించి ఋత్విగ్జనంబు లశ్వాలంభసమయంబున యాజ్ఞసేని సన్నిహితం జేసి ........హుతంబులు చేయించిరి. అశ్వవపాహోమంబునం బరఁగు గంధం బాఘ్రాణించి ధర్మతనయుండు తమ్ములు దానును బరమానందంబు నొంది కనకమయములయిన యజ్ఞోపకరణములను విప్రులకు దాన మొసఁగి రెండవ మరుత్తుఁ డని ప్రశంస లందుకొనినాఁడు.

సకలబాంధవభూపతిసంయుతముగ
నా నరేశ్వరుఁ డవభృథస్నానపూత
గాత్రుఁడై చిత్తగతసర్వకల్మషములఁ
బాసి నిర్జితస్వర్గత్వభాసి యయ్యె.

—తిక్కన, అశ్వమేధ. 4-204

* హే దేవ త్వష్టృనామక వసు పశుద్రవ్యం రణ్వ రమణీయం కురు ॥ —సాయణ

"O God Tvasta make pleasant our Possessions"

## గ యా శ్వ మే ధ ము లు

ముం డను రా జ ర్షి బ్రహ్మసరమునందు బహు దక్షిణాన్వితముగా చేసి త్రిలోకప్రసిద్ధుండైనాండు, "తత్కృత క్రతుబహుదక్షిణా నుడుసికతాసంఖ్యయును నెఱుంగగాదు జనుల కట్టి గయు గయ యనంగం బఖ్యతీర్థ మయ్యె నిదియుం బితృహితార్థమిందుం నంబు సేయుంగనిన నిష్టసిద్ధి గలుగు" - నని గయామాహాత్మ్యమును ధర్మరాజునకుం దెలిపినాండు. —నన్నయ, భార. అరణ్య. 2-318

ంద్రాది దేవతలు యూపములు స్థాపించుట విశ్వకర్మకృత ప్రతిమాదానములు మున్నగునవి గయాశ్వమేధములందలి .

యోష్ణీనదీతీరమునందు, "తొల్లి యామూర్తరయసుండైన గయుండు ంబు లయిన చషాలస్థాలీయూపచమస పాత్రీస్రుక్స్రువంబులును బులయిన యూపంబులు నొప్ప నే డశ్వమేధంబులు సేసి ంబులయిన ధనంబుల ఋత్విజులను సదస్యులనుం బూజించి గోదానంబు లనేకంబులు బ్రాహ్మణుల కిచ్చి యక్షయంబులయిన కంబులం బడసెం బయోష్ణియందుం గృతస్నానులైన వారు ్యంబుం బడయుదురు" - అని రోమశుండు ధర్మరాజుతోంజెప్పెను. —నన్నయ. భార. అరణ్య. 3-173

వర్ణనమంతయు మూలానుసరణముగనే యున్నది.

ఆమూర్తరయస శ్చేహ రాజా వజ్రధరం ప్రభుః ।
తర్పయామాస సోమేన హయమేధేషు సప్తసు ॥ 3 ॥
తస్య సప్తసు యజ్ఞేషు సర్వమాసీద్ధిరణ్మయమ్ ।
వానస్పత్యం చ భౌమం చ యద్ద్రవ్యం నియతం మఖే ॥ 4 ॥*
చషాలయూపచమసాః స్థాల్యః పాత్ర్యః స్రుచః స్రువాః ।
తేష్వేవ చాన్యయజ్ఞేషు ప్రయోగాః సప్త విశ్రుతాః ॥ 5 ॥**

—వ్యా.భా. వన. 121. 3-5

---

వృక్షజం చషాలాది । భౌమం మృణ్మయం స్థాల్యాది ॥ 4 ॥
యూపకటకః । యూపః యజ్ఞస్తంభః ।
సోమపానపాత్రాణి । పాత్ర్యః । హవిఃస్థాపనార్థాని మృణ్మయాని ।
విఃప్రదానార్థాః । స్రువాః హవిరవదానార్థాః ॥ 5 ॥ —నీలకంఠ.
మహాభారతమ్ - సటీకమ్ - చిత్రశాలాప్రతి. పు. 191]

## యూపములు

గయుని యజ్ఞములందు ప్రకాశించుచున్న హిరణ్మయ యూపములు ఇంద్రాదిదేవతలచే స్థాపింపఁబడినవి. ఒక్కొక్క యూపముపై నేడేసి హిరణ్మయచషాలము లున్నవి.

సప్తైకస్య యూపస్య చషాలశ్చోపరిస్థితాః ।
తస్య స్మ యూపాన్ యజ్ఞేషు భ్రాజమానాన్ హిరణ్మయాన్ ॥
స్వయముత్థాపయామాసు ర్దేవా సేంద్రా యుధిష్ఠిర ।

—వ్యా. భా వన. 121-6 7

## యజ్ఞవేదికలు

......వేదికాస్థలి మణికనకాత్మకమై ముప్పదాఱుయోజనముల దైర్ఘ్యము నంత కమరు విస్తారంబుగలుగంగ నొనరించి క్రతువు చేసి విప్రతతులకు దాని నతిప్రియముగ నిచ్చి, తన పేర గయ సుతికెక్క వటము పొగడు వడయంగఁ బుణ్యుఁడై నెగడె గయుఁడు. [—తిక్కన ద్రోణ. 2-206]

యజ్ఞవేదిక కొలతలు మూలమునందు స్పష్టముగ నున్నవి.

షట్త్రింశద్ యోజనాయామా త్రింశద్యోజనమాయతా ।
పశ్చాత్ పురశ్చతుర్వింశద్ వేదీహ్యాసీద్ధిరణ్మయీ ॥
గయస్య యజమానస్య ముక్తావజ్రమణి స్తృతా ।

—వ్యా భా. ద్రోణ. 66-16,17

గయుని యజ్ఞవేదిక హిరణ్మయమును ముక్తావజ్రమణిమయమును నై యున్నది. దాని పొడవు × వెడల్పు × ఎత్తు లేక లోతు 36 × 30 × 24 యోజనములు.

ఈ వర్ణనము లతిశయోక్తులతోఁగూడినవి. యోజన ప్రమాణమును 'వితస్తి' గా భావించినచో యజ్ఞవేదిక కొలతలు పొ × వె × ఎ = 18 × 15 × 12 హస్తములై వాస్తవస్థితి కనుగుణముగా నుండును.

ఈ కొలతలు 6 : 5 : 4 నిష్పత్తిలో నుండుటచే యజ్ఞవేదిక దీర్ఘచతురస్రాకారముగనున్నట్లు స్పష్టమగుచున్నది.

ఈ పరిమాణాకృతు లెట్లున్నను యజ్ఞవేదికలను నిర్మించువారు శిల్పాచార్యులే.

## యజ్ఞదక్షిణలు

సౌవర్ణాం పృథివీం కృత్వా దశవ్యామాం ద్విరాయతామ్ । *
దక్షిణా మదదద్ రాజా వాజిమేధే మహాక్రతౌ ॥—వ్యా.భా. శాంతి. 129-117

గయుఁడు హయమేధయాగమునందు ఏఁబదిహస్తముల వెడల్పు, దానికి రెండింతలు (నూఱుహస్తములు) పొడవు గల యజ్ఞభూమిని సువర్ణమయ మొనర్చి దానిని బ్రాహ్మణులకు దక్షిణగా నొసఁగినాఁడు.

సువర్ణమయగోదానము లనేకములు బ్రాహ్మణుల కిచ్చినట్లు నన్నయ వ్రాసినాఁడు.

ఇట సువర్ణమయగోదానము లనఁగా స్వర్ణకారునిచేఁ జేయఁబడిన హిరణ్యగోప్రతిమాదానము లని చెప్పవలయునే కాని కొంద అనుకొనునట్లు కొమ్ములకు గిట్టలకు బంగారు తొడుగులు వేయఁబడిన గోవులను దాన మొసఁగుటకాదు.

విశ్వకర్మచేతఁ జక్కఁగా నిర్మింపఁబడిన బంగారుగోవుల నొసఁగి నానాదిక్కులనుండి వచ్చిన బ్రాహ్మణులను తృప్తిపఱచినాఁ డని మూలమునందు వర్ణింపఁబడినది.

హిరణ్మయీభిః గోభిః సుకృతా విశ్వకర్మణా ।
బ్రాహ్మణాం స్తర్పయామాస నానాదిగ్భ్యః సమాగతాన్ ॥
—వ్యా. భా. వన. 121-12

ఇంద్రాదిదేవతలు యూపప్రతిష్ఠ గావించినారు కనుక యూపనిర్మాతయు, హిరణ్యగోప్రతిమాకారుఁడగు విశ్వకర్మయు సమస్తశిల్పాధిపతియగు దేవశిల్పియే

అట్లు కాకున్న విశ్వకర్మసదృశుఁడు, సకలయజ్ఞశిల్ప క్రియాకుశలుఁడు గయునకు సమకాలికుఁడు నగు మఱియొక శిల్పాచార్యుఁడు - విశ్వకర్మ - కావచ్చును. ఆ శిల్పాచార్యుని యాధ్వర్యవమునఁదక్కిన శిల్పులుపనిచేయుదురు.

యజ్ఞోపకరణము లన్నియు హిరణ్మయములు గావున గయాశ్వమేధము లందు హిరణ్మకారులు ప్రముఖపాత్ర వహించి తమ శిల్పకళాప్రావీణ్యమును ప్రదర్శించినా రని చెప్పవచ్చును,

---

* వ్యామో వ్యాయతహస్తప్రమాణం । దశవ్యామాం పంచాశద్ధస్త విస్తారాం ।
ద్విరాయతాం శతహస్తదీర్ఘాం ॥ —నీలకంఠ - వాఖ్యప్రతి. తృ. సం. పు. 73

** "జో బ్రాహ్మణ్ దేశ్ దేశాంతర్ సే ఆ........ఉన్ సే విశ్వకర్మాకీ బనాయీ
సోనేకీ ఏక్ ఏక్ గౌ దే సంతుష్ట కియాథా ॥"
(చూడు :- హిందీమహాభారతము. వన. పు. 4-11)

## నక్షత్రదానములు

నక్షత్రదానము లనఁగా కృత్తికాది సప్తవింశతి నక్షత్రములందు దానకల్పమునం దాయానక్షత్రములకుఁ జెప్పఁబడిన వస్తువులను దానము చేయుట. ఒక్కొక్కదిన మొక్కొక్క నక్షత్రముండును గనుక నివి నిత్యదానములు.

"అఖిల తారకముల నీగులు నూర్ధ్వలోకములఁ జేయు" నని నారదమహర్షి దేవకీదేవికిఁజెప్పినట్లు భీష్ముఁడు ధర్మరాజునకుఁ దెలిపినాఁడు. [1]

ఇరువదియేడు తారకలలోఁ గొన్నింటికి శిల్పికృతవస్తువులు దానయోగ్యములుగాఁ జెప్పఁబడినవి.

అశ్విని యందు అశ్వకలితశకటము, హస్త యందు హస్తిరథము, విశాఖ యందు ధేనుశకటములు, ధనిష్ఠ యందు గుజ్జులమరినబండి, పుష్యమి యందు కృతాకృతకనకము (స్వర్ణాభరణములు, శుద్ధసువర్ణము), రేవతి యందుఁ గంచుకుండతో మొదవు దానమొనరించిన వారి కూర్ధ్వలోకములు గలుగు నని భారతానుశాసనపర్వము నందుఁజెప్పఁబడినది. [2]

నక్షత్రదక్షిణలలో దారుశిల్పికృతములయిన రథశకటాదులు, స్వర్ణకారకృతములైన యాభరణములు, కాంస్యకారకృతములైన కంచుకుండలు మున్నగునవి యుండుటవలన నాయా వస్తుసంపాదనమునందు వివిధశిల్పకారుల యవసరమున్నది.

గయుఁ డశ్వమేధములనే కాక అంగిరోముని వలెను సోముని వలెను వివిధయజ్ఞములు చెసి సప్తవింశతినక్షత్రము లందును తత్తదుచితదక్షిణా దానములు చేసినాఁడు.

నక్షత్రేషు చ సర్వేషు దద న్నక్షత్రదక్షిణాః।
ఈజే చ వివిధై ర్యజ్ఞై ర్యథా సోమోఽంగిరో యథా ॥

—వ్యా.భా. ద్రోణ. 66-10

ఈవిధముగా గయుఁ డనేకయజ్ఞములు చేసి యజ్ఞదక్షిణ లిచ్చియు నూఱుసంవత్సరములు నిరంతరనిత్యనక్షత్రదానములు చేసియు శాశ్వతకీర్తి గడించి పుణ్యలోకముల కరిగినాడు,

1. చూడు :- తిక్కన. అనుశాసన. 2, 377-79
   వ్యా భా. ఆనుశాసనిక. అ. 64
2. — అదే —

# యయాతియజ్ఞాయతనములు

యయాతిం శుభకర్మాణం దేవై ర్యోయాజితః స్వయమ్।
చైత్యయూపాంకితాభూమి రస్యేయం సవనాకరా ॥ –వా.భా. అది. 1–229*

ఇట చైత్యము లన చయనక్రతు విహితము లయిన వని(యజ్ఞవేదికలని) టీకాకారుఁడు వివరించినాఁడు.

ఈభూమియంతయు యయాతి యజ్ఞములు చేసిన యజ్ఞవేదికలతోను, యూపములతోను నిండియున్నది.

నూఱు క్రతువు లొనరించి దేవేంద్రత్వముంబడసిన చంద్రవంశపురాజు నహుషునికిఁబ్రియంవదకుఁ బుత్త్రుఁడయిన యయాతిరాజై యనేకయాగంబులు చేసె నని నన్నయ వ్రాసినాడు. [1]

"......అగ్నిష్టోమహయమేధవాజపేయాతిరాత్రపౌండరీకము లనఁ
బరగిన యధ్వరంబు లనేకములు చేసి......
శుక్రునల్లుఁ డనఁగ శోభిల్లి తనయందు ధర్మతత్త్వమూర్జితముగ
నియమనిష్ఠుఁడై యయాతి నెగడె"–నని తిక్కన వర్ణించినాఁడు. [2]

మూలమునం దిట్లున్నది.

రాజసూయశతేనేష్ట్వా సోఽశ్వమేధ శతేన చ।
పుండరీక సహస్రేణ వాజపేయ శతేన చ॥
అతిరాత్ర సహస్రేణ చాతుర్మాస్యైశ్చ కామతః।
అగ్నిష్టోమైశ్చ వివిధైః సత్రైశ్చ ప్రాజ్యదక్షిణైః॥
— వ్యా. భా. ద్రోణ. 63–1, 2

అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి. అతిరాత్రము, ఆప్తోర్యామము, వాజపేయము, అనునవి సోమసంస్థలు. [3] ఇవి యూపప్రతిష్ఠ గల క్రతువులు.

---

* చయన మితి క్రితౌ విహితాశ్చైత్యాః తే చ తే యూపాశ్చ తై రంకితా॥
—నీలకంఠ. (చిత్రశాలాప్రతి)

1. నన్నయ. భార. ఆది. 3–94
2. తిక్కన భార. ద్రోణ. 63–1, 2
3. చూడు :– గౌతమధర్మసూత్రములు. 1. 8–21 హరదత్తాచార్య మితాక్షర వ్యాఖ్యాసహితము. పం పంచాగుప్తల ఆదినారాయణశాస్త్రి. మద్రాసు. 1925
295 సూ॥ అగ్నిష్టోమోత్యగ్నిష్టోమో ఉక్థ్య షోడశీ వాజపేయోఽప్తోర్యామోఽతిరాత్రి - ఇతి సప్త సోమసంస్థాః॥ (1-8-21)

" ఇది యయాతి యజ్ఞాయతనంబు వాని సవనంబున కింద్రుండువచ్చె "
నని రోమశుఁడు ధర్మరాజునకుఁజూపెను. —నన్నయ. భార ఆరణ్య.3-221

మూలమునం దిట్లున్నది.

సార్వభౌమస్య కౌంతేయ యయాతే రమితౌజసః ।
స్పర్ధమానస్య శక్రేణ తస్యేదం యజ్ఞవాస్త్విహ ॥ 4 ॥
పశ్య నానావిధాకారై రగ్నిభి ర్నిచితాం మహీమ్ ।
మజ్జంతీమివ చాక్రాంతాం యయాతే ర్యజ్ఞకర్మభిః ॥ 5 ॥
—వ్యా.భా. వన. 129. 4, 5*

ఈ యజ్ఞభూమియందు యయాతి యింద్రునితోడి స్పర్థతో యజ్ఞములు చేసినాఁడు. ఇచ్చట భూమి నానావిధాకారములైన స్థండిలముతో (అగ్నికుండములతో) నిండియున్నది.

అగ్ను లనఁగా అగ్నిసంస్థాపనార్థము ఇటికలతో నిర్మింపఁబడిన స్థండిలములని వ్యాఖ్యాత వివరించినాఁడు.

యయాతి యజ్ఞములుచేసిన యీ ప్రదేశమునకు కురుక్షేత్రద్వార మరియు స్వర్గద్వార మనియు పేరు.

ద్వారమేతత్ తు కౌంతేయ కురుక్షేత్రస్య భారత ॥
అత్రైవ నాహుషో రాజా రాజన్ క్రతుభిరిష్టవాన్ ।
యయాతి ర్బహురత్నాఢ్యై ర్యత్రేంద్రో ముదమభ్యగాత్ ॥
— వ్యా. భా. వన. 129. 11-12

---

అధః :- (1) వ్యా.భా. వన. 129-4. 5 చిత్రశాలాప్రతి

యజ్ఞవాస్తు యజ్ఞభూమిః । ఇహ అస్మిన్ వాస్తుని । ఇదముత్తరాన్వయి ॥ 4 ॥
అగ్నిభిః అగ్నిస్థాపనార్థై రిష్టకారచితైః స్థండిలైః ॥ 5 ॥ —నీలకంఠ.

(2) చతుర్వేది ద్వారకాప్రసాద్ శర్మా - హిందీమహాభారత. పు 430
" దేఖియే యహాఁకీ భూమి భాంతిభాంతికే ఆకార్ వాలే
అగ్నికుండోంసే పరిపూర్ణ హై । "

(3) " దేఖే, యహాఁ అగ్నియోంసే యుక్త నానాప్రకార్‌కీ వేదియాఁ హై । "
—మహాభారత. గీతాప్రెస్. పు. 1307

## భరతుని బహుయజ్ఞములు

భరతుఁ డశేషభూభువనభారధురంధరుఁడై వసుంధరం
బరఁగి యనేకయాగములఁ బాయక భాస్కరజహ్నుకన్యకా
సురుచిరతీరదేశముల సువ్రతుఁడై యొనరించి భూరిభూ
సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధసువర్ణగవాశ్వహస్తులన్.

—నన్నయ. భార. ఆది. 4-110

భరతుఁడు మరుత్పతియైన యింద్రునివలె బహుయజ్ఞములు చేసినాఁడనియు తనచేత శాస్త్రప్రకారము దక్షిణాన్వితముగా ననేకయాగములు, 'గోవితత' మను హయమేధమును చేయించిన కణ్వమహర్షికి సహస్ర పద్మ నిష్కములు దక్షిణగా నొసఁగినాఁ డనియు మూలమునందు వర్ణింపఁబడినది.

ఈజే చ బహుభిర్యజ్ఞై ర్యథా శక్రో మరుత్పతిః ।
యాజయామాస తం కణ్వో విధివ ద్భూరిదక్షిణమ్ ॥
శ్రీమాన్ గోవితతం నామ వాజిమేధ మవాప సః ।
యస్మిన్ సహస్రం పద్మానాం [1] కణ్వాయ భరతో దదౌ ॥

—వ్యా.భా ఆది. 74. 129-30

శాకుంతలుండైన భరతుఁడు యమునాతీరమునందు నూఱశ్వమేధములు సరస్వతీరమునందు మున్నూఱు వాజిమేధములు, గంగాతీరమునందు నన్నూఱు హయమేధములు చేసి, మరల నుత్తమ దక్షిణాదానములతో వేయి హయమేధములు, నూఱు రాజసూయములు, అగ్నిష్టోమాదియాగములు, విశ్వజిద్యాగము, వేయి వాజపేయములు చేసినట్లు మహాభారత ద్రోణపర్వమునందు వర్ణింపఁబడినది.[2]

ఈ యజ్ఞములం దింద్రాదిదేవతలు ద్విజులతోఁగలిసి నన్నూఱు హస్తములు పొడవు (ఎత్తు) గల కాంచనయూపమును స్థాపించినారు-

యస్య యూపః శతవ్యామః పరిణాహేన కాంచనః ।
సమాగమ్య ద్విజైః సార్థం సేంద్రై ర్దేవైః సముచ్ఛ్రితః ॥

—వ్యా.భా. ద్రోణ. 68. 12

1. పద్మానాం కోటిశతానాం ॥ —నీలకంఠ

2. చూడు :- వ్యా.భా. ద్రోణ. 68. 8-12

## సోమయాగములు

అగ్నిష్టోమాతిరాత్రాభ్యా మిష్ట్వా విశ్వజితా వపి।
వాజపేయసహస్రాణాం సహస్రైశ్చ సుసంవృతైః॥

ఇష్ట్వా శాకుంతలో రాజా తర్పయిత్వా ద్విజాన్ ధనైః।
—వ్యా భా ద్రోణ. 68. 10-12

అగ్నిష్టోమాతిరాత్రములు సోమయాగములు. అనఁగా సోమరస హోమము ప్రధానముగా గలవి.

ఈయాగములలో అధ్వర్యుఁడు, యజమానుడును సోమలతను కొని, శకటముపై తెచ్చి, ఆతిథ్యేష్టి గావించి దానిని 36 అంగుళముల పొడవు, 18 అంగుళములు వెడల్పు గల అభిషవణఫలకముమీద నూరి, రసమును గ్రహించి దానిలో పాలు, పెరుగు, నేయి సువర్ణరజము మున్నగు పదార్థములను కలిపి యా మిశ్రమమును హోమము చేసి యింద్రాది దేవతలకర్పించి హోమశేషమును సేవింతురు.

సోమరసమును సువర్ణపాత్రలో త్రాగినచో హర్షోత్సాహములే కాక బ్రహ్మజ్ఞానోదయమున కనుకూలమగు స్వస్థత కలుగు నని చెప్పఁబడినది.[1]

## యజ్ఞశాలలు

ఏ యాగమునకైనను ముందుగా ప్రాచీనవంశశాలను నిర్మింపవలయును దానిని నాలుగుభాగములుగా విభజించి తూర్పుదిక్కునదేవతలకు, దక్షిణమున పితరులకు, పశ్చిమున మనుష్యులకు, ఉత్తరమున రుద్రులకు స్థానములు ల్పింపవలెను.

యస్య మండల విశేషస్యోపరి వంశాః ప్రాగగ్రాః భవంతి స ప్రాచీనవంశః॥
ప్రాచీనవంశం కరోతి దేవమనుష్యా దిశో వ్యభజంత ప్రాచీం దేవా దక్షిణాం తరః ప్రతీచీం మనుష్యా ఉదీచీం రుద్ర యత్ ప్రాచీనవంశం కరోతి దేవలోక మేవ తద్యజమాన ఉపావర్తతే॥"
—కృ. య. సం. కాం. 6-1-1*

---

1. చూడు :- డా॥ ముట్నూరి సంగమేశం = వేదవాఙ్మయము, పుట. 25

* Cf. :- A. B. Keith : T. S. 6-1-1
"He makes a hall with beams Pointing to east. The Gods and men divided the quarters, the gods (obtained) the eastern, the Pitrs the Southern, men the western, the Rudras the northren. In that he makes a hall with beams Ponting east, the Sacrificer approaches the world of the gods."

యజ్ఞదీక్ష పూనిన యజమానుఁడు నతని భార్యయు నొకసంవత్సరకాలము వేఱ్వేఱుగా నివసించుటకు యజమానశాల, పత్నిశాల యను రెండు శాలలు నిర్మింపవలెను.[1] ఇవి కాక హవిర్ధానము సదము అను శాలలు కూడ నిర్మింపవలయును.

## యజ్ఞవేదికలు

ప్రాచీనవంశశాలలో తూర్పున చతురస్రాకారముగ ఆహవనీయాగ్ని కుండమును, పశ్చిమమున వృత్తాకారముగ గార్హపత్యాగ్నికుండమును, అర్ధవృత్తాకారముగ దక్షిణాగ్నికుండమును నిర్మింపవలెను. ఇవి క్రమముగా ద్యు భూమ్యంతరిక్షలోకములను సూచించును.

ప్రాచీనవంశశాలకు వెలుపల తూర్పుగా సమాంతరద్విభుజ చతురస్రాకారము (TRAPEZIUM) గల మహావేదిని నిర్మింపవలెను. దాని కొలతలు 36 × 30 × 24 ప్రక్రమములు (పదములు).

షట్ త్రింశత్ ప్రక్రమా ప్రాచీ చతుర్వింశతి రగ్రేణ
త్రింశజ్జఘనేనేతి శక్యామహే ॥ [2]

ఈ వేదిక మూలాధారము 30 ప్రక్రమములు, ముఖము 24 ప్రక్రమములు, ఎత్తు 36 ప్రక్రమములు గలిగి యుండునని వివరింపఁబడినది.

మహావేదికి తూర్పుగా ఉత్తరవేది నిర్మింపఁబడును. చతురస్రాకారముగ నుండు నీ యుత్తరవేది ద్యులోకమునకు ప్రతీక.

---

1. Cf :- R. C. Majumdar = Ancient India —P. 85
2. చూడు :- కృ. య 1-2-11 సాయణభాష్యము — పు. 304

Cf :- G. K. Pillai : The Ways of the SILPIS —P. 169.

"MAHAVEDI is a regular Isossceles Trapezium. The base of the trapezium is given as 30 prakrams, the face (or the opposite side) is 24 prakrams and the altitude is 36 prakramas. Prakrama appears to be a measure like feet or strides.

## వేదీరక్షకులలో విశ్వకర్మ

ఇంద్రఘోషాది దిగ్దేవత లీ యుత్తరవేది నసురులబారి నుండి రక్షింతురు గాక యను నాశయముతో ప్రోక్షణీజలముల నభిమంత్రించి వేదికి నలుదిక్కుల ప్రోక్షింతురు.

ఇంద్రఘోషస్త్వా వసుభిః పురస్తాత్ పాతు
మనోజవ స్త్వా పితృభిః దక్షిణతః పాతు
ప్రచేతాస్త్వా రుద్రైః పశ్చాత్పాతు
విశ్వకర్మా త్వాఽదిత్యై రుత్తరతః పాతు. —కృయ. 1. 2-12*

ఇంద్రఘోషుఁ వసువులతో పూర్వభాగము (ముందు) నుండి నిన్నురక్షించుగాక!
మనోజవుఁడు పితరులతో దక్షిణదిక్కు (కుడివైపు) నుండి నిన్నురక్షించుగాక!
ప్రచేతసుఁడు రుద్రులతో పశ్చిమదిక్కు (వెనుక) నుండి నిన్నురక్షించుగాక!
విశ్వకర్మ ఆదిత్యులతో నుత్తరదిశ (ఎడమవైపు) నుండి నిన్నురక్షించుగాక!

ఇట ఇంద్రఘోష మనోజవ ప్రచేతా విశ్వకర్మలు క్రమముగా ఇంద్ర, యమ, వరుణ, విశ్వకర్తలకు ప్రతినిధులు ప్రాక్దక్షిణపశ్చిమోత్తర దిశల కధిపతులు.

---

* చూడు :- కృ. య. సాయణభాష్యము — పుట. 310.

"ఇంద్రఘోషాదినామకాదేవాః పరివృఢా స్తదనుచరా వస్వాది గణా
స్తైర్ గణైః సహితాస్తే దేవాః పాన్తు"
"పురస్తాదిత్యాది దిగ్వాచకశబ్దప్రయోగేణ దిగ్దేవతా
తుష్టికరం ప్రోక్షణమిత్యాహ" —సాయణ

[1]చూడు :- శు. య. 5-11

"విశ్వకర్మా విశ్వాని కర్మాణి జగదుత్పత్త్యాదీని యస్య
స విశ్వకర్మా ఆదిత్యై ర్ద్వాదశసంఖ్యై ర్గణదేవైః సహితైః
ఉత్తరతః ఉత్తరస్యాందిశి పాతు." —మహీధరభాష్యము

1. Cf :- Ralph T H. Griffith : THE WHITE YAJURVEDA -5. 11
"The Omnific guard thee leftward with Adityas."
ఇంద్రఘోష = Indra's shout = as God of Battles.
ప్రచేతా = The Wise one = VARUNA, the moral Governor of the world.
మనోజవ = The Thought swift = Yama, God of the Departed.
విశ్వకర్మ = The Omnific = an abstract deity representing the Supreme God as creator of all things.

## గ్రహహోమము : శిల్పాభిమానిదేవతలు

గ్రహములన సోమరసగ్రహణార్థ ముపయోగింపఁబడు దారుపాత్రలు· గ్రహములతో సోమరసమును గ్రహించి హోమముచేయుట గ్రహహోమము·

అగ్నిష్టోమ జ్యోతిష్టోమాది సోమయాగముల యందు గ్రహములతో సోమహోమము చేయుట ముఖ్యమనిచెప్పఁ బడినది.

"గ్రహైః సోమహోమో జ్యోతిష్టోమో ముఖ్యః।"

అగ్నిష్టోమమునందు ముప్పదియాఱు గ్రహములను అత్యగ్నిష్టోమము నందు మఱి నాలుగు గ్రహములను ఉపయోగింతురు. 1

వివిధదారువులతో గ్రహచమసాదులు నిర్మించువారు శిల్పులే.

ఉపాంశు, అంతర్యామ, ఐంద్రవాయవ, మైత్రావరుణ, ఆశ్విన, శుక్రామంథీ, ఉక్థ్య, ధ్రువ, ఋతు. మహేంద్ర, ఆదిత్య, సావిత్ర, వైశ్వదేవ, పత్నీవంత, హరియోజన, షోడశి ఇత్యాదులు కొన్ని గ్రహనామములు.

ఈ గ్రహముల యందు సోమరసమును గ్రహించి, దానితో నింద్రాది దేవతలకు హోమము చేయుదురు.

ఇంద్రాదిదేవతలు శిల్పాభిమానిదేవత లని తెలియుచున్నది.

శుక్రామంథిగ్రహహోమవిధిని వివరించుచు సాయణాచార్యుఁ డిట్లు తెలిపినాడు. 2

అన్యత్రాఽఽమ్నాయతేన మంత్రేణ గ్రహహోమస్య విధి మర్థవాదినోన్నయతి॥

"స ప్రథమః సంకృతిర్విశ్వకర్మా" ఇత్యేవైనావాత్మన ఇంద్రాయాజుహువు
రిందోహ్యేతాని రూపాణి కరిక్రదచరన్॥ —తై. సం. 6-4-10

దేవతలు 'స ప్రథమః సంకృతి ర్విశ్వకర్మా' - యను మంత్రముతో ప్రథమ సంకృతియు, రూపకర్తయు నగు నింద్రునకు (తమకును) సోమపూర్ణగ్రహములను సమర్పించుచున్నారు.

పూర్తి మంత్రపాఠము తైత్తిరీయబ్రాహ్మణమునఁ గలదు.

---

1. Cf :- Ralph T. H. Griffith R. V. X-114-6. Vol II P. 5o8 Notes.
2. చూడు :- కృ.య. 1-4-9 శుక్రామంథిగ్రహయోరభిధానమ్.
సాయణభాష్యము. పు. 981

స ప్రథమః సంకృతి ర్విశ్వకర్మా
స ప్రథమో మిత్రో వరుణోఽగ్నిః
స ప్రథమో బృహస్పతిశ్చికిత్వాన్
తస్మా ఇంద్రాయ సుత మా జుహోమి ॥ —తై. బ్రా. 1-1-6*

సర్వజగదాధిపత్యము వలన దేవతలలో ముఖ్యుడయిన యింద్రుడే ప్రథమసంకృతి. సంకృతి యన సమీచీనాకృతులు నిర్మించువాఁడు. రూపకర్త. సంకృతి యగు విశ్వకర్మనామకదేవుఁడు కూడ నిందుఁడే. మిత్రుఁడు, వరుణుడు అగ్నియు నట్టివారే. సంకృతులే. అభిజ్ఞుఁడయిన బృహస్పతియు నట్టివాఁడే - రూపనిర్మాణకర్తయే. తత్సదృశుఁడగు నింద్రునికొఱకు సోమవల్లినుండి పిండిన రసమును హెూమము చేయుచున్నాము.

ఇట్లనుట వలన శుక్రామంథిగ్రహహెూమమున హవిస్స్వ కర్తలగు నింద్రాదిదేవతలు సంకృతు లని రూపనిర్మాణకర్త లని తెలియుచున్నది.

అట్లే పత్నీవంతగ్రహహెూమమున దేవశిల్పి యగు త్వష్టకు స్థానము గల్పింపఁబడినది.

పత్నీవంతం గ్రహం గృహ్ణామి. అగ్నా ౩ ఇ పత్నీ వా ౩ః
సజూర్దేవేన త్వష్టా సోమం పిబ స్వాహా । —కృ.య. 1-4-27**

'దేవపత్నీయుక్తుఁడవగు నో యగ్నీ త్వష్టృదేవునితోఁ గలిసి సోమపానమునకు రమ్ము'-అని అధ్వర్యుడు అగ్ని నాహ్వానించుచున్నాఁడు

ఈవిధముగా సోమయాగములలో గ్రహహెూమముల యందు శిల్పులకు, శిల్పాభిమానిదేవతలకు స్థానముగలదు.

---

* చూడు :- కృ.య. 1-4-27 సాయణభాష్యము. పు. 481

"స ఇంద్ర ప్రథమో దేవనాం ముఖ్యః సర్వాధిపతిత్వాత్ ।
సమీచీనాకృతిర్నిర్మాణం యస్యాసౌ సంకృతిః । తాదృశో విశ్వకర్మ నామకో దేవోఽపి స ఇంద్ర ఏవ । మిత్రో వరుణోఽగ్నిః స ఏవ । చికిత్వా నభిజ్ఞో బృహస్పతి రపి స ఏవ । తాదృశా యేంద్రాయాభిషుతం సోమం సర్వతో జుహోమి । యస్మాదింద్ర ఏతాని విశ్వకర్మత్వాదీని రూపాణి కరికద్రత్యర్థం కుర్వన్ జగదచరత్ తస్మాత్ తత్ప్రతిపాదకేనానేనైవ మంత్రేణ హోమో యుజ్యతే ॥" — [పోల్చు :- శు య. 8-10]

* Cf :- A. B. Keith : T. S. 1-4-27
"O Agni, With the wives in unison with God Tvastar, drink the Soma. Hail"

# విశ్వజిద్యాగము

" విశ్వంజయతీతి విశ్వజిత్ " " విశ్వజిత్ సర్వస్వదక్షిణా । "

విశ్వము నంతటిని జయించిన సార్వభౌముఁడు చేయు యాగము విశ్వజిద్యాగము. యాగానంతమున యజ్ఞకర్త తన సర్వస్వమును బ్రాహ్మణులకు దక్షిణగా నొసఁగవలెను.

విశ్వజిద్యాగము చేసినవారిలో ప్రథముఁడు దేవేంద్రుఁడు.

పూర్వము ప్రజాపతి ప్రజలను సృష్టించి సర్వజనసారభూతమైన యొక ప్రజమును నిర్మించికొని దానిని తన గళమునందు ధరించెను. తత్ ప్రజప్రభావమున ప్రజాపతి సర్వశ్రేష్ఠుఁడాయెను.

ఆ ప్రజాపతి వయోవిద్యాకర్మాదిగుణములందు తనకు సమానుఁడగు పురుషుఁ డొకఁ డుండవలయునని ప్రజలయం దింద్రుడు సర్వశ్రేష్ఠుఁడు కావలయు నను కోరికతో తన గళమునందలి ప్రజము నింద్రుని మెడయందు వైచెను.

అంతట ప్రజలు ఇంద్రుని శ్రేష్ఠత్వము కొఱకు, తమ పితరుని శ్రైష్ఠ్యమునకు కారణభూతమగు నాశ్చర్యకరమయిన శిల్పమును చూచి తన్మాహాత్మ్యమును తెలిసికొనిరి.

ప్రజలాభమువలన సర్వజనశ్రేష్ఠత్వము ప్రాప్తించిన యింద్రుఁడు విశ్వమునంతియును జయించి విశ్వజిద్ యజ్ఞమును జేసెను. *

రఘుమహారాజు విశ్వజిద్యాగము చేసినాడు.

స విశ్వజిత మాజహ్రే యజ్ఞం సర్వస్వదక్షిణమ్ । —కాళిదాసు : రఘు 4. 86

శాకుంతలుండయిన భరతుఁడు చక్రవర్తియై విశ్వజిద్యాగము చేసినాఁడు.

—[వ్యా. భా. ద్రోణ. 68–10]

---

* చూడు :– సామవేదీయ తాండ్యమహాబ్రాహ్మణము. షోడశాధ్యాయము - చతుర్థఖండము. సాయణ భాష్యము. (ద్వితీయభాగము పు 221) చౌఖంబా సంస్కృత సీరీజ్ ఆఫీస్ – వారణాసి. 1936.

"ప్రజాపతిః ప్రజా అసృజత........

సోఽకామయతేంద్రో మే ప్రజాయాం శ్రేష్ఠఃస్యా దితి తా మస్మై స్రజం ప్రతిముంచత్ తతో వా ఇంద్రాయ ప్రజాః శ్రైష్ఠ్యాయాతిష్ఠంతి

తచ్ఛిల్పం పశ్యంతో యత్ పితర్యపశ్యన్ (5)........

"తతో వా ఇద మింద్రో విశ్వమజయత్ యద్విశ్వ మజయత్

తస్మాద్ విశ్వజిత్" (5)

విశ్వజిద్యాగము శిల్పప్రధానమయినది.

విశ్వజిచ్ఛిల్పః ॥ శిల్పం వా ఏష స్తోమానాం పశ్యతి గృహే
య ఏవం వేద ॥ —తాం. మ. బ్రా. 16-15-1-2*

విశ్వజిన్నామకమైన యీ యజ్ఞము ఏకాహమైన సాద్యస్క్రయాగభేదము. ఇది శిల్పమయము కావున చిత్రమైనది.

నానావిధపృష్ఠములవలనను, స్తోత్రములవలనను, సర్వస్వదక్షిణాదానములవలనను విశ్వజిద్యాగ మాశ్చర్యకరమైనది.

స్తోమసాధ్యమయిన యీ శిల్పరహస్యము నెవఁ డెఱుగునో వాఁడు స్వగృహమునందు శిల్పమును దర్శించును.

విశ్వజిద్యాగము వంటిదే అభిజిద్యాగమును. రెండును ఇంద్రసంబంధములగు శిల్పాఖ్యస్తోమములతో ననుష్ఠింపఁదగినవి. ఈ యజ్ఞములు చేసినవారు వీర్యవంతులగుదురు.

తౌ వా ఏతావింద్రిస్తోమౌ వీర్యవంతౌ శిల్పం వా ఏతౌ నామ
స్తోమనస్తామ్ ॥ 8 ॥ పశ్యతే గృహో శిల్పం య ఏవం వేద ॥ 9 ॥
—తాం. మ. బ్రా. 16-4-89**

ఈ బ్రాహ్మణమున కర్థము తెలిసికొనినవాఁడు తన గృహమునందు నానారూపవస్తుజాతమగు శిల్పమును దర్శించును.

దక్షిణాదానసమయమున యజ్ఞకర్త తన సర్వస్వప్రకటనములో భాగముగా 'శిల్పకళావస్తుప్రదర్శనము' చేయకతప్పదు.

---

* చూడు :- తాండ్య మహాబ్రాహ్మణము 16-15-1-2 సాయణభాష్యము.

"విశ్వజిన్నామాఽన్యః సాద్యస్క ఏకాహః । స చ శిల్ప శ్చిత్రిభూతః ।
తస్య చ శిల్పత్వం ఏకాహస్య విశ్వజితః । శిల్పత్వవ్యాఖ్యానేన
పూర్వకృతేన వ్యాఖ్యాతమ్" - (1)

"స్తోమానాం స్తోమసాధ్యానాం ఏష యజ్ఞః శిల్పం వై సర్వ పృష్ఠత్వాత్
సర్వస్తోమకత్వాత్ సర్వస్వదక్షిణత్వాఽఽశ్చర్య భూతః । య ఏవ మస్య
శిల్పం వేత్తి సః స్వకీయగృహో శిల్పం చిత్రిం పశ్యతి ॥" - (2)

** చూడు :- తాండ్య మహాబ్రాహ్మణము - సాయణభాష్యము.

"....ఏతౌ చ పురా ఉక్తం శిల్పం నామ శిల్పాఖ్యే విచిక్రిసంస్థానే స్తోమా
స్తోమవంతావస్తాం అభూత్ । యచ్ఛిల్పం పశ్యంతో యత్పితర్యపశ్యన్నితి
విశ్వజితః శిల్పరూపముక్తం తత్సంబధా దభిజితోఽపి శిల్పత్వోపచారః ॥ - (8)

"య ఏవం బ్రాహ్మణార్థే జానాతి సోఽయం గృహం శిల్పం నానారూపం
వస్తుజాతం పశ్యతి" - (9) - సాయణ

# వాజపేయ యజ్ఞము

వాజపేయేన స్వారాజ్యకామో యజేత। —ఆపస్తంబ

స్వారాజ్యమును గోరువాఁడు వాజపేయమును జేయవలెను.

"ఒకానొకప్పుడు దేవతలలో జ్యేష్ఠుఁ డెవఁడను ప్రశ్న యుదయింపఁగా అజిధావనము (రథధావనము) నందు గెలిచిన వాఁడు జ్యేష్ఠుఁ డగు నని సమయము చేసికొని రథధావనమునకుఁ గడఁగిరి.

"రథధావనమునందు బృహస్పతి యితరదేవతలకంటె ముందుగా గమ్యస్థానము చేరి విజేతయై వాజపేయయాగము చేసి యపార తంత్ర్యరూపమైన స్వారాజ్యమును పొందినాఁడు.

"ఆ బృహస్పతిని ప్రార్థించి యింద్రుఁడు వాజపేయ మొనరించి దేవతలయందు జ్యేష్ఠుఁడై స్వర్గాధిపత్యమును బడసినాఁడు" *

ఈవిధముగా దేవతలలో బ్రాహ్మణజాత్యభిమానియైన బృహస్పతియు క్షత్రియజాత్యభిమానియైన యింద్రుఁడును వాజపేయయాగములు చేసిరి.

ఋద్ధి (వృద్ధి) కాముఁడయిన బ్రాహ్మణుఁడు గాని, రాజన్యుఁడు గాని వాజపేయయాగమును శరదృతువునందుఁ జేయవలెను.

"శరది వాజపేయేన యజేత బ్రాహ్మణో రాజన్యో వార్థికామః" —ఆపస్తంబ

వాజపేయము సోమయాగమే. వాజపేయసంబంధమైన సోమమును హవిస్సును) పానము చేసినవాఁడు స్వయముగా వాజి (వీర్యవంతుఁడు) యగుచున్నాఁడు.

సోమో వై వాజపేయః యో వై సోమం వాజపేయం వేద।
వాజ్యేవైనం పీత్వా భవతి। ఆఽస్య వాజీ జాయతే॥ —తై.బ్రా. 1-3-2

* చూడు :- కృ.య 1-7-7 సాయణభాష్యము పు. 746

"... ఏవం సమయం కృత్వా తస్మిన్ వాజపేయవిషయే ప్రయాయాఽఽజిమధావన్
తత్ర తం వాజపేయం ప్రతి ధావన్ బృహస్పతి రుత్కర్షేణాజయత్।
ఇతరేభ్యః ప్రథమ మవధిం ప్రాప్య। తతః ప్రథమం స ఏవ తేన
వాజపేయేనేష్ట్వా స్వారాజ్య మపారతంత్ర్యరూపం మహారాజ్య మగచ్ఛత్।
తత ఇంద్రస్తం బృహస్పతిం సంప్రార్థ్య తేన వాజపేయేనేష్ట్వా దేవానాం
మధ్యే జ్యేష్ఠత్వ మపారతంత్ర్యేణ స్వర్గాధిపత్యలక్షణం స్వారాజ్యం
చాగమచ్ఛత్। అస్యేంద్రస్య జ్యైష్ఠ్య మితరే సర్వే దేవా మాత్సర్యం
పరిత్యజ్యాంగీచక్రుః॥ —సాయణ

భరతుఁడు వేయి వాజపేయయాగములు చేసినాఁడు.

వాజపేయసహస్రాణాం సహస్రైశ్చ సుసంవృతైః ।

ఇష్ట్వా శాకుంతలో రాజా తర్పయిత్వా ద్విజాన్ ధనైః

—వ్యా.భా. ద్రోణ. 68-10.11

వాజపేయమునందు సవితృహోమము, రథధావనము, యూపారోహణము, అభిషేకము, సోమపానము ప్రధానాంశములు.

## సవితృహోమము

దేవసవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ। దివ్యో గంధర్వః కేతపూః కేతం నః పునాతు। వాచస్పతి ర్వాచ మద్య స్వదాతినః ॥

—కృ.య. 1-7-7

ప్రేరకుఁడవగు నో సవితృదేవా! మా వాజపేయయజ్ఞమును ప్రవర్తింపఁ జేయుము. యజ్ఞకర్తను యజ్ఞానుష్ఠానరూపమగు నైశ్వర్యము కొఱకు ప్రేరేపింపుము. దివియందుద్భవించిన గంధర్వుఁడు సవితృదేవుని యనుగ్రహము వలన జీవుల మనోభావములను - విజ్ఞానమును - పునీతము చేయుగాక!

ఆ గంధర్వుఁడు మా వాజపేయవిజ్ఞానమును (కేతం) శోధించుఁగాక: వాచస్పతి మాచే వాజపేయమంత్రములను చక్కగా పఠింపఁజేయుగాక!

వాజపేయయజ్ఞారంభమునం దీమంత్రములతో సవితృహోమము చేయవలెను. ఈ మంత్రమునందుఁ జెప్పఁబడిన దివ్యగంధర్వుఁడు విశ్వకర్మయే.

విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవ ఆదిద్గంధర్వోఽభవద్ ద్వితీయః ॥

—శు య. 17-32

ప్రజాపతి ర్విశ్వకర్మా మనోగంధర్వః ॥ —శు.య. 18-32

కావున వాజపేయమునందు శోధింపఁబడు విజ్ఞానము శిల్పవిజ్ఞానమే.[1]

---

* చూడు :- కృష్ణయజుర్వేదము, 1-7-7 సాయణభాష్యము. పు. 756

"హే సవితర్దేవ ప్రేరకాంతర్యామి న్నస్మదీయం వాజపేయ యజ్ఞం ప్రవర్తయ। యజ్ఞపతిం యజమానం భగాయానుష్ఠాను రూపాయైశ్వర్యాయ। దివి భవోయో గంధర్వః సవితు రనుగ్రహాత్ కేతాన్ పునాతి ప్రాణినాం విజ్ఞానాని శోధయతి సోఽస్మాకం కేతం వాజపేయవిజ్ఞానం పునాతు శోధయేత్। వాచస్పతిశ్చ సవితాఽనుజ్ఞాతోఽద్యాస్మిన్ కర్మణి వాచమస్మాభిః పఠితాన్ మంత్రాన్ స్వదతి స్వదయతు యథావత్ పాఠయతు॥" —సాయణ

పోల్చు - శు య. 9-1. వాచస్పతి వాజ మద్య స్వదతు స్వాహా।

1. చూడు :- వడ్డెపాటి నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము. పు. 214

వాచస్పతి యన్నను విశ్వకర్మయే.

"వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే।" అని ఋగ్వేదము.[1]

వాజపేయ యజ్ఞమునందు హవిస్సు (చరువు) బృహస్పతి సంబంధమయినది.

యో వాజపేయేన యజతే । బార్హస్పత్య ఏష చరుః ॥

—తై. బ్రా. 1-3-6*

ఈ చరువు - పరమాన్నము - సప్తదశశరావపరిమాణము గలది.

హవిస్స్వీకర్తయగు బృహస్పతి సంకృతి. శిల్పాచార్యుడు.

## రథధావనము : రథప్రశంస

వాజపేయ యజ్ఞమునందు రథధావన మత్యంతప్రధానమైనది.

రథధావనమున కవసరమగు రథములను నిర్మించువారు రథకారబ్రాహ్మణులు.

సౌమికీవేది దక్షిణశ్రోణ్యంతమునఁగల రథవాహనము (రథమునుంచు చోటు) నుండి రథమును గొనివచ్చునపుడు, ఇంద్రానుగ్రహార్థము "ఇంద్రస్య వజ్రోఽసి" - అను మంత్రమును పఠింపవలెను.

ఇంద్రస్య వజ్రోఽసి వార్త్రఘ్నస్త్వయాఽయం వృత్రం వధ్యాత్॥

—కృ.య 1-7-7**

(ఓ రథమా! నీవు ఇంద్రుని వజ్రమవు. వైరిఘాతివి. నీ సహకారముతో ఈ యజ్ఞకర్త శత్రువును వధించి విజయమును సాధించుఁగాక!)

వజ్రమే రథము - వజ్రముచేతనే దిక్కులను జయింపవలెను.

వజ్రో వై రథః । వజ్రేణైవ దిశోఽభిజయతి ॥ —తై.బ్రా. 1-3-6

ఇంద్రాయుధమగు వజ్రమును నిర్మించినవాఁడు దేవశిల్పి యగు త్వష్ట. రథనిర్మాణముచేయువాఁడును త్వష్టయే.

యజుర్వేదమంత్రములతో సజ్జీకృతమైనరథము నధ్వర్యువ కొనఁగవలెన

"యజుర్యుక్తం రథ మధ్వర్యవే దదాతి॥"

1. చూడు :- ఋగ్వేదము. 10-81

* చూడు :- కృ.య. 1-7-7 సాయణభాష్యము. పు. 777

** ... అదే ....

"దేవహూర్మోఽత్రి కర్మాదా వింద్రస్య రథ మాహరేత్."

వాజపేయమునందు యజ్ఞసాధనములన్నియు సప్తదశ సంఖ్యాకములు. సప్తదశసంఖ్య ప్రజాపతికి ప్రీతికరమైనది.

సర్వాః సప్తదశో భవంతి ప్రజాపతిర్వై సప్తదశప్రజాపతిమేవాప్నోతి ॥
—తాం. మ. బ్రా 18.7-5

సప్తదశరథములు, సప్తదశశకటములు, సప్తదశదుందుభులు, సప్తదశారత్నిప్రమాణయూపములు, సప్తదశగ్రహములు, ఇత్యాది యజ్ఞపాత్రలను నిర్మించువారు శిల్పులే.

## బృహస్పతి స్తుతి

ఆజిధావనార్థము సప్తదశశరపాతపరిమితమైన భూమి నవధిగా నెంతురు.

రథధావనమున యజమానుఁడు విజయము నొందుటకు బృహస్పతి దేవతాకమైన యీ క్రింది మంత్రముతో బ్రాహ్మణుఁడు రథము నధిరోహించును.

దేవస్యాహం సవితుః ప్రసవే బృహస్పతినా వాజం జిత వాజం జేష ॥
— కృ య. 1-7-8

(సవితృదేవుని ప్రేరణతో రథధావనస్పర్ధయందు విజేతయైన బృహస్పతి యనుగ్రహము వలన నేను గెలుపొందుదును గాక !)

అట్లే యభిషేకసమయమునందు బృహస్పతిస్తోత్రము గలదు.

సరస్వత్యై వాచో యంతు ర్యంత్రియే దధామి ।
బృహస్పతేష్ట్వా సామ్రాజ్యేనాభిషించామి ॥ — శు. య. 9-30

(మహావిద్వాంసుఁడైన బృహస్పతి యొక్క శిల్పవిద్యవలన సిద్ధమైన రాజ్యమునకు చక్రవర్తిగుణసహితుఁడవయిన నిన్నభిషేకించుచున్నాను) - అని అధ్వర్యుఁడు యజమాను నభిషేకము చేయును.

శిల్పాభివృద్ధియే రాజ్యాభివృద్ధికి మూలకారణము.

ఈవిధముగా వాజపేయమునందు బృహస్పతికి ప్రాధాన్య మెక్కుడుగా నుండుట వలన నది యొకవిధముగా బృహస్పతిసవమనియు శిల్పయజ్ఞమనియు జెప్పవచ్చును.

---

* చూడు :- దయానంద : యజుర్వేదభాషాభాష్యము
సరస్వత్యైవాచః = అచ్ఛేప్రకార్ శిల్పవిద్యాయుక్త దేవవాణీ
యంత్రియే = కారీగారీ విద్యాసే సిద్ధ కియే రాజ్య -

## యజ్ఞదక్షిణలు

భరతుఁడనేక యాగములు చేసి భూసురులకు దక్షిణగా 'శుద్ధసువర్ణగవాశ్వహస్తుల' నొసఁగినాఁడని నన్నయ వ్రాసినాఁడు.

ఇట శుద్ధసువర్ణగవాశ్వహస్తులనఁగా శుద్ధసువర్ణము, గోవులు, అశ్వములు, హస్తులు నని యర్థము చెప్పుకొనుట కంటె, శుద్ధసువర్ణ వికృతములయిన - మేలిమిబంగారముతోఁ జేయఁబడిన - గోవులు, హయములు, గజములు నని చెప్పుకొనుట లెస్స.

భరతుఁడు గంగాయమునా సరస్వతీ తీరములందు......

"వాజిమేధ, రాజసూయాది వివిధాధ్వరము లొనర్చి
కనక నిర్మిత కరి తురంగమ హయంబు
లసదృశప్రీతి విప్రుల కొసఁగె" నని
తిక్కన మూలానుసారముగా వ్రాసినాఁడు. —ద్రోణ. 2-210

మూలమునందిట్లున్నది.

అలంకృతాన్ రాజమానాన్ సర్వరత్నై ర్మనోహరైః
హైరణ్యా నశ్వాన్ ద్విరదాన్ రథానుష్ట్రా నజావికమ్ ॥
—వ్యా.భా.68. 13, 14

ఈ యజ్ఞములు చేయించిన కణ్వమహర్షికి భరతుఁడు యజ్ఞదక్షిణగా సహస్ర స్వర్ణకమలముల నొసఁగినట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

సహస్రం యత్ర పద్మానాం కణ్వాయ భరతో దదౌ ।
జాంబూనదస్య శుద్ధస్య కనకస్య మహాయశాః ॥-వ్యా భా. ద్రోణ. 68-12*

ఈ వర్ణనములను బట్టి భరతకృతబహుయాగములందు యజ్ఞ దక్షిణల కొఱకు శుద్ధసువర్ణగవాశ్వహస్తులను, కనకమయరథములను, స్వర్ణకమలము లను నిర్మించి యిచ్చిన స్వర్ణకారుల సువర్ణ శిల్పరచనావిశేషములు విశద మగుచున్నవి.

---

* చూడు :- మహాభారతము. హిందీ టీకాసహితము. గీతాప్రెస్.
ద్రోణపర్వము. 68-12 పుట. 3270

" ఆచార్య కణ్వకో విశుద్ధజాంబూనద సువర్ణకే బనేహుఏ
ఏక్ హజార్ కమల్ భేంట్ కియే ॥"

ఇట పద్మ శబ్దమును సంఖ్యాపరముగాఁగాక కమల పరముగా నర్థము చెప్పుట గమనింపఁదగినది.

## దక్షయజ్ఞము

కురుక్షేత్ర ప్రాంతమునం దొకస్థలమును జూపి యిదిగో 'యిది దక్షమఖస్థానం'[1] బని రోమశుఁడు ధర్మరాజునకుఁ జూపెను.

దక్షుఁడు యజ్ఞము చేసినచోట మరణించిన నరులు స్వర్గలోక గతులగుదురు.

"....ఏవ మాశీః ప్రయుక్తా హి దక్షేణ యజతా పురా ।

ఇహ యే వై మరిష్యంతి తే వై స్వర్గజితో నరాః ॥–వ్యా.భా. వన. 130. 2

తరువాత కొన్నాళ్లకు కురుక్షేత్రయుద్ధానంతరము ధర్మరాజు అశ్వమేధ యాగము చేసినాఁడు. ఆ యజ్ఞమునందలి యగ్నిచయనము దక్షప్రజాపతి అగ్నిచయనము పలె నున్న దని వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

శుశుభే చయనం యత్ర దక్షస్యేవ ప్రజాపతేః ॥ —అశ్వ. 88-32

వైవస్వతమన్వంతరమునందు ప్రాచేతసుండైన దక్షప్రజాపతి హయమేధయాగము నొనరించుచుండఁగా రుద్రానుచరులు దానిని ధ్వంసము చేసినట్లు శాంతిపర్వమునందు వర్ణింపఁబడినది.

దక్షో నామ మహాభాగో ప్రజానాం పతిరుత్తమః ।

హయమేధేన యజతే తత్ర యాంతి దివౌకసః ॥ —శాంతి. 263. 24

దక్షుఁడు హిమవత్పర్వతమున గంగాద్వారమున యజ్ఞము చేయ సంకల్పించి, యా యజ్ఞమునకు దేవతల నెల్లర నాహ్వానించి విశ్వకర్మ యైన మహేశ్వరు నాహ్వానింపఁడయ్యెను.

ఆహూతా దేవతా స్సర్వా ఋషయశ్చ తపోధనాః

దేవో నాహూయతే తత్ర విశ్వకర్మా మహేశ్వరః ॥ –శాంతి. 284-5

సర్వజగత్కారణుండయిన (విశ్వకర్మ) మహేశ్వరుని యజ్ఞమునకాహ్వానింపకపోవుటచే కుపితులైన రుద్రానుచరులు దక్షాధ్వరమును ధ్వంసమొనర్చిరి. కొందఱు యూపములను బెల్లగించిరి. కొందఱు యజ్ఞపాత్రలను ధ్వంసము చేసిరి.[2]

రుద్రానుచరులు కొందఱు ప్రాగ్వంశము, పత్నీశాల, యజమానశాల సదము, అగ్నీధ్రశాల యజ్ఞశాల, మహానసము మున్నగు వివిధశాలలను భగ్నము చేసిరి.[3]

---

1. నన్నయ్య అరణ్య. 3. 224   2, వ్యా.భా. శాంతి. 284. 41, 42
3. వ్యాస భాగవతము. స్కంధ. 4 6-14

దక్షుఁడంతట తన తప్పు తాను తెలిసికొని శివసహస్ర నామ స్తోత్రముచేసి శిల్పశ్రేష్ఠుఁడును సర్వశిల్పప్రవర్తకుఁడు నయిన శివునకు యజ్ఞభాగము కల్పించెను.

శిల్పికః శిల్పినాంశ్రేష్ఠః సర్వశిల్పప్రవర్తకః —వ్యా. భా. శాంతి. 285-77

ఈ విధముగా దక్షప్రజాపతి హయమేధము చేసినాఁడని భారతము వర్ణించుచుండఁగా రాజసూయము గావించినాఁడని కాశీఖండమును వాజపేయానంతరము బృహస్పతిసవ మొనరించినాఁడని భాగవత మహాపురాణమును తెలుపుచున్నవి.

దక్షుడు రాజసూయః యజ్ఞదీక్షితుఃడయినట్లు నా యజ్ఞమునకు "విశ్వకర్మ దారు పాత్ర శకట మంటపాలంకారములను గల్పించి"[1] నట్లును స్కంద మహాపురాణాంతర్గత కాశీఖండమునందు వర్ణింపఁబడినది.

దీక్షితో రాజసూయస్య దత్త్రైలోక్యదక్షిణః ।

.......................................

దారుపాత్రాణి సర్వాణి శకటం మండపాదికం ।
విశ్వకర్మాప్యలంకారాన్ కురుతేభ్యాగతర్త్విజమ్ ॥[2]

....స్కాంద. కాశీ. 87. 63, 64

యజ్ఞశాలాదులే కాక యజ్ఞము చూడవచ్చిన వారుండుటకు విశాలములు కాంతిమంతములు నైన భవనములను విశ్వకర్మ (త్వష్ట) తన కౌశల్యము చేత నిర్మించినాఁడని స్కందమహాపురాణాంతర్గ మహేశ్వరఖండము నందు వర్ణింపఁబడినది.

భవనాని మహార్హాణి సుప్రభాని మహాంతి చ
త్వష్ట్రా కృతాని దివ్యాని కౌశల్యేన మహాత్మనా ॥[2]

దక్షుండు సకలప్రజాపతి విభుత్వగర్వంబునంజేసి బ్రహ్మనిష్ఠ నీశ్వరుల నారాధించి యరుద్రకంబుగా వాజపేయసవనంబు యనంతరంబ బృహస్పతిసవన నామకంబైన మఖంబు సేయ నుపక్రమించెఁ డని భాగవతమునందు వర్ణింపఁబడినది.[3]

---

1. శ్రీనాథ : కాశీఖండము. 7-54
2. చూడు :- స్కందమహాపురాణ - మహేశ్వరఖండ. 2। దక్షయజ్ఞ వర్ణనము — సంక్షేపము
3. ఆంధ్రమహాభాగవతము : స్కంద 4-54 (= వ్యాస. భాగ 4-3-2-3)

యథాభిషిక్తో దక్షస్తు బ్రహ్మణా పరమేష్ఠినా
ప్రజాపతీనాం సర్వేషా మాధిపత్యే స్మ యోఽభవత్ ।
ఇష్ట్వా స వాజపేయేన బ్రహ్మిష్ఠా నభిభూయ చ
బృహస్పతిసవం నామ సమారభే క్రతూత్తమమ్ ॥*

—వ్యాస భాగవతము. 4-3-2,3

ఈ వర్ణనము 'వాజపేయము తరువాత యజమానుఁడు రాజన్యుఁడయినచో రాజసూయమును బ్రాహ్మణుఁడైనచో బృహస్పతిసవమును చేయవలె' నను నాశ్వలాయనసూత్రము ననుసరించియున్నది.[1]

సవ మన అభిషేకయుక్తమయినయాగము.

బృహస్పతిసవము జ్యోతిష్టోమవికృతియాగమైనచో వసంతర్తువునందును వాజపేయసహితమయినచో శరదృతువు నందును జేయవలెను.[2]

సురాపాన మొనరించిన బ్రాహ్మణుఁడు "బృహస్పతిసవనమన్ క్రతువొనరించిన" దానివలనఁగలుగు కీడు తొలఁగి[3] మరల బ్రాహ్మణ సమాజమునఁ గలిసియుండవచ్చు నని వేదము చెప్పుచున్నది.

బృహస్పతిసవేనేష్ట్వా సురాపో బ్రాహ్మణఃపునః ।
సమితిం బ్రాహ్మణో గచ్ఛే దితి వై బ్రహ్మణఃశ్రుతిః ॥

—వ్యా భా. శాంతి. 35-18

కావున బృహస్పతిసవము పాపభంజకము.

---

* "వాజపేయేనేష్ట్వా బృహస్పతిసవేనయజేతీతి శ్రుతేః
వాజపేయేనేష్ట్వా సమారభే" —శ్రీధరవ్యాఖ్య

1. Cf. :- A. B. Keith : Introduction to T. S. CVIV
"Asvalayana (ix-9-9) lays down the rule that the Vajapeya is intended as a Preliminary rite to be followed in the case of a King by the Rajanya and in that of a Brahmin by the BRIHASPATISAVA the actual installation and consecration ceremony"

2. చూడు :- కృ-య. 5-6-3 సాయణభాష్యము. పు. 2461
"తథా బృహస్పతిసవస్య జ్యోతిష్టోమవికృతిత్వాత్ వసంతకాలశ్చోదకప్రాప్తః వాజపేయసహప్రయోగైక్యే శరది వాజపేయవిహితత్వాద్ బృహస్పతిసవోఽపి శరది ప్రసజ్యేత ॥" —సాయణ.

3. తిక్కన. శాంతి. 1-308

## బృహస్పతిసవము - స్థపతిసవము

బ్రాహ్మణో బ్రహ్మవర్చస్కామో బృహస్పతిసవేన యజేత॥

బ్రహ్మవర్చస్సును గోరు బ్రాహ్మణుఁడు బృహస్పతిసవమును జేయ వలయును.

పూర్వము ఇంద్రాదిదేవతలకు పౌరోహిత్యము నెరపవలె నను కోరికతో బృహస్పతి యీయజ్ఞము చేసి తన్మాహాత్మ్యమువలన దేవతలకు పురోహితుఁ డయినాడు. అందువలన నీ యజ్ఞమునకు బృహస్పతిసవ మను పేరువచ్చినది.

స్థపతిచే ననుష్ఠింపఁదగినది కావున బృహస్పతిసవమును స్థపతిసవ మనియు నందురు.

ధర్మసంస్థాపనమునందు నియుక్తుఁడై యభిషేకింపఁబడిన బ్రాహ్మణుని స్థపతి యందురు. అట్టి స్థపతి బృహస్పతిసవము ననుష్ఠింపవలెను.

స ఏష బృహస్పతిసవో బృహస్పతి రకామయత దేవానాం పురోధాం గచ్ఛేయ మితి స ఏతేనాఽయజత స దేవానాం పురోధా మగమచ్ఛత్ ॥4॥

గచ్ఛతి పురోధాం య ఏవం వేద ॥5॥

స ఏష స్థపతిసవో యం స్థాపత్యాయాభిషించేరన్ స ఏతేన యజేత ॥6॥

— తాండ్యమహాబ్రాహ్మణము. 17-11-4-6*

బృహస్పతిసవము నొనరించువాఁడు స్థపతి యని నిఘంటువులు తెలుపుచున్నవి.

"స గీష్పతీష్ట్యా స్థపతిః।" —అమరకోశము

స్థాపత్యవేదవేత్తయై ధర్మసంస్థాపన కుపయుక్తములైన యజ్ఞశిల్పము నొనరించు శిల్పిబ్రాహ్మణుఁడే స్థపతి యనియు నా స్థపతి యొనరించు బృహస్పతిసవము శిల్ప యజ్ఞ మనియుఁ జెప్పనొప్పును!

---

*చూడు - తాండ్య మహాబ్రాహ్మణము - సాయణబాష్యము

"రాజ్ఞా సహబ్రాహ్మణాః యం బ్రాహ్మణం ధర్మస్థాపకత్వేన వృణీరన్ స స్థపతి రుచ్యతే - తేన ప్రాప్తస్థాపత్యేనపుంసా నైమిత్తికత్వేనాఽయ మనుష్ఠేయ ఇత్యాహ ॥5॥

"స ఏషయజ్ఞః స్థపతిసవః స్థపతినానుష్ఠేయః। అతోయం బ్రాహ్మణం స్థాపత్యాయ స్థపతిత్వాయ అభిషించేరన్ రాజపురస్సరా బ్రాహ్మణా వృణీరన్ సోఽయమేతేన బృహస్పతిసవేన యజేత। యథా లబ్ధహిరణ్యస్య నైమిత్తికేష్టిః తద్వత్ ప్రాప్తస్థాపత్యస్యాఽయం నైమిత్తికోయజ్ఞశ్చోద్యత ఇత్యర్థః ॥6॥ —సాయణ

# ప్రజాపతియజ్ఞవము

ప్రయాగం సర్వతీర్థేభ్యః ప్రవదంత్యధికం విభో ॥

—వ్యా.భా. వన 85.80

"అది ప్రజాపతి యజ్ఞవేది గావున నందు మూఁ డగ్నికుండంబు లెప్పుడుఁ గానంబడు. మఱి వేదంబులు యజ్ఞంబులు మూర్తిమంతంబులై యరువదికోట్లపదివేలు తీర్థంబులు సన్నిహితంబులై గంగాయమునాసంగమంబు సేవించి యుండు" - నని పులస్త్యుండు భీష్మునకుఁ జెప్పినట్లు నారదుఁడు ధర్మరాజుతోఁజెప్పినాఁడు. —నన్నయ. భార. ఆరణ్య. 2-282

తత్ర త్రీణ్యగ్నికుండాని యేషాం మధ్యేన జాహ్నవీ ।

.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

యమునా గంగయాసార్థం సంగతా లోకపావనీ ।

గంగాయమునయోర్మధ్యం పృథివ్యా జఘనం స్మృతమ్ ।

.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

తీర్థం భోగవతీచైవ వేదీ రేషాప్రజాపతేః ।

తత్ర వేదాశ్చ యజ్ఞాశ్చ మూర్తిమంతో యుధిష్ఠిర ॥

—వ్యా.భా. వన. 85-69-80

"ఇది పంచయోజనప్రమాణమైన ప్రజాపతి యజ్ఞవేది" "యిందు దేహత్యాగంబు చేసి మర్త్యు లమర్త్యత్వంబుఁ బొందుదు" రని రోమశుఁడు ధర్మరాజుతోఁ జెప్పెను —నన్నయ్య. ఆరణ్య. 3.225

వేదీ ప్రజాపతే రేషా సమంతాత్ పంచయోజనా ॥

—వ్యా. భా. వన. 129-22

ప్రజాపతి యనఁగా బ్రహ్మ. ప్రయాగ బ్రహ్మదేవుని యజ్ఞవేది.

ఇందుఁ దొల్లి ప్రజాపతి సహస్రవార్షికంబైన యిష్టాకృతం బను సత్రయాగమును జేసెను. 1

---

1. నన్నయ్య - భార. ఆరణ్య. 3-222 = వ్యా.భా. వన, 129.1

అస్మిన్ కిల స్వయం రాజ న్నిష్టవాన్ వై ప్రజాపతిః ।

సత్ర మిష్టీకృతం నామ పురా వర్షసహస్రికమ్ ॥

చూ :- ఆంధ్రభాగవతము. 4-54

"అనఘాత్మ యే యజ్ఞమందు సర్వశ్రేష్ఠుఁడగు హరి సంపూజ్యుఁడై వెలుంగు నట్టి యజ్ఞంబు సమ్యగ్విధానమున సహస్రవర్షము లజుఁ డొనర్చె."

బ్రహ్మ యొనరించిన యజ్ఞమునకు యజ్ఞమండపములను యజ్ఞోపకరణములను నిర్మించినవాఁడు విశ్వకర్మయే యని స్కాంద మహాపురాణాంతర్గత నాగరఖండము వలనఁ దెలియుచున్నది.

బ్రహ్మోవాచ ॥ విశ్వకర్మన్ ద్రుతం గచ్ఛ యజ్ఞమండప సిద్ధయే ।
పత్నీశాలా సదశ్చైవ యజ్ఞవేదీ స్తథైవ చ ॥ 14 ॥
కుండాని చైవ సర్వాణి యథా స్థానేషు కారయ ।
యజ్ఞపాత్రాణి సర్వాణి గ్రహాశ్చ చమసాస్తథా ॥ 15 ॥
యూపాశ్చయత్ప్రమాణేన కర్తవ్యాః స చషాలకాః ।
పచనార్థం తథా గర్తాః కర్తవ్యాః యత్ప్రమాణతః ॥ 16 ॥
ఇష్టకానాం సహస్రాణి దశచాష్టశతాని చ ।
కర్తవ్యాని త్వయా శీఘ్రం చయనానీతి సత్వరం ॥ 17 ॥
తథా హిరణ్మయశ్చాపి పురుషః కార్య ఏవ హి ।
తథేత్యుక్త్వా తత స్త్వష్టా శీఘ్రాచ్ఛీఘ్రతరం యయౌ ॥ 18 ॥
.......................................
ఏతస్మిన్నంతరే ప్రాప్తో విశ్వకర్మా త్వరాన్వితః ।
అబ్రవీత్ పంకజభవం సంసిద్ధో యజ్ఞమండపః ॥26 ॥

—నాగరఖండే - బ్రహ్మయజ్ఞోపాఖ్యానే - అ 180 శ్లో. 14-26

బ్రహ్మదేవుఁ డిట్లు పలికెను :

"ఓ విశ్వకర్మా త్వరగా నేగి యజ్ఞమండపమును సిద్ధము చేయుము. పత్నీశాలయు, సభ్యశాలయు, యజ్ఞవేదియు. యజ్ఞకుండములను తగిన స్థానములందు నిర్మింపుము (14)

సమస్త యజ్ఞపాత్రలు. గ్రహములు, చమసములు మున్నగు సోమరసపానపాత్రలు సమకూర్పుము (15)

శాస్త్రోక్తప్రమాణములతో యూపములను, వానిపై చషాలములను నిర్మింపుము. పచనార్థము గర్తముల నొనర్పుము (16)

10,800 ఇటికలతో చయనములను [యజ్ఞవేదికలను] శీఘ్రముగా నిర్మింపుము. అట్లే హిరణ్మయపురుషుని నిర్మింపుము (17)

బ్రహ్మ యిట్లు చెప్పిన వెంటనే త్వష్ట - విశ్వకర్మ - కార్యోన్ముఖుఁడై త్వరత్వరగా నరిగెను (18)

కొంతకాలము తరువాత విశ్వకర్మ వచ్చి యజ్ఞమండపము సిద్ధమైనదని పద్మభవునితోఁ జెప్పెను. (26)

దీనిని బట్టి విశ్వకర్మ వివిధయజ్ఞశిల్పక్రియాకుశలుఁ డని విదితమగుచున్నది.

## చయనక్రతువులు

10,800 ఇష్టకలతో నగ్నిచయనములను (యజ్ఞవేదికలను) శీఘ్రముగా నిర్మింపు మని పద్మసంభవుఁడు విశ్వకర్మను గోరెను.

సర్వశిల్పాధిపతియైన విశ్వకర్మ సంకల్పమాత్రమున యజ్ఞవేదికలను శీఘ్రముగా నిర్మించియుండవచ్చును గాని సాధారణముగా వీనిని నిర్మించుట కొకసంవత్సరకాలము పట్టును.

యజ్ఞవేదికలను నిర్మించుటకు ముందుగా శాస్త్రనిర్దిష్ట ప్రమాణయుక్తము లైన ఇష్టకలను సిద్ధము చేయవలెను.

ఇష్టకారచనము శిల్పకర్మమే ఇష్టకలనుచేర్చుచు యజ్ఞవేదికలను నిర్మించుటయు శిల్పకర్మమే. అది స్థాపత్యము.

చతురస్రాకారయజ్ఞవేదీనిర్మాణమునం దుపయోగింపఁబడు నట్టి ఇటికలు ఏకపాదచతురస్రాకృతులు.

అథాత ఇష్టకా మాత్రాణా మేవ పాదమాత్రీః ప్రథమాయాం
చోత్తమాయాం చ చిత్యో రుపదధ్యాత్ ॥ — శతపథ 8-7-3-17

ధ్రువాసి ధరుణాస్తృతా విశ్వకర్మణా సుకృతా ॥ —కృ య. 4-2-9*

[విశ్వకర్మచేఁ జక్కఁగా నిర్మింపఁబడిన యో యిష్టకా విశ్వమును ధరించు భూమి వలె నీవు స్థిరముగానుందువు గాక ]

అని స్వయమాతృణ్ణేష్టక నుద్దేశించి యధ్వర్యుఁడు పలుకుచుండుటను బట్టి యజ్ఞవేదీనిర్మాణార్థము ఇష్టకలను నిర్మించువాఁడు, స్థాపించువాఁడును విశ్వకర్మ యే యని తెలియుచున్నది.

కావున లోకమునం దీయజ్ఞశిల్పములు చేయువారు విశ్వకర్మస్థానీయులగు విశ్వకర్మ బ్రాహ్మణులె యని రూఢి యగుచున్నది.

---

* చూడు :- — కృ.య. 4-2-9 సాయణభాష్యము.

"హే స్వయమాతృణ్ణే త్వం ధ్రువా స్థిరాపి కీదృశీ. ధరుణా భూమిరూపేణ విశ్వస్య ధారయిత్రీ. అత ఏవాఽస్తృతా కేనా ప్యహింసితా విశ్వకర్మణా జగత్కర్త్రా సుకృతా సుష్ఠు నిర్మితా." — సాయణ

"Thou art firm, supporting, un over powered, well wrought by Viswakarman." — A. B. Keith : T. S. 4-2-9.

Cf :- Ralf T. H. Griffith : The WHITE YAJURVEDA. xiii - 16
"Steady art thou, sustainer, laid by Visvakarman in thy place."

## శ్యేనచితి

చతురస్రశ్యేనచితి అత్యంతప్రాచీనమయినది. స్వర్గమును గోరువాఁడు శ్యేనచితియందు అగ్నిచయనము చేయవలెను.

శ్యేనచితిం చిన్వీత సువర్గకామః ॥ —కృ.య. 5-4-11

ఇది అయిదు అంతరములు (layers) గలిగి, 7½ చదరపు పురుషులకు సమానమయిన విస్తీర్ణము గలిగియుండును. పురుషప్రమాణ మనఁగా నొకపురుషుఁడు రెండుచేతులు పయికెత్తి నిలిచినప్పటి ప్రమాణము.*

యజ్ఞవేదిక రథచక్రాకృతి గాని సమభుజత్రికోణాకృతి గాని, కూర్మాకృతి గాని, మఱి యే యితరాకృతి గాని దాని విస్తీర్ణము నందు మార్పుండదు.

యజ్ఞవేదిక విస్తీర్ణము ప్రథమచితి 7½ చదరపు పురుషప్రమాణమైనచో ద్వితీయచితి 8½ చదరపు పురుషప్రమాణమును, తృతీయచితి 9½ చదరపు పురుషప్రమాణమును, చతుర్థచితి 10½ పురుషప్రమాణమును, పంచమచితి 21½ పురుషప్రమాణమును గలిగియుండును.

క్షేత్రగణితజ్ఞానము లేనిచో శిల్పు లిట్టి యజ్ఞవేదికలు నిర్మింపఁజాలరు.

---

* యావాన్ పురుషం ఊర్ధ్వబాహుస్తావాన్భవత్యేతావద్ వై
పురుషే వీర్యం వీర్యేణై వేనం విమీతే ॥ —కృ.యా. 5-2-5

Cf :- Romesh C Dutt : Early Hindu Civilisation.

"The area of the earliest Chaturasra Syena was to be 7½ square the side of each square being equal to Purusha i.e. the height of a man with up-lifted arms. When any other shape of altar was required the size or area did not change so that a wheel or equilateral triangle or a tortoise had to be constructed - all of the area of 7½ Purushas. Then agian at the second construction of the altar one square Purusha had to be added to the area, and at the third construction two square Pursshas had to be added without changing the shade of the relative proportions of the figure. All this could not be done without a considerable knowledge of Geometry.

## ఇష్టకోపధానము

ఇష్టకోపధాన మనఁగా యజ్ఞవేదీనిర్మాణమునందు మంత్ర పూర్వకముగా నిష్టకలను బేర్చుట.

ఇష్టకలు బహునామాంకితములు. అవి వివిధదేవతలకు ఋషులకు, భావములకు ప్రతీకలు.

ఇష్టకలలోఁ గొన్నింటికి శిల్పర్షు లధిపతులు.

### ప్రథమచితి :: ప్రాణభృత్ - అపానభృత్ సంజ్ఞకేష్టకలు

పంచచితాత్మకమగు యజ్ఞవేదికకు మూలాధారమైన ప్రథమచితియందు అపస్యా - ప్రాణభృత్ - అపానభృత్ - సంజ్ఞకములగు ఇష్టకలను బేర్తురు.

వేదీమధ్యమందుఁ బ్రతిష్ఠింపఁబడిన హిరణ్మయపురుషునకు తూర్పునుండి ప్రారంభించి దిక్కున కైదేసి చొప్పున నిరువది యిటికలను ప్రాచీదక్షిణపశ్చిమోత్తరదిశలయం దుంతురు.

"అపామపస్యా దిక్ష్వేతా ఉపధేయాస్తు వింశతిః"

ప్రాణభృత్ సంజ్ఞకమగు నిష్టకోపధానమునందు, "అయం పురో భువ" అనుమంత్రములతో దిక్కునకు పది చొప్పున ఏఁబది ఇటికలను ప్రతిష్ఠింపవలెను.

"అయంపురోభువ ఇతి పంచాశతం ప్రాణభృతో దశదశ
ప్రతిదిశ మక్ష్ణయా దశమధ్యేఽంతరా ముపదధాయ" - ఇతికల్పః

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాచీదిశయందుంచఁబడు | | భువ | ప్రజాపతిరూపమగు నిష్టకకు ఋషి | వశిష్ఠుఁడు |
| దక్షిణ | ,, | విశ్వకర్మ* | ,, | భరద్వాజుఁడు |
| పశ్చిమ | ,, | విశ్వవ్యచ | ,, | విశ్వామిత్రుఁడు |
| ఉత్తర | ,, | సువ | ,, | జమదగ్ని |
| ఉపరి [మధ్య] | ,, | మతి | ,, | విశ్వకర్మ |

ఇచ్చట విశ్వకర్మ ప్రజాపతిగను ఋషివర్యుఁడుగను గన్పించుచున్నాఁడు.

---

* చూడు :- కృ.య. 4-3-1. సాయణభాష్యము పు. 1975

"విశ్వాని కర్మాణి జగద్ వ్యాపారరూపాణి యస్య సో విశ్వకర్మా
ప్రజాపతిః దక్షిణా దక్షిణస్యాందిశి యోఽయం విశ్వకర్మా
హే ఇష్టకే తద్రూపా త్వమసి" —సాయణ

"యాః ప్రాచీస్తాభి ర్వశిష్ఠ ఆర్ధ్నోద్యా దక్షిణాస్తాభిర్భరద్వాజో
యాః ప్రతీచీస్తాభి ర్విశ్వామిత్రో యా ఉదీచీస్తాభిర్జమదగ్ని
ర్యా ఊర్ధ్వా స్తాభిర్విశ్వకర్మా ॥" —కృ య. 5-2-10

అపానభృత్సంజ్ఞకమగు నిష్టకోపధానమునందును ప్రాణభృత్ సంజ్ఞకమునందు వలె దిక్షునకు పదేసియిటికల చొప్పున నేబది యిష్టకల నమర్పవలెను.

"బాహ్యం బాహ్యం ప్రాచీదిశామితి పంచశత మపానభృత్
యథా ప్రాణభృతః ॥" — ఇతికల్పః ॥*

ఇచట పూర్వదక్షిణ పశ్చిమోత్తరోర్ధ్వ [మధ్య] దేశములం దుంచఁబడు ఇష్టకలకు వరుసగా సానగ సనాత నాహభూన ప్రత్న సుపర్ణ నామక శిల్పర్షు లధిపతులు. 1

| | | |
|---|---|---|
| 'ప్రాచీదిశాం' | అనుమంత్రముతోనుంచు ఇష్టక | సానగఋషిస్వరూప |
| 'దక్షిణదిశాం' | ,, | సనాతనఋషి స్వరూప |
| 'ప్రతీచీదిశాం' | ,, | అహభూనఋషి స్వరూప |
| 'ఉదీచీదిశాం' | ,, | ప్రత్నఋషి స్వరూప |
| 'ఊర్ధ్వాదిశాం' | ,, | సువర్ణఋషి సర్వూప |

ఈ పంచర్షులు విశ్వకర్మ తనయు లని శిల్పప్రవర్తకు లని తెలియుచున్నది.

## ద్వితీయచితి : : ఆశ్విన్యేష్టకలు

ఆశ్విన్యాఖ్యేష్టకలలో నైదవదానికి విశ్వకర్మ ఋషి.

విశ్వకర్మా తే ఋషి రశ్వినాఽధ్వర్యూ
సాదయతా మిహ త్వా ॥ —కృ యు. 4-3-4

[ ఓ యిష్టకా నీవు సర్వాత్మికవు......... విశ్వకర్మ నీకు ఋషి. దేవతల కధ్వర్యులైన అశ్వినులు నిన్నిచట స్థాపింతురు గాక. ]

* చూడు :- కృ య. 4-3-3 సాయణభాష్యము, పు 1979

1. ఆదే
"హే ఇష్టకే దిశాంమధ్యే యా ప్రాచీ సా త్వమపి
ఋషీణాం మధ్యే సానగాఖ్య ఋషి స్తద్రూపా త్వమపి ॥" —సాయణ
అట్లే తక్కినవియు.

** చూడు .- కృ.య. 4-3-4 సాయణభాష్యము. పు. 1985
"హే ఇష్టకే త్వం సర్వాత్మికాసి...... విశ్వకర్మా ప్రజాపతిరేవ తే తవ ఋషిర్ ద్రష్టా అశ్వినే త్వా సాదయతాం స్థాపయతామ్ ॥" —సాయణ

"Visvakarman is thy seer, may tha two Aswins, the leeches, set thee here." — A. B. Keith.
"Visvakarman is thy Rishi" — V. S. 14-5 — Griffith.

## తృతీయచితి :: స్వయమాతృణ్ణేష్టకలు.

"విశ్వకర్మా త్వా సాదయ త్వంతరిక్షస్య పృష్ఠే" —కృయ. 4-3-6

[విశ్వకర్మ నిన్ను అంతరిక్షమునందు నిలుపుగాక] అను మంత్రముతో స్వయమాతృణ్ణేష్టకలను అగ్నివేదికా మధ్యమందుంతురు. [1]

## చతుర్థస్థితి :: అక్ష్ణవాస్తోమీయేష్టకలు.

ఈ యిష్టకలలో కొన్ని వసురుద్రాదిత్యులతోను ఋభువులతోను భాగస్వామ్యము గలిగియున్నవి.

ఋభూణాం భాగోఽసి ॥ —కృ.య. 4.3-9*

[ఓ ఇష్టకా నీవు ఋభుదేవతలయొక్క భాగస్వామివి] అను మంత్రముతో కొన్ని యిటికలు పశ్చిమదిక్కున స్థాపింపఁబడును.

ఋభువులు శిల్పాభిమానిదేవతలు.

## పంచమచితి :: పంచచోడేష్టకలు.

చోడాఖ్యేష్టకాపంచకమునందు దక్షిణదిశ యందుంచఁబడు నిష్ట విశ్వకర్మ స్వరూప.

అయం దక్షిణా విశ్వకర్మా ॥ —కృ.య. 4-4-3**

ఈ విధముగా పంచచితాత్మకమగు చయనము నందు స్థాపింపఁబడ నిష్టకలు సర్వశిల్పాధిపతియైన విశ్వకర్మకు, శిల్పర్షులకు శిల్పాభిమానిదేవతల ప్రతీకలుగా నిలిచి తత్ప్రాశస్త్యమును వేనోళ్లఁ జాటుచున్నవి.

---

1. చూడు :- కృ.య. 4-3-6 సాయణభాష్యము.

"విశ్వాని కర్మాణి యస్యాసౌ విశ్వకర్మా ప్రజాపతిః ।
హే స్వయమాతృణ్ణే ప్రజాపతిస్త్వా మంతరిక్ష పృష్ఠ ఉపరి సాదయతు"

"Let Visvakarman place thee in the ridge of atmosphere
—A.B. Kei

* "ఋభుశబ్దో దేవసామాన్యవాచీ ।" —సాయ

"ఋభూణాం భాగోఽసీతి పశ్చాత్ ప్రతిష్ఠిత్యై" —కృ.య. 5-

** "విశ్వాని కర్మాణ్యగ్నిహోత్రాదీని యస్యాగ్నేః సోఽయం విశ్వకర్మా దక్షిణస్యాందిశి స్థితః ॥"

"హే ఇష్టకే విశ్వకర్మ స్వరూపాఽసీత్" —సాయ

## హిరణ్యపురుషోపధానము

తథా హిరణ్మయశ్చాపి పురుషం కార్య ఏవ హి ॥

—నాగరఖండ 106-18

చయనములను నిర్మించి నట్లె హిరణ్మయపురుషుని గూడ నిర్మింపు మని బ్రహ్మ విశ్వకర్మకుఁ జెప్పెను.

హిరణ్యపురుషుఁ డనఁగా హిరణ్యవికృతమయిన పురుషాకార ప్రతిమ.

హిరణ్యమమృతము, శాశ్వతమైనది. కావున యజ్ఞకర్త అగ్నికుండమునం దడుగున పుష్కరపర్ణముపై "బ్రహ్మ జ జ్ఞా న" అను మంత్రముతో రుక్మఫలకము నుంచును.

బ్రహ్మ జజ్ఞాన మితి రుక్మ ముపదధాతి.... రుక్మముపదధా
త్యమృతం వై హిరణ్య మమృత ఏవాగ్నిం చినుతే ప్రజాత్యై ॥*

ఆరుక్మఫలకముపై "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే" అను మంత్రముతో ప్రాఙ్ముఖముగా వెలకిలఁబడినట్లున్న పురుషాకృతి గల హిరణ్యప్రతిమ నుంచవలెను.

"హిరణ్యగర్భః సమవర్తతాగ్ర ఇతి తస్మిన్ హిరణ్మయం పురుషం
ప్రాచీనముత్తానం దక్షిణేనాఽత్యృణ్ణాం ప్రాఙ్ముఖే ఉపధాయ" - ఇతికల్పః ॥ **

ప్రజాపతికి, అగ్నికి, యజమానునకు ప్రతీకయైన హిరణ్యపురుషు నట్లుంచుట వలన యజమానస్థానమునకు ధృతి కలుగును. [1]

"హిరణ్యపురుష ముపదధాతి యజమానలోకస్య విధృత్యై"[2]

సమస్త ప్రతిష్ఠాకార్యములయందు ముందుగా హిరణ్యశకలముల నుం సంప్రదాయ మనాదిగానున్నదనియు నీ హిరణ్యపురుషుఁడే హిరణ్యప్రతి శిల్పమునకు మూల మనియుఁ దెలియుచున్నది.

---

* కృ.య. 5-2-7 — A. B. Keith : T. S. 5-2-7.
"He puts down s gold disk; gold is immortality; verily in immortality he piles the fire, for propagation.

** చూడు :- కృ య. 4-2-8. సాయణభాష్యము. పు. 1933.

1. Cf :- Ralph T. H. Griffith : The White Yajurveda, 13.4. Note "On the piece of gold, he lays a golden figure of a man, on his back with his face eastward, a symbol of Prajapati; Agni, and the Sacrificer"

2. కృ. య. 5-2-7. " He puts down a golden man, to support the world of the Sacrificer." — A. B. Keith.

# స్వాయంభువ విశ్వకర్మ యజ్ఞము

అనవరతఫలాలంకృతంబైన యొక్క వనంబుఁగని...... యిందు తొల్లి స్వాయంభువుండైన విశ్వకర్మ యజ్ఞంబు సేసి,

దక్షుఁడయి యజ్ఞదక్షిణ దక్షిణభూభాగమెల్లఁదానిచ్చె నశే

షక్షితిధరవనములతో నక్షయగతిఁ గశ్యపునకు నార్త్విజ్యమునన్.

దాని కలిగి భూదేవి కశ్యపునకుం బట్టీక రసాతలంబునకుఁ బోయిన దని రోమశుఁడు ధర్మరాజునకుఁ జెప్పినాఁడు. —నన్నయ. భార. ఆరణ్య. 3. 120-2

మూలమునం దిట్లున్నది.

ఏతద్ స్వయంభువో రాజన్ వనం దివ్యం ప్రకాశతే।
యత్రాయజత రాజేంద్ర విశ్వకర్మా ప్రతాపవాన్॥
యస్మిన్ యజ్ఞే హి భూర్దత్తా కశ్యపాయ మహాత్మనే।
సపర్వతవనోద్దేశా దక్షిణార్థే స్వయంభువా॥
అవాసీదచ్చ కౌంతేయ దత్తమాత్రా మహీ తదా।
ఉవాచ చాపి కుపితా లోకేశ్వర మిదం ప్రభుమ్॥
న మాం మర్త్యాయ భగవన్ కస్మైచిద్దాతు మర్హసి।
ప్రదానంమోఘమేతత్తే యాస్యామ్యేషా రసాతలమ్॥

—వ్యా. భా. వన. 114-17-

ఓ విశ్వకర్మా భౌవనా నీవు నన్నొక మర్త్యునకు దాన మొసఁగఁ దగ పలికి భూదేవి సలిలమధ్యమునకుఁ జని నట్లు శ్రుతు లందుఁ జెప్పఁబ ైయైతిహ్యము నిచట గ్రహింపవలయు నని నీలకంఠుఁడు వివరించినాడు.[1]

ఈ వివరణము వలన నీ యజ్ఞకర్త భౌవనవిశ్వకర్మ య తెలియుచున్నది.

శ్రుతు లేమనుచున్నవో చూతము.

1. చూడు:- వ్యా.భా. వన. 114 17-18. చిత్రశాలా ప్రతి. పు. 182

"భూమిర్హ్వా జగా విత్యునాహరంతి। న మా మర్త్యః కశ్చన దాతు ము విశ్వకర్మన్ భౌవన మాం దిదాసిథ। నిమంక్ష్యేహం సలిలస్య మ మోఘ స్త ఏవ కశ్యపాయాససంగరః॥" - ఇతి శ్రుతే ర సంగృహ్ణాతి॥ యత్రాయజత రాజేంద్రేత్యాదినా॥ —నీలక

## అశ్వమేధయాగము

ఏతేన హ వా ఐంద్రేణ మహాభిషేకేణ కశ్యపో విశ్వకర్మాణం
భౌవన మభిషిషేచ తస్మాదు విశ్వకర్మా భౌవనః సమస్తం సర్వతః
పృథివీం జయన్ పరి యాశ్వే రుచ మేధ్యై రీజే ॥

—ఐతరేయబ్రాహ్మణము. 8-21-4*

కశ్యపమహర్షి భువనపుత్రుఁడైన భౌవనవిశ్వకర్మకు ఐంద్రమహాభిషేకము చేసినాఁడనియు, భౌవనవిశ్వకర్మ పృథివి నంతటిని జయించి యశ్వమేధయాగము చేసినాఁడనియు ఐతరేయబ్రాహ్మణము తెలుపుచున్నది.

యజ్ఞము చేసి కశ్యపునకు భూదానముచేసిన విశ్వకర్మయొక్కడే యనియు నాతఁడు భౌవనవిశ్వకర్మయే యనియు చరిత్రకారు లంగీకరించినారు. 1

భౌవన విశ్వకర్మ సర్వమేధయాగము చేసినాఁడని శతపథబ్రాహ్మణము నందు వర్ణింపఁబడినది. [శతపథ. 13-2-7-13]

సర్వమేధయాగ విశేషములు మఱియొక ప్రకరణమునందు వివరింపఁబడినవి.

---

* కశ్యపః కశ్యపోనామ ఋషిః భౌవనః భువనస్యాపత్యం భౌవనః
తం విశ్వకర్మాణం అభిషిషేచ హ అభిషేచనం కృతవాన్ ॥ —సాయణ

Cf :- Narayana Chandra Bandhyopadhyaya : HINDU POLITY and POLITICAL THFRIES — Part I pp. 167-

" Accorbing to the Aitareya Brahmana, the following Kings atte ned Supreme headship by the performance of Rajasuya a AIndra Mahabhisheka.

| King | Consecrating priest. |
|---|---|
| **VISVAKARMA of the race of BHUVANA** | **KASYAPA** |

1. Cf :- The Cambridge History of Indra —Vol I Ancient India -ed by E. J. Rapson. p. 118

"The only case of which we hear is one reported in the Satapat and Aitareya Brahmanas in which Visvakarman Bhauvana ga land to the priests who sacrificed for him but the Earth itself buked his action."

2. Cf :- A. L. Basham : THE WONDER THAT WAS INDIA. p. 110.

## వేదీరూపభూదేవి

విశ్వకర్మ చేసిన భూదానమునకు కుపితయైన భూదేవి రసాతలమునకుఁ జనఁగా, "తత్ప్రసాదార్థియై కశ్యపుం డుగ్రతపంబు సేసినం బ్రసన్నయై భూమిదేవి నీరిలోనుండి వెలువడి వేదీరూపంబునం గశ్యపునకుఁ బొడసూపె నవ్వేది యిది సుమ్ము దీనినెక్కినవారు వీర్యవంతు లగుదు రీమంత్రంబున దీని నెక్కుండు పెఱనాఁ డిది తావీక సముద్రంబు సొచ్చు నని యగ్నిర్మిత్రో యోని యనునవి యాదిగాఁగల మంత్రంబులను" రోమశుఁడు ధర్మరాజున కుపదేశించినాఁడు.

ఓం నమో విశ్వగుప్తాయ నమో విశ్వపరాయ తే
సాన్నిధ్యం కురు దేవేశ సాగరే లవణాంభసే ॥

— వ్యా.భా, వన. 114-26*

ఇది సముద్రప్రార్థనామంత్రము.

విశ్వగుప్తుఁ డన విశ్వమును తనలో లీనము చేసికొన్న వాఁడనియు విష్ణువనియు టీకాకారుఁడు వివరించినాడు.

ఈ విశ్వమును సృష్టించి ప్రళయకాలమునందు తనయందు లీనము చేసికొన్నవాఁడు విశ్వకర్మ యని ఋగ్వేదము చెప్పుచున్నది.

య ఇమా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్ పితా నః ॥

— ఋగ్వేద 10.81.1

ఈ విశ్వకర్మయే మహాభారతము నందు విష్ణువుగా ప్రశంసింపఁ బడినాఁడు.

ఇట యజ్ఞముచేసినవాఁడు స్వాయంభువ విశ్వకర్మ కనుక పై మంత్రము నందుఁ బ్రశంసింపఁబడిన విశ్వగుప్తుఁడు, విశ్వపరుఁడు విశ్వకర్మయే యని చెప్పవచ్చును.

---

* స్నానార్ఘ్యార్థం సముద్రప్రార్థనామంత్ర మాహ ఓం నమ ఇతి ।
'విశ్వం గుప్తం లీనమస్మిన్ ప్రలయే' ఇతి విశ్వగుప్తః ।
విశ్వస్మాత్ పరాయ శ్రేష్ఠాయ విష్ణవే ఇత్యర్థః ॥

— నీలకంఠ వ్యా.భా. చిత్రశాలాప్రతి. పు. 182

# పరశురాముని యజ్ఞవేది

కశ్యపమహర్షికి యజ్ఞదక్షిణగా భూభాగము నొసఁగిన యజ్ఞకర్తలలో భార్గవరాముఁ డొకఁడు.

విహితవివిధాధ్వరుండై కశ్యపునకు నార్త్విజ్య దక్షిణగా సకల భూవలయంబుల నిచ్చి నిస్సంగుండై మహేంద్రపర్వతంబునం దపోనిష్ఠుండై యున్నవాఁ డని పరశురాముని చరితంబు రోమశుఁడు ధర్మరాజునకుఁ జెప్పినట్లు నన్నయ వర్ణించినాడు. — అరణ్య. 3-155

జామదగ్న్యుఁడు మహాయజ్ఞము చేసి భూమినే కాక నలువదిహస్తముల పొడవు-వెడల్పులు ముప్పదియాఱు హస్తముల ఎత్తును గల సువర్ణమయవేదిని గూడ కశ్యపునకు దక్షిణగా నొసఁగినట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

తతో యజ్ఞేన మహతా జామదగ్న్యః ప్రతాపవాన్ ।
తర్పయామాస దేవేంద్ర మృత్విగ్భ్యః ప్రదదౌ మహీమ్ ॥
వేదీం చాప్యదదద్ధైమీం కశ్యపాయ మహాత్మనే ।
దశవ్యామాయతాం కృత్వా నవోత్సేధాం విశాంపతే *
—వ్యా భా. వన. 17. 11, 12

ఈ యజ్ఞవేదిక శాస్త్రప్రకారము సువర్ణముతో నిర్మింపఁబడిన దనియు దాని యెత్తు 32 హస్తము లనియు భార్గవరాముఁడు హయమేధమహాయజ్ఞః చేసి యజ్ఞవేదికను శిష్టజనాకీర్ణమయిన భూమిని కశ్యపునకు దానము చేసిన డనియు ద్రోణపర్వమునందు వర్ణింపఁబడినది.

ఈజే క్రతు శతైః పుణ్యైః సమాప్తవరదక్షిణైః ।
వేదీ మష్టనలోత్సేధాం సౌవర్ణాం విధినిర్మితామ్ ॥....
నిర్దస్యుం పృథివీం కృత్వా శిష్టేష్టజనసంకులాం ।
కశ్యపాయ దదౌ రామో హయమేధే మహామఖే ॥
—వ్యా. భా. ద్రోణ. 70. 16-19

దీనినిఁబట్టి యుత్సేధమునందు కించిద్భేదమున్నను యజ్ఞవేదికలు చతురస్రాకృతులనియు, యజ్ఞకర్తలు తాము జయించిన భూభాగములను ఋత్విక్కులకు దానముచేయుచుండి రనియుఁ దెలియుచున్నది.

---

* దశవ్యామాయతాం । వ్యామో హస్తచతుష్టయం చతుర్వింశ ద్ధస్తాయామ విస్తారామ్ । నవోత్సేధాం షట్త్రింశద్ధస్తోచ్ఛ్రియాం చేత్యర్థం ॥ —నీలకంఠ.

# కణ్వాశ్రమము

దుష్యంతుఁడు కతిపయామాత్యపరిజనపురోహితుండై యొక్క రమణీయవనంబు నందుఁ గ్రుమ్మరుచు.

చని చని ముందట నాజ్యహవిర్ధ్రుతసౌరభధూమలతాతతులం
బెనఁగిన మ్రాఁకుల కొమ్మలమీఁద నపేతలతాంతములైనను బా
యని మధుపప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత నెఱింగెఁ దపో
వన మిది యల్లదె దివ్యమునీంద్రునివాసము దా నగు నంచు నెదన్॥

—నన్నయ. ఆది. 4-21

దుష్యంతుఁడు 'ఆజ్యహవిర్ధ్రుతసౌరభధూమలతాతతులంజూచె' నని వర్ణించుటచే నచట ననేకయజ్ఞశాలలు - అగ్నిహోత్రగృహములు - నున్నట్లు తెలియుచున్నది.

మూలమునందు స్పష్టముగనె యున్నది.

ఆశ్రమప్రవరం రమ్యం దదర్శ సుమనోహరమ్ ।
నానావృక్షసమాకీర్ణం సంప్రజ్వలితపావకమ్....
అగ్న్యగారైశ్చ బహుభిః పుష్పసంస్తరసంవృతమ్ ॥ *

—వ్యా.భా. ఆది. 70. 18-20

అచట మాలిని యను పుణ్యనది ప్రవహించుచున్నది.

ఆ నదితీరమున కశ్యపగోత్రుఁడైన కణ్వమహాముని యాశ్రమమున్నది.

తస్యాస్తీరే భగవతః కాశ్యపస్య మహాత్మనః ।
ఆశ్రమప్రవరం రమ్యం మహర్షిగణసేవితమ్॥-వ్యా.భా, ఆది. 70-27**

కణ్వమహాముని యాశ్రమము, "అనవరతపదక్రమ పఠ్యమానమహాద్విజ వేదధ్వనులను నవిచ్ఛిన్నహూయమానాగ్నిహోత్రస్వాహాశబ్దంబులను...... యజ్ఞప్రయోగప్రవీణులయిన యాజ్ఞికులకును విహితానుష్ఠానాసక్తులైన యనుష్ఠాతలకును నధికతపోనిరతులయిన మహాతపోధనులకును నివాసస్థానమై యున్నది. —నన్నయ : భార. ఆది 4-23

---

* "అనేకానేక అగ్నిహోత్రిగృహ ఉస్ ఆశ్రిమకీ శోభా బఢా రహే థే"

—మహాభారత - గీతాప్రెస్ ప్రతి.

"And it was adorned with many chambers containing the sacrificial fires." — P. C. Roy M bh-Eng.Tr

** కాశ్యపస్య కశ్యప గోత్రస్య కణ్వస్య ॥ 27 ॥ —నీలకంఠ.

ఇష్టిపశుబంధనసోమాది యజ్ఞములందు ప్రధానములైన ఋక్కులు
౦ ఋగ్వేదులు, యజ్ఞవిధానమున కంగభూతములైన కల్పసూత్రాదులు
౧ యజుర్వేదులు, సామగానముచేయు సామవేదులు, అథర్వశీర్ష
౹ము లెఱిఁగిన యథర్వవేదులును నా యాశ్రమమునం దున్నట్లు
మునందు స్పష్టముగా వర్ణింపఁబడియున్నది.

ఋచో బహ్వృచముఖ్యైశ్చ ప్రేర్యమాణాః పదక్రమైః ।
శుశ్రావ మనుజవ్యాఘ్రో వితతేష్విహ కర్మసు ॥ 37

యజ్ఞవిద్యాంగవిద్భిశ్చ యజుర్విద్భిశ్చశోభితమ్ ।
మధురైః సామగీతైశ్చ ఋషిభి ర్నియతవ్రతైః ॥ 38

భారుండసామగీతాభి రథర్వశిరసోద్గతైః ।
యతాత్మభిః సునియతైః శుశుభే స తదాశ్రమః ॥ 39

అథర్వవేదప్రవరాః పూగయజ్ఞియ సామగాః
సంహితామీరయన్తి స్మ పదక్రమయుతాం తు తే ॥ 40

—వ్యా.భా ఆది. 70, 30-40*

ఆ కణ్వాశ్రమమునందు ఇష్టకోపధానవిధానము నెఱిఁగి యజ్ఞవేదీ
ణకళయందు కుశలులయిన శిల్పిబ్రాహ్మణులును గలరు.

యజ్ఞసంస్తరవిద్భిశ్చ[1] క్రమశిక్షావిశారదైః ॥ —70-42

ఈ వర్ణనము వలన మహాభారతకాలమున వైదికయజ్ఞకర్మపరాయణులు,
వేదీనిర్మాణకుశలులు వేదవేదాంగవేత్తలు, బహుశాస్త్రజ్ఞులు [నానాశాస్త్రైషు
ళ్చ] నదీతీరము లందాశ్రమములు నిర్మించికొని వైదికధర్మపరిరక్షణము
౦చుండిరనియు, వారిలో కశ్యపగోత్రులు ప్రముఖులనియుఁదెలియుచున్నది.

---

౦డు :- వ్యా.భా. ఆది. 70, 37-40 చిత్రశాలాప్రతి

వితతేషు వైతానికేషు ఇష్టిపశుసోమాదిషు ప్రవర్తమానేషు ॥ 37 ॥
యజ్ఞవిద్యయా మంగభూతాని కల్పసూత్రాదీని ॥ 38 ॥
భారుండ సామాని పూగయజ్ఞియ సామాని చ సామ్నాం అవాంతరభేదాః ॥ 39 ॥

యజ్ఞసంస్తరః ఇష్టకాద్యుపధానక్రమః ॥ 42 ॥ —నీలకంఠ.
యజ్ఞవేదీకీ రచనా కే జ్ఞాతా ॥" - పండిత రామనారాయణదత్తశాస్త్రీ
— మహాభారత - హిందీటీక

"And there were many Brahmins skilled in the art of making sacrificial platforms and in the rules of Krama Sacrifice"
— P. C. Roy. M bh - Sec LXXI.

# పుత్రకామేష్టి

అగ్ని స్సప్తిం వాజంభరం దదా త్యగ్నిర్ వీరం శ్రుత్యం కర్మనిష్ఠాం।
అగ్ని రోదసీ విచరత్ సమంజ న్నగ్నిర్నారీ వీరకుక్షిం పురంధిమ్ ॥
— ఋగ్వేద. 10-80-1

[అగ్ని జయశీలమైన హయము నొసఁగును. అగ్ని కర్మనిష్ఠులై యశోవంతులగు వీరపుత్రుల నొసఁగును. అగ్ని పృథివ్యాకాశములందు వివిధరూపములతోఁ జరించుచుండును. అగ్ని స్త్రీలకు గర్భధారణ మొనరించి వీరసంతాన మొసఁగును]

సంతానార్థ మగ్నిని పూజించుట యార్యసంప్రదాయ మనియు, నగ్నిని పూజించి యార్యస్త్రీలు వీరసంతానమును గాంచుచుండిరనియు, వివరించుచు శివనాథ ఆహితాగ్ని శ్రీరామజన్మోదంతము నుదాహరించినాఁడు.[1]

అథర్వవేదమునందు సంతానదాయకములగు మంత్రతంత్రము లున్నవి.

అథర్వవేదోక్త సిద్ధమంత్రముల చేతను దద్విధానముచేతను నీకు పుత్రసంతానముకొఱకు పుత్రకామేష్టి నొనరింతు నని ఋష్యశృంగమహర్షి దశరథునికిఁ జెప్పినట్లు వాల్మీకిరామాయణమునందుఁ వర్ణింపఁబడినది.

ఇష్టిం తే కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్ ।
అథర్వశిరసిప్రోక్తై ర్మంత్రైః సిద్ధాం విధానతః ॥
—వా.రా. బాల. 15-2

కావున పుత్రకామేష్టి యథర్వోక్తవిధానమునఁ జేయఁబడుచుండెడి దని తెలియుచున్నది.

"కశ్యపప్రజాపతి తొల్లి పెద్దకాలంబు తపంబు చేసి పుత్రకామేష్టిఁ జేసి" కద్రూవినతలకు సంతానము ప్రసాదించినాఁడు.[2]

---

1. Cf :- Sivanath Ahitagni : Rugveda Sara Samhita. — P 12'
"The mantra mentions some of the fruits of Agni's worship which are endorsed by the ancient history of India. Rama the hero son, famed and firm in duty was born as the result of PUTRESTI YAJNA by Dasaratha. The women folk of the Aryan worshippers of Agni may be said to have literally teemed with hero sons."

2. నన్నయ - భార. ఆది. 2-4 [వ్యా.భా. ఆది. 3-15]
యజతః పుత్రకామస్య కశ్యపస్య ప్రజాపతేః ॥

# ద్రుపదుని పుత్రికామేష్టి

ద్రుపదుఁడు రణరంగంబున ద్రోణు వధియించునట్టికొడుకు, నర్జునునకు దేవి యగునట్టి కూఁతునుం బడయుదు నని బ్రహ్మవిదులయిన బ్రాహ్మణుల నివాసంబులకుంజని నిత్యంబును బ్రాహ్మణోపాస్తి సేయుచు నొక్కనాఁడు గంగాకూలంబునందు వానప్రస్థవృత్తి నున్న యాజోపయాజు లనువారి నిద్దఱ ననవరతవ్రతవ్యాసక్తులం గాశ్యపగోత్రులం గని వారికి నమస్కరించి యందుఁ గొండొకయయ్యును దపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దయైన వాని నుపయాజు నుపాసించి యిట్లనియె.

మునినాథ నాకు సత్సుతజననం బగునట్టి క్రతువు సద్విధిఁ గావిం
చినఁ గృతకృత్యుఁడ నగుదుం గొనుమిచ్చెద నీకు లక్ష గోధేనువులన్
....నన్నయ. భార. ఆది. 7-8-9

ఉపయాజుం డందుల కంగీకరింపక ఫలార్థి యగు మాయన్న నీ కభిమతంబు సేయుఁ బొమ్మనిన ద్రుపదుం డరిగి సంహితాధ్యయనాగ్నిహోత్రాదులయిన పంచమహాయజ్ఞంబులు సేయుచు శిలోంఛవృత్తి భైక్ష సంధారిత కుటుంబభారుండై ఘోరతపోవృత్తి నున్న యాజునకు నమస్కరించి, తన కోరికను దెలిపి ప్రార్థింపఁగా నా మునివరుఁడు యాజకత్వమున కొడంబడినాఁడు.

యజ్ఞోపకరణద్రవ్యంబులు సమకట్టికొని యథావిధి నుపయాజుండు సహాయుండుగా సౌత్రామణి యయిన కోకిలాదేవి పత్నిగా ద్రుపదుం పుత్రికామేష్టి సేయించిన నందు మంత్రాహుతులం దృప్తుండం యగ్నిదేవు వలన.

'జ్వాలాభీలాంగుఁడు కరవాలబృహచ్చాపధరుఁడు వరవర్మకిరీ
టాలంకారుఁడు వహ్నియ పోలె రథారూఢుఁ డొక్క పుత్త్రుఁడు పు

కులపవిత్ర సితేతరోత్పలకోమలామలవర్ణ యు
త్పలసుగంధి లసన్మహోత్పలపత్రనేత్ర మదాలికుం
తలవిభాసిని దివ్యతేజముఁ దాల్చి యొక్క కుమారి త
జ్జ్వలనకుండము నందుఁ బుట్టెఁ బ్రసన్నమూర్తి ముదంబుతోన్.
—నన్నయ. భార. ఆది. 7. 17-20

పుత్రకామేష్టి చేయుటకుఁగావలసిన యజ్ఞోపకరణములు, అగ్నికుండములు నిర్మించువారు శిల్పులే.

ద్రుపదుని కొఱకు పుత్రకామేష్టి యొనరించిన యాజుఁడు హవనాంతమున హవిర్గ్రహణార్థము శీఘ్రముగా రమ్మని ద్రుపదుపత్ని నాహ్వానింపఁగా నామె పుత్రదాయకమగు హవిస్సును గ్రహించుటకు తాను శుచిస్నాతయైవచ్చువఱకుఁ గొంతతడ వాగు మని యాజుని కోరినట్లును, యాజుఁ డంతట 'నీవు వచ్చి హవిస్సును గ్రహించినను, రాక యచటనే నిలిచియున్నను, యాజునిచె పచనముచేయఁబడి యుపయాజునిచే నభిమంత్రింపఁబడిన యీ హవిస్సు యజమానుని కోరికను తప్పక తీర్చు' నని పలికి సుసంస్కృతమయిన యా హవిస్సు నగ్నికాహుతి యొసఁగఁగా నగ్నికుండము నుండి యొక్క కుమారుఁడు, నొక్క కుమారియు దుద్భవించినట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

ఆచఖ్యే కర్మ వైతానం తదా పుత్రఫలాయ వై ।
స చ పుత్రో మహావీర్యో మహాతేజో మహాబలః ।
ఇష్యతే యద్విధో రాజన్ భవితా తే తథా విధి ॥ 33
యాజస్తు హవనస్యాంతే దేవీ మాజ్ఞాపయత్తదా ।
ప్రేహి మాం రాజ్ఞి పృషతి మిథునం త్వాముపస్థితమ్ ॥ 36
అవిలిప్తం ముఖం బ్రహ్మన్ దివ్యాన్ గంధాన్ బిభర్మిచ ।
సుతార్థే నోపలబ్ధాస్మి తిష్ఠ యాజ మమ ప్రియే ॥ 37
యాజేన శ్రపితం హవ్యముపయాజేనాభిమంత్రితమ్ ।
కథం కామం న సందధ్యాత్ సా త్వం విప్రేహి తిష్ఠ వా ॥ 88
ఏవముక్తాతు యాజేన హుతే హవిషి సంస్కృతే ।
ఉత్తస్థౌ పావకాత్ తస్మాత్ కుమారో దేవసన్నిభః ॥ 39
కుమారీ చాపి పాంచాలీ వేదీమధ్యాత్ సముత్థితా ॥ 44*

ఆ కుమారునిపేరు ధృష్టద్యుమ్నుఁడు. ఆ కుమారియే కృష్ణ. ద్రౌపది.

---

చూడు :- వ్యా.భా. ఆది. 167. 33-44. చిత్రశాలాప్రతి.

వైతానం శ్రౌతాగ్ని సాధ్యం । ఆచఖ్యే ఆఖ్యాతవాన్ ॥ 36 ॥ — నీలకంఠ

శ్రపితమ్ పక్వమ్ । క్షేత్రరేతః సేకం వినా ఆవయోః సామర్థ్యాన్ మిథున ముత్పత్స్యత ఇత్యర్థః । విప్రేహి దూరంవాగచ్ఛ తిష్ఠం వా । ప్రయోగవిధిస్తు న విలంబం సహతే ఇత్యర్థః ॥ 38 ॥ — నీలకంఠ

వైతానికం జుహూయా దగ్నిహోత్రం యథావిధి ॥ - కాశీఖండ - 40. 5

[ వైతానికం గార్హపత్యకుండస్థానా మగ్నినా మాహవనీయ దక్షిణాగ్ని కుండయో ర్వహారో వితానం తద్భవం వైతానికమ్ - శ్రీరామానందవ్యాఖ్య ]

## మంత్రప్రభావము

కుంతీదేవికి మంత్రప్రభావముపలన సంతానము కలిగినట్లు భారతమునందు వర్ణింపఁబడినది.

"ఈ మంత్రంబున నీవెయ్యేని నొక్కవేల్పు నారాధించి తవ్వేల్పు నీకోరినయట్టిపుత్రకుల నిచ్చు"నని దుర్వాసుఁడనుసిద్ధముని కుంతీదేవి కాపద్ధర్మంబుగా నొక్క దివ్యమంత్రంబు ప్రసాదించినాడు. - నన్నయ. ఆది. 5-1c

అది దేవతావశీకరణమంత్ర మనియు అథర్వశిరోపనిషత్తు నందు8 జెప్పఁబడినదనియు వ్యాసభారతము వలనఁ దెలియుచున్నది.

తస్యై స ప్రదదౌ మంత్ర మాపధర్మాన్వవేక్షయా।
అభిచారాభిసంయుక్త మబ్రవీచ్చైవ తాం మునిః॥*
యం యం దేవం త్వమేతేన మంత్రేణావాహయిష్యసి।
తస్య తస్య ప్రభావేణ తవ పుత్రో భవిష్యతి॥

—వ్యా.భా. ఆది. 111-6, 7

తత స్తా మనవద్యాంగీం గ్రాహయామాస సద్విజః।
మంత్రగ్రామం తదా రాజ న్నథర్వశిరసి శ్రుతమ్॥ —వ్యా.భా.వన.305.20

కుంతి కన్యగా నున్నపుడే దుర్వాసుఁ డొసఁగిన మంత్రశక్తిం బరీక్షించి సూర్యుని వలన వసుషేణుని, వివాహానంతరము భర్తృ నియోగంబున ధర్మపవనేంద్రుల నారాధించి వరుసగా ధర్మజభీమార్జునులను బడసినది.

మాద్రియు నదేవిధముగా నశ్వినీ దేవతలను బ్రార్థించి నకుల సహదేవులను బడసినది.

మగధాధినాథుఁడగు బృహద్రథుఁడు సంతానార్థము విప్రమునిదేవపూజల వివిధవిధుల, పుత్రకామేష్టులను నొందు పుణ్యకర్మయుక్తులను జేసిపడయంగ నోపక, చండకౌశికుండను మునివరుని బ్రార్థింపఁగా నమ్మునిప్రవరుఁ డొకచూతఫలము నభిమంత్రించి బృహద్రథున కిచ్చి యీఫలంబు వలన నీకొక్కపుత్రుఁ డుద్భవిల్లు నని చెప్పినాఁడు.[1] ఈ యభిమంత్రితచూతఫల ప్రభావమే జరాసంధుని జన్మమునకు మూలము.

---

* ఆపద్ధర్మాన్వవేక్షయేతి భావి సంతాన ప్రతిబంధ స్యానాగతావేక్షణేన।
అభిచారోః వశ్యాకర్షణాది దృష్టఫలం తదుక్తమ్॥ —నీలకంఠ.

పోల్చు: వ్యా భా. వన. 122. 35. సమేఽభిచార సంయుక్తమాచష్ట భగవాన్ వరమ్।"
(అభిచారో దేవతాకర్షణశక్తి స్తదుక్తమ్.) —నీలకంఠ.

1. నన్నయ భార. సభా. 1 136-148.

## మంత్ర తంత్ర ప్రయోగములు

సంతానోత్పత్తిసాధనములందు ఓషధీకృతచరుభక్షణము ప్రధానాంశముగా గనుపించుచున్నది.

భృగుపుత్రుండగు ఋచీకుండను మహాముని పత్ని సత్యవతి "దేవా నీ ప్రసాదంబున నాకొక్క కొడుకును మజ్జనని కొక్క కొడుకు నుదయింప వలయు" ననిమ్రొక్కినం గరుణించి భృగుండు నీ కోరినయట్ల యగు శుచిస్నాతలయి నీవు మేడిమ్రానిం గౌఁగలింపుము నీ జనని నశ్వత్థంబుఁ గౌఁగిలింపు మను మనిన నయ్యిద్దఱుఁ దదాలింగన విపర్యాసంబు సేసిన నెఱింగి భృగుండు కోడలి కిట్లనియె.

పుత్రుఁడు నీకు బ్రాహ్మకులపూజ్యుఁడు పుట్టియు వాఁడు దారుణ
క్షత్రచరిత్రుఁడై పరఁగు సత్త్వమునన్ మఱి నీ సవిత్రికిన్
క్షత్రియుఁ డుద్భవిల్లియు నఘక్షయకారణుఁడున్ మహాతపః
పాత్రుఁడు నై ధృతిం బడయు బ్రాహ్మణభావము భూరితేజమున్.

—నన్నయ. ఆరణ్య. 3 135.

వ్యాసభారతమునందు ఉదుంబరాశ్వత్థవృక్షాలింగనములే కాక చరుభక్షణమును చెప్పఁబడినది.

ఋతౌ త్వం చైవ మాతా చ స్నాతే పుంసవనాయ వై
ఆలింగేతాం పృథగ్ వృక్షే సాశ్వత్థం త్వ ముదుంబరమ్ ॥ 35
చరుద్వయమిదం భద్రే జనన్యాశ్చ తవైవ చ ।
విశ్వమావర్తయిత్వా తు మయా యత్నేన సాధితమ్ ॥ 36
ప్రాశితవ్యం ప్రయత్నేన తేత్యుక్త్వాదర్శనం గతః
ఆలింగనే చరౌ చైవ చక్రతుస్తే విపర్యయమ్ ॥ 37

——వ్యాభా. వన. 115. 36-37

విరాట్ పురుషమంత్రాభిమంత్రితములయిన యీ చరువులను భక్షించిన విశ్వస్రష్టృసదృశులయిన పుత్రులు జన్మింతు రనియుఁ జెప్పఁ బడిన విరాట్ పురుషుఁ డన విశ్వకర్మయే. కావున నా చరువులను విశ్వకర్మ సూక్తపు తోడనో పురుషసూక్తముతోడనో యభిమంత్రింపవలయు నని తెలియుచున్న

---

* చూడు - వ్యా. భా. వన. 115 - 36, 37

విశ్వం విరాట్స్వరూపం ఆవర్తయిత్వా ముహుర్ముహు రనుసంధాయ ఏతం చ్చరోర్భక్షణేన విశ్వస్రష్టృ తుల్యో పుత్రో భవిష్యతి ఇతి భా: ॥ 36 ॥ —నీలక

మంత్రపూతములయిన యీ చరుద్వయమునం దొక్కటి బ్రహ్మతేజో విరాజిత మనియు వేఱొకటి క్షత్రవీర్యోపేత మనియుఁ జెప్పఁబడినది.

అప్పరమ ధర్మ పరుండు, "రెండుచరువు లొనర్చి యొక్కండు బ్రాహ్మణత్వ మత్యుజ్జ్వలముగనొనర్ప నొకటి రాజభావంబు నధికతీవ్రముగఁ జేయఁ జాలు నట్లుగ నిజతపశ్శక్తిఁ జేసె." 1

ఔదుంబర్యాదిమణి [కవచ] ధారణమువలన గుహ్య రోగములు నశించి పుత్త్రోత్పాదనశక్తి కలుగు నని అథర్వ వేదమంత్రముల వలనఁ దెలియుచున్నది.

అయ మౌదుంబరోమణి ర్వీరో వీరాయ బధ్యతే।
స నః సనిం మధుమతీం కృణోతు రయిం చ
నః సర్వవీరం నియచ్ఛాత్ ॥ —అథర్వ 19. 31-14

[ ఈ ఔదుంబరమణి వీరశక్తిసంపన్నమైనది. అది మాకు మధురోపభోగములు కలిగించుగాక ! పుత్త్ర సంతానరూపమగు నైశ్వర్యమును ప్రసాదించుగాక. ]

ఉదుంబరవృక్ష [మేడిచెట్టు] త్వచాదులు యోనిరోగ నాశకములనియు, గర్భసంధానకారకము లనియు నాయుర్వైదిక నిఘంటు రత్నాకరము చెప్పుచున్నది. 2

కావున నా చరుద్వయమునందు పుష్టికరములు గుహ్యరోగనివారకములు గర్భసంధానకారకములును సాత్త్విక రాజస గుణప్రధానములును నగు నోషధులు కలుపఁబడియుండు నని యూహింపవచ్చును.

ఇష్టి వలన మనోరథసిద్ధికవసరమగు సంకల్పబలమును, ఓషధి యుక్తములు, మంత్రపూతములు నగు చరువులు భక్షించుట వలన స్త్రీ గర్భధారణమున కవసరమగు క్షేత్రశుద్ధియు గలుగు నని చెప్పవచ్చును.

ఈ యుదంతముల వలన మహాభారతకాలమున సంతానహీనులగు దంపతులు పుత్త్రకామేష్టులు, మంత్ర తంత్ర ప్రయోగములు సంతానప్రదము లని భావించుచుండి రని తెలియుచున్నది.

---

1. తిక్కన భార. ఆనుశాసనిక. 1, 106-7 = వ్యాఖా. అను. అ 4. 28-58
2. చూడు :- స్వామీ బ్రహ్మముని పరివ్రాజక = అథర్వవేదీయ మంత్రవిద్యా దయానందసంస్థాన్. నయా డిల్లీ పు. 21

## జనమేజయుని సర్పయాగము

"జనమేజయుండు కాశిరాజపుత్రియయిన వపుష్టయను మహాదేవి ధర్మపత్నిగా సర్పయాగదీక్షితుండయి,

శాస్త్రోపదిష్టప్రమాణలక్షణనిపుణశిల్పాచార్యవినిర్మితంబును
యజ్ఞోపకరణానేకద్రవ్యసంభారసంభృతంబును

ప్రభూతధనధాన్యసంపూర్ణంబును, స్వస్వనియుక్త క్రియారంభసంభ్రమ పరిభ్రమద్ బ్రాహ్మణనివహంబును నయిన యజ్ఞాయతనంబున" నున్నట్లు నన్నయ వర్ణించినాఁడు. —నన్నయ భార. ఆది. 2. 29

యజ్ఞాయతననిర్మాణమునకు ముందు వేదవేత్తలయిన ఋత్విజులు శాస్త్రానుసారము భూమాపనము చేసి శాస్త్రోక్తవిధిప్రకారము యజ్ఞశాలను నిర్మించినారు.

తతస్తే ఋత్విజస్తస్య శాస్త్రతో ద్విజసత్తమ ।
తం దేశం మాపయామాసు ర్యజ్ఞాయతనకారణాత్ ॥

యథావద్వేదవిద్వాంసః సర్వే బుద్ధేః పరంగతాః ।
బుద్ధ్యా పరమయా యుక్త మిష్టం ద్విజగుణై ర్యుతమ్ ॥

ప్రభూతధనధాన్యాఢ్యమృత్విగ్భిః సునిషేవితమ్ ।
నిర్మాయచాపి విధివ ద్యజ్ఞాయతన మీప్సితమ్ ॥

—వ్యా. భా ఆది. 51. 10-12

ఇట విధి యనఁగా శుల్బసూత్రాదులందుఁ జెప్పఁబడిన పద్ధతి. యజ్ఞవేదికలను శిల్పశాస్త్రానుసారము నిర్మింపవలయును. [1]

జనమేజయుని సర్పయాగమండపము శతస్తంభయుక్తమై మనోహరముగా నున్నట్లు దేవీభాగవతమునందు వర్ణింపఁబడినది.

గంగాతీరే శుభాం భూమిం మాపయిత్వా ద్విజోత్తమైః ॥

కుర్వంతు మండపం స్వస్థాః శతస్తంభం మనోహరమ్ ।
వేదీ యజ్ఞస్య కర్తవ్యా మమామాత్యసచివాః ఖలు ॥

—దేవీభాగవతము. స్కంద 3-12. 50, 51

1. చూడు : డా॥ శోభిరాల సత్యనారాయణ . శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళాదర్శనము. ద్వితీయభాగము. పుట. 24

యజ్ఞాయతననిర్మాణానంతరము ఋత్విజులు జనమేజయుని సర్పయాగదీక్షితుని జేసిరి.

ఇంతలో 'వాస్తువిద్యానిపుణుండైన పౌరాణికుం' డొకఁ డటకు వచ్చి యీ యజ్ఞము పూర్తి కా దని రాజునకుఁ చెప్పినాఁడు.

అనఘా యీ యజ్ఞము విధిసనాథఋత్విక్ప్రయోగసంపూర్ణంబ
య్యును గడచననేరదు, నడుమన యుడుగును భూసురోత్తమనిమిత్తమునన్
—నన్నయ. భార. ఆది. 1 204-10

కారణమేమన యజ్ఞమండపము నిర్మింపఁబడినస్థలమును తన్నిర్మాణ ప్రారంభముహూర్తమును సలక్షణముగ లేవు.

మూలమునం దిట్లున్నది.

స్థపతిర్బుద్ధిసంపన్నో వాస్తువిద్యావిశారదః ।
ఇత్యబ్రవీత్ సూత్రధారః సూతః పౌరాణికస్తదా ॥
యస్మిన్ దేశే చ కాలే చ మాపనేయం ప్రవర్తితా ।
బ్రాహ్మణం కారణం కృత్వా నాయం సంస్థాస్యతే క్రతుః ॥
—వ్యా.భా. ఆది. 51-15, 16

ఇట పౌరాణికుఁడనఁగా శిల్పాగమశాస్త్ర వేత్త యనియు జాతిచేతసూతుఁ డనియు నీలకంఠుఁడు వివరించినాఁడు. [1]

సూత, సూత్రధార శబ్దములు శిల్పి పర్యాయవాచకములు. స్థపతి యన శిల్పాచార్యుడు.

శిల్పాగమవేత్త యైన యీ సూతుఁడు, సూత్రధారుఁడు మహామేధావియు వాస్తువిద్యావిశారదుఁడు నైన స్థపతి కావుననే యతఁడు వేదవేదాంగవేత్తలు నిర్ణయించిన వాస్తు ముహూర్త దోషములు తెలిసికొని తత్పర్యవసా[illegible] తెలిపినాఁడు.

---

1. చూడు :- వ్యాభా. ఆది. 51. 15. చిత్రశాలాప్రతి. పు. 202
సూతో జాత్యా పౌరాణికః శిల్పాగమవేత్తా॥ —నీలకంఠ॥

Cf. :- E W, Hopkins : THE GREAT EPIC OF INDIA. P. 56
"The Sutradhara appears only in 1-51-15, where he i[s] Sthapati, or architect and a Sutaha Pouranikaha. [illegible] application of the name is here apparently to the Sutra, lin[es] or plans drawn up by the architect."

ఆ స్థ ప తి పే రు లో హి తా క్షుఁ డు.

'వాని వచనం బవకర్ణించి రాజనియుక్తులయి చ్యవసకులవిఖ్యాతుండైన చండభార్గవుండు హోతగాఁ బింగళుం డధ్వర్యుండుగా శార్ఙ్గరవుండు బ్రహ్మగాఁ గౌత్సుండుద్గాతగా వ్యాసవైశంపాయన పైల జైమిని సుమంతు సహాయుండైన వ్యాసుం డుపద్రష్టగా శుక శ్వేతకేతు...... సోమశ్రవసు లాదిగాఁగల మహామునులు స ద స్యు లు గా నీలాంబరపరిధానులును ధూమసంరక్త నయనులును నై యాజ్ఞికు లగ్నిముఖుంబు సేసి వేల్వం దొడగిరి:'

సర్పయాగము మారణహోమము. అట్టి యజ్ఞములందు ఋత్విజులు రక్తవస్త్రములు లోహితోష్ణీషములు ర క్త మా ల్య ము లు ధరింపవలె నని మత్స్యపురాణమునందుఁ జెప్పఁబడినది.

హోమం కుర్యు స్తతో విప్రా రక్తమాల్యానులేపనాః ।
వినీతా లోహితోష్ణీషా లోహితాంబరధారిణః ॥ —మత్స్య 92. 162*

స ర్ప యా గ ము నందలి యాజ్ఞికులు నీలాంబరపరిధానులగుట నయ్యాగవిశేషముగా నున్నది.

ధరణిసురమంత్రహోమస్ఫురణను వివశులై భూరిభుజగప్రభు లొం
డొరుఁ బిలుచుచు నధికభయాతురులై కుండాగ్నులందుఁ
దొరగిరి పెలుచన్.[2]

కాని యా యజ్ఞము పూర్తి కాలేదు.

"జనమేజయుం డాస్తీకప్రార్థనంజేసి స ర్ప యా గ ముడిగించె."[3] లోహితాక్ష స్థపతి జోస్యము నిజమైనది.

దీనిని బట్టి సమస్తనిర్మాణకార్యములందును వాస్తువిద్యా విశారదులగు స్థపతులను సంప్రదించుట మేలని తెలియుచున్నది.

ఒనర జరత్కారమునీంద్రునకు జరత్కారుసకు సుతుండైన మహా
మునివరు నాస్తీకు మదమునఁ దలఁచిన నురగభయముఁ
బొందదు జనులన్.[4]

---

.. నన్నయ. భార. ఆది. 2. 211 = వ్యా.భా. ఆది. 52. 1-2
* పోల్చు : వా.రా. యుద్ధ. 80. 5-7
2 నన్నయ. భార. ఆది. 2. 212
3. అదే 2. 233
4. అదే 2. 237

## పంచ మహాయజ్ఞములు

పంచయజ్ఞప్రవృత్తేన గృహస్థేన విశేషతః
పంచయజ్ఞాంస్తు యో మోహాన్నకరోతి గృహాశ్రమే।
తస్య నాయం న చ పరో లోకో భవతి ధర్మతః॥

—వ్యా. భా. శాంతి. 146-6. 7.

ప్రతిదినము పంచయజ్ఞములు చేయుట గృహస్థధర్మము.

గృహస్థాశ్రమ మందుండి మోహవశమున పంచయజ్ఞములు చేయని మనుజునకు ధర్మకర్మాచరణసాధ్యములయిన యిహపరసౌఖ్యము లుండవు.

దేవయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, భూతయజ్ఞము, పితృయజ్ఞము, మనుష్యయజ్ఞము నను నైదును పంచమహాయజ్ఞములు. *

1. అగ్నిహోత్రమునందు సుగంధద్రవ్యాదులు వేల్చుచు నగ్ని ముఖమున పరమేశ్వరునుపాసించుట దేవయజ్ఞము.
2. సాంగవేదాదిశాస్త్రాధ్యయనాధ్యాపనములు సంధ్యోపాసన బ్రహ్మ యజ్ఞము.
3. ప్రతిదినము ఉప్పు కలియని పక్వాన్నమును విశ్వేదేవుల కొఱకు గృహ్యాగ్నియందు హోమముచేయుట భూతయజ్ఞము.
4. జ్ఞానపూర్ణులైన పితృదేవతలకు చేయు తర్పణాదులు పితృయజ్ఞము.
5. అతిథిసత్కారము మనుష్యయజ్ఞము.

తర్పణం ఋభుయజ్ఞః స్యాత్ స్వాధ్యాయో బ్రహ్మయజ్ఞకః।
భూతయజ్ఞో బలిర్యజ్ఞో నృయజ్ఞోఽతిథిపూజనమ్
పితౄనుద్దిశ్య యత్కర్మ పితృయజ్ఞః ప్రకీర్తితః॥**

---

* చూడు :- భట్టనీలకంఠ ఆచారమయూఖము. ప్రథమఖండము. పు. 50.

"అథాతః పంచమహాయజ్ఞో దేవయజ్ఞో బ్రహ్మయజ్ఞో
భూతయజ్ఞః పితృయజ్ఞో మనుష్యయజ్ఞ ఇతి."

"తదగ్నే జుహోతి స దేవయజ్ఞః యత్ స్వాధ్యాయ మధీతే స బ్రహ్మయజ్ఞః
యద్ బలిం కరోతి స భూతయజ్ఞః యత్ పితృభ్యో దదాతి స పితృయజ్ఞః
యత్ మనుష్యేభ్యః స మనుష్యయజ్ఞ ఇతి॥ —అశ్వలాయన గృహ్యే. 3-2-4

** వ్యా.భా. అశ్వమేధికపర్వణి - వైష్ణవధర్మపర్వ అ 92. గీతాప్రెస్ ప్రతి. పు. 6337.

# 1. దేవ యజ్ఞము : అగ్నిహోత్రము

వైదికార్యులు అగ్నిముఖమున పరమేశ్వరారాధనము చేయుచుండిరి.

నిత్యాగ్నిహోత్రులు అగ్నిముఖమున సుగంధద్రవ్యములు, మధుర పదార్థములు, పుష్టికరములగు ఘృతక్షీరాదులు, రోగనాశకములగు సమిధలు సోమలతాదులు వేల్చుట వలన పరిశుద్ధవాతావరణ మేర్పడును. ధూమము మేఘముగా మాఱి సకాలమున వర్షములు గురియును.

'అనవరతయాగతర్పిత పర్జన్యప్రసాదమునం గొరినయప్పుడు వానలు గురియుచు సకలసస్యసమృద్ధియుఁ బ్రజావృద్ధియు నగు '[1]

లోహకారాదిశిల్పులు అగ్నిముఖమున శిల్పకార్యములు చేయుచు జగచ్ఛిల్పి యగు విశ్వకర్మపరమేశ్వరుని సేవింతురు.

అనవరతశిల్పయజ్ఞము వలన సకలజనోపయోగివస్తూత్పత్తియు సాధనసంపత్తియుఁ గలుగుచున్నది.

తా సుజిహ్వా ఉపహ్వయే హోతారా దైవ్యా కవీ।
యజ్ఞం నో యక్షతా మిమమ్ ॥ —ఋగ్వేద. 1-13-8*

[ మా శిల్పవిద్యామయ యజ్ఞమును ప్రారంభించుటకు అగ్ని, విద్యుదగ్ని యను హోతల నాహ్వానించుచున్నాను. ]

కాశ్యపుండైన కణ్వునాశ్రమమునందు అగ్నిహోత్రగృహము లనేకము లున్నవి. [అగ్న్యగారైశ్చ బహుభిః ॥ వ్యా. భా. ఆది. 70-20]

భృగుఁడను విప్రుఁడు తన ధర్మపత్ని నగ్నిహోత్రమునకు నగ్నులు విహరింపు మని పంచి యభిషేచనార్థమరుఁగ.... పులోముఁ డను రక్కసి యగ్నిహోత్రగృహమునకు వచ్చి నాఁ డని వర్ణింపఁబడినది. [2]

శిల్పాచార్యులయిన కశ్యప భృగ్వంగిరఃప్రభృతుల యగ్నిహోత్ర గృహములు శిల్పశాలలై యుండు ననుటలో విప్రతిపత్తి యుండదు.

---

4. నన్నయ. భార. ఆది. 3-52

* చూడు :- దయానంద : ఋగ్వేదభాషాభాష్యము. పు. 16

" యజ్ఞమ్ హవన్ వా శిల్పవిద్యామయ యజ్ఞకో "

2. నన్నయ. భార. ఆది. 1-120 = వ్యా.భా. ఆది. 5-21

" అథాగ్నిశరణే పశ్యజ్జ్వలంతం జాతవేదసమ్॥ "

మంథనక్రియద్వారా అగ్నిని మొట్టమొదట భూలోకమున కాహ్వానించి స్థాపించిన వారు భృగువులు. పవిత్రుఁడైన యగ్ని వసువులకధిపతి. శిల్పవిద్యా సంబంధములగు సమస్తకర్మలకు కారణభూతుఁడు.

ఉపవోచంత భృగవో మంథంతో దాశా భృగవః।
అగ్నిరీశే వసూనాం శుచి ర్యో ధర్ణి రేషామ్॥ —ఋగ్వేద. 1-127-7*

మఱియొక మంత్రమీ విషయమునే రూఢి చేయుచున్నది.

య మేరిరే భృగవో విశ్వవేదసం।
నాభా పృథివ్యా భువనస్య మజ్మనా॥ —ఋగ్వేద. 1-143-4**

విజ్ఞానాన్వేషకులయిన ఆదిమానవులలో మంథనక్రియవలన అగ్నిని బుట్టింపవచ్చు నని కనుఁగొన్నవాఁడు అథర్వుఁ డనియు వానికే యంగిరసుఁ డని మఱియొక పేరనియు డా॥ సత్యప్రకాశ్ తెలిపినాఁడు.[1]

భృగువులు, అథర్వాంగిరసులు ఒకే కుటుంబమునకుఁజెందిన వారనియు వీరే ప్రపథ్రమయజ్ఞస్థాపకు లనియు పండితు లూహించుచున్నారు.

---

* చూడు :- దయానంద. ఋగ్వేదభాషాభాష్యము. పు. 173

"ధర్ణిః శిల్పవిద్యావిషయక కామోం కా ధారణ్ కర్నేహారా॥"

Cf :- Ralph T. H. Griffith : The Hymns of the Rigveda —1 -27,7
"The Bhrigus with their prayer and praise, invited Hir the Bhrigus rubbing, offering gifts."
(The Bhrigus = descendants of Bhrigu, the earliest che of Agni or Kindler of fire.)

** Cf :- Ibid : 1 - 143. 4.
"Him, All - possessor, whom the Bhrigus with their n brought to earth's central point, the centre of the world."

Cf :- Krishna Rao M. Jogleker : Boquet of Hymns from Ri
"భృగవః —- 'Roasters, consumers' —- A class of mytho beings who belonged to the middle or aerial class of gods are connected with అగ్ని and are spoken of as produce nourishers of fire. They are associated with అంగిరసాః అథ ఋభుక్షాః। They are supposed to be the descendants of the భృగు.

1. Cf :- Dr. Satya Prakash : Founders of the Sciences in Ancient Ir
'Atharvan, also known as Angiras, is the first discoverer of fir
త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమంథత॥ —ఋగ్వేద. 6. 16-13.
అగ్నిర్జాతో అథర్వణా విద ద్విశ్వాని కావ్యా —ఋగ్వేద 10, 21-3.

# 2. బ్రహ్మయజ్ఞము

స్వాధ్యాయము బ్రహ్మయజ్ఞము. స్వాధ్యాయ మనఁగా వేదాధ్యయనము. వేదాధ్యయనము వలన జ్ఞానవిజ్ఞానములు కలుగును.

జ్ఞాన మన మోక్షవిషయకబుద్ధి. విజ్ఞాన మన శిల్పమునకు సంబంధించిన బుద్ధి. [మోక్షే ధీర్ జ్ఞాన మన్యత్రవిజ్ఞానం శిల్పశాస్త్రయోః] అమరము.

జ్ఞానవిజ్ఞానసముపార్జనములు రెండును బ్రాహ్మణకర్మలే.

జ్ఞానవిజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥ —భగవద్గీత అ. 18

వేదాధ్యయనము చేయువారికి వారివారి యధికారమును బట్టి యాయా మంత్రముల కనేకార్థములు స్ఫురించుచుండును.

శ్రీ దయానందసరస్వతి వంటి పండితులు వేదమంత్రములందు శిల్పశాస్త్రరహస్యములు నిక్షిప్తములై యున్న వని గ్రహించి కొన్నిమంత్రములకు శిల్పపరమయిన యర్థములు చెప్పినారు.

ఋక్సామయోః శిల్పే స్థ స్తే వామారభే।
తే పాత మాస్యయజ్ఞ స్యోదృచః॥ —యజుర్వేదము. 4. 9 *

[ప్రతిపదార్థము :- ఓ విద్వాంసులారా ! నేను, (ఋక్సామయోః) ఋగ్వేదసామవేదములను చదివినతరువాత (ఉదృచః) ఋక్కు బాగుగా ప్రత్యక్షము చేయఁబడు (అస్య యజ్ఞస్య) శిల్పవిద్యచే సిద్ధమైన యీ యజ్ఞమునకు సంబంధించిన (వామ్, శిల్పే) మనస్సు లేక ప్రసిద్ధశిల్పవిద్యచే సిద్ధము చేయఁబడిన ఏ యీ శిల్పకళావిద్యలను (ఆరభే) ఆరంభించు చున్నానో, మఱియు నేవి (మా) నన్ను (పాతమ్) కాపాడుచున్నవో. (తే) అవి (స్థ) ఉన్నవి వానిని విద్వాంసుల దగ్గఱనుండి గ్రహించుచున్నాను.

భావార్థము :- మానవులు విద్వాంసుల దగ్గర వేదములను చదివి శిల్పవిద్యను, చేతిపనులను, సాక్షాత్కారము చేసికొని విమానాదియానముల యొక్క సిద్ధిరూపకార్యము లను సాధించి సర్వసుఖములను పెంపొందఁ జేయవలయును. ]

జ్ఞాననిష్ఠులయిన విప్రులు వేదాధ్యయన మొనరించి విరాట్పురుషుఁడైన విశ్వకర్మతత్త్వము నుపాసింతురు.

విజ్ఞానాన్వేషకులైన శిల్పిబ్రాహ్మణులు వేదవేదాంగాధ్యయన మొనరించి తదంతర్గతములయిన శిల్పశాస్త్రరహస్యములు గ్రహించుచు విశ్వశిల్పి యగు విశ్వకర్మపరమేశ్వరు నారాధింతురు.

---

* చూడు. - దయానంద సరస్వతి : యజుర్వేదభాష్యము పు. 26
ఆంధ్రానువాదము పు. 256, 57. : అనువాదకులు : ఆచార్యాద్వయలు
ప్రకాశకులు : అన్నే మాధవరావు, ఆర్యగ్రంథాలయము, ముదునూరు, కృష్ణాజిల్లా

మహాభారతకాలమున ప్రజలు "యజ్ఞంబులంజేసి దేవతల ఋణంబును తపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యవ్రతంబులంజేసి ఋషుల ఋణంబును...... బాపవలయు" నని తలంచుచుండిరి. —నన్నయ. ఆది. 5-70

బ్రాహ్మణులు క్షత్రియులు వేదాధ్యయము చేయుచుండిరి.

అంగిరసుం డను బ్రహ్మమానసపుత్రుని కొడుకు బృహస్పతి వేల్పుల కాచార్యుఁడై వెలింగె. —నన్నయ్య, ఆది. 3-36

వ్యాసపుత్రుండైన శుకుఁడు, ధిషణుని గురుఁడుగ వరించి, యాచార పరిపాటి యవలంబించి, యి ట్లుపాధ్యాయవరణము చేసి,

"అతఁడు సదివింప వేదవేదాంగధర్మ
శాస్త్రరాజనీత్యాదికసకలవిద్యలును" గ్రమంబుగఁ జదివినాఁడు.[1]

యోగాచార్యుఁడయిన శుక్రుఁడు, వేదాధ్యయనశీలుండయి సకలదైత్య దానవగణోపాధ్యాయుఁడయినాఁడు.[2]

శ్రీకృష్ణుఁడు "వేదాదిసమస్తవాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు"[3]

ధృతరాష్ట్రుఁడు, 'నేను షడంగసహితంబుగా వేదాధ్యయనంబు నర్థశాస్త్రంబులందుఁ గృతనిశ్చయుండ నయి'[4] నాఁడ నని చెప్పినాఁడు.

వసుదేవపురోహితుఁడైన కశ్యపుఁడు పాండుకుమారులకుఁ గ్రమంబ జౌలోపనయంబు లొనరించి వేదాధ్యయనంబు సేయించుచుండె.[5]

వేదాదివిద్యలందు శిల్పశాస్త్రమును కలదు. రథసూత్ర. సూత్రాదులు శిల్పశాస్త్రాంతర్గతములు.

అధ్యాపనము బ్రాహ్మణకర్మగా పరిగణింపఁబడినది.

ఇంద్రప్రస్థము నందలి బ్రాహ్మణులు సత్కర్మనిరతులు.

తనరిరి తద్దేశంబున ననవరతము యజనయాజనాధ్యయనాధ్యా
పనదానములుఁ బ్రతిగ్రహమును నను షట్కర్మములను భూసురవంశు
—నన్నయ. ఆది.

1. తిక్కన శాంతి. 6. 254-6 = వ్యా భా, శాంతి. 324. 23-25
2. నన్నయ. ఆది. 3 107
3. నన్నయ. సభా. 2-18
4. నన్నయ, ఆది 6-124
5 నన్నయ. ఆది. 5-137

## 3. భూతయజ్ఞము : వైశ్వదేవబలి

వైశ్వదేవం హి నామైతత్ సాయం ప్రాతశ్చ దీయతే॥

—వ్యా. భా. వన. 2-59 *

ప్రతిదినంబును బకి శునక శ్వాపదార్థంబు సాయం ప్రాతస్సుల యందు వైశ్వదేవంబు సేసి యమృతాశియు, విఘతాశియుఁ గావలయు; యజ్ఞశేషం బమృతంబు నాఁబరఁగు నతిథిభుక్తశేషంబు విఘసంబునాఁబడు; నట్టి వృత్తి వర్తిల్లు వాఁ డుత్తమ గృహస్థుఁడు. —నన్నయ. అరణ్య. 1-31

వైశ్వదేవబలి యందు దక్షిణదిక్కున యమునకు, పడమట వరుణునకు, ఉత్తరమున సోమునకు, వాస్తుమధ్యమునందు ప్రజాపతికి, ప్రాగుత్తరమున ధన్వంతరికి, ప్రాచీదిక్కునశక్రునకు, గృహద్వారమునందు మనుష్యులకు, గృహాంతర్భాగమందు మరుద్దేవతలకు ఆకాశమునందు విశ్వేదేవతలకు బలి యొసఁగవలయును.

దక్షిణాయాం యమాయేతి ప్రతీచ్యాం వరుణాయ చ ।
సోమాయా చాప్యుదీచ్యాం వై వాస్తుమధ్యే ప్రజాపతేః ।
ధన్వంతరేః ప్రాగుదీచ్యాం ప్రాచ్యాం శక్రాయ మాధవ॥

మనుష్యేభ్య ఇతి ప్రాహు ర్బలిం ద్వారి గృహస్య వై ।
మరుద్భ్యో దైవతేభ్యశ్చ బలి మంతర్గృహే హరేత్ ॥

తథైవ విశ్వదేవేభ్యో బలి మాకాశతో హరేత్ ॥

—వ్యా.భా. అను. 97. 11-14

ఇట వాస్తుమధ్యమునందు ప్రజాపతికి, ఆకాశమునందు విశ్వేదేవులకు బలి యొసఁగుట గమనింపఁదగినది.

ప్రజాపతి యన శిల్పప్రజాపతి యగు విశ్వకర్మయే. [1]

విశ్వకర్మ ఆద్యశిల్పాచార్యుఁ డని యెల్లరకు విదితమేకదా! విశ్వేదేవతలును శిల్పశాస్త్రమునందు నిష్ణాతులే. [2]

---

* "విశ్వం సర్వజాతియిం ప్రాణిజాతం దేవో దేవతా యస్మిన్
తత్ విశ్వేదేవం స్వార్థే తద్ధితః వైశ్వదేవం నామ కర్మ" —నీలకంఠ.

1. "ప్రజాపతి ర్విశ్వకర్మా......" —యజుర్వేదము.

2. చూడు :- శౌనకీయ బృహద్దేవతా ॥

# 4. పితృ యజ్ఞము

ఆయంతు నః పితరః సోమ్యాసోఽగ్నిష్వాత్తాః ॥

—శుక్లయజుర్వేద, 19.58

పితృశబ్దము చేత సర్వరక్షకులు, శ్రేష్ఠస్వభావులు, జ్ఞానులు నగు వ్యక్తులు గ్రహింపఁబడుదురు...... విద్వాంసులు మనుష్యులకు జ్ఞానచక్షువుల నిచ్చి, వారి యవిద్యాంధకారమును దొలగించి రక్షింతురు. కావున వారిని పితరు లందురు. అట్టివారిని సత్కరించుట ప్రతిమానవునకు కర్తవ్యము.

నిత్యమును భగవంతు నిట్లు ప్రార్థింపవలెను :

" ఓ పరమేశ్వర ! నీ యనుగ్రహము వలన (సోమ్యాసః) శాంతశీలురు, నెల్లరకు సుఖము నొడఁగూర్చువారు, సోమలత మున్నగు నోషధుల రసము గ్రహించుటలో చతురులు నగు విద్వాంసులు, (అగ్నిష్వాత్తాః) నిజాభ్యుదయము కొఱకు అగ్నిహోత్ర మొనరించుచు అగ్నినామకపరమాత్మను సేవించువారు, శిల్పవిద్యల ప్రయోజనార్థము భౌతికాగ్నిని బాగుగఁ దెలిసికొని సేవించు జ్ఞానులు, సంఘరక్షకులు నగు పితరులు (ఆయంతు నః) మాకు లభింతురుగాక! మే మెల్లప్పుడు వారి సాన్నిధ్యమును సంపాదించుకొందుము గాక॥ " 1

అగ్నిష్వాత్తు లనఁగా అగ్న్యాదిపదార్థవిద్యానిపుణులు. 2

అగ్ని, విద్యుత్తు మున్నగుపదార్థములనెఱుగువా రగ్నిష్వాత్తులు. 3

" యై రగ్నేర్ విద్యుతో విద్యా గృహీతా తే అగ్నిష్వాత్తాః ॥ "

అగ్నిష్వాత్తాది పితరులు యమరాజసభయందు మూర్తిమంతులై యున్నట్లు భారతమునందు వర్ణింపఁబడినది.

అగ్నిష్వాత్తాశ్చ పితరః ఫేనపోష్మపాశ్చ యే ।
స్వధావంతో బర్హిషదో మూర్తిమంత స్తథాపరే ॥—వ్యా.భా. సభా. 8.30

---

1. చూడు :- దయానంద సరస్వతి : వేదతత్త్వప్రకాశము.

" అగ్నిష్వాత్తాః - అగ్నిః పరమేశ్వరోఽభ్యుదయా యానుష్ఠతయాఽత్తో గృహీతో యై స్తే ఽగ్నిష్వాత్తాః । తథా హోమకరణార్థం శిల్పవిద్యాసిద్ధయే చ భౌతికోఽగ్నిరాత్తో గృహీతో యై స్తే పితరో విజ్ఞానవంతః పాలకాః సంతి॥ "

2. చూడు :- దయానంద సరస్వతి : యజుర్వేదభాషాభాష్యము

3. చూడు :- దయానంద సరస్వతి = సత్యార్థప్రకాశము. పు. 156

పితృసంజ్ఞకా ఋషయ ఏవ దేవశిల్పినః ॥ —నైరుక్తే దేవతాకాండే.

ఋషులును, దేవశిల్పులును పితృసంజ్ఞ కలవారు.

అంగిరసో నః పితరో నవగ్వా అథర్వాణో భృగవః సోమ్యాసః ।
తేషాం వయం సుమతౌ యజ్ఞియానా మపి భద్రే సౌమనసే స్యామ॥

ఋగ్వేద. 10. 14-6, యజుర్వేద. 19-56

(అంగిరసో నః) బ్రహ్మాండమున కంగభూతములగు పృథివ్యాదులకు రసభూతప్రాణనామక పరమేశ్వరు నెఱుఁగువారును, (నవగ్వాః) నవీన నవీన విద్యలను నుత్తమోత్తమకర్మలను గ్రహించువారును, గ్రహింపఁజేయువారును, (అథర్వణాః) అథర్వవేదమునందు, ధనుర్వేదమునందును చతురులును, దుష్టులను, శత్రువులను, దోషములను నివారించుటలో ప్రవీణులు (భృగవః) పరిపక్వజ్ఞానులు, తేజస్వులు, (సోమ్యాసః) పరమేశ్వరుని యుపాసనవలనను తమ విశేషగుణముల వలనను శాంతస్వరూపులు నగు (పితరః) పితరులు - విద్వాంసులు - గలరో (తేషాం యజ్ఞియానాం) యజ్ఞములు చేసి, చేయింపఁగల వారి (సుమతౌ భద్రే సౌమనసే) కల్యాణకరమగు విద్యచే శుభకరము, శ్రద్ధాయుక్తము నగు మనస్సు నందు (వయమపిస్యామ) మేము కూడ స్థిరముగా నుందుము గాక! వ్యావహారికము, పారమార్థికము నగు సుఖములు పొందుదుము గాక! *

పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ।
పితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ।
ప్రపితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ॥—శుక్లయజుర్వేద. 19-36

ఇందు పితృసంజ్ఞకలవారు వసువు లనఁబడుదురు. వారు సర్వవిద్యలందు వాసము చేయుదురు. అట్లే పితామహులకు రుద్రులని నామము వారు వసువుల కంటె రెండింతలు కాని, నూరింతలు కాని యెక్కుడు విద్యావంతులు, బలశాలురు నై యుందురు. అట్లే ప్రపితామహులు ఆదిత్యులనఁ బడుదురు. వారు సమస్తవిద్యలలోను గుణములలోను సూర్యుని వలె ప్రకాశింతురు. ఇతరులను ప్రకాశింపఁజేయుదురు.

వసురుద్రాదిత్యులు, వసుధేశ తపంబు గౌరవంబున నైశ్వ
ర్యసమృద్ధులైరి తపమునఁ బరిసిద్ధముగ నిష్టసిద్ధివడయుము పేర్మిన్ ॥

—నన్నయ. ఆరణ్య. 1-34

---

* చూడు - దయానందసరస్వతి : వేదతత్త్వప్రకాశము
** — అదే —

పితృయజ్ఞము శ్రాద్ధ మనియు తర్పణ మనియు రెండు విధములు శ్రద్ధతోఁజేయఁబడు కర్మము శ్రాద్ధము.

"జీవించియున్న మాతాపితలు మున్నగు వారేయే కర్మముల వలనఁ బ్రసన్నులగుదురో యాక్రియలకు తర్పణమనిపేరు కావున నీ తర్పణము జీవితులకుఁ జేయు క్రియయే కాని మృతులకుఁ జేయునది కాదు." 1

ధర్మవ్యాధుఁడు వృద్ధులయిన జననీజనకులను సేవించి వారి మెప్పు వడసినాడు.

"వాఙ్మనః కర్మములఁ బితృవత్సలత్వ మొక్క రూపుగఁ జలుపుచునున్నయట్టి సద్గుణాకారు నిన్నెన్ని జామదగ్న్య నొకనినెన్నంగఁ దగుఁగాక యొరులుగలరె?"

'నా జననియు జనకుండును...... నాపాలి వేల్పు లనఘ! కమనీయ ఫలపుష్పగంధభూషణవస్త్రములు మనోహరభక్ష్యభోజ్యములును వీరి కెపుడు నివేదింతు వేడ్క' నని ధర్మవ్యాదుఁడు కౌశికుండను విప్రునకుఁ దెలిపినాఁడు.

—ఎఱ్ఱన. భార. అరణ్య. 5. 115-17

ప్రతిదినమును చేయవలసిన పితృ యజ్ఞము నందును పితృదేవతల కన్నోదకాదు లర్పింపవలయును.

"అన్నమున దుగ్ధమునఁ బండ్లనైన మూలకోటి నైనను దనుపారు నీటనైన నిత్యమును జేయునది పితృకృత్య మోపి వైశ్వదేవ మవశ్యనిర్వాహ్యమధిప.

పాండురాజు పరలోకమున కరగినంత వ్యాసభీష్మధృతరాష్టు యనుమతంబున -

వెలయంగఁ బితృమేధవిధ విచక్షణశీలసద్భూసురోపదేశక్రమమున
నధికవిభూతితో నతిపవిత్రప్రదేశమున నయ్యంగముల్ సంస్కరించి
పుణ్యస్వధామృతంబుల నొప్పఁగా శ్రాద్ధవిధి యొనరించి తద్విప్రతతికి
నగ్రహారములు దివ్యాంబరాభరణశయ్యాసనచ్ఛత్రగవాశ్వకరుల
నిచ్చి సర్వజనుల కెల్లను భోజనదాన మొనరఁజేసి ధర్మవిదుఁడు
విదురుఁ డట్లు పాండువిభునకుఁ జేయించె నన్యలోకహితములైన విధులు.

—నన్నయ. ఆది. 5. 158

"శ్రాద్ధవిధిసమాచరణసమయమున విశ్వలగుదేవతలను [విశ్వేదేవతలను] బరికీర్తించిన యతండు వడయు శుభంబుల్." —తిక్కన. ఆనుశాసనిక. 3. 19[illegible]

1. చూడు :- దయానంద సరస్వతి : సత్యార్థప్రకాశము. పు. 135

2. తిక్కన ఆనుశాసనిక. 3. 337 = వా భా. అను. 98-17

## 5. మనుష్య యజ్ఞము : అతిథిపూజ

తద్ యస్యైవం విద్వాన్ వ్రాత్యోఽతిథిర్ గృహానాగచ్ఛేత్ ॥
—అథర్వ. 15.11.1

పూర్ణ విద్వాంసులు, పరోపకారులు, జితేంద్రియులు, ధర్మాత్ములు, సత్యవాదులు, నిత్యము దేశమునం దెల్లయెడలఁ దిరుగుచు విద్యాధర్మములను బ్రచారమొనర్చువారు, అవిద్యాధర్మములను దొలఁగించువారు అతిథు లనఁబడుదురు. [1]

"ధర్మ్యంబైన విత్తంబున నతిథులఁ బూజించుచు యజ్ఞంబులు సేయుచు ...నిత్యానుష్ఠానపరులైన గృహస్థులు ...తమ తమ పూర్వాచారంబులంజేసి క్రిందంబదితరంబులవారిని మీఁదంబదితరంబులవారిని దమ్మును నుద్ధరింతురు.'

నిత్యము గృహమునం దుండని వానిని అతిథి యందురు. ఆచార్యుని పితరుని, ఆప్తమిత్రుని, అతిథిని నిత్యమును పూజింపవలయును. ఒక సంవత్సరము తరువాత వచ్చిన రాజును, ఋత్విజుని, స్నాతకుని శ్వశురుని మధుపర్కముతో నర్చింపవలయును.

అనిత్యం హి స్థితో యస్మాత్ తస్మా దతిథి రుచ్యతే ।
ఆచార్యస్య పితుశ్చైవ సఖ్యురాప్తస్య చాతిథేః ॥....
రాజర్త్విజం స్నాతకం చ గురుం శ్వశుర మేవ చ ॥
అర్చయే న్మధుపర్కేణ పరిసంవత్సరోషితాన్ ॥ -వ్యా.భా. అను. 97. 19-22

మధుపర్క మనఁగా పెరుగు, నేయి, నీరు, తేనె, శర్కర అను నయిదు పదార్థములు గలిపిన మిశ్రమము.

దధి సర్పిర్ జలం క్షౌద్రం సితా చైతైశ్చ పంచభిః
ప్రోచ్యతే మధుపర్కః ॥ —సంస్కృతాంగ్లకోశము. [2]

పెరుగు, తేనె, నేయి యను పదార్థములను కాంస్యపాత్ర యందుఁ గలిపి యిచ్చుట మధుపర్క మని యాజ్ఞవల్క్యుడు చెప్పినాఁడు.

కాంస్యపాత్రే సమాయుక్తం దధిమధుఘృతై ర్యుతం ।
మధుపర్కః స విజ్ఞేయో మితశ్రీస్యత్వాప్రతీక్షణీ ॥
—యాజ్ఞవల్క్యసంహిత. 8-202

---

1. చూడు :- 1) దయానంద సరస్వతి : వేదతత్త్వప్రకాశము
2) దయానంద సరస్వతి : సత్యార్థప్రకాశము. పు. 138, 139
2. V. S. Apte : The Students' Sanskrit-English Dictionary.

అంగిరసుండయిన సుధన్వాచార్యున కతిథిసత్కారము చేయుటకు ఉదకమును మధుపర్కమును దెమ్మని సేవకుల నాజ్ఞాపించి, ప్రహ్లాదుఁడు తన యాతిథ్యమును స్వీకరింపు మని సుధన్వుని ప్రార్థించినాఁడు.

ప్రహ్లాద ఉవాచ : ఉదకం మధుపర్కం వాప్యానయంతు సుధన్వనే ।
బ్రహ్మన్నభ్యర్చనీయోఽసి శ్వేతగౌః పీవరీకృతా ॥

—వ్యా భా. ఉద్యోగ. 35-26

దుష్యంతమహారాజు కణ్వమహాముని నివాసంబునకుం జనినపుడు శకుంతల 'అనంతవిలాసంబున జయంతుండ పోని దుష్యంతు నెఱింగి యతి సంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజించి కుశలంబడిగినది.'*

పాండురాజునకు ద్వితీయవివాహము చేయఁదలఁచి భీష్ముఁడు మద్రదేశమున కరిగినపుడు మద్రపతి శల్యుఁడు భీష్మున కాసనార్ఘ్యపాద్య మధుపర్కాదు లర్పించినాఁడు.

దత్త్వా తస్యాసనం శుభ్రం పాద్య మర్ఘ్యం తథైవ చ
మధుపర్కం చ మద్రేశః పప్రచ్ఛాగమనేఽర్థితామ్ ॥

—వ్యా భా. ఆది. 112-4

కృష్ణభీమార్జునులు స్నాతకవేషధారులై గిరివ్రజము నందలి జరాసంధు మందిరంబున కరిగినపుడు జరాసంధుఁడు,

"అర్ధరాత్రమయిన నభ్యాగత ద్విజ స్నాతకులకు నెదురు చని కరంబు భక్తిఁ బూజలిచ్చు పరమవ్రతుం దప్పు డెదురువచ్చి వారి కిష్టమెసఁగ ధీయుతుఁడయి మధుపర్కము సేయఁగ సమకట్టి" నాఁడు ।.**

మహాభారతకాలమునందు పూజనీయులగు వారరుదెంచినపుడు అర్ఘ్యపాద్యాదులు మధుపర్కము నొసఁగి పూజించుటయాచారముగా నున్నది.

అతిథిసత్కారమునం దుపయోగింపఁబడు నాసనములు కాంస్యపాత్రలు మున్నగునవి చేయువారు శిల్పులే.

ఈవిధముగా పంచమహాయజ్ఞములందు శిల్పులకు శిల్పమునకు గల స్థానము గమనింపదగినది.

---

* నన్నయ ఆది. 4-26 = వ్యా.భా. 71. 4-5

"ఆసనేనార్చయిత్వా చ పాద్యేనార్ఘ్యేణ చైవ హి ।
పప్రచ్ఛానామయం రాజన్ కుశలం చ నరాధిపమ్ ॥"

** నన్నయ సభా. 1-181 = వ్యా.భా. సభా. 21-31

# షోడశసంస్కారములు

చిత్రకర్మ యథానేకై రంగై రున్మీలతే శనైః
బ్రాహ్మణ్య మపి తద్వత్ స్యాత్ సంస్కారైః విధిపూర్వకైః ॥
—అంగిరసస్మృతి *

చిత్రలేఖనమునం దనేకవర్ణసంయోగము వలన రూపమేర్పడునట్లు స్కారమువలన బ్రాహ్మణ్యము వ్యక్తివైశిష్ట్యము ప్రకాశమాన మగును.

గర్భాధానము మొదలు అంత్యేష్టి వఱకు సంస్కారములు పదునాఱు.[1]

1. గర్భాధానము 2. పుంసవనము, 3. సీమంతోన్నయనము, జాతకర్మము, 5. నామకరణము, 6. నిష్క్రమణము, 7. అన్నప్రాశనము, చూడాకర్మము, 9. ఉపనయనము, 10 కేశాంతము, 11. వేదారంభము, సమావర్తనము, 13. వివాహము, 14. గృహస్థాశ్రమము, 15. సన్యాసము, అంత్యేష్టి.

జాతకర్మము నుండి వివాహము వఱకుఁ గల సంస్కారములు పదుఁ డని మహాభారతమునందుఁ జెప్పఁబడినది.

"విశ్వామిత్రుండు కుమారున కడ కరిగి యద్దేవు శరణంబు సొచ్చి ధవాక్యంబులం బ్రస్తుతించి తదాదేశమున నతనికి జాతకర్మాది ం లొనరించి" నట్లు వర్ణింపబడినది. —ఎఱ్ఱన. అరణ్య. 5. 212

మంగలాని చ సర్వాణి కౌమారాణి త్రయోదశ ।
జాతకర్మాదికా స్తస్య క్రియాశ్చక్రే మహామునిః ॥
—వ్యా.భా. వన. 226. 13**

భరతుఁడు కణ్వనిర్వర్తిత జాతకర్మాదిక్రియా కలాపుఁడు.[2]

పరాశరుఁ డుదయించి వశిష్ఠనిర్మితజాతకర్మాదికుండయినాఁడు.[3]

సంస్కారవిధులందు శిల్పప్రసక్తియు, త్వష్టృవిశ్వకర్మల ప్రశంసయు పించుచున్నది.

---

గాడు :- కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా పుట. 346, రామకృష్ణమిషన్ ప్రచురణ.

చూడు :- దయానంద సరస్వతీ : సంస్కారవిధిః ॥ —పు. 1.

"గర్భాద్యా మృత్యుపర్యంతాః సంస్కారాః షోడశైరపి."

"జాతకర్మాదికా వివాహాత్ ప్రాచీనా త్రయోదశక్రియా." — నీలకంఠ.

"బృహస్పతి యేతెంచి జాతకర్మాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి పోయె" నని శల్యపర్వమునందు వర్ణింపఁబడినవి. —తిక్కన. శల్య 3-716 = వ్యా.భా.శల్య. 454

నన్నయ, ఆది. 4. 63 3 నన్నయ. ఆది. 7. 132.

# సంస్కారవిధులలో శిల్పులపాత్ర

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః।
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు॥
—యజుర్వేద. 25-27

మానవుఁ డీలోకమున జన్మించినది మొదలు పరలోకము చేరువఱకు
్పులతో నవసరమున్నది. శిల్పులు లేకుండ నేపనియు జరుగదు.

సమస్తసంస్కారవిధులకు ముందు స్వస్తివాచనము, శాంతిమంత్ర
నము, హోమకార్యము జరుగుసు.

స్వస్తిపుణ్యాహవచన ప్రయోగవిధియందు పఠింపఁబడు ఋగ్యజు
్రమాథర్వణాది వేదమంత్రములందు, ఆయుర్వృద్ధికొఱకు జాతవేదుని,
తానాభివృద్ధికొఱకు త్వష్టృదేవుని, ధనసమృద్ధికి సవితృదేవుని ప్రార్థించు
ంత్రము లున్నవి.

ఆయురస్మై ధేహి జాతవేదః ప్రజాం త్వష్ట రధినిధేహ్యస్మై।
రాయస్పోషం సవిత రాసువాస్మై శతం జీవాతి శరదస్తవాయమ్॥
—అథర్వ. 2-29-2*

[ ఓ అగ్నీ! వీనికి పూర్ణాయుర్దాయము నిమ్ము. ఓ త్వష్టా వీనికి సంతానము
పఁగుము ఓ సూర్యుఁడా వీనికి సంపత్సమృద్ధి నిమ్ము. మీ యనుగ్రహవ
లన నితఁడు నూఱేండ్లు జీవించుగాక ! ]

దేవతాస్తుతి యనంతరము ఉత్తరకలశమును దక్షిణహస్తముతోను, ద
లశము నుత్తరహస్తముతోను గ్రహించి వాని యందలి జలములను
'రాద్వయముగా నొక పాత్రయందు పోయుచు "వాస్తోష్పతే ప్రతిజానీ
హ్యస్మాన్ స్వావేశో అనమీవో భవా నః" అను మంత్రమును పఠింతురు. 1

శాంతిప్రకరణము నందు ఇంద్రాదిదేవతలు మాకు సుఖ
లిగింతురు గాక యని వివిధదేవతలను ప్రార్థింతురు. 2

శన్న ఇంద్రో వసుభిర్దేవో అస్తు శమాదిత్యేభి ర్వరుణః సుశంసః।
శంనో రుద్రేభిర్ జలాషః శంనస్త్వష్టా గ్నాభిరిహ శ్రుణోతు॥ 6
శం న ఋభవః సుకృతః సుహస్తాః శం నో భవంతు పితరో హవే
—ఋగ్వేద.

---

చూడు :- శుక్ల శ్రీ శివరామ : సామవేదీయ సుబోధినీ పద్ధతిః ॥ పు. 42
చౌఖంబా సంస్కృత సీరీజ్ వారణాసి
. చూడు - దయానందసరస్వతి : సంస్కారవిధిః శాంతిప్రకరణము. పు. 11

**గర్భాధానము** :- కణ్వమహాముని కరుణించి శకుంతలకు 'దాని కోరిన వరం బిచ్చి యథాకాలవిధుల గర్భసంస్కారంబులు' చేయించినాఁడు.

—నన్నయ్య. ఆది. 4 63

గర్భాధానవిధియందు నిమ్నలిఖితమంత్రలముతో నాజ్యాహుతి నొసఁగ వలెను.[1]

విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు।
ఆసించతు ప్రజాపతి ర్ధాతా గర్భం దదాతు తే॥ —ఋగ్వేద 19. 24

ఈ మంత్రమునందు రూపకర్త యగు త్వష్టృదేవతా ప్రశంస యున్నది.

తతోఽనంతరం రుచిరశయ్యాయాం పత్నీసంయోగం కుర్యాత్.[2]

**పుంసవనము** :- 'శారదండాయని తనధర్మపత్ని శ్రుతసేనం బుత్రార్థంబు నియోగించిన నది బ్రాహ్మణవచనంబునం బుణ్యస్నాతయై పుంసవనహోమంబు సేయించి ఋత్విజులవలన దుర్జయాదులను గొడుకుల మువ్వురం బడసె'

— నన్నయ. ఆది. 5. 75

పుంసవన మనఁగా పురుష సంతానము కావలయు నను కోరికతో నొనరించు సంస్కారము.

పుంసవనహోమమునందు హిరణ్యగర్భుని, జగచ్ఛిల్పియగు విశ్వకర్మను త్వష్టృ దేవుని స్తుతించు మంత్రము లున్నవి.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్।
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ॥

— యజుర్వేద. 13-4

అద్భ్యః సంభృతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే।
తస్య త్వష్టా విదధద్ రూపమేతి తన్మర్త్యస్య దేవత్వ మాజానమగ్రే॥

—యజుర్వేద 31-13

పై మంత్రములు పఠించుచు పతి గర్భిణీస్త్రీ యొక్క గర్భాశయమును స్పృశించును.[3]

**సీమంతోన్నయనము** :- సీమంతోన్నయనసమయమున గృహమునకు వెలుపల పందిరి వేసి సామగానము వీణావాదనము చేయవలయును.[4]

---

1. చూడు :- దయానంద సరస్వతి : సంస్కారవిధిః ॥ పు. 34
2. చూడు :- శుక్ల శ్రీ శివరామ్ . సామవేదీయ సుబోధినీపద్ధతిః ॥ పు. 206
3. చూడు :- దయానంద సరస్వతి : సంస్కారవిధిః ॥ పు. 42
4 చూడు :- — అదే — పు. 46

ర్మము :- ప్రసవసమయ మాసన్నమైనంతనే రమ్యమయిన సమతల మునందు వాస్తువిద్యావిశారదులచేత తూర్పుముఖద్వారముగా గాని ముఖద్వారముగా గాని యొక సూతికాగృహమును నిర్మింపింపవలెను.

సుభూమౌ నిర్మితం రమ్యం వాస్తువిద్యావిశారదైః ।
ప్రాగ్ద్వార ముత్తరద్వార మథవా సుదృఢం శుభమ్॥

—విష్ణుధర్మోత్తరము.*

ఉత్తరపుత్త్రీగర్భమునందుద్భవించిన మృతజాతుని బ్రదికింతు నని ష్ణుడు "సూతికాగృహంబునకుం గుంతీప్రభృతులుతోడ రా నతండు నప్పు డది ధవళకుసుమసితసర్షపలాజ పూర్ణకుంభప్రముఖ మంగళ వ్యులను బ్రజ్వలితపావకప్రదీప్త శస్త్ర పిచుమందపల్లవాది భూతపరిహారక వ్యంబులను జతురవృద్ధాంగనా చికిత్సకదక్షపరిచారికాముఖ్య హితకారి పవర్తనంబునను బరిశోభితంబయి యుండె. —తిక్కన. అశ్వమేధ. 3. 189

సూతికాగృహనిర్మాణము, పూర్ణకుంభాది మంగళవస్తుసంపాదనము )ల పనియే.

జాతకర్మసంస్కారాంతర్గతమయిన "మేధాజననవిధి" యందు తండ్రి గా రు శ లా క తో శి శు వు న కు మంత్రపూర్వకముగా మధుఘృతములను చూపించును.

కుమారం జాతం పురాఽన్యైరాలంభాత్ । సర్పిర్మధుని
హిరణ్యనికాషం హిరణ్యయేన ప్రాశయేత్ ॥**

అట్లు చేయుట వలన శిశువునకు మేధాశక్తి కలుగును.[1]

మేధాజననకర్మ యందు వినియోగింపఁబడు మేధాసూక్తము నంద )కళాచతురులయిన ఋభువుల ప్రశంస కలదు.

యాం మేధా మృభవో విదు ర్యాం మేధా మసురో విదుః ।
ఋషయో భద్రాం మేధాం యాం విదుస్తాం మయ్యావేశయామసి॥

—అథర్వ. 6.1(

---

చూడు :- రాజబలీ పాండేయ : హిందూసంస్కార్, పు. 61
Cf :- V A K Iyer : HINDU SASTRAS AND SAMSKARAS —p
"The room should be in the South West corner of a house the ground should be even."
చూడు :- దయానందసరస్వతి : సంస్కారవిధిః ॥ పు. 48
Cf :- V A. K. Iyer : Hindu Sastras and Samskaras —P.
"The action bestows the child with Medha or intelligence."

**అన్నప్రాశనము :-** అన్నప్రాశనసమయమున బంగారుగిన్నె యందు మధ్వాజ్యయుక్తమైన పాయసమును బిడ్డచేత తినిపించవలయును.

మధ్వాజ్యకనకోపేతం ప్రాశయేత్ పాయసం తు తమ్॥

ఈ సమయముననే వివిధవస్తువుల నొకచోట చేర్చి జీవికా పరీక్ష జరుపుదురు. బాలుఁడు గాని, బాలిక గాని మొట్టమొదట ఏవస్తువును ముట్టుకొనునో దానితో జీవన ముండు నని విశ్వసింతురు.

ఈ వస్తుసముదాయమునందు శిల్పోపకరణములు గూడ నుండును.

తదగ్రే పుస్తకాయుధవస్త్రశిల్పాని విన్యస్య జీవికాపరీక్షాం కారయేత్ ।
శిశుః స్వేచ్ఛయా యత్ ప్రథమం స్పృశేత్ సా తస్య జీవికేతి విద్యాత్॥*

**కర్ణవేధ :-** మూఁడవసంవత్సరమునఁ గాని ఐదవసంవత్సరమునఁ గాని రక్షకొఱకు భూషణార్థము బాలబాలికలకు కర్ణవేధ యొనరింతురు.

రక్షాభూషణనిమిత్తం బాలస్య కర్ణౌ విధ్యేత్ ॥
—సుశ్రుతసంహిత. శరీర. 16 ।

సువర్ణసూచితో వేధించిన శుభప్రద మని చెప్పఁబడినది.

శాతకుంభమయీ సూచీ వేధనే శోభనప్రదా ॥
—బృహస్పతి.

రాజపుత్రులకు స్వర్ణముతోను, విప్రవైశ్యులకు వెండితోను శూద్రులకు ఇనుముతోను జేయఁబడిన సూచికతో కర్ణవేధ యొనరింపవలయు ననియు నాసూచి యెనిమిదంగుళముల పొడవుండవలయుననియుఁ జెప్పఁబడినది.

సౌవర్ణీ రాజతస్య రాజతీ విప్రవైశ్యయోః ।
శూద్రస్య చాయసీ సూచీ మధ్య మాష్టాంగులాత్మికా ॥**

సాధారణముగా కర్ణవేధకు వంశపారంపర్యముగా ననుభవజ్ఞులయిన స్వర్ణకారులనే యాహ్వానింతు రని రాజబలీ పాండే వక్కాణించినాఁడు.[1]

---

* చూడు :- సామవేదీయసుబోధినీపద్ధతే - అన్నప్రాశనప్రయోగః ॥ పు. 221

** చూడు :- డా॥ రాజబలీ పాండేయ : హిందూసంస్కార్. పు. 131

1. ,, ,, ,,

## చౌలోపనయనములు

చౌలము = చూడాకరణము = కేశచ్ఛేదనసంస్కారము.

మూఁడవ యేటఁగాని, మూఁడుభాగములు గడచిన యైదవ యేటఁ గాని చేయఁబడు కేశసంస్కారము చౌలము.

తృతీయే వర్షే చౌలమ్॥ —ఆశ్వలాయనగృహ్యసూత్రము

తృతీయవర్షేఽథ పంచమేఽబ్దే గతత్రిభాగే
ప్రవదంతి చౌలమ్॥ —ముహూర్తదర్పణము

ఉపనయన వివాహాది శుభకార్యములందు ముందుగాఁ జేయఁబడు వపనసంస్కారము గోదానము. ఇట గోశబ్దమునకు కేశ మనియు దానశబ్దమునకు ఛేదన మనియు నర్థము.[1] ఇట్టిదే కేశాంతమును.

ఆయమగన్త్సవితా క్షురేణోష్ణేన వాయ ఉదకేనేహి॥ —అధర్వ. 6. 68-1

[ ఈ సూర్యుఁడు వపన సాధనమైన కత్తితో పాటు వచ్చినాఁడు. ఓ వాయూ నీవు వేడి నీళ్లు తీసికొని రా. ]

ఉపనయన మన బ్రహ్మోపదేశమునకై (బాలుని) గురు సమీపమునకుఁ బంపుట [బ్రహ్మోపదేశాయ గురోః ఉప సమీపే నయనం ప్రాప్త మితి].

విధ్యుక్తముగా నుపనయము చేయఁదగిన వయఃకాలములను గూర్చి గృహ్యసూత్రము లిట్లు చెప్పుచున్నవి.

అష్టమే వర్షే బ్రాహ్మణ ముపనయేత్॥ గర్భాష్ట మే వా॥
ఏకాదశే క్షత్రియమ్॥ ద్వాదశే వైశ్యమ్॥ —ఆశ్వలాయనగృహ్యసూత్రమ్

"వసంతే బ్రాహ్మణ ముపనయతి గ్రీష్మే రాజన్యం శరది వైశ్యం
వర్షాసు రథకార మితి" —బౌధాయనగృహ్యసూత్రమ్. 1-4-2

వసుదేవుఁడు తన పురోహితుండైన కశ్యపబ్రహ్మర్షిని పంపగా,

"అకశ్యపుండును జనుదెంచి పృథామాద్రీసహితుండయి యున్న పాండురాజుం గని వసుదేవు సందేశంబుఁ జెప్పి యక్కుమారులకు రత్నభూషణాంబరము లిచ్చి క్రమంబునఁ జౌలోపనయనంబు లొనరించి వేదాధ్యయనంబు సెయించుచుండె" —నన్నయ్య. ఆది. 5. 137

---

1. చూడు :- సుఖమయ భట్టాచార్య : మహాభారతకానలీసమాజ్. పు 61
అనువాదికా. పుష్పాజైన్ – లోకభారతీప్రకాశన్, అలహాబాద్.

"జాతకర్మాణి సర్వాణి వ్రతోపనయనాని చ
గోదానాని వివాహాశ్చ తథా యజ్ఞసమృద్ధయః॥" —వ్యా భా. అను. 95-2

చూడాకర్మము, ఉపనయనము, కేశాంతము, వివాహము. సీమంతోన్నయనము నను నైదు సంస్కారవిధులందు ముందుగా నింటిముందు పందిళ్లు వేయవలెను.

" పంచసు బహిఃశాలాయా వివాహే చూడాకరణోపనయనే
కేశాంతే సీమంతోన్నయన ఇతి "—పారస్కరగృహ్యసూత్రము. 1-4-2*

బహిఃశాలానిర్మాణము దారుశిల్పుల పని.

మేధాజనన గోదానోపనయనకర్మలందు వినియోగింపఁబడు మంత్రములందు త్వష్టృదేవతా ప్రార్థనమున్నది.

త్వష్టా నో అత్రి వరీయః కృణోత్వను
నో మార్ష్టు తన్వోఽయద్ విరిష్టమ్॥ —అథర్వ. 6-53-3**

[ త్వష్ట - విశ్వకర్మపరమేశ్వరుడు[1] - మాదేహమునందలి రోగ పీడితాంగములను స్పృశించి, స్వస్థతగూర్చి, మాకు శరీరపుష్టి నొసఁగుఁగాగ ! ]

ఉపనయనసంస్కారవిధియందు స్వస్తిపుణ్యాహవాచనము, యజ్ఞోపవీతధారణము, మౌంజీబంధము, గాయత్రిమంత్రోపదేశము, దండధారణము, గోదానము, సూర్యదర్శనము, అగ్నికార్యము, బ్రహ్మచర్యదీక్ష - ఇత్యాది క్రియలున్నవి.

యజ్ఞోపవీతము ధర్మదీక్షాచిహ్నము.

యజ్ఞోపవీతం పరమంపవిత్రం ప్రజాపతే ర్యత్ సహజం పురస్తాత్
ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥

యజ్ఞోపవీతము పరమపవిత్రమైనది అది ప్రజాపతికి సహజమైనది. యజ్ఞోపవీతధారణమువలన నాయుర్వృద్ధి, శుభ్రత, బలము, తేజము కలుగును.

హోమానంతర మాచార్యుఁడు కుమారునకు గాయత్రీమంత్రోపదేశము చేయును.

ఓం భూర్భువస్సువః ఓం తత్ సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్॥

—ఋగ్వేద. 3-62-10

ఈ మంత్రార్థము వేఱొక ప్రకరణమునందు వివరింపఁబడును.

---

* చూడు :- రాజబలీపాండే : హిందూధర్మసంస్కార్ పు. 164-65

** చూడు :- తెలుగు అథర్వవేదసంహిత - 3. పు. 130-133

అనువాదం : కళాప్రపూర్ణ డాక్టర్ విద్వాన్ విశ్వం, —తి.తి. దేవస్థాన ప్రచురణ.

1. చూడు :- క్షేమంకరణదాస్ త్రివేది : అథర్వవేదభాషాభాష్యము. పు. 117

—దయానందసంస్థాన్ ప్రచురణ.

## వేదారంభము

గాయత్రీమంత్రోపదేశానంతరమా దినముననుగాని మఱియొక శుభదినముననుగాని తండ్రిగాని యాచార్యుడుగాని సాంగోపాంగముగా [1] వేదాధ్యయనము చేయుటకు వటువునకు బ్రహ్మచర్య వ్రతదీక్ష యొసంగును అదియే వేదారంభసంస్కారము

యథే మాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః ।
బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ॥

—శుక్ల యజుర్వేదము. 26-2

[కల్యాణకరమైనవేదవాక్కులను నేను బ్రాహ్మణుల కొఱకు రాజన్యుల కొఱకు, శూద్రులకొఱకు, వైశ్యులకొఱకు, సేవకులకొఱకు, పరదేశీయులకొఱకు - సర్వమానవులకొఱకు, పలుకుచున్నాను.] [2]

ఆద్యంతరహితమును, నిత్యము నయిన వేదవాణిని స్వయంభువుడైన ప్రజాపతి మనకు ప్రసాదించినాడు.

అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా॥ —వ్యా॥ భా.శాంతి 232-25

కావున సర్వమానవులు వేదాధ్యయనము చేసి విజ్ఞానవంతులు కావలయును.

వేదశాస్త్రములలో నథర్వవేదమున కుపవేదమయిన స్థాపత్యవేద మొకటి.

విశ్వకర్మ, త్వష్ట, మయుడు మొదలుగాగల శిల్పాచార్యులచే రచింపబడిన శిల్పశాస్త్రగ్రంథములు గల యర్థవేదము [శిల్పశాస్త్రము] నధ్యయనము చేసి విమాన, తార, భూగర్భాది విద్యలను సాక్షాత్కరించుకొనుట కాఱు సంవత్సరములు పట్టును. [3]

---

1. చూడు - దయానందసరస్వతి : సంస్కారవిధిః పు. 79

| | | |
|---|---|---|
| వేదములు | : | ఋగ్యజుస్సామాథర్వణములు. |
| ఉపవేదములు | : | ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము [స్థాపత్యవేదము] |
| అంగములు | : | శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిషము |
| ఉపాంగములు | : | పూర్వమీమాంస, న్యాయవైశేషికములు, సాంఖ్యయోగములు, వేదాంతము |
| బ్రాహ్మణములు | : | ఐతరేయ, శతపథ, సామ, గోపథబ్రాహ్మణములు |

2. Cf :- Abinash Chandra Bose : THE CALL OF THE VEDAS -p. 2 "The Veda states that its words are for all MANKIND, not to limited to any particular group or nationality."

3. చూడు :- దయానందసరస్వతి : సంస్కారవిధిః ॥ పు. 101

వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వతః ॥ —మనుస్మృతి. 2-240

బ్రాహ్మణక్షత్రియకుమారులు, వేదములతో పాటు ధనుర్వేదము నభ్యసించుచున్నట్లు భారతము నందు వర్ణింపఁబడినది.

గౌతముండను బ్రసిద్ధుఁడయిన ముని తనయుఁడు శరద్వంతుఁడు తన కొడుకైన కృపాచార్యున కుపనయనము చేసి వేదములు, ధనుర్వేదము చదివించినాఁడు.

చనుదెంచి శరద్వంతుం డనవద్యుఁడు తన యపత్య మని వారిని శం
తనున కెఱిఁగించి కృపు నత్యనుపము, నుపనీతుఁజేసె నధికప్రీతిన్॥

వేదంబుల్ చదివించె భూసురులతో విఖ్యాతిగా నాత్మసం
వేదిం జేసెఁ జతుర్విధంబగు ధనుర్వేదంబు నానాస్త్రవి
ద్యాదాక్షిణ్యముతోడఁ దానఁ గఱపెన్ దద్వృత్తముల్ సూచి సం
వాదుల్గాఁ దననందనుం గృపు శరద్వంతుండు దాంతాత్ముఁడై

—నన్నయ. ఆది. 5. 189, 90

శస్త్రాస్త్రములు నిర్మించువారు కర్మారులు.

గురుకులమునందు విద్యాభ్యాసము పూర్తియైనంత, "సవినయంబునఁ దనశక్తితో గురునకు దక్షిణయిచ్చి యాతండు వనుపఁగా సమావర్తనకార్యంబు నడపి" వివాహంబు గావలయును.[1]

సమావర్తనానంతరము స్నాతకుఁడు కాషాయాంబరములు ధరించి బ్రాహ్మణక్షత్రియవైశ్యరథకారులనుండి యపక్వపదార్థములను గాని, భిక్షను గాని గ్రహించుచు గృహస్థాశ్రమము స్వీకరించునంతవఱకు బ్రహ్మచారిగా జీవితము గడపవలయును. ఇది స్నాతకధర్మము.

బ్రహ్మరాజన్యవైశ్య రథకారేష్వామంలిప్సేతి । భైక్ష్యంవా॥

—బోధాయన. 1-3, 9, 10*

ఇట్లు కొంతకాలము గడిపి గృహస్థాశ్రమమును స్వీకరింపవలయును.

1. తిక్కన. శాంతి. 5-129 = వ్యా.భా. శాంతి. 242. 29

"వేదవ్రతోపవాసేన చతుర్థేచాయుషోగతే ।
గురవే దక్షిణాం దత్త్వా సమావర్తేద్ యథావిధి॥

* చూడు :- చర్ల గణపతిశాస్త్రి : ఆర్షధర్మసూత్రము. పు. 56-59

## వివాహము

కన్యాదానం శచీయోగో వివాహో౽థ చతుర్థికా ।
వివాహమేతత్ కథితం యత్ర కర్మ చతుష్టయమ్॥
—అగ్నిపురాణము. 154. 3, 4*

కన్యాదానము, శచీపూజ, వివాహము [పాణిగ్రహణము], చతుర్థిక [సమావేశనము] అను నాలుగు కర్మలు గల సంస్కారమును వివాహమందురు.

మహాభారతకాలమునందు అగ్నిసాక్షిగా సాలంకృతకన్యాదానము చేయు సంప్రదాయ మున్నది.

ద్రౌపదీస్వయంవరానంతరము ద్రుపదుఁడు తన పుత్రిక యగు కృష్ణకు మంగళస్నానము చేయించి రత్నభూషణాలంకృతను గావించినాఁడు.

సమానయామాస సుతాం చ కృష్ణా మాప్లావ్య రత్నైర్ బహుభిర్విభూష్య॥
—వ్యా భా. ఆది. 197-6

ద్రౌపది యధికవిదగ్ధపుణ్యాంగనావిరచిత లలితప్రసాధనాలంకృతాంగియై హిరణ్మయవేదీ సమిద్ధాగ్నికుండ మండితమై యొప్పు వివాహమండపమునకు వచ్చినది.[1]

పాండవులేవురుఁ గృతమంగళాభిషేకులు, ధృతసముచితవేష ప్రశస్త రత్నభూషణులు నయి యేతెంచిరి.[2]

వివాహమునందు హోమము ప్రధానము. పురోహితుఁడు వేదమంత్రములతో హోమము చేసినాడు.

తతః సమాదాయ స వేదపారగో
జుహావ మంత్రైర్ జ్వలితం హుతాశనమ్॥—వ్యా.భా. ఆది. 197-11*

వితత ప్రదక్షిణావర్తిత దీపశిఖానలమున ధృతి వేల్చెఁ
బురోహితుఁడగు ధౌమ్యుఁడు బుధసమ్మతుఁడు
వివాహప్రయుక్త మంత్రోక్తులన్॥ —నన్నయ్య. ఆది. 7.

* చూడు - కావ్యతీర్థ బంకుపల్లె మల్లయ్యశాస్త్రి. వివాహతత్త్వము.

1, 2 :- నన్నయ. ఆది. 7. 283, 84

** పోల్చు :- వ్యాస : భాగవతమహాపురాణము. 10-53-12

చక్రుః సామర్గ్యజుర్మంత్రైః బధ్వా రక్షాం ద్విజోత్తమాః ।
పురోహితో౽థర్వవిద్ వై జుహావ గ్రహశాంతయే॥

వివాహప్రయుక్త మంత్రాహుతులందు త్వష్టృ విశ్వకర్మలకు భాగమున్నది.

త్వష్టా జాయామజనయత్ త్వష్టాస్యై త్వాం పతిమ్ ।
త్వష్టా సహస్రమాయూంషి దీర్ఘమాయుః కృణోతు వామ్॥
—అథర్వ. 6-78-3*

త్వష్టృదేవుఁ డీస్త్రీని - భార్యను - సృష్టించినాడు. ఓవరుఁడా! ఆ త్వష్టయే నిన్నీ స్త్రీకి పతిగా జనింపఁజేసినాఁడు. అట్టి త్వష్టృ దేవుఁడు మీకు దీర్ఘాయువు నొసఁగుఁగాక.

హోమసమయమున ద్వాదశరాష్ట్రభృతాజ్యాహుతులందు విశ్వకర్మ సంబంధములగు నీ క్రింది మంత్రములు పఠింతురు.[1]

ఓం ప్రజాపతిర్విశ్వకర్మా మనోగంధర్వః....
ఇదం ప్రజాపతయే విశ్వకర్మణే మనసే గంధర్వాయ ఇదం న మమ॥ 11

అట్లే అష్టాదశాభ్యాతానాజ్యాహుతులందు త్వష్టృదేవునకు స్థానము గలదు.

ఓం తృష్టారూపాణామధిపతిః.... ఇదం త్వష్ట్రే రూపాణా
మధిపతయే ఇదం న మమ॥ 15

"ఇట్లు వేల్చి ముందఱ ధర్మపుత్రునకు ద్రుపదరాజపుత్రిం బాణి గ్రహణంబు సేయించి........ యక్కన్యకం గ్రమంబున భీమార్జుననకుల సహదేవులకుం బాణిగ్రహణంబు సేయించి"[2] ధౌమ్యపురోహితుఁడు దంపతుల చేత నగ్నిహోత్రము చుట్టు ప్రదక్షిణము చేయించినాఁడు.

ప్రదక్షిణం తౌ ప్రగృహీతపాణీ
సమానయామాస స వేదపారగః ॥ —వ్యా.భా. ఆది. 197-12

పాణిగ్రహణానంతరము సప్తపదీగమనము చేసిననే కాని వివాహము పూర్తిగాదు.

పాణిగ్రహణమంత్రాణాం నిష్ఠా స్యాత్ సప్తమే పదే॥—వ్యా భా, అను. 44-55

వధువు వరుని గృహము ప్రవేశించిన తరువాత ప్రవేశహోమము, శేషహోమము నను హోమకార్యములు జరుపవలయును

---

* చూడు :- డాక్టర్ విద్వాన్ విశ్వం : తెలుగు అథర్వవేద సంహిత. 3. పు. 195.
చర్ల గణపతిశాస్త్రి : ఉపనయన వివాహవిధి. పు. 196

1. చూడు :- దయానంద సరస్వతి : సంస్కారవిధిః॥ పు. 132-133

2. నన్నయ్య. ఆది: 7-236

భారతమునందు అష్టవిధ వివాహములు పేర్కొనఁబడినవి.

అష్టావేవ సమాసేన వివాహా ధర్మతః స్మృతాః।
బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః ॥
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమః స్మృతః।
తేషాం ధర్మాన్యథాపూర్వం మనుః స్వాయంభువోఽబ్రవీత్॥
—వ్యా.భా. 73. 8, 9*

అష్టవిధ వివాహములందు బ్రాహ్మ, దైవ, ప్రాజాపత్యవివాహము లందు సాలంకృతకన్యాదానము చెప్పఁబడినది.

బ్రాహ్మో వివాహ ఆహూయ దీయతే యథా శక్త్యలంకృతా॥
—యాజ్ఞవల్క్య.శ.

ఋత్విజే వితతే కర్మణి దద్యాదలంకృత్య స దైవః ॥
—ఆపస్తంబగృహ్యసూత్ర. 1-6

అలంకృత్యైవ కన్యాయా వివాహః స ప్రజాపతేః ॥
—వీరమిత్రోదయము. 2. పు. 851

శాస్త్రవాక్యము లెట్లున్నను అష్టవిధ వివాహము లన్నింటను కన్యలు సాలంకృతలే.

కుంతీ మాద్రీ దమయంతీ ద్రౌపదీ సుభద్రాది రాజకన్యల వివాహము లిందుకు నిదర్శనములు.

అలంకారార్థ మాభరణములు చేయువారు స్వర్ణశిల్పులు.

వివాహోత్సవమునందు వివాహమండపము, యజ్ఞవేదిక, హోమార్థ మగ్నికుండము, మంగళ్యాభరణములు, వధువు వరునింటికిఁ జేరుటకు రథము, కేళీగృహము, శయ్యాసనములు మొదలగునవి చేయువారు శిల్పకళాకారులే.

---

* బ్రాహ్మః అలంకృత్య కన్యాదానమ్ । తద్వదేవ యజ్ఞాంతే ఋత్విజే దానం దైవః ।
సహోభౌ ధర్మం చరతామితి బుధ్యా దానం ప్రాజాపత్యః ।
వరాద్గోమిథునం శుల్కం గృహీత్వా దాన మార్షః ॥ —నీలకంఠ.
బహు ధనం గృహీత్వా దాన మాసురః ॥ —బోధాయన. 1-11-6
సకామేన సకామాయాం మిథస్సంయోగో గాంధర్వః ॥
సుప్తానాం ప్రమత్తానాం వాపహరేత్ స పైశాచః । —నీలకంఠ
హత్వా ఛిత్వా చ శీర్షాణి రుదతీం రుదద్భ్యోహరేత్ స రాక్షసః ॥

## గృహస్థాశ్రమము

ఇహైవ స్తం మా వి యౌష్టం విశ్వమాయుర్ వ్యశ్నుతమ్ ।
క్రీడంతౌ పుత్రైర్నప్తృభిర్మోదమానౌ స్వే గృహే॥ –ఋగ్వేద. 10. 85 42

ఓ దంపతులారా! మీరు వివాహకాలమునందు చేసిన ప్రమాణమునకు భంగమువాటిల్లనీయక, గృహస్థాశ్రమధర్మములను పాటించుచు చిరంజీవులై పుత్రపౌత్రులతో నాడుకొనుచు మీ గృహమునం దానందముగా నుందురుగాక!

గృహస్థుఁడు ప్రయత్నపూర్వకముగా నిష్టాపూర్తములు చేయవలెను. ఇష్టము వలన స్వర్గము, పూర్తము వలన మోక్షము గలుగును. [1]

ఇష్టం పూర్తం ప్రకర్తవ్యం బ్రాహ్మణేన ప్రయత్నతః ।
ఇష్టేన లభతే స్వర్గం పూర్తేన మోక్ష మాప్నుయాత్॥ —అతిల. 45

గృహస్థాశ్రమధర్మములు నిర్వర్తించుటకు శిల్పుల సాహాయ్యమెంతేని యవసరము.

## వానప్రస్థము

గృహస్థధర్మమునందుఁ గృతకృత్యుఁడై, "......అగ్ని విడువక డపిఁ బూరిపంటలఫలమూలములను భిక్షు పూజసలుపుచుఁ బరిశిష్టములు భుజించి తపముసేత వానప్రస్థ ధర్మ సరణి" —తిక్కన శాంతి. 5.139

వానప్రస్థాశ్రమము స్వీకరించు సమయమున గృహ్యాగ్ని యందు స్థాలీపాకము చేసి త్వష్ట్రాది దేవతల కాహుతు లొసఁగి యగ్నిహోత్రమును తత్సంబంధితసామగ్రినిగొని వనమునకుఁ బోవలెను. [2]

త్వష్ట్రే స్వాహా । త్వష్ట్రే తురీపాయస్వాహా । త్వష్ట్రే పురురూపాయస్వాహా ।

యయాతి... యదుప్రభృతులఁ బ్రత్యంతభూములకు రాజులం జేసి తాను వేదవేదాంగపారగులయిన బ్రాహ్మణులతోడం దపోవనంబునకుం జని యందుఁ గందమూలఫలాశనుండై వన్యంబులయిన ఫలంబుల హవ్యకవ్యంబుల నగ్నిభట్టారకుం బితృదేవతలం దనుపుచు వానప్రస్థవిధానం బుఁదప్పక... నియతాత్ముండై... తపంబు సలిపె. —నన్నయ్య. ఆది. 3-201

వానప్రస్థునకు అగ్నినుంచుకొనుటకు మాత్ర మొక యిల్లు కావలయును "అగ్న్యర్థం శరణం" —ఆపస్తంబ. 2-9. 22-21

అగ్నిశరణములు - అగ్నిహోత్రగృహములు - నిర్మించువారు శిల్పులే.

1. చూడు :- చర్ల గణపతిశాస్త్రి : ఆర్షధర్మసూత్రము. పు. 106
2. చూడు :- దయానంద సరస్వతి : సంస్కారవిధిః ॥ పు. 220

## సన్యాసము

ఆశిల్పజీవీ గుణవాన్శ్చైవ నిత్యం జితేంద్రియః సర్వతో విప్రయుక్తః
అనోకశాయీ లఘురల్పప్రచారశ్చరన్ దేశానేకచరః స భిక్షుకః ॥

—వ్యా.భా. ఆది. 91.5

వానప్రస్థాశ్రమానంతరము శిల్పోపజీవనుఁడు కాక, శమదమాది గుణయుక్తుఁడై జితేంద్రియుఁడై సర్వసంగపరిత్యాగముచేసి, యొక యింటియందు శయనింపక యల్లనల్లన దేశాటనము చేయువాఁడు భిక్షుకుఁడు.

"పుణ్యంబులైన యరణ్యంబులను శూన్యగృహముల దేవతాగృహము లందు, గుహలను నిలుచుచుఁ గుడుపు భిక్ష నొనర్చి" శేషజీవితము గడపుట యతిధర్మము. —తిక్కన అను. 3-312

అశిల్పజీవి యైనను సన్యాసి శిల్పినిర్మితములయిన శూన్యగృహము లందును, దేవాలయాదులందును నిలువక తప్పదు.

## అంత్యేష్టి

పాండురాజున కంతిమసంస్కారము పరమపవిత్రస్థలమునఁ గావింపఁ బడినది. మాద్రీపాండురాజుల యస్థికలను గొనిపోవు శిబికను గంధపుష్ప వస్త్రాదులతో సలంకరించి దానిపై ఛత్రచామరములుంచి, మేళతాళములతో గంగాతీరమునకుఁ గొనిపోయిరి. బంధుజనులు సర్వగంధాధివాసితములయిన యస్థికలను సువర్ణకలశములతోఁగొని తేఁబడిన గంగాజలములతో నభిషేకించిరి.

అథైనామార్తవైః పుష్పైర్ గంధైశ్చ వివిధై ర్వరైః ।
శిబికాం తా మలంకృత్య వాససాచ్ఛాద్య సర్వశః ॥.........

అవహన్ యానముఖ్యేన సహమాద్ర్యా సుసంయుతమ్ ।
పాండురేణాతపత్రేణ చామరవ్యజనేన చ
సర్వవాదిత్రనాదైశ్చ సమలంచక్రిరే తతః ॥........

తత స్తస్య శరీరం తు సర్వగంధాధివాసితమ్ ।
పర్యషించజ్జలేనాశు శాతకుంభమయై ర్ఘటైః ॥—వ్యా భా. ఆది. 126-7-20

ఇట శిబికలు, ఛత్రచామరములు, శాతకుంభమయకలశములు నిర్మించు వారు శిల్పులే. కావున అంత్యేష్టి యందును శిల్పుల యవసరమున్నది.

ఈవిధముగా షోడశసంస్కారములందు శిల్పులపాత్ర ప్రశంసనీయమై యున్నది

# యజ్ఞశిల్పము - సమీక్ష

మహాభారతకాలమున రాజులు ప్రజాశ్రేయస్సును గోరి యజ్ఞములు చేయుచుండిరి.

యజ్ఞనిర్వహణార్థము యజ్ఞశాలా యజ్ఞవేదీ యజ్ఞకుండాదులు నిర్మించుటకు స్థాపత్యవేదవేత్తలయిన స్థపతులను - శిల్పాచార్యులను - నియమించుచుండిరి.

స్రుక్స్రువాది యజ్ఞోపకరణములు చేయువారు శిల్పులే. అవి దారుమయములైన దారుశిల్పులు, హేమమయములయిన స్వర్ణకారులు చేయుచుండిరి, మరుత్తుని యజ్ఞమునందు యజ్ఞోపకరణములను స్వర్ణకారులే చేసిరి. దుర్యోధనుని వైష్ణవయాగమునందు యజ్ఞభూమిని దున్నుటకు స్వర్ణలాంగలమును నిర్మించినవారు స్వర్ణశిల్పులే.

యూపస్తంభములు దారువికృతములే కాని యవి హిరణ్మయము లయినపుడు వానిని తక్షకులు, స్వర్ణకారులు గలిసి చేయుచుండిరి.

యజ్ఞములను జూడ వచ్చిన రాజులు బ్రాహ్మణాదులు నివసించుటకుఁ దగిన వసతిగృహములు వాస్తువిద్యావిశారదులయిన స్థపతులు నిర్మించుచుండిరి.

యజ్ఞములయందెల్లయెడల విశ్వకర్మత్వష్ట్రాది శిల్పాభిమానిదేవతల స్తోత్రములున్నవి.

ఈ విధముగా మహాభారతకాలమున యజ్ఞనిర్వహణమునందు శిల్పాచార్యులు ప్రముఖపాత్ర వహించుచుండిరి.

యజ్ఞములు - శిల్పయజ్ఞములు - మాకు సర్వశుభములు కలిగించుగాక !

ఆ నో భద్రాః క్రతవో యంతు సర్వతః ॥ —ఋగ్వేద 1-89-1



# అనుబంధము

## విశ్వకర్మ సూక్తము - 1

విశ్వకర్మా భౌవనః ఋషిః విశ్వకర్మా దేవతా॥

య ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్ పితా నః ।
స ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాం ఆ వివేశ॥ 1

కిం స్విదాసీదధిష్ఠానమారంభణం కతమత్స్విత్కథాసీత్ ।
యతో భూమిం జనయద్విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః ॥ 2

విశ్వతఃచక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్ ।
సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్దేవ ఏకః ॥ 3

కిం స్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః ।
మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్ భువనాని ధారయన్॥ 4

యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా ।
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః ॥ 5

విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ పృథివీముత ద్యామ్ ।
ముహ్యంత్వన్యే అభితో జనాస ఇహాస్మాకం మఘవా సూరిరస్తు॥ 6

వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే మనోజువం వాజే అద్యా హువేమ ।
స నో విశ్వాని హవనాని జోషద్ విశ్వశంభూ రవసే సాధుకర్మా॥ 7

—ఋగ్వేద. 10, 81*

---

* చూడు :- దయానంద సరస్వతి : ఋగ్వేద భాషాభాష్యము.

" తత్రేతిహాసమాచక్షతే -
విశ్వకర్మా భౌవనః సర్వమేధే సర్వాణి జుహవాంచకార
స ఆత్మానమప్యన్తతో జుహవాంచకార తదభివాదిన్యేషర్గ్భవతి
య ఇమా విశ్వా భువనాని జుహ్వ దితి॥ —నిరుక్త. 10-26

విశ్వకర్మసూక్తము కించిద్భేదముతో కృష్ణయజుర్వేదమునందును గలదు.

Cf :- Ralph T. H. Griffith : The Hymns of the Rigveda. Notes
" VISVAKARMAN the Omnific, is represented in this hym as the Universal Father and Generator, the Creator of a things and Architect of worlds. "

# విశ్వకర్మసూక్తము - 2

విశ్వకర్మా భౌవనః ఋషిః । విశ్వకర్మా దేవతా॥

చక్షుషః పితా[1] మనసా హి ధీరో ఘృతమేనే అజనన్నమ్నమానే ।
యదేదంతా అదదృహన్త పూర్వం ఆదిద్ ద్యావాపృథివీ అప్రథేతామ్॥ 1

విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సంద్రృక్ ।
తేషామిష్టాని సమిషా మదంతి యత్రా సప్తఋషీన్పర ఏకమాహుః ॥ 2

యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా ।
యో దేవానాం నామధా ఏక ఏవ తం సంప్రశ్నం భువనా యంత్యన్యా॥ 3

త ఆయజంత ద్రవిణం సమస్మా ఋషయః పూర్వే జరితారో న భూనా ।
అసూర్తే సూర్తే రజసి నిషత్తే యే భూతాని సమకృణ్వన్నిమాని॥ 4

వరో దివా పర ఏనా పృథివ్యా పరోదేవేభిరసురైర్యదస్తి ।
కం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమపశ్యంత విశ్వే॥ 5

త మిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్రదేవాః సమగచ్ఛంత విశ్వే ।
అజస్య[2] నాభావధ్యేకమర్పితం యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః ॥ 6

న తం విదాథ య ఇమా జజానాన్యద్యుష్మాకమంతరం బభూవ ।
నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరంతి॥ 7

—ఋగ్వేద. 10 82*

---

1. చక్షుషః పితా :- "The father of the eye : VISVAKARMAN who made the Light which enables the eye to see"

2. అజస్య :- "The Unborn, AJA, seems here to be identified with VISVAKARMAN"

[Ralph T H Griffith : The Hymns of the RIGVEDA Vol II P. 498)

* పోల్చిచూడు .. 1) కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత, 4-6-2
2) శుక్లయజుర్వేద వాజసనేయసంహిత 17-11-32

ఈ విశ్వకర్మ సూక్తద్వయముతో వైశ్వకర్మణ హోమము చేసిన దురితక్షయమగునని చెప్పబడినది.

[ చూడు :- పుటలు. 43-45 ]

# శ్రీ విశ్వకర్మ భగవాన్



విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్పప్రజాపతిః ।

కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః ॥

భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాంవరః ।

యో దివ్యాని విమానాని త్రిదశానాం చకారహ ॥

మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః ।

పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్ ॥

# శ్రీమదాంధ్రమహాభారతశిల్పకళాదర్శనము

## చతుర్థోన్మేషము

## పూర్తశిల్పము

పూర్ణం నారి ప్రభర కుంభమేతం ఘృతస్య ధారా మమృతేన సంభృతామ్ ।
ఇమాం పాత్యా నమృతేనా సమ గ్ధీష్టాపూర్తమభి రక్షాత్యేనామ్॥

—శాలాసూక్తము. అథర్వ. 3-12-8*

ఓనారీ! అమృతమయమైన ఘృతధారలతో నిండిన పూర్ణకుంభమును గొనిరమ్ము. దీనిని - ఈశాలను - పాలించువారి నమృతముతో ముంచెత్తుము. ఇందు చేయబడు నిష్టాపూర్తములు - శ్రౌతస్మార్త దానాదిపుణ్యకర్మములు - ఈశాలను రక్షించుగాక.

యద్దత్తం యత్ పరాదానం యత్ పూర్తం యాచ్చ దక్షిణాః ।
తదగ్నిర్ వైశ్వకర్మణః స్వర్దేవేషు నో దధత్॥ —శు. య. 18.64

మా దానధర్మములు, పుణ్యకార్యములు, పూర్తశిల్పములు యజ్ఞదక్షిణలు - వీని నన్నింటిని వైశ్వకర్మణాగ్ని స్వర్గలోకము నందలి దేవతల ముందుంచుఁగాక.[1]

---

* పోల్చు :- అథర్వ. 18-2-57; శుక్ల యజుర్వేద 15-54, 8

1. Cf :- Ralph T. H. Griffith : The White Yajurveda.
"Our gifts, our charitable grants, our Pious works, our fees to priests. May the Omnific's Agni set all this among the Gods in heaven"
[The Omnific Agni = That is Agni, or the Fire Altar, that belongs to VISVAKARMAN or Prajapati ].

ఇష్టాపూర్త్తమవతు నః పితౄణామ్॥ —అథర్వ. 2-12.8

మా పితృదేవతల యొక్క ఇష్టాపూర్తములు మమ్ము రక్షించుఁగాక.

ఇష్ట మనఁగా అగ్నిహోత్రాదికము.

పూర్త మనఁగా వాపీకూపతటాకదేవతాయతనాది నిర్మాణములు.

ఏకాగ్నికర్మ హవనం త్రేతాయాం యచ్చ హూయతే।
అంతర్వేద్యాం చ యద్దాన మిష్టం తదభిధీయతే॥

వాపీకూపతడాగాని దేవతాయతనాని చ
అన్నప్రదానమారామః పూర్త్త మర్థ్యాః ప్రచక్షతే॥ —హేమచంద్ర.

"వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబును నన రెండు తెఱంగులయ్యె. అందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును, నివృత్తంబున మోక్షంబును సిద్ధించు. ప్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులను రెండుమార్గములు గలవు.

అందు హింసాద్రవ్యమయ కామ్యరూపంబు లయిన యాగాదికంబు లిష్టంబులు. దేవతాలయ వన కూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు."

—శ్రీ మహాభాగవతము. 7. 467*

యజ్ఞకర్మానుష్ఠానముచేయు పురుషులు పొందు పుణ్యలోకములు వాపీకూపతడాగాది దానములు చేయు మనుష్యులు పొందు పుణ్యలోకములు వేఱు వేఱుగా నున్నవి.

అన్యే వై యజుషాం లోకాః కర్మిణా మపరే తథా।
క్షమావంతాం బ్రహ్మలోకే లోకాః పరమపూజితాః॥

—వ్యా.భా. వన. 29.39**

---

* వ్యాస : భాగవతమహాపురాణము. స్కంధ. 7. 15. 47-49
"పూర్తం సురాలయారామ కూపాజీవ్యాది లక్షణమ్"

** "యజుషాం త్రేతాగ్నిసాధ్యకర్మవతాం కర్మిణాం వాపీకూపాది ధర్మవతాం॥-" నీలకంఠ

పోల్చు :- వ్యాసభారతము - ఆదిపర్వము. 194-6 గీతా ప్రెస్. పుట. 559
టీకాకర్త - పండిత రామనారాయణదత్త శాస్త్రి (పాండేయ)

అగ్నిహోత్రం తపః సత్యం వేదానాం చైవ పాలనం।
ఆతిథ్యం వైశ్వదేవం చ ఇష్టమిత్యభిధీయతే॥
వాపీకూపతడాగాది దేవతాయతనాని చ
అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే॥

# పూర్తశిల్పములు - పుణ్యలోకములు

విహారావసథోద్యాన కూపారామ సభా ప్రపాః।
విప్రాణాం చైవ కర్తార స్తే నరాః స్వర్గగామినః ॥

—వ్యా భా. అను. 23-99

"రచ్చకొట్టంబు నారామంబుఁ బ్రపయుఁ గావించుట... నాకలోకమునకు నిచ్చెనలగు." —తిక్కన అను. 2-64

వీనిని పాడుచేయుట పాపహేతువు.

"సత్రంబు సాలయుఁ జలిపందిరియు రచ్చకొట్టంబు వ్రచ్చుట...... నిరయహేతువులు." —తిక్కన అను. 2-61*

గతజీవితులయిన వారి పేర తటాకారామములు నిర్మించినను, దేవాలయములు గట్టించినను, సత్రములు బెట్టించినను వారికి పుణ్యలోకములు గలుగు నని మహాభారతకాలీనజనులు విశ్వసించిరి.

కావుననే ధర్మరాజు కురుక్షేత్రసంగ్రామమునం దసువులుబాసి వీరస్వర్గ మలంకరించిన బంధుమిత్రుల పేర,

"చలిపందిరులను సత్త్రంబులుఁ బెట్టించెను;
తటాకములు దేవగృహమ్ములు కల్పించెను;
బంధుజనులకు సుగతి యగుటకై వినుతభుగి నృపా!"

—తిక్కన. శాంతి. 1-383

తిక్కన యనువాదము మూలవిధేయముగా నున్నది.

సభాః ప్రపాశ్చ వివిధా స్తటాకాని చ పాండవః।
సుహృదాం కారయామాస సర్వేషా మౌర్ధ్వదేహికమ్॥

—వ్యా.భా. శాంతి. 42-8

ఇట సభ యన ధర్మశాల యనియు ధర్మశాలాదులు నిర్మించిన వారికి సంతానఫలము లభించు ననియు నీలకంఠుఁడు వివరించినాఁడు.[1]

---

* "ప్రపానాం చ సభానాం చ సంక్రమాణాం చ భారత।
అగారాణాం చ భేత్తారో నరో నిరయగామినః॥" —వ్యా భా. అను. 23-53

1. సభాః ధర్మశాలాః తత్తన్నామాంకితాని సభాదీని చక్రే
ఇయ మముకస్య సభా ఇయ మముకస్య సభేతి
ఏతేన సభాదికారణాత్ సంతానఫలం లభ్యత ఇతి గమ్యతే. —నీలకంఠ,

# వాపీకూపతటాకములు

పానీయం పరమం దానం దానానాం మనురబ్రవీత్ ।
తస్మాత్ కూపాంశ్చ వాపీశ్చ తడాగాని చ ఖానయేత్॥

—వ్యా.భా. అను. 65-3

పానీయదాన ముత్తమదానం బని యఖిలధర్మతత్త్వదృఢపరి
జ్ఞానానూనుం డగు మానవపతి చెప్పె నృపసమాజవరేణ్యా॥

కావునఁ జెఱువులు నూతులు
బావులుఁ గొలఁకులును నెపుడుఁ బౌరవముఖ్యా
కావింపవలయు నవి కడుఁ
బావనములు పుణ్యలోకభాగిత నిచ్చున్. —తిక్కన అనుశాసన. 2-383

## వాపీకూపనిర్మాణఫలము

వరం కూపశతాద్ వాపీ వరం వాపీశతాత్ క్రతుః ॥—వ్యా.భా. ఆది. 75-102

కూప మనఁగా నూయి; వాపి యన దిగుడుబావి. దీర్ఘిక.

"నుతజలపూరితంబులగు నూతులు నూఱిటి కంటె సూనృతవ్రత యొక బావి మేలు; మఱి బావులు నూఱిటి కంటె నొక్క సత్క్రతు వది మేలు..."

—నన్నయ ఆది. 4-94

యజ్ఞఫలములో నూఱవ వంతు బావి త్రవ్వించిన మనుష్యునకు, దానిలో నూఱవ వంతు నూయి త్రవ్వించిన వానికిఁ గలుగును.

## తటాకనిర్మాణఫలవిశేషము

దేవ తిర్య క్నర స్థావరాశ్రయము తటాకంబు; వినుమట్లు గాక యందుఁ
గోకులంబులు నీరుఁగొని దానికర్త కులమునెల్లఁ బుణ్యలోకమున కనుచు
నీలోకమున శ్రీయు నెక్కుడు కీర్తియు నతనికిఁ జేయు; వర్షాగమమున
నీతువ వేసవిఁ జెఱువులో నీరున్న నగ్నిహోత్రాదిమయజ్ఞ వాజ
పేయ ఫలము లోలి నాయన కగుఁ గట్టఁ దగిన తరువు లిడిన సుగతిగలుగ
నిహసుఖంబుఁ బొందు విహగాదిబహుభూతవాససౌఖ్య మతఁడు చేసెఁగాన
సలిలాశయములు చేసిన నలఘుప్రియమందుఁ బితృచయము లూర్ధ్వగతుల్
కలుగును దానం దమకను తలఁపున నది కోరుచుండు ధర్మతనూజా॥

తిక్కన. ఆనుశాసనిక. 3, 330,3

పూర్త శిల్పమునకు మూలపురుషుఁడు విశ్వకర్మయె.

విశ్వకర్మా ప్రభాసస్యపుత్రః శిల్పిప్రజాపతిః ॥
ప్రాసాదభవనోద్యాన ప్రతిమాభూషణాదిషు
కడాగారామ కూపేషు స్మృతః సోఽమరవర్ధకిః॥

—మత్స్యపురాణ. 5. 27. 28

## యక్ష సరోవరము

బ్రాహ్మణుని యరణిం గొని పఱచిన హరిణి వెంటంబరువిడిన యనుజుల వెదకుచుఁ జనిన ధర్మజుఁడు బహువిధ పక్షికోలాహలభయదమై కడుఁ బరపయిన యడవి యం దొక కమలాకరమును గాంచెను.

—ఎఱ్ఱన. అరణ్య. 7. 406

ఆ సరోవరము సువర్ణవర్ణసుమశోభితమై సాక్షాత్తు విశ్వకర్మచే నిర్మింపఁబడినట్లున్నదని మూలమునందు వర్ణింపఁబడినది.

స గచ్ఛన్ కాననే తస్మిన్ హేమజాలపరిష్కృతం ।
దదర్శ తతః సరః శ్రీమాన్ విశ్వకర్మకృతం యథా॥

—వ్యా.భా. వన. 312-45

"నా యనుమతి లేకుండఁగ నీ యుదకముఁ ద్రావిరేని యెవ్వారేనిన్ ధీయుత చత్తురు నీవటు సేయవు సమ్యగ్విచారశీలుఁడ వగుటన్" అని యక్షుఁడు ధర్మజునితోఁ బలికినాఁడు. అది యక్షసరోవరము.

## పంచవర్ణపద్మాకరము

పురందరుం డరిగిన కందువ నే నిప్పుడెట్లు గాంతునొ యని శచీదేవి యుపశ్రుతి నారాధింపఁగా నుపశ్రుతి సాకారయై పాడసూపి, "నీకు పాకశాసనుం జూపెద రమ్మని తోడ్కొని హిమవత్పర్వతంబు నుత్తరంబున ముంజవంతం బను మహాశైలంబున కరిగి దానియందు శతయోజన విస్తీర్ణంబైన యొక్క సరోవరంబు సొచ్చి యచ్చట నుల్లసిల్లు పంచవర్ణ కమనీయంబులగు కమలంబులలో నొక్క నాళంబు ఛేదించి" నట్లు వర్ణింపఁబడినది. —తిక్కన. ఉద్యోగ. 1-171

ఈ సరోవరము నూఱు యోజనముల పొడవు - వెడల్పులు గలిగి చతురస్రాకారముగ నున్నది.

తత్రాపశ్యత్ సరో దివ్యం శుభం శకునిభిర్యుతం ।
శతయోజనవిస్తీర్ణం తావదేవాయతం శుభమ్॥ —వ్యా.భా. ఉద్యోగ 13-8

## అమృతవాపి : అసురశిల్పి

మహాయోగియైన మయుఁడు చచ్చిన వారిని బ్రదికింపఁ జాలు సిద్ధామృతరసపూర్ణమయిన యొక బావిని నిర్మించినట్లు తెలియుచున్నది.

తారకాసురుని తనయుఁడు హరి యనువాఁడు విరించిని గూర్చి తపమొనర్చి,

" త్రిపురంబుల వార లాయుధంబులు దాఁకి చచ్చినఁ బీనుఁగుల్ నీరిలోఁ బెట్టితడుప, నొక్కఁడు పదుగురై యెక్కుడు లావును బీరంబు మెఱయ సంప్రీతి నుల్లసిల్లు నట్టి బావి చిరతరతోయమై మాపురమునఁ జిత్రమహిమ వెలయు వావహిల్ల వలయు" నట్లు వరము వడసెను. —తిక్కన. కర్ణ. 1. 264

త్రిపురాసురుల యోగక్షేమము లరయు మహాయోగి మయుఁడు చచ్చిన వారిని బ్రదికింపఁజాలు ప్రభావము గల బావిని నిర్మించి యిచ్చినాఁడు.

సస్సృజే తత్ర వాపీం తాం మృతానాం జీవనీం ప్రభో॥

—వ్యా.భా. కర్ణ. 34-30,31

ఆ బావి దీర్ఘచతురస్రాకారముగ నున్నది.

అమృతమయమైన యా బావి రెండు యోజనముల పొడవు - ఒక యోజనము వెడల్పు గలిగియున్నదనియు, శిల్పిశ్రేష్ఠుఁడయిన మయుఁడు (మయో మాయావినాం వరః) తన శిల్ప చాతుర్యము చేత (మాయయా, మాయాబలేన) నిర్మించినాఁడనియు మత్స్య పురాణమునందు వర్ణింపఁబడినది.

......................మయో మాయావినాం వరః ।
అస్రాక్షీన్మాయయా వాపీం రంభా మివ పితామహః ॥
ద్వియోజనాయతాం దీర్ఘాం పూర్ణయోజనవిస్తృతామ్ ।....
మయాఽమృతమయీ వాపీ చైషా మాయాబలేన తు ।
సృష్ట్వా దానవదైత్యానాం హతానాం జీవవర్ధనీ॥

—మత్స్య. అ. 134. 10-23

ఇట మాయ యనఁగా శిల్పము, మాయాబల మనఁగా శిల్ప శాస్త్ర విజ్ఞానము. మాయి. మాయావి = శిల్పి; శిల్పకళాకౌశలముగలవాఁడు.

---

Maya : మాయా f. art, wisdom, extra-ordinany or Supernatural Powe
(only in earlier language)
Mayin : మాయిన్ mfn artful, Skilled in art or enchantment etc.
Mayavin : మాయావిన్ Possessing illusive or magical Powers.
—Sir Monier Williams. SED. P. 811

భాగవతమునం దది యొక సిద్ధరసకూపముగా వర్ణింపఁబడినది.

"గతాసువులయిన త్రిపురాసులం దెచ్చి, మహాయోగియైన మయుండు సిద్ధరసకూపంబున వైచిన,

సిద్ధామృతరసమహిమను శుద్ధమహావజ్రతుల్య శోభితతనులై
వృద్ధిం బొందిరి దానవు లుద్ధత నిర్ఘాత పావకోపములగుచున్."

—భాగవతము. 7, 397-99*

మణిమయ నలిని

ఇంద్రప్రస్థమునందు ధర్మరాజునకు సభాభవనమును నిర్మించి యిచ్చిన మయవిశ్వకర్మ యిు నందు మణిమయములై చిత్రవిచిత్రములయిన కొలఁకులను నిర్మించినాఁడు. 1

తటాకములు

ధరణీనాథ భవద్భుజపరిపాలితరైన వసుధఁ బరిపూర్ణములై
కరమొప్పుచున్నె చెఱువులు ధరణికవగ్రహభయంబు దనుకకయుండన్
అని నారదుఁడు ధర్మజుని ప్రశ్నించినాడు. —నన్నయ. సభా. 1-4?

తటాకముల నిండుగా నీరున్నచో ప్రజలకు వానలేమి వ…
భయముండదు.

పద్మాకరములు లక్ష్మీనివాస స్థానములు.

"అబ్జినీ తటాక తరుషండ పుష్పవాటికల నిలుతు" నని శ్రీ…
చెప్పినది. —తిక్కన. అనుశాసన

కావున రాజులు చెఱువులు త్రవ్వింపవలయును.

విశ్వకర్మ నిర్మితమయిన యింద్రప్రస్థపురమునందు …
సరస్సులు, పుష్కరిణులు, తటాకములు గలవు. 2

ఈ వర్ణనములను బట్టి మహాభారతకాలమునందు విశ్వక…
శిల్పివరులే వాపీకూపతటాకములు నిర్మించు చుండి రని తెలియుచున్న…

---

* వ్యాస : శ్రీమద్భాగవత మహాపురాణములు, స్కం. 7. 11-59, 60

1 చూడు :- డా॥ శోభినాల "శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళాదర్శనము"
—ప్రథమభాగము. పు. 253-5

2 — అదే — పు. 94, 95

# దేవతాయతనములు : చైత్యములు

తటాకాన్యుదపానాని వాప్యః ప్రస్రవణాని చ ।
సీమాసంధిషు కార్యాణి దేవతాయతనాని చ॥ —మనుస్మృతి 8. 248

వాపీకూపతటాకాదులు, దేవతాయతనములు సీమాసంధులందు, నిర్మింపవలె నని మనుస్మృతి చెప్పుచున్నది.

మహాభారతకాలమున భారతదేశమునందు దేవతాయతనములు, చైత్యములు గలవు. అవి స్థాపత్యకళకు మూల రూపములు.

కణ్వాశ్రమమున దేవతాయతనము లందు ద్విజులు చేయు పూజా పద్ధతిని జూచి దుష్యంతమహారాజు తాను బ్రహ్మలోకము నందున్నట్లు భావించినాఁడని వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

దేవతాయతనానాం చ ప్రేక్ష్య పూజాం కృతాం ద్విజైః ।
బ్రహ్మలోకస్థ మాత్మానం మేనే స నృపసత్తమః ॥ _వ్యా భా. ఆది. 71. 49

"శతశృంగంబునఁ గుంతిదేవి భీమసేను సుపుత్రుం బడసి దశమ దివసంబున వేల్పులకు మ్రొక్కఁ గొడుకు నెత్తికొని దేవగృహంబునకుఁ" బోయి నట్లు నన్నయ వర్ణించినాఁడు. [1]

అర్జునుఁడు తీర్థాటనము చేయుచు పశ్చిమ సముద్రతీరమునందలి పుణ్యతీర్థములను దేవమందిరములను చూచినాఁడని వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

సోఽపరాంతేషు తీర్థాని పుణ్యాన్యాయతనాని చ ।
సర్వాణ్యాను పూర్వేణ జగామామితవిక్రమః ॥
సముద్రే పశ్చిమే యాని తీర్థాన్యాయతనాని చ ।
తాని సర్వాణి గత్వా స ప్రభాస్మముపజగ్మివాన్॥-వ్యా.భా. ఆది 217-1, 2

ఆయతనము లనఁగా దేవమందిరములని హిందీటీకాకారుఁడు వ్రాసినాడు. [2]

---

1. నన్నయ్య. భార. ఆది. 5-112 = వ్యా.భా. ఆది. 172-15 తరువాత శ్లోకము
"దైవతాన్యర్చయిష్యంతీ నిర్జగామాశ్రమాత్ పృథా॥"

2. చూడు :- వ్యా.భా. ఆదిపర్వము గీతాప్రెస్ ప్రతి. పు. 619
"తదనంతర్ అమితపరాక్రమీ అర్జున్ క్రమశః పశ్చిమసముద్రతటవర్తీ
దేశ్ కే సమస్త పుణ్యతీర్థోం ఔర్ మందిరోంమే గయే ।
పశ్చిమ సముద్రకే తట్‌పర్ జిత్నే తీర్థ ఔర్ దేవాలయ థే ఉన్ సబ్‌కీ
యాత్రా కర్ కే వే ప్రభాస క్షేత్రమే పహుంచే॥

# చైత్యములు

ఆసీనం చైత్యమధ్యే త్వాం దీప్యమానం స్వతేజసా ।
ఆగమ్య ఋషయః సర్వేఽయాచంతాభయ మచ్యుత॥
—వ్యా.భా. వన. 12. 36

'ఓ అచ్యుతా! సమస్తఋషులు చైత్యమధ్యమునందు నిజతేజముతో ప్రకాశించు నిన్ను శరణుఁజొచ్చి మోక్షము కొఱకు ప్రార్థించుచున్నారు అని' అర్జునుఁడు కృష్ణుని స్మరించినాఁడు.

'చైత్యం చితాంకే బుద్ధాండ ఉద్దేశేఽద్రౌ సురాలయే' - వైజయంతి,

చైత్య శబ్దమునకుఁ గల నానార్థములలో దేవాలయ మనున దొకటి.[1]

ఇట చైత్య మన బాహ్యార్థము దేవాలయ మనియు, నాధ్యాత్మికార్థము హృదయపుండరీక మనియు నీలకంఠుఁడు వివరించినాడు.[2] ఈ చైత్యము చిచ్ఛబ్దభవము. [చిత్ - చైత్య].

చైత్యములకు దేవతాయతనములకు కొంచెము భేదమున్నది. చైత్యములన చతుష్పథము లందుండు చిన్న గుడు లనియు, దేవతాయతనము లన నగరములకు వెలుపలనుండు పెద్దగుడు లనియు గ్రంథాంతరముల వలనఁ దెలియుచున్నది.

---

1. చూడు :- సూర్యరాయాంధ్ర నిఘంటువు. పుట. 279

చైత్యము : సం. వి. అ. పుం, 1 అశ్వత్థము. రావి (వృ.వి.)
2. ఉద్దేశ వృక్షము, గుఱుతు మాను. ఎల్లమాను
3. గ్రామములందు ప్రసిద్ధమగు మహావృక్షము, రచ్చమ్రాను.
4. గ్రామములకు నెల్లగా కట్టిన జాతికట్టడము.
న. 1) ఆయతనము, యజ్ఞశాల. 2) దేవాలయము, గుడి
3) బౌద్ధాలయము, బౌద్ధస్తూపము.

2. చూడు :- వ్యా.భా. వన. 12-36. చిత్రశాలాప్రతి

"ఆసీనం చైత్యమధ్యే త్వాం చైత్యం ఆయతం ఆధ్యాత్మికం హృదయపుండరీకం, బాహ్యం దేవాలయాది" —నీలకంఠ.

ఆయతనము : సం. వి. అ న. 1) ఇల్లు, ఉనికిపట్టు,
2) స్థానము, ఆశ్రయము, 3) యజ్ఞస్థానము, 4) గుడి, దేవాలయము
5) బౌద్ధాలయము. —[సూ. ని. పు. 403]

అయోధ్యానగరమునందు దేవతాయతన చైత్యము లున్నట్లు వాల్మీకి రామాయణమునందు వర్ణింపఁబడినది.

దేవతాయతన చైత్యేషు సాన్నభక్ష్యాః స దక్షిణాః ॥ —అయోధ్య. 3-18

ఇట చైత్యము లనఁగా నాలుగుత్రోవలు కలియుచోట నుండు చిన్న దేవమందిరము లనియు, దేవతాయతనములు వాని కంటె పెద్దవి యగు గుడు లనియు వ్యాఖ్యాతలు వివరించినారు.*

మఱియొకచోట చైత్యము లనగా గణేశాదుల పూజాస్థానము లనియు, దేవతాయతనము లనఁగా విష్ణ్వాదుల పూజాస్థానము లనియు వివరింపఁబడినది[1]

హస్తినాపురమునందు దేవతాయతన చైత్యము లున్నవి.

పాండవులు పరిత్యక్తవిభవులై నిజాయుధంబులు ధరించి గజపురంబు వెలువడి రంత "ధృతరాష్ట్ర విభుని మందిరమున నఱచుచుఁ బఱచె గోమాయువుల్ పట్టపగల" అని నన్నయ వ్రాసినాఁడు. కాని మూలము నందిట్లున్నది.

ప్రత్యాహారంతి క్రవ్యాదా గృధ్రి గోమాయు వాయసాః
దేవతాయతన చైత్యేషు ప్రాకారాట్టాలకేషు చ॥ —వ్యా. భా. సభా. 80-30

దేవాలయములందు, చైత్యము లందు, ప్రాకారాట్టాలకముల పైనను గృధ్ర గోమాయు వాయసము లఱచి నట్లు వర్ణింపఁ బడినది. కావున దేవాలయాదులు పురమునకు వెలుపల నున్నవి.

దేవతాయతనము లన నగరమందిరము లనియు, చైత్యము లన దేవవృక్షము లనియు పండిత రామనారాయణదత్త యనువదించి నాఁడు. త్యము లన యజ్ఞశాల లనియుఁ జెప్పికొనవచ్చును.

---

చూడు :- 1) శ్రీమద్వాల్మీకిరామాయణము. మందరము. పు. 83

2) శ్రీమద్వాల్మీకిరామాయణమ్ ఆంగ్లానువాదసహితము. గీతాప్రెస్. పు. 238

'Let images of deities deserving worship through flowers and installed in temples and at cross-roads severally and served -with cooked rice etc."

1 చూడు :- వా. రా, అయోధ్య. 56-33 (ఆంగ్లానువాదము. పు. 446)

" వేదీస్థలవిధానాని చైత్యాన్యాయతనాని చ॥ "

[chaityas = places of worship for Ganesa and other gods. Ayatanas = places of worship for Vishnu and other gods]

**దుర్గాలయము :** దేశమునం దెల్లెడల దుర్గాలయము లున్నవి.

జంబూద్వీపమున రాజధానీనగరములందలి చైత్యము లందు - దేవాలయములందు - దుర్గాదేవి నిత్యము నివసించియుండు నని యర్జునకృత దుర్గాస్తోత్రమునందు వర్ణింపఁబడినది,

వేదశ్రుతిమహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి ।
జంబూకటకచైత్యేషు నిత్యం సన్నిహితాలయే॥—వ్యా.భా. భీష్మ. 23-10

ఇట చైత్య మన దేవాలయ మని టీకాకారుఁడు వ్రాసినాడు.[1]

నగరమందిరములందేకాక మందరాచలమునందు, కాంతారములందు, దుర్గమస్థానములందు, భక్తుల గృహములందు పాతాళమునందు దుర్గాదేవి నిత్యము నివసించు ననియు నా స్తోత్రమునందు వర్ణింపఁబడినది.

నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందరవాసిని ।
కాంతారభయదుర్గేషు భక్తానాంచాలయేషు చ
నిత్యం నివసి పాతాలే యుద్ధే జయసి దానవాన్॥
—వ్యా.భా. భీష్మ. 23-4-14

విరాటనగరోపాంతమునందు దుర్గాదేవి యాలయమున్నది. పాండవులు ప్రచ్ఛన్నవేషధారులయి విరాటనగరము ప్రవేశించునపుడు యుధిష్ఠిరుఁడు దుర్గాస్తోత్రము చేసినాఁడు.

విరాటనగరం రమ్యం గచ్ఛమానో యుధిష్ఠిరః ।
అస్తువన్ మనసా దేవీం దుర్గాం త్రిభువనేశ్వరీమ్॥—వ్యా.భా, విరాట

**శివాలయము :** గిరివ్రజమునందు శివాలయమున్నది.

జరాసంధుఁడు, 'నృపతులఁ జెఱఁబెట్టి పశువరించుచుఁ బశుపతి వరదుఁ బూజించెడి' వాడు. —నన్నయ. సభా.

ప్రోక్షితానాం ప్రమృష్టానాం రాజ్ఞాం పశుపతేర్గృహే ।
పశూనామివ కా ప్రీతి ర్జీవితే భరతర్షభ॥ —వ్యా. భా. సభా.

పశుపతిగృహ మనఁగా పశుపతి దేవాలయము.

---

1. "జంబూకటకేషు జంబూద్వీపరాజధానీషు చైత్యేషు దేవాలయేషు
నిత్యం సన్నిహితః ఆలయః స్థానం యస్యాః సా తథా॥
నీలకంఠ - వావిళ్లప్రతి.

నలదమయంతుల పునస్సమాగమావసరంబున విదర్భేశుఁడు సంతసిల్లి "తనపురంబునం దష్టశోభనంబులు దేవగృహంబులందు వివిధపూజలు సేయించె." —నన్నయ. అరణ్య. 2-224

అర్చితాని చ సర్వాణి దేవతాయతనాని చ॥ —వ్యా.భా. వన, 77-3

కాని యవి యే దేవతాగృహములో తెలియుట లేదు.

దేవతాయతనములు, చైత్యములు, చైత్యవృక్షములు పురమునకు వెలుపల నుండెడివి.

సాల్వుఁడు ద్వారకానగరముపై దండెత్తి వచ్చి "ద్వారవతి భేదింపనేరక దాని వెలిం బ్రపా చైత్య దేవతాయతన వల్మీకంబుల వర్జించి సమతల ప్రదేశంబున నిబిడంబుగా శిబిరసన్నివేశంబు చేసి" నట్లు వర్ణింపఁబడినది. —నన్నయ. అరణ్య. 1-153

వర్జయిత్వా శ్మశానాని దేవతాయతనాని చ।
వల్మీకాం శ్చైత్యవృక్షాంచ తన్నివిష్ట మభూద్బలమ్॥ —వ్యా.భా. వన. 16-3

**పూజాపద్ధతి :** దేవతాయతనములకు - చైత్యములకు - చైత్యవృక్షములకు (అశ్వత్థవృక్షములకు) ప్రదక్షిణనమస్కారములు చేయు సంప్రదాయము ప్రాచీనకాలమునుండియు నున్నది.

శుచిం దేశ మనడ్వాహం దేవగోష్ఠం చతుష్పథమ్।
బ్రాహ్మణం ధార్మికం చైత్యం నిత్యం కుర్యాత్ ప్రదక్షిణమ్॥
—వ్యా.భా. శాంతి. 193-8*

జ్ఞానులకు, గురువులకు, వృద్ధులకు, దేవతలకు, తాపసులకు, కల్యాణకరమైన చైత్యవృక్షములకు, బ్రాహ్మణులకు నమస్కరించుచున్నావా? అని నారదుఁడు ధర్మరాజును ప్రశ్నించినాడు.

కచ్చిజ్జ్ఞానీన్ గురూన్ వృద్ధాన్ దైవతాం స్తాపసానపి।
చైత్యాంశ్చ వృక్షాన్ కల్యాణాన్ బ్రాహ్మణాంశ్చ నమస్యసి॥
—వ్యా.భా, సభా 5-101**

ధర్మజుఁడన్నింటికి 'ఔ' నని తలయూపినాఁడు. కావున నింద్రప్రస్థ పురమునందు దేవతాపూజలు, చైత్యపూజలు జరుగుచుండెడివని చెప్పవచ్చును.

---

* పోల్చు :- వా.రా. అయోధ్య. 17-16
"చతుష్పథాత్ దేవపథం చైత్యాంశ్చాయతనాని చ।
ప్రదక్షిణం పరిహరన్ జగామ నృపతేః సుతః॥

** పోల్చు :- వా.రా. ఆయోధ్య 100-61

" సుమనోధూపదీపనైవేద్యంబులుత్తమంబులగు పూజాసాధనంబు లని వానిఁగొని దేవతలఁ బూజింతురు." —తిక్కన, ఆనుశాసనిక. 4-4

దేవపూజార్థము పుష్పముల కొఱకు దేవాలయావరణములందు పూఁదోటలు పెంచుచుండిరి. అందలి పూవులు దేవపూజకే కాని తదితర శుభకార్యములకు పనికిరావు.

" విను దేవాలయమునఁ బితృవనమునఁ బుట్టు కుసుమములు వలదు
వివాహంబునకును శాంతికపౌష్టికవనితాజనరంజనాది వర్తనములకున్ "[1]

దేవాలయాది పవిత్రస్థలములను శుచిగా నుంచుటకు కొన్ని నియములు పాటింపబఁబడుచుండెడివి.

దేవగృహముల కడ వీథిని గోవాటమునందు రచ్చకొట్టము పొంతన్
భూవర సస్యములను విణ్మూత్రవిసృజన మొప్పదండ్రు చారిత్రవిదుల్.[2]

అశుచిపదముల దేవాలయములు మెట్టినవారు పాదరోగు లగుదురు.[3]

దేవళములందు దీపదానముచేసినచో నైశ్వర్యము గలుగును.

" ఒరు లిచ్చిన దీపం బపహరించి తత్పాతకమున నంధుండగు భూ
వర ! గుడిపై లోపల గిరి దీపం బిడి విభూతికిన్ బాత్రమగున్ "

1. తిక్కన ఆనుశాసనిక. 4-4 = వ్యా.భా. అను. 98-83
" న తు శ్మశాన సంభూతా దేవతాయతనోద్భవా ।
సంనయేత్ పుష్టియుక్తేషు వివాహేషు రహఃసు చ॥ "

2. తిక్కన. అను. 4-93 = వ్యా.భా. అను. 104-54 దాక్షిణాత్యప్రతి.
" దేవాలయేఽథ గోవృందే చైత్యే సస్యేషు విశ్రమే.... "

3. తిక్కన. అను. 5-102 = వ్యా.భా. అను. 145. దాక్షిణాత్యప్రతి.
" మనుజా దేవతాస్థానం స్వపాదై ర్భ్రంశయంత్యత ....
పాదరోగై ర్భహువిధై ర్ధార్యంతే శ్వపదాదిభిః॥ "

4. తిక్కన. అను. 4-21 = వ్యా.భా. అను. 98-83
" గిరిప్రపాతే గహనే చైత్యస్థానే చతుష్పథే ।
దీపదాతా భవేన్నిత్యం య ఇచ్ఛే ద్భూతిమాత్మనః ॥ "

**గృహదేవతలు :** మహాభారతకాలమున రాజులు నగరదేవతలనే కాక గృహదేవతలను గూడ పూజించుచుండిరి.

నగరదేవత లనఁగా నగరరక్షణార్థము నెలకొల్పఁబడిన దేవతలు. నేటికిని గ్రామదేవతల గుడు లున్నవి.

గృ హ దే వ త లనఁగా కులదేవతలు. ఇలు వేల్పులు.

యుద్ధానంతరము హస్తినాపురము ప్రవేశించిన ధ ర్మ రా జు ధౌమ్య ధృతరాష్ట్రపురస్సరంబుగా నభ్యంతరనివాసంబు సొచ్చి, గృ హ దే వ త లం బూజించి, మగుడ బహిరంగణభూమికివచ్చి, న గ ర దే వ తా పూ జ లు సేయింపం దగువారలం బంచినాఁడు. " 1

'జర' బృహద్రథుని కులదేవత.

"వినయము విస్తరిల్ల గురువృద్ధజనాతిథివిప్రదేవతార్చన లొనరింతు" నని ధర్మవ్యాధుఁడు కౌశికునితోఁ జెప్పినాఁడు. —ఎఱ్ఱన. ఆరణ్య. 5-34

దేవతాతిథిభృత్యానా మవశిష్టేన వర్తయే॥ —వ్యా.భా. వన. 201-22

ఇది గృహదేవతాపూజయే. అతని పూజామందిరము దేవతలనివాసస్థానము వలె నున్నది.

"దేవతాగృహసంకాశం దైవతైశ్చ సుపూజితమ్" —వ్యా.భా. వన. 214-5

దేవత లర్ఘకుసుమపూజావిధిఁ బ్రియ మంది జనుల కోర్కుల సఫలము గావింతురు.

తన యింటఁ గలుగు నన్నము మును దేవతలకు నివేద్యముగఁ జేసిన పిమ్మట తాను భుజింపవలయును.

ఈ విధముగా గృహదేవతలను బూజించిన గృహస్థులకు శుభములు గలుగును.

ఉపహారసమర్చకుఁడగు సుపురుషు గృహదైవతములు శుభములఁ గూర్చున్
నృపవర తత్కర్మరహితుఁ గృప లేక నితాంతవిఫలకృత్యున్ జేయున్॥

—తిక్కన. అను. 4-29

---

1. తిక్కన. శాంతి. 1-368 = వ్యా.భా. శాంతి. 38-14

ప్రవిశ్యాభ్యంతరం శ్రీమాన్ దైవతాన్యభిగమ్య చ ।
పూజాయమాస రత్నైశ్చ గంధమాల్యైశ్చ సర్వశః ॥

దేవాలయాది పవిత్రస్థానములందు నివసించిన మనసున కేకాగ్రత కలుగు నని వ్యాసమహర్షి శుకున కుపదేశించినాఁడు.

మన నేకాగ్రతఁ బొందఁ జేయఁ జనసమ్మర్దంబు వర్జించి శూ
న్యనికేతాద్రిగుహావివిక్తవనదేవాగార ముఖ్యంబులై
న నివాసంబుల నుండఁగా వలయుఁ[1], దన్ మన్నించినన్ గీడు సే
సిన హర్షంబు నమర్షమున్ హృదయమున్ జెందింపఁ కక్షోభ్యుఁడై.

యుద్ధానంతరము హతపుత్రుఁడైన ధృతరాష్ట్రుడు పుణ్యకార్యములు సేయుచు 'గుళ్లుఁజెఱువులుఁగట్టించె.' —తిక్కన. ఆశ్రమవాస. 1-7

ఈ విధమయిన వర్ణనముల వలన మహాభారతకాలమున భారతదేశము నందు దేవాలయచైత్యాది నిర్మాణములు జరుగుచున్నట్లు తెలియుచున్నది.

కాని యుగసంధులందు, యుగాంతసమయములందు దేవతాపూజలయం దనాదరము గలుగుచుండు నని చెప్పఁబడినది.

త్రేతాద్వాపర సంధికాలమునందు

"యాగముల్ దేవతాపూజలు నెడలంగ భూసురప్రముఖములైన వర్ణములు చొప్పుదప్పు" ననియు,[2]

దేవాలయములం దినపగంటలు మ్రోగుచుండు ననియు[3] వర్ణింపఁబడినది.

కలియుగంబున ధర్మంబు పాదమాత్రావశిష్టంబయి యుండునపుడు

"దేవతాయతనంబులన్ జగతీసురావసథంబులన్
పావనాశ్రమభూములన్ జెడి పొడగున్" -

అని మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ జెప్పినాఁడు. — ఎఱ్ఱన. అరణ్య.

1. తిక్కన. శాంతి. 5-121 = వ్యాభా. శాంతి. 240-8

శూన్యా గిరిగుహాశ్చైవ దేవతాయతనాని చ ।
శూన్యాగారాణిచైకాగ్రో నివాసార్థ ముపాశ్రియేత్॥

2. తిక్కన. శాంతి. 3-289

3. వ్యాభా. శాంతి. 141-32

ఉలూకపక్షిధ్వనిభి ర్దేవతాయతనైర్ వృతమ్ ।
లోహఘంటాపరిష్కారం శ్వయూథపరివారితమ్॥

కలియుగమునందు ప్రజలు దేవతా విగ్రహపూజలు వర్జించి ఏడూకచిహ్నములను పూజింతు రనియు, దేవతాయతనచైత్యము లందును, నాగాలయములయందును ఏడూకచిహ్నము లుంపఁబడు ననియు, భూమి దేవతా గృహములతో నలంకరింపఁబడ దనియు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

ఏడూకాన్[1] పూజయిష్యంతి వర్జయిష్యంతి దేవతాః ॥....*
దేవస్థానేషు చైత్యేషు నాగానామాలయేషు చ
ఏడూకచిహ్నాని పృథివీ న దేవగృహభూషితా॥

—వ్యా.భా. వన. 190. 65-65

యుగాంతమునందు విష్ణుఁడు కల్క్యాత్మకుండయి జనియించి ధర్మమును పునరుద్ధరించును.

కృతయుగము ప్రాప్తించినపు డెల్లదేశములు
"ఆరామ వ్రజచైత్యసద్మవన దేవాగార సౌమ్యంబులై"యొప్పారును [2]

ఈ వర్ణనములను బట్టి భారతరామాయణకాలములందే కాక కృతయుగము నుండియు లోకమునందు దేవతాయతన చైత్య తటాగాది పూర్తశిల్పము లుండెడి వనియు తెలియుచున్నది.

కలియుగము నందవి చెడిపోయినను, వాని స్థానమునందు ఏడూకాది నిర్మాణములు చోటుచేసికొనుచున్నవి.

సమస్తనిర్మాణకార్యములు చేయువారు సంకృతులే. శిల్పాచార్యులే.

---

1. ఏడూకాన్ : అస్థ్యంకితాని కుడ్యాని —నీలకంఠ
ఏడూకము, ఏడుకము = లోపల ఎముకలుపెట్టికట్టినగోడ, బౌద్ధాలయము (సూ.ని.)
బుద్ధైడూక = A temple in which relics of Buddha are preserved.
( = Chaitya) — Monier Williams.

* "లోగ్ హడ్డీ జడీ హుఈ దీవారోంకో తో పూజాకరేంగే
ఔర్ దేవవిగ్రహోంకో త్యాగ్ దేంగే" — రామనారాయణదత్తా
—(చూడు : శ్రీమహాభారతము - గీతాప్రెస్)

2. ఎఱ్ఱన. అరణ్య. 4-313 = వ్యా.భా. వన. 191-8
"ఆరామాశ్చ చైత్యాశ్చ తటాకావసథా స్తథా ॥
పుష్కరిణ్యశ్చ వివిధా దేవతాయతనాని చ ।
యజ్ఞక్రియాశ్చ వివిధా భవిష్యంతి కృతే యుగే॥"

# దేవాలయ నిర్మాణపద్ధతులు

వైదికయుగమునందలి యాగశాలయే రామాయణ భారతేతిహాసకాలమున దేవాలయముగా పరివర్తన చెందినది. [1]

యజ్ఞాయతనమే దేవాలయ నిర్మాణమునకు మూలము. యజ్ఞవేదికలను చితి - చయన - స్తూపము లనియు నందురు. దేవాలయ నిర్మాణమునకు ఈ వేదికా పద్ధతియే మూల మని వైదికస్తూపచితుల నుండియే జైన బౌద్ధుల స్తూప చైత్య విహారాదినిర్మాణము లవతరించిన వని భారతీయవిద్వాంసులు నిర్ణయించినారు. [2]

అత్యంత ప్రాచీనకాలమున ప్రజలు చతురస్రాకృతి గల వేదికలపై నేదే నొక ప్రతీక నుంచి దాని నిష్టదైవముగా భావించి పూజించు చుండిరి యక్షసదములు నాగాలయములు నిట్టివే. [3]

ఋగ్వేదమునందు 'యక్షసదము' పేర్కొనఁబడినది.

మా కస్య యక్షం సద మిద్ధురః ॥ —ఋ. 4-3-13

మహాభారతకాలమున నాగాలయములున్నవి.

అర్జునుఁడు మట్టితో నొకస్థండిలము - వేదికను - నిర్మించి, దానిని శివునిగా భావించి మాల్యాదులతో పూజించినాఁడు.

మృణ్మయం స్థండిలం కృత్వా మాల్యేనాపూజయద్భవం॥
—వా.భా. వన.

ఇవి యన్నియు నాచ్ఛాదసలేని బహిరంగపూజా స్థానములు.

కొంతకాలము తరువాత ఆచ్ఛాదనము, స్తంభములు, ప్రాకారము చిన్నచిన్న గుడులు నిర్మింపఁబడినవి.

---

1. Swami Harshananda : All about HINDU TEMPLES
" The view that the Yaga Sala of the Vedic Period graduall metamorphosed into temples by the epic period owning t. influence of the cults of devotion, is widely accepted."

2. గడియారం రామకృష్ణశర్మ : మన వాస్తుసంపద —పు.

3. Cf :- Vasudeva S Agrawala : Evolution of the HINDU TEMP. and other essays.

ఈ దేవాలయములు దారుమయములు, మృణ్మయములు నగుటవలన నవి కాలగర్భమునందు కలిసిపోయినవి. మిగిలిన దారు నిర్మితదేవాలయములు కొన్ని హిమాలయ ప్రాంతమునందు మలబారుతీరమునందు నున్నవి.

అనంతరకాలమున నిర్మింపఁబడిన గుహాలయములు, ఇటుకలతోను, శిలలతోను నిర్మింపఁబడిన దేవాలయములు కొన్ని నేటికిని నిలిచియున్నవి. [1]

## స్థాపత్యకళ : క్రమవికాసము

వాస్తుశిల్పకళాకలితమైన దేవాలయనిర్మాణము క్రీ. శ. ప్రథమ శతాబ్ది యందు ప్రారంభమయినది.

గర్భగృహము, ఆచ్ఛాదనము, ప్రాకారకుడ్యములు, మండపములు గల గుప్తకాలపుదేవమందిర మొకటి సాంచి యందున్నది.

గుప్తకాలమున ప్రారంభదశయందున్న స్థాపత్యకళ క్రమవికాసము పొంది సర్వాలంకారశోభితమయిన దేవాలయము రూపుదిద్దు కొన్నది. [2]

భారతీయ శిల్పులు మతదృష్టితో వాస్తునిర్మాణమునకు అవసరమైన సూత్రములు విధించినారు. వీనిని అర్థరహితము లని త్రోసివేయరాదు. అవి మానవ కల్యాణమును, ఆరోగ్య భాగ్యములను దృష్టియందుంచుకొని నిర్వచింపఁబడినవి. [3]

దేవాలయనిర్మాణమునకు ముందు జలపూర్ణమయిన సలిలాశయమును, ఆరామమును నిర్మింపవలె నని బృహత్సంహిత యందుఁ జెప్పఁబడినది. [4]

కృత్వా ప్రభూతసలిల మారామాన్ వినివేశ్య చ।
దేవతాయతనం కుర్యాద్ యశోధర్మాభివృద్ధయే॥

— బృహత్సంహిత. 56—1*

---

. Swami Harshananda : All about HINDU TEMPLES.
Vasudeva S Agrawala : Evolution of the HINDU TEMPLE and other essays.

గడియారం రామకృష్ణశర్మ : మన వాస్తుసంపద. — పు. 15.

చూడు:- డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి : భారతీయ దేవాలయము—పు. 47.

* పోల్చు - విష్ణుధర్మోత్తరము - ప్రతిష్ఠాప్రదేశము

# స్థపతి స్థాపకులు

దేవాలయ నిర్మాణము నందు స్థపతి స్థాపకులు ప్రధానపాత్రవహింతురు.

దేవాలయమును నిర్మింపదలచు యజమానుడు - ధర్మకర్త - ముందుగా శిల్పశాస్త్రకోవిదుడు, శిల్పక్రియా దక్షుడు నగు శిల్పాచార్యుని స్థపతిగను, వాస్తుపూజాది సమస్త వాస్తుకర్మల నొనరించుటయందు సమర్థుడై యాచార్యస్థాన మలంకరింపదగిన శిల్పాగమశాస్త్రవేత్తను స్థాపకునిగను ఎంచుకొనవలెను.*

యజమానుడు ముందుగా నాలయ నిర్మాణకార్యక్రమ పర్యవేక్షణార్థ మొక సద్బ్రాహ్మణుని స్థాపకునిగా - ఆచార్యునిగా - ఎంచుకొనవలయు ననియు నా స్థాపకుడు శిల్పిముఖ్యు నొకనిని స్థపతిగా నిర్ణయించి యాలయనిర్మాణ కార్యము నందు నియమించు ననియు స్థపతి స్థాపకులు సమానగౌరవ ప్రతిపత్తులు గలవా రనియు హర్షానందస్వామి వ్రాసినారు. [1]

ఎట్లైననేమి? దేవాలయనిర్మాణమునకు స్థపతి స్థాపకు లిరువురు నవసరమని స్పష్టమగుచున్నది.

---

* Cf :- 1. Stella Kramrishch : HINDU TEMPLE —p. 10

"First a Sthapati is to be selected - one well-versed in Silp sastras, similarly a Stapaka also. Knowing the Silpasastra possessing all the qualifications of an Acharya, being sele by the patron, he should perform the architectural rites. (Vastu-karma)

2. V. S Agrawala : Evolution of Hiudu Temple and other

1. Swami Harshananda : All about HINDU TEMPLES

"The Yajamana (lit. the sacrificer, here, the finar builder) must first choose a proper guide or Sthapaka or for overall guidance and supervision. This Acharya mus expert in art and architecture and rituals. The Achary chooses the Sthapati (Chief architect) and put him in c of the whole constuction The Sthapati commands a s and respect equal to that of the Acharya.

స్థపతి యన శిల్పిముఖ్యుఁడు. ఆలయనిర్మాత.

స్థాపకుఁడన విగ్రహ ప్రతిష్ఠాపకుఁడు. వాస్తుపూజాది ప్రతిష్ఠాంతము వాస్తుకర్మలయందు స్థపతికి సహాయపడు శిల్పాచార్యుడు. (Architect-Preist)[1]

శ్రీ వాసుదేవ యస్. అగ్రవాలా యిట్లు వివరించినాడు.

దేవాలయములు నిర్మించు శిల్పిని స్థపతి యందురు. అతఁడు వాస్తుశిల్ప జ్యోతిషగణితాదిబహుశాస్త్రవేత్తయై ప్రజ్ఞాన్వితుఁడై యుండవలయును.

శిల్పులలో నగ్రగణ్యుఁడగు స్థపతిని విశ్వకర్మ యనియు నందురు. సూత్రగ్రాహి, సూత్రధారుఁడు, తక్షకుఁడు, వర్ధకి యను నలువురు శిల్పులు స్థపతికి సహాయకులుగా నుందురు. ఈ నలువురపై పర్యవేక్షణము చేయుచు నాచార్యస్థాన మలంకరింపఁదగిన శిల్పశాస్త్రజ్ఞుని స్థాపకుఁ డందురు.[2]

---

1. P. K Acharya : An Encyclopaedia of HINDU ARCHITECTURE — p. 512.

Sthapati : The Chief Architect, the master builder.

Sthapaka : One who installs, actual worker, perhaps the principal assistant to the Chief architect (sthapati) not the master who is called Karta.

2. V S Agrawala : Evolution of HINDU TEMPLE and other essays. — p. 13.

" The Architect should have the knowledge of the Science or Architecture (Vastusastra) and other sciences like Mathematics Astronomy and of other various arts and crafts. The perfect architect should possess immediate intuition, a readiness of judgment (prajna)...

"The architect is the foremost of the craftsmen or silpins. He is called Viswakarman· His other assistants are Sutragrahin Sutradhara, Takshaka and Vardaki, i e , the surveyor, sculptor, and builder plasterer-painter, over and above these four there is the architect-priest called Sthapaka who has the qualifications of Acharya or Guru.

చూడు :- డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి
భారతీయ దేవాలయము. —పు. 23

"వాస్తుమండలము ననుసరించి యాలయమును నిర్మించు శిల్పిని స్థపతి యందురు. ఇతనికే విశ్వకర్మ యని కారకుఁడని పేర్లున్నవి. ఇతనికి తోడ్పడు వారిలో సూత్రగ్రాహి, తక్షకుఁడు, వర్ధకి ముఖ్యులు."1

స్థపత్యాది శిల్పుల లక్షణములు శిల్పశాస్త్రము లిట్లు వివరించుచున్నవి.

స్థపతిః సర్వశాస్త్రజ్ఞః సూత్రగ్రాహీ తు సూత్రధృత్ ।
వర్ధకిర్ మానకర్మజ్ఞ స్తక్షణాత్ తక్షకః స్మృతః ॥

స్థపతిః స్థాపనాచార్యో వేదవిచ్ఛాస్త్రపారగః ।
స్థాపనాధిపతిర్యస్మాత్ తస్మాత్ స్థపతి రుచ్యతే॥

స్థపతేశ్చాజ్ఞయా సర్వే సూత్రగ్రాహాదయః సదా ।
కుర్వంతి శాస్త్రదృష్టేన వస్తువాస్తు ప్రయత్నతః ।
ఆచార్యలక్షణై ర్యుక్తైః స్థపతి రిత్యభిధీయతే॥

సూత్రజ్ఞః సూత్రగ్రాహీ చ రేఖాజ్ఞః శాస్త్రవిత్తమః ।
శ్రుతజ్ఞ సూత్రగ్రాహీ చ శిల్పశాస్త్రవిదుత్తమః ।
విచారజ్ఞః శ్రుతజ్ఞశ్చ చిత్రకర్మా చ వర్ధకీ ।
తక్షాదికర్మవిత్ ప్రాజ్ఞ స్తక్షకః పరికీర్తితః ॥

—మానసార : అ 2 21.32*

---

1, డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి – మన దేవాలయములు

* Cf :- 1) INDIAN ARCHITECTURE -ed. by M .A. Ananthalwar Vol : I part VI. Book I p. 41.

2) Prasanna Kumar Acharya — Manasara.

"The Sthapati is in rank the Director General and the Consulting Architect. [Manasara — 2-21].

"The Sthapati must be well-versed in all Sciences.
స్థపతిః సర్వశాస్త్రజ్ఞః । — [M. 2-24]

"He must have all the qualifications of a Supreme Director. —[Acharya. M -2-31]

"The Sutragrahin also should have the ganeral knowledge of all the Sciences and Vedas. But he must be an expert in measuring accurately and make a special study of drawing. Vardhaki also should have the general knowledge of the Vedas and Practical Sciences.

The Takshaka must be an expert in his own work i.e., carpentery.

వేదవేత్తయు సకలశాస్త్రపారంగతుఁడు నగు స్థపతి దేవాలయములు నిర్మించుటయందే కాక వివిధదేవతామూర్తులను నిర్మించి స్థాపింపఁగల యాచార్యుఁడై యుండవలెను. స్థపతి యాజ్ఞానుసారమే తక్కిన శిల్పులు శాస్త్ర ప్రకారము తమతమ శిల్పకార్యములు నిర్వహింతురు. ఆచార్యపీఠమలంక రించుటకుఁ గావలసిన సమస్తలక్షణములు గల శిల్పినే స్థపతి యందురు.

స్థపతి, సూత్రగ్రాహి. వర్ధకి, తక్షకుఁడు నను నలువురు శిల్పులలో స్థపతి యజ్ఞపర్యవేక్షకుఁడగు బ్రహ్మవంటివాఁడు.[1] వైదికయజ్ఞనిర్వహణ మున కవసరమగు హోత, అధ్వర్యుఁడు. ఉద్గాత, బ్రహ్మ యను నలువురు ఋత్విక్కులలో బ్రహ్మ అథర్వణవేదావేత్త. మంత్రతంత్రక్రియాదక్షుఁడగు శిల్పాచార్యుఁడును అథర్వణవేదవేత్తయే.[2]

ప్రాచీనకాలమున పురోహితుఁడే శిల్పాచార్యుఁడై యుండవచ్చు ననియు నాతఁడే యాత్మోద్దీపనముతో - సద్యఃస్ఫూర్తితో - దేవతాప్రతిమాది పూజా వస్తువులు సృష్టించి యుండు ననియు టి. యన్. శ్రీనివాసన్ అభిప్రాయ పడినాడు.[3]

---

1. Cf :- V. S. Pramar : Study of Indian Architecture - Proceedings of the workshop in History of Art - 1977. (p. 131)

2. Cf :- 1) P. K. Acharya - Mahasara I quoted in.
"The ART OF INDIAN ASIA" compiled and edited by Joseph Cambell. —p. 320 -Panthecn Books

"The artificer should understand Atharvaveda the thirty two craftmanuals (Silpa Sastras) and the Vedic mantras by which the dieties are invoked. He should be one who wears the sacred thread (i.e , he should be a member of one of the upper Twice-born class), a necklase of holy bead and on his finger a ring of sacred Kusa grass in the worship of God.

2) Kewal Motwani : INDIA; A Synthesis of Cultures. -p. 88

3. Cf :- T. N Srinivasan : A Hand Book of South Indian Images. — p. 119.

"If is probable that in the early periods of Indian art, the priest himself was the artist and brought the inspiration and fecundation of the soul to the making of sacred objects of worship."

అథర్వ ఋండయిన శిల్పిబ్రాహ్మణుఁడే దేవతామూర్తినిర్మాతయు పురోహితుఁడునునై యుండు నని చెప్పిన మిక్కిలి సమంజసముగానుండును.

అనంతరకాలమున నానావిధశిల్పకార్యభారవహుండయిన స్థపతికి సహాయకులుగా స్థాపకాచార్యులు వచ్చియుండురు.

స్థపతి, స్థాపకుఁడు, ఆచార్యుఁడు - అనువారు విశ్వకర్మకులోత్పన్నులు

స్థపతిః స్థాపకశ్చైవ ఆచార్యో విశ్వకర్మణః ॥

—స్కాందపురాణ. నాగరఖండ .*

మహాభారతకాలమున వాస్తువిద్యావిశారదులు, ప్రాజ్ఞులు, యజ్ఞశిల్ప క్రియాదక్షులు నగు స్థపతులే కాక దేవకర్మకృత్తులు గలరు.

........................ కారవః శిల్పిన స్తథా ।
దేవకర్మకృతశ్చైవ యుక్తాః కామేన కర్మను ॥

—వ్యా.భా. శాంతి. 167-32

కారు వన నూతనసృష్టి చేయఁగల శిల్పకళాకారుడు. స్థపతి. [1]

శిల్పి యన చిత్రలేఖనాదిశిల్పకారుఁడు. [2]

దేవకర్మకృత్తు దేవతావిగ్రహస్థాపనపూజనాది దేవకార్యములు చేయువాడు. స్థాపకుడు.

దేవాలయనిర్మాణమునకు మూలము యజ్ఞశాలాయజ్ఞవేదికలే కావున మహాభారతకాలమునందు యజ్ఞశిల్పప్రవీణులైన స్థపతులు - శిల్పాచార్యులు దేవాలయాదులు నిర్మించుచుండి రనియు ప్రతిమాకారులు విగ్రహవ రచించుచుండిరనియు దేవకర్మకృత్తులు దేవతావిగ్రహ ప్రతిష్ఠ పూజాకార్యములు నిర్వహించుచుండి రనియు, వీరెల్లరు విశ్వకర్మవ శిల్పిబ్రాహ్మణులే యనియుఁ జెప్పవచ్చును.

---

* చూడు :- 1) జి. జ్ఞానానంద - శ్రీ విశ్వకర్మాన్వయ ప్రదీపిక - (కన్నడ భాషానువాదము - దీపిక) పు

"స్థపతి స్థాపక ఆచార్య ఇవరెల్లరూ విశ్వకర్మనవరు"

2) D' N. Sukla : SILPASASTRA.

"Visvakarma is a proper name not only of Architect the Divine Architect but every descended from Visvakarma"

1 చూడు - డా॥ శోభిరాల : శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళాదర్శనము ప్రథమభాగము. పు. 1

## పరమాత్మ స్వరూపము

న సాదృశ్యే తిష్ఠతి రూప మస్య న చక్షుషా పశ్యతి కశ్చిదేనం।
మనీషయాఽథో మనసా హృదా చ యఏనం విదు రమృతాస్తే భవంతి॥
— వ్యా భా. ఉద్యోగ. 46_6*

పరమాత్మరూప మిట్లుండు నని చెప్పఁజాలము. దాని కొక సాదృశ్యము లేదు. వాని నెవ్వరును చర్మచక్షువులతోఁ గాంచలేదు నిశ్చలబుద్ధితో మనసు నందు, హృదయము నందు వాని నెఱుంగు నట్టివారు అమృత స్వరూపు లగుదురు.

ఇది నిర్గుణోపాసన. నిరాకారుఁ డగు పరమేశ్వరుని తమ హృదయము లందు దర్శించి తరించుటకు యోగిపుంగవులకు సాధ్యమగును గాని తదితరులకు సాధ్యముకాదు.

దేహమే దేవాలయము. అందలి జీవుఁడే దేవుఁడు. అజ్ఞానమను నిర్మాల్యమును వదలి అతఁడే - నేనను నాత్మజ్ఞానముతో పరమాత్ముని పూజింపవలె నని యుపనిషత్తులు చెప్పుచున్నవి.

దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవః సనాతనః।
త్యజే దజ్ఞాననిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్॥
—స్కందోపనిషత్ **

ఈ విధముగా పరమాత్ముని పూజింపఁజాలని సామాన్య మానవునకు తరణోపాయము సగుణోపాసనమే.

"సగుణోపాసనయందు జీవాత్మ పరమాత్మలకుఁ గల సంబంధమును అభ్యాస మొనరించునపుడు చిత్తవృత్తుల ననుసరించి అధికారభేదము లుండక తప్పదు. అందువలననే విగ్రహారాధకునిలో నున్న అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములను ఉత్తరోత్తరసాక్షాత్కారము చేసికొనుటకై మన శిల్పరీతులు ఉదయించినవి "1

---

* పోల్చు : కఠోపనిషత్తు 5-9-3; —శ్వేతాశ్వతరోపనిషత్. 4-20.

Cf :- D. N. Sukla : SILPASASTRA. — p. 262.
"God is the spirit immenent in the Universe and temple is His Abode."
"Every part of the temple architecture is an illustration of this organic theory corroborating the truth that God and His Temple correspond to soul and human body."

1. గడియారం రామకృష్ణశర్మ : మన వాస్తుసంపద, పుట. 13,
ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ ప్రచురణ.

## సగుణోపాసనము : మూర్తికల్పనము

ఏకం చ భగవంతం తే నానారూప మకల్పయన్ ।
ఆత్మనః ప్రీతిరూపాణి రూపాణ్యథ మహాత్మనః ॥

—వ్యా.భా. కర్ణ: 33-51

భగవంతుఁడగు శివుఁ డొక్కఁడే యైనను దేవతలు తమ భావనాశక్తి ననుసరించి యనేకరూపములు కల్పించి పరమాత్మునందు తమతమ ప్రతిబింబములు దర్శించిరి.

శివునకు బహురూపుఁడు, విశ్వరూపుఁడు - అను నామములున్నవి.

భగవానుఁడు భక్తజనులకు తత్తద్భావనానురూప మగు రూపమున దర్శన మిచ్చుచుండును.

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥

—భగవద్గీత. 7-21*

"ఏయే భక్తుఁ డేయే దేవతామూర్తిని శ్రద్ధాసక్తులతో నర్చింపఁగోరుచున్నాఁడో వానివాని శ్రద్ధాసక్తు లాయాదేవతారూపమునం దచంచలముగా నిలిచియుండు నట్లు నేను చేయుదు"నని శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాడు.

శ్రద్ధతో నర్చించుట యనఁగా వివిధద్రవ్యములతో నిర్మింపఁ బడిన దేవతామూర్తుల, నాయా దేవతామంత్రజపధ్యాన పూజావిధానముల ననుసరించి పూజించుట [1]

పరమేశ్వరధ్యానమునకు యోగమునకు ప్రతిమ ప్రధాన సాధనము. అది భగవంతునిపై దృష్టిని కేంద్రీకరించుటకు సాధకునకు సహాయకారిగా నుండును

ధ్యానయోగస్యసంసిద్ధ్యై ప్రతిమా లక్షణం స్మృతమ్ ॥

—శుక్రనీతి 4-4-14

ఈ రహస్యము నెఱిఁగిన శిల్పిబ్రహ్మ లోకహితార్థము దేవతామూ కల్పనము చేసినాఁడు.

శిల్పినా కల్పితం దైవం శిల్పిబ్రహ్మమయం జగత్॥ —మయమతవ

---

1. చూడు :- వ్యా.భా. భీష్మ. 31-21 (గీత 7-21) వ్యాఖ్యానసహితము
—గీతా ప్రెస్. ప్రతి. పు 266

# ప్రతిమాశిల్పము

భారతదేశమునందు విగ్రహారాధన మనాదిగా నున్నది.

మొహంజదారో-హరప్పా శిథిలములం దుపలభ్యమైన కళాఖండములను బట్టి సింధుసభ్యతాసమాజమునందు శివలింగపూజయు మాతృదేవతారాధనము నున్నట్లు తెలియుచున్నది.

ఋగ్వేదమునందు ప్రతిమారచనమును సూచించు మంత్రము లున్నవి.

కాసీత్ ప్రమా ప్రతిమా కిం నిదానమ్॥ —ఋగ్వేద. 10-130-3

ఇట ప్రమ యన ప్రమాణ మనియు, ప్ర తి మా యన దేవత యనియు వివరింపఁబడినది.

ఒ కా నొ క శి ల్పి యింద్రదేవతా ప్రతీకనో ప్రతిమనో రచించి దానిని పూజార్థము పదిధేనువుల కద్దె కీయఁజూచుచున్నట్లు మఱియొక మంత్రము వలన స్పష్ట మగుచున్నది.

క ఇమం దశభి ర్మమేంద్రం క్రీణాతి ధేనుభిః।
యదా వృత్రాణి జంఘన దథైనం మే పునర్దదత్॥ —ఋగ్వేదము. 4-24-10

(నా యింద్రుని - ఇంద్రప్రతిమను - పదిధేనువు లిచ్చి యెవఁడు కొనును ? శత్రుసంహారానంతర మతఁడు నా యింద్రుని నాకు తిరిగి యిచ్చివేయవలెను )

దేవశిల్పియగు విశ్వకర్మయే ప్రప్రథమ ప్రతిమాకారకుఁడు, ప్రతిమా స్థాపకుఁడు నని డా॥ ద్విజేంద్రలాల్ శుక్లా వక్కాణించినాడు.

విశ్వకర్మా వ ఆదిత్యై రుత్తరత ఉపదధతామ్।
త్వష్టా వో రూపై రుపరిష్టా దుపదధతామ్॥ —తైత్తిరీయారణ్యకము. 1-20-1

ఆద్యార్యకళాకారుఁడు, దేవస్థపతియు నగు విశ్వకర్మ నీకొఱకు సూర్య ప్రతిమను స్థాపించుఁగాక.[1] త్వష్టను గూర్చియు నిట్టి యభ్యర్థనము గలదు.

కశ్యప బ్రహ్మర్షికృతమగు 'కాశ్యపశిల్ప'మను శిల్పశాస్త్రగ్రంథము నందు పతిమారచనాస్థాపనాదివిధానము లున్నవి.

దీనినిబట్టి ప్రాచీనకాలమున విశ్వకర్మ, త్వష్ట, కశ్యపమహర్షి మున్నగు శిల్పాచార్యులు ప్రతిమాశాస్త్రవేత్త లయినట్లు తెలియుచున్నది.[2]

---

1, 2. చూడు :- డా॥ ద్విజేంద్రలాల్ శుక్లా 'భారతీయవాస్తుశాస్త్ర - ప్రతిమావిజ్ఞాన' "విశ్వకర్మా - దేవస్థపతి ఆది ఆర్యకళాకార్ - తేరేఁయే సూర్య ప్రతిమా ప్రత్యుపస్థాపితకరే"

## ఇంద్రోత్సవము : ప్రతీకపూజ

చేదిభూనాథుఁడయిన వసురాజు తప మొనరించుచుండఁగా నింద్రుఁడు వచ్చి, వాని తపంబునకు మెచ్చి, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనక్షమంబైన యొక్క వేణు యష్టి నిచ్చిన, నవ్వసువును దనకు చిహ్నంబుగా నవ్వేణు యష్టికి మహావిభవంబు మెఱయ నేఁటేట నింద్రోత్సవంబను నుత్సవంబు చేయుచు నీశ్వరునకు నింద్రాదిదేవతలకు నతిప్రీతి సేసె నది మొదలుగా రాజు లెల్లం బ్రతిసంవత్సరంబు నింద్రోత్సవంబు సేయుచుండుదురు.

ఘనముగ నయ్యింద్రోత్సవ మొనరించు మహీపతులకు నొగి నాయు ర్వ
ర్ధనము నగుఁ బెరుఁగు సంతతి యనవరతము ధరణిఁ బ్రజకు నభివృద్ధి యగున్.

—నన్నయ, భార. ఆది. 3-24-25

ఇంద్రోత్సవము చేయు పద్ధతి మూలమునందు వర్ణింపఁబడినది.

యష్టిం చ వైణవీం తస్మై దదౌ వృత్రనిషూదనః ।
ఇష్టప్రదాన[1] ముద్దిస్య శిష్టానాం ప్రతిపాదినీమ్॥ 17

తస్యాః శక్రస్య పూజార్థం[2] భూమౌ భూమిపతి స్తదా ।
ప్రవేశం కారయామాస గతే సంవత్సరే తదా॥ 18

తతః ప్రభృతి చాద్యాపి యష్టేః క్షితిపసత్తమైః ।
ప్రవేశః క్రియతే రాజన్యథా తేవ ప్రవర్తితః ॥ 19

అపరేద్యు స్తత స్తస్యాః క్రియతేఽత్యుచ్ఛ్రయో నృపైః ।
అలంకృతాయాః పిటకై ర్గంధమాల్యైశ్చ భూషణైః ॥ 20*

మాల్యదామపరిక్షిప్తా విధివత్ క్రియతేఽపి చ ।
భగవాన్ పూజ్యతే చాత్ర హంసరూపేణ చేశ్వరః ॥ 21

---

1. ఇష్టప్రదానం ప్రీతిదాన ముద్దిశ్య యష్టిం దదౌ॥ 17

2. శక్రస్య పూజార్థం మానార్థం తస్యాః యష్టేః ॥ 18

* అపరేద్యుః ప్రతివర్షే ద్వితీయసంవత్సరాదౌ । అత్యుచ్ఛ్రయ ఊర్ధ్వం స్థాపనమ్
పిటకైః మంజూషాభిః పైర్వస్త్రమయైః కోశైః యద్వా
కాంచ్యామివ పిటకాః స్వర్ణాదిమయా వేష్టకా
పేట్య ఇతిభాషాయాం ప్రసిద్ధా గ్రాహ్యాః ॥ —నీలకంఠ, చిత్రశాలాప
పిటకః పేటకః మంజూషాథ విహంగికా - ఇత్యమరః ॥

ఉపరిచరవసు విం్రదుఁ డొసఁగిన వేణుయష్టిని ఇంద్రప్రతీకగా భూమిపయి స్థాపించి పూజించినాఁడు. వాని ననుసరించి లోకమునందలి రాజు లెల్లరు నింద్రధ్వజపూజ చేయఁదొడఁగిరి.

ప్రతిసంవత్సరాదిని ఇంద్రప్రతీకయగు నా వేణుయష్టిని వివిధ వస్త్రములతోను, గంధమాల్యాదులతోను పెక్కు పేటలుగల స్వర్ణహారములతోను, భూషణములతోను అలంకరించి పూజించి యింద్రధ్వజోత్థానము చేయుదురు. ఇంద్రుఁడు హంసరూపమున వచ్చి యా పూజ లందుకొనును.

చక్కగా నలంకరింపఁబడిన యెత్తైన వెదురుగడను త్రాళ్లతోఁ గట్టి పైకెత్తి నిలఁబెట్టుటనే యింద్రధ్వజోత్థాన మందురు. రజ్జుబద్ధమయిన యీ ధ్వజమునకు యంత్రధ్వజ మనియు పేరు. రజ్జుబంధ (యంత్ర) నిర్ముక్త మయినపు డది పడిపోవును.

వ్యాసభారతము నందలి యింద్రధ్వజోపమానముల వలన నీ యెల్ల విషయములు విశదమగుచున్నవి.

పరస్పరాశ్లిష్టశాఖైః పాదపైః కుసుమాన్వితైః ।
అశోభయత వనం తత్ తు మహేంద్రధ్వజసన్నిభైః ॥ —ఆది.70-14

ఇంద్రకేతురివోత్థాయ సర్వాభరణభూషితః ।
ఇంద్రవీర్య సమః కృష్ణః సంవిష్టో మాభ్యభాషత॥ —ఉద్యోగ. 59-25

స పపాత హతో రాజన్ వసుధా మనునాదయన్ ।
ఇంద్రధ్వజ ఇవోత్సృష్టో యంత్రనిర్ముక్తబంధనః ॥ —ద్రోణ. 93.59*

ఉపరిచరవసువే యింద్రధ్వజపూజావిధానమున కాద్యప్రవర్తకుఁడు. పాశ్చాత్య దేశములందు పాటింపఁబడు శక్రధ్వజోత్థానము వంటి వసంతోత్సవములకు (May Pole) సైత మతఁడే మూలమై యుండవచ్చును.[1]

* పోల్చు :- వాల్మీకి రామాయణము —అయోధ్య. 77 9

1, Cf :- V. Venkatachalam Iyer . Notes on a study of the Preliminary chapters of the Mahabharata —P. 347

"...Uparichara Vasu started the cult of INDRADHWAJA (th e May Pole of some Europian countries.) The DUD of Egypt - a cult which according to some scholars had its origin in the days of the Polestar worship."

మహాకవికాళిదాసు క్రొత్త
యొక్క నవాభ్యుదయమును ఇ

పురుహూత ధ్వజస్యేః
నవాభ్యుత్థానదర్శినో

చతురస్రాకృతి గల శక్ర
ప్రజలకు సౌఖ్యము కలుగు
రాజుల రాజ్యములో పర్జన్యు
పురాణమునందు జెప్పఁబడినది.

చతురస్రం ధ్వజాకార
ఆహుః చక్రధ్వజం
ఏవం యః కురుతే
పర్జన్యః కాలవర్షీస్యా

ప్రాచీన శిల్పముల
వైజయంతిని - చూచి యద
ఇంద్రయష్టియై యుండు నని

ఇంద్రధ్వజ నిర్మాణా
శిల్పశాస్త్రగ్రంథములవలనఁ దె

చిత్రప్రతి సమాకీర్ణాం యష్టిం తత్రాజ్యలేపితామ్ ।
చూర్ణైః సర్వోషధీభిశ్చ స్థపతిః స్థాపయేత్ స్వయమ్ ॥
—సమరాంగణసూత్రధార, 17

* చూడు :- కాళిదాస : రఘువంశము 4-3. మల్లినాథవ్యాఖ్య.

1. Cf :- V S. Agrawala : Studies in Indian Art. — p.
"We know of another motif on the punch-marked coins and sculpture viz. a triangular - Surmounted Standard. It appe to me to be the Standard Symbol or Vaijayanti, the Indrayasi referred to in the Mahabharata and said to be a banner raised in honour of Indra to make the weal and the prosperity of the whole Janapada. It has an obvious resemblance with motif Ankh, that is first found in Egypt and then transmitted to other countries in Westsrn Asia."

# అగ్ని పూజ

యజ్ఞేన వర్ధత జాతవేదస మగ్నిం యజధ్వం హవిషా తనా గిరా॥

—ఋగ్వేద 2-2-1

యజ్ఞముతో జాతవేదుఁడు వర్ధిల్లు గాక !

హవిస్సు తోడను స్తోత్రము తోడను అగ్నిని పూజింపుడు. [1]

యజ్ఞ మన శిల్పయజ్ఞమును.

శిల్పక్రియలతో విద్యుదగ్నిసాధ్యములగు యానవిమానాదులను సంపాదించుకొను మానవుఁ డైశ్వర్యవంతుఁడగును. [2]

మహాభారతకాలమున జనులు దేవముఖుఁడగు అగ్నిని యజ్ఞములతోడను హోమములతోడనే కాక స్తోత్రములతోడను పూజించుచుండిరి.

మందపాలుఁడు ...... ఖాండవదహనోద్యతుండై వచ్చుచున్న యగ్నిభట్టారకుంగని యగ్నిసూక్తముల నిట్లని స్తుతియించె.

"నీ వఖిలధర్మమూర్తివి నా వీర్యప్రభవులయిన నల్వురు సుతులన్
లావుకలఁగరుణఁగావుము పావక భువనోపకారపర్యాప్తమతీ॥"

—నన్నయ ఆది. 8-301

సహదేవుఁడు శుచియై వార్చి దర్భశయనంబున శయనించి యగ్నిసూక్తంబులం బఠియించుచు నగ్నిభట్టారకు నిట్లని స్తుతించె.

"నీతదర్థంబులై నిఖిలవేదంబులు వర్తిల్లు లోకపావనములగుచుఁ
బావనంబులలోనఁ బావనుండవు నీవు యజ్ఞంబులును నీవ హవ్యవాహ॥"

— నన్నయ. సభా; 1-258,9

ఋగ్వేదమునందలి యగ్నిసూక్తముల వలనను, మహాభారతాది గ్రంథము లందలి యగ్నిస్తోత్రముల వలనను దెలియనగు నగ్నిస్వరూప స్వభావములను బట్టి యగ్నిదేవునకు రూపకల్పన చేయఁబడినది.

---

1. Cf :- Ralph T. Griffith ; Hymns of the Rigveda. — 2-2-1
"With sacrifice exact Agni who knows all life, worship him with oblation and song of praise.''

2 చూడు :- దయానంద : ఋగ్వేదభాషాభాష్యము. — 2-2-1.

"జో మనుష్య శిల్పక్రియాసే బిజులీ ఆది కే రూప్ కో యాన విమాన ఆది కే కార్యమే అచ్ఛేప్రకార్ యుక్త కరే వే ఐశ్వర్య కో ప్రాప్త హో ।"

# అగ్నిదేవుని రూపకల్పన

త్వమేక మాహుః కవయ స్త్వామాహు స్త్రివిధం పునః,
త్వా మష్టధా కల్పయిత్వా యజ్ఞవాహ మకల్పయన్॥

—వ్యా. భా. ఆది. 229.26*

ఓ అగ్నీ! నీ వొక్కరూపముగలవాఁడవే. కవులు నీకు మూఁడురూపములు కల్పించినారు. కొందఱు నీకు ఎనిమిదిరూపములు కల్పించి యజ్ఞవాహకునిఁ జేసినారు.

దివ్యము, భౌమము, ఔదర్యము నని యగ్నికి మూఁడు విధములు. అగ్ని పంచభూతములు (పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము) సూర్యుఁడు, చంద్రుడు, యజమానుఁడు నను నెనిమిది రూపములు గలవాఁడు.[1]

ఋగ్వేదకాలముననే కవులు, శిల్పులు, అగ్నికి రూపకల్పనము చేసినారు.

చత్వారిశృంగా త్రియో అస్య పాదా
ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య॥ —ఋగ్వేద. 4-58.3

శిల్పాచార్యు లీ రూపమును ధ్యానించి శిలాదార్వాదిద్రవ్యములతో మూర్తినిర్మాణము చేయుచున్నారు.

ఈ వేదమంత్రానుసారము శిల్పించఁబడిన యగ్నిమూర్తిని చిదంబర క్షేత్రము నందలి నటరాజాలయపూర్వద్వారమునఁజూడ నగును.

అది అగ్నిప్రతిమ యని శ్రీ కృష్ణుఁ శ్రీ గోపీనాథరావు గారును అభిప్రాయపడినారు.[2]

" నాలుగు శృంగములు, మూడు పాదములు, రెండు శిరములు హస్తములు కల మూర్తిని సృష్టించి లోకులకుఁ బ్రత్యక్షీకరింపఁజేసె శిల్పము. "[3]

* పోల్చు - కఠోపనిషత్. 5.9

అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపఁబహిశ్చ॥

1. త్రివిధం దివ్యం భౌమ మౌదర్యం చ.
అష్టధా పంచభూతాత్మనా సూర్య చంద్ర యజమాన రూపేణ చ॥ —నీలకంఠ

2. చూడు :- డా. ద్విజేంద్రలాల్ శుక్లా : భారతీయవాస్తుశాస్త్ర - ప్రతిమావిజ్ఞాన.

3. చూడు :- నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము. పు. 109

అగ్ని రూపము చిత్రీకరింపఁబడి త్వక్కు పయి నిలుపఁబడి నట్లు మఱియొక ఋగ్వేదమంత్రము వలనఁ దెలియుచున్నది.

స ఈం మృగో అప్యో వన ర్గురుప త్వచ్యుపమస్యాం ని ధాయి.

—ఋగ్వేద. 1-145-5*

అగ్నిదేవుఁడు పింగాక్షుఁడు, లోహితగ్రీవుఁడు, కృష్ణవర్త్మయును.

పింగాక్షః లోహితగ్రీవో కృష్ణవర్త్మన్ హుతాశన॥

—వ్యా.భా. ఆది. 131-10

ఈ వర్ణనము వర్ణచిత్రకారుల కుపయుక్తముగ నుండును.

అగ్నిదేవుఁడు సప్తజ్వాలాయుక్తుఁడుగ భావింపఁబడినాఁడు

యదగ్నే తే శివం రూపం యే చ తే సప్త హేతయః॥

—వ్యా.భా. ఆది. 131-10

అగ్ని సప్త జిహ్వనుఁడు (వ్యా.భా. ఆది. 232-5) సప్తార్చి —(ఆది. 5-30)

కాళీ, మనోజవా, ధూమ్రా, కరాళీ, లోహితా, స్ఫులింగినీ విశ్వరుచి - అను నేఁడును అగ్నియొక్క సప్తజిహ్వలపేర్లు -

పంచేంద్రియములు బుద్ధి, మనస్సు నను నేఁడును సప్తజిహ్వలుగా అగ్నికి రూపకల్పన చేయఁబడినదని దార్శనికులు చెప్పుదురు. పంచభూతములు సూర్యచంద్రులు నని కొందఱు.

ఈ సప్త జిహ్వల నామములు కాలభేదము వలనఁ గలుగు భిన్న భిన్నోష్ణోగ్రతలను సూచించును. [1]

త్రేతాగ్నిసాధ్యమయిన యజ్ఞకర్మలు చేయు నిత్యాగ్నిహోతృలకు, అగ్నిద్వారమున శిల్పకర్మములు చేయు లోహకారాది నిత్యాగ్నిహోత్రులకును అగ్నియే పరమదైవము.

తుభ్యం కృత్వా నమో విప్రాః స్వకర్మవిజితాం గతిమ్॥[2]

—వ్యా.భా. ఆది. 229-26

* Cf :- O G Ganguly

"This God, child of the waters, was...... made still and motionless by placing him on a Piece of Skin"

This is poetic circumlocution for saying :-

"I am Painting a still Portrait of the God on a Piece of Parchment."

1. చూడు :- శ్రీ వేంకటరమణార్యేణ విరచితః సనాతనవిజ్ఞానసముదయః॥ పు. 121

2. "కర్మిణాం త్వమేవ గతి రిత్యాహ తుభ్య మితి॥" —నీలకంఠ.

# సూర్యోపాసనము

త్వం భానో జగతశ్చక్షు స్త్వమాత్మా సర్వదేహినామ్
త్వా ముపస్థాయ కాలే తు బ్రాహ్మణా వేదపారగాః ।
స్వశాఖావిహితై ర్మంత్రై రర్చంత్యృషి గణార్చితమ్॥

—వ్యా.భా. వన. 3.36-39

ఓ సూర్యదేవ! నీవు సర్వజగత్తునకు నేత్రము వంటివాఁడవు. సకలప్రాణులకు ఆత్మవు నీవే...

ఓ సూర్యదేవ ! ఋషిగణములచే నర్చింపఁబడు నిన్ను ఉపస్థాన సమయమున వేదవేత్తలయిన బ్రాహ్మణులు తమ తమ వేదశాఖల యందలి మంత్రములతో నిన్ను పూజించుచున్నారు.

"ధౌమ్యుండు విశుద్ధాత్ముండైన ధర్మరాజునకు సూర్యుఁ డర్యముండు భగుం డను నివి మొదలుగా గల నామంబుల యష్టోత్తరశతంబు నభీష్టసిద్ధి ప్రదంబయిన దాని విస్పష్టార్థవర్ణోచ్చారణంబును విధియుక్తంబునుగా నుపదేశించి దీనిని దొల్లి యింద్రువలన నారదుండు వడ నారదువలన వసు వనురాజు వడసె నాతవి వలన నేను బడసితి వేను నీకిచ్చితి నిది దేవనిర్మితంబు దీన నాదిత్యు నతి భక్తి నారాధింపు మనిన.

" హితుఁడైన తన పురోహితు నుపదేశంబు పేర్మితోఁ జేకొని ధర్మసుతుఁడు నెమ్మిఁ బుష్పోపహారమ్ముల నాదిత్యుఁ బూజించి.... సూర్యాదినామముల సూర్యుఁగొలిచి జపము చేయుచున్న త్రిలోకచక్షుఁడు ప్రత్యక్షమై యాతని కక్షయపాత్ర నొసఁగెను.

—నన్నయ. ఆరణ్య. 1-41-43

సూర్యోదయసమయమున ఏకాగ్రచిత్తముతో సూర్యస్తవమును పఠించిన వానికి దారాపుత్రులు, ధనధాన్యములు, పూర్వజన్మస్మృతి, ధైర్యస్థైర్యములు మేధాసంపద కలుగు నని మూలమునందున్నది.

సూర్యోదయే యః సుసమాహితః పఠేత్ ।
స పుత్రదారాన్ ధనరత్నసంచయాన్ ।
లభేత జాతిస్మరతాం నరః సదా ।
ధృతిం చ మేధాం చ స విందతే పుమాన్॥ —వ్యా.భా. వన. 3.30

---

*పోల్చు :- ఋగ్వేద. 1-115-1
" సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ "

## సూర్యుఁడు : విశ్వకర్మ

వ్యాసభారతమునందలి సూర్యాష్టోత్తరశతనామములలో త్వష్ట...సవిత... విశ్వకర్మ విశ్వతోముఖాది నామము లున్నవి.

సూర్యోఽర్యమా భగస్త్వష్టా[1] పూషార్కః సవితా రవిః
కాలాధ్యక్షః ప్రజాధ్యక్షో విశ్వకర్మా తమోనుదః ।
దేహకర్తా ప్రశాంతాత్మా విశ్వాత్మా విశ్వతోముఖః ॥—వ్యా భా. వన. 3-16-27

త్వష్ట దేవశిల్పి. ద్వాదశాదిత్యులలో నొకఁడు.

విశ్వకర్మ యన విశ్వసృష్టికర్త.

అగస్త్యకృతమగు 'ఆదిత్యహృదయము' నందును సూర్యునకు త్వష్ట, విశ్వకర్మాదినామము లున్నవి.[2]

సూర్యుఁడు త్రిలోకచక్షుఁడు.[3] సూర్యుఁడు విశ్వచక్షుఁ డని ఋగ్వేదము.

ఉద్వేతి సుభగో విశ్వచక్షాః సాధారణః సూర్యో మానుషాణామ్ ॥
—ఋగ్వేద. 7-63-1

విశ్వకర్మయు సూర్యుని వలె విశ్వచక్షుఁడు, విశ్వతోముఖుడును.

విశ్వత శ్చక్షు రుత విశ్వతోముఖః ॥ —ఋగ్వేద. 10-81-3

నేత్రములకు జనకుఁడయిన విశ్వకర్మ మానవులకు చూపును మనోవికాసమును గలిగించు లోచూపును నొసఁగువాఁడు.

'చక్షుషః పితా మనసా హి ధీరః ॥' —ఋగ్వేద. 10-81-1

సూర్యుఁ డొసఁగు వెలుఁగును మనోవికాసము గలిగించు నట్టిదే.

సూర్యవిశ్వకర్మలకు భేదము లేదు. ఇరువురు పరమాత్మ స్వరూపులే.[4]

---

1. త్వష్టా విశ్వశిల్పకత్వాత్। సవితా జగత్ప్రసవనాత్॥ —నీలకంఠ.
2. చూడు :- వా. రా. అయోధ్య. 105. 11-21.
   నన్నయ అరణ్య. -1. 43. = వ్యా. భా. వన. -3.38.
4. Cf :- Jeanine Miller : THE VEDAS. — p 89.
   "Going back to the origins we find that the 'Father of the eye' (Cakshusah Pita) is the 'all-creator' Visvakarman, he who is 'wise in mind' (manasa hi dhirah, X 82. 1) and thus promoter of wise insight as Cakshusah Pita could be interpreted. The all-seeing (Visvacakshas) and 'all-creator' (Visvakarman) are one."

భారతదేశమునం దతిప్రాచీనకాలము నుండియు సూర్యోపాసన మున్నది.

యఋతేన సూర్య మారోహయన్ దివి॥ —ఋగ్వేద 10-62-3

అంగిరసబ్రాహ్మణులు తమ ఋతము చేత - సత్య ధర్మము చేత - సూర్యుని నభస్థలి యందు నిలిపినారు. సూర్యోపాసకులలో నాంగిరసబ్రాహ్మణు లగ్రగణ్యులు.

వైదికయుగానంతరము అంగిరసభారద్వాజులు స్కంద (శక) ద్వీప బ్రాహ్మణులు - మాగులు - భారతదేశమున సూర్యారాధనమును సౌరమతమును వ్యాప్తి నొందించినా రని పురాణముల వలన దెలియుచున్నది.[1]

త్రేతాయుగమునందు శ్రీరామచంద్రునకు సర్వశత్రు వినాశకర మగు ఆదిత్యహృదయము నుపదేశించిన అగస్త్యుఁడు శిల్పాచార్యుఁడు.

ద్వాపరయుగమునందు ధర్మజున కాదిత్యపూజావిధానమును తెలిపిన ధౌమ్యపురోహితుఁడు కాశ్యపగోత్రుఁడు. కాశ్యపులు శిల్పులే.

అంగిరసులు, అంగిరసభారద్వాజులు, అగస్త్యులు, కాశ్యపులు వీరెల్లరు శిల్పిబ్రాహ్మణులే యగుట గమనింపఁదగిన విశేషము.

విశ్వకర్మ కూఁతురగు సంధ్యాదేవిని, సూర్యుఁడు వివాహమాడినట్లును 'సవితృనకు బడబారూపధారిణియైన త్వాష్ట్రికి నాశ్వినులు పుట్టినా' రనియు పురాణేతిహాసములు చెప్పుచున్నవి.

శిల్పప్రజాపతి కల్లుఁడయిన సూర్యుఁడు శిల్పుల కభిమానదైవము.

సప్తచామీకరాభాయ హరయే విశ్వకర్మణే।
సమస్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే॥

—వా.రా. యుద్ధ. 105-21

---

1. Cf :- N. K Bhatta Sali : Iconography of Buddhist and Brahmanical Sculptures in Decca Museum —p 154.

"The priestly family of the Angirasa Brhmanas ...... is said to have caused SURYA to ascend the sky by their rites. [R V. X 62-3] The Angirasas thus appear to have been associated with the Solar worship from the earliest times and it is interesting to find in the later Puranas that it was the Angirasa Bharadwajas the Magas or Skunda Dweepi Brahmins who were mainly instrumental in spreading the wohrship of the Sun God in India."

## దివాకరుని దివ్యరూపము

కుంతీదేవి యొకనాఁడు పూర్వశైలతటిపై శోభిల్లు తిగ్మాంశుఁ జూచి, సహజకుండలకవచాభిరామంబయిన తదీయమూర్తి విభవంబున కోటువడి దేవా భవత్సమానసుందరుం డగు నందనుం గరుణింపవే యని మనంబునఁ గోరుచు మంత్రోచ్చారణంబు సేయుచున్నఁ బ్రభాకరుండును నిజయోగబలంబున మూర్త్యంతరంబు ధరియించి కుంతి పాలికిం జనుదెంచె.

సూర్యుఁడు మూర్త్యంతరము ధరించి వచ్చినప్పటి రూపము మూలమునం దిట్లు వర్ణింపఁబడినది.

మధుపింగో మహాబాహుః కంబుగ్రీవో హసన్నివ ।
అంగదీ బద్ధముకుటో దిశః ప్రజ్వాలయన్నివ॥ —వ్యా.భా. వన. 306-9

సూరుఁడు మధుపింగశరీరుఁడు మహాభాహువు అంగదములు కిరీటము ధరించి నగుమోముతో ప్రకాశించు చున్నాఁడు.

దివాకరుఁడు సప్తాశ్వుఁ డనియు హరితాశ్వుఁ డనియు మఱియొకచోటఁ జెప్పఁబడినది.

దివాకరః సప్తసప్తి ర్ధామకేశీ విరోచనః ।
ఆశుగామీ తమోఘ్నశ్చ హరితాశ్వశ్చ కీర్త్యసే॥ —వ్యా భా. వన 3-63

హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తి ర్మరీచివాన్॥ —వా.రా. యుద్ధ.

సూర్యుఁ డేకచక్రరథుఁ డని ఋగ్వేదము.

సప్త యుంజంతి రథ మేకచక్ర మేకో అశ్వో వహతి సప్తనామా॥
—ఋగ్వేద. 1-164-2*

ఈ విధమగు వర్ణనముల నన్నింటిని సమీకరించికొని, మననము చేసి రూప సాక్షాత్కారము చేసికొనిననే గాని శిల్పులు సూర్యవిగ్రహమును నిర్మింపఁజాలరు.

---

1. ఎఱ్ఱన. ఆరణ్య. 7-325 : వ్యా.భా. వన. 306-6

"తస్యా దృష్టి రభూత్ దివ్యా సా పశ్యద్ దివ్యదర్శనమ్ ।
ఆముక్తకవచం దేవం కుండలాభ్యాం విభూషితమ్॥

* Cf :- Ralph T. Griffith : The Hymns of the Rigveda.

"Seven to the one-wheeled chariot yoke the Courser, bearing seven names the Single Courser draws it."

# సుప్రసిద్ధ సూర్యక్షేత్రములు

"ఆదిత్యాశ్రమం బను వనంబున నాదిత్యుం బూజించి యాదిత్యలోక గతులగుదురు"[1]

ప్రాచీనకాలమున భారతదేశమునందు ముండీరము, కాలప్రియము, మూలస్థానము నను మూఁడు పట్టణము లందు సూర్యదేవాలయములున్నవి.[2]

ముండీరం ప్రథమం తత్ర కాలప్రియం తథా పరమ్ ।
మూలస్థానం తృతీయం చ సర్వవ్యాధివినాశనమ్॥
తత్ర సంక్రమతే సూర్యో ముండీరే రజనీక్షయే ।
కాలప్రియే చ మధ్యాహ్నే మూలస్థానే క్షపాగమే॥
తస్మిన్ కాలే నరో భక్త్యా పశ్యే దప్యేకమేవ చ ।
కృతక్షణో నరో మోక్షం సత్యం యాతి న సంశయః॥

—స్కాంద. నాగరఖండ. 76-2

మూలస్థానము నందలి సూర్యమందిరమును శ్రీ కృష్ణుని కుమారుడైన సాంబుఁడు కట్టించి నట్లు భవిష్యపురాణము వలనఁ దెలియుచున్నది.

---

1 ఎఱ్ఱన. ఆరణ్య. 2-268 = వ్యా భా. వన. 83-188, 5

తతో గచ్ఛేత రాజేంద్ర తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్ ।
ఆదిత్యస్యాశ్రమో యత్ర తేజోరాశే ర్మహాత్మనః ॥
తస్మిం స్తీర్థే నరః స్నాత్వా పూజయిత్వా విభావసుమ్ ।
ఆదిత్యలోకం వ్రజతి కులం చైవ సముద్ధరేత్॥

2. Cf :- Dr. A. B. L. Awasthi : Studies in Skanda Purana. —Part I.

"Mundira, described as one of the three important cities associated with the Solar cult is placed in the Eastern Region near Gangapura." —p. 123.

"Kalapriya an important town associated with Sun cult has been correctly identified with Kalpi." —p. 109.

"The city of Mulasthana was reputed for its Sun temple." —p. 52.

"Mulasthana another important town famous for the Sun worship represents modern Multan in Western Pakistan.' —p. 123

చంద్రభాగానదీతీరమునందున్న మూలస్థానమునకు సాంబపురమనియు, మూలసాంబపుర మనియు నామాంతరములు.

సాంబుఁడు శాపవశమున కుష్ఠురోగగ్రస్తుఁడై మైత్రేయవనమునందు సూర్యుని గూర్చి ద్వాదశాబ్దములు తప మొనర్చి సూర్యానుగ్రహమున స్వస్థుఁడై యచ్చట సూర్యమందిరము నిర్మింపఁదలఁచెను. మఱునాఁడు చంద్రభాగా నదియందు స్నానమాడుచుండఁగా విశ్వకర్మ నిర్మితమును సూర్యతేజో విరాజితమును నగు నొక విగ్రహము లభించెను. దాని నాతఁడు తనచే నిర్మింపఁబడిన దేవాలయమునందు ప్రతిష్ఠించినాడు,

సాంబుఁడే సూర్యదేవతా విగ్రహ ప్రతిష్ఠార్థము, పూజార్థము సూర్యోపాసకులగు మాగీబ్రాహ్మణులను ఇరానుదేశము నుండి పిలిపించినాఁ డనియుఁ జెప్పఁబడినది.[1]

గుప్తయుగమున సూర్యారాధనము, సూర్యప్రతిమానిర్మాణము ప్రచురముగా నున్నట్లు శాసనాధారములవలనఁ దెలియుచున్నది.

సూర్యదేవాలయములలో విగ్రహప్రతిష్ఠాపూజాకార్యక్రమములు సూర్యోపాసకులయిన మాగీబ్రాహ్మణులచేత (పర్షియాదేశస్థులు) చేయింపవలె నని వరాహమిహిరుఁడు వ్రాసినాఁడు. కావుననే యుత్తరభారతమునందలి సూర్యవిగ్రహములు ఉదీచ్యవేషోపేతములుగా నిర్మింపఁబడిన వనియు పండిత పరిశోధకుల యభిప్రాయము.[2]

---

1. Cf :- Debala Mitra : KONARK. —p 4, 5.
Published by the Director General, Archeological Survey of India, New Delhi, 1968.
"While bathing in the Chandrabhaga the following day he discovered an image of the God, which had been fashioned out of Sarya's body by Visvakarma, Samba installed this image in a temple built by him in Mitravana "

2. Cf :- MISS NILESHVARI V. DESAI : Ancient Indian Society, Religion & Mythology as depicted in the Markandeya Purana. —p 161.
"The prevalence of Sun worship was known and practiced in the Gupta age and referrence to temples of the God are found from the inscriptions of the Gupta Period." "Varahamihira informs that the installation and consecration of the images and temples of the Sun should be caused to be made by the Magas (who are Parsians) and it appears that in his days Magas were the special Priests of the Sun God."

ఉత్తరభారతము నందు పలుతావుల సూర్యమందిరములున్నవి. క్రీ॥పూ॥ 400 సం॥ల నాటికి అబూశిఖరప్రాంతము నందు వెలసిన యాదిత్యగృహము లతిప్రాచీనములు. క్రీ.శ. 9 వ శతాబ్దమున లలితాదిత్యుడు కాశ్మీరమునందు మార్తండ మందిరమును నిర్మించినాడు.

రాజస్థానము నందు జోధ్‌పూరుజిల్లా ఓసియన్ వద్దను, సిరోహి జిల్లా వర్మన్ వద్దను సూర్యదేవాలయములున్నవి. సౌరాష్ట్రము నందలి మోఢేరా సూర్యదేవాలయము (క్రీ.శ. 1028) నేడు శిథిలావస్థయందున్నను అదియానాటి వాస్తుశిల్పకళావైభవములను చాటిచెప్పుచున్నది. ఈదేవాలయ కుడ్య గర్భము లందు ద్వాదశాదిత్యుల ప్రతిమలున్నవి.[1]

ద్వాదశాదిత్యులన ధాతృ మిత్రార్యమ శక్ర వరుణాంశు భగ వివస్వత్ పూష సవిత్ర త్వష్టృ విష్ణులు.

ఓఢ్రదేశమునందు నరసింహదేవుడు (క్రీ. శ. 1238-64) నిర్మించిన కోణార్క దేవాలయ మత్యంతమనోహరమై యానాటి మహాశిల్పుల ప్రతిభా విశేషములకు, వారి స్థాపత్యశిల్పకళా సిద్ధికి తార్కాణముగా నిలిచియున్నది.[2]

శిల్పు లిచ్చటదేవాలయగర్భగృహము నందలి సూర్య దేవునే గాక, త్రిసంధ్యల యందలి సూర్యబింబ ప్రతిబింబములను దేవాలయ కుడ్యములపై చెక్కినారు [3]

ముకుటధారి, చోలకచ్ఛన్నదేహుడు, 'యావియంగ' రశనాయుక్తుడు, ఉపానత్పినద్ధపాదయుగళుడు నగు ఉదీచ్యవేషధారిగా సూర్య విగ్రహమును నిర్మించుట యుత్తరభారతశిల్పసంప్రదాయము.[4]

దాక్షిణాత్యపద్ధతి యిందుకు భిన్నముగానుండును.

---

1. Cf. :- Krishna Deva : Temples of North India, —p 46
2. Cf. :- Ibid. P. 79. "Grandest achievement of the artistic and architectural genius of Orissa.
3. Cf :- Arabinda Chatterjee : KONARKA at a glance —PP 1820
4. " కుర్యా దుదీచ్య వేషం గూఢం పాదాదురో యావత్॥ " —బృహత్సంహిత.

   " చతుర్బాహుః మహాతేజాః కవచేనాభిసంవృతః ।
   కర్తవ్యా రశనా చాస్య యావియంగేతి సంజ్ఞితా॥ " —విష్ణుధర్మోత్తర.

   " రథస్థం కారయేద్దేవం పద్మహస్తం సులోచనమ్ ।
   సప్తాశ్వమేకచక్రం చ రథం తస్య ప్రకల్పయేత్॥
   ముకుటేన విచిత్రేణ పద్మగర్భసమప్రభమ్ ।
   చోలకచ్ఛన్నవపుషం క్వచిత్ చిత్రేషు దర్శయేత్॥ " —మత్స్యపురాణ.

# సూర్యనారాయణుఁడు

ధ్యేయ స్సదా సవితృమండల మధ్యవర్తీ ।
నారాయణః సరసిజాసన సన్నివిష్టః॥

విష్ణుమూర్తి సూర్యమండల మధ్యవర్తి కావున సూర్యుని సూర్యనారాయణుఁ డనియు నందురు.

ఆంధ్రదేశమున శ్రీకాకుళ పట్టణ సమీపమునఁగల హర్షవల్లీ (అరసవల్లి) క్షేత్రము నందలి సూర్యనారాయణ దేవాలయమును పురాతనమైనదే. ఈ దేవాలయమును దేవేంద్రుఁడు కట్టించి నట్లు స్థలపురాణము చెప్పుచున్నది.

దేవశిల్పి యగు మయుఁడు (విశ్వకర్మ ?) రూపొందించిన రచనా ప్రణాళిక ననుసరించి నిర్మింపఁబడిన యీ దేవాలయము నందు దేవేంద్రుఁడు సూర్య విగ్రహమును ప్రతిష్ఠించినాఁడు.[1]

ఈ మందిరమునందలి సూర్య విగ్రహము 'విశ్వకర్మ శిల్పము' ననుసరించి రచింపఁబడినది.



ఏకచక్రం స సప్తాశ్వం స సారథమహారథమ్
హస్తద్వయం పద్మధరం కంచుకచ్ఛన్న వక్షసమ్
ద్విహస్త స్థ సరోజన్మా శబలాశ్వరథస్థితః
దండశ్చ పింగలశ్చైవ ద్వారపాలౌ చ ఖడ్గినౌ॥

—విశ్వకర్మశిల్పము

హర్షవల్లి క్షేత్రమున వేంచేసి యున్న శ్రీశ్రీశ్రీ సూర్యనారాయణస్వామివారి విగ్రహము.

సప్తాశ్వరథమారూఢం
ప్రచండం కశ్యపాత్మజమ్ ।
శ్వేతపద్మధరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహమ్॥

1. Cf :- N. Ramesam : Temples and Legends of Andhra Pradesh - Ch XIX - Arasavalli

## సమాజము - పశుపతిపూజ

మహాభారతకాలమున పశుపతిపూజ యెక్కుడుగ నున్నది.

'పశుపతినివాసంబయిన యప్పుణ్యస్థానంబునం బాండుహితంబుగా నగణ్యగోహిరణ్యమహాదానంబుల బ్రాహ్మణతర్పణంబు సేసి యందుం గొండొకకాలం బుండివచ్చునది-' యని ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతనగరమునకు పంపినాడు. —నన్నయ. ఆది. 6-136

మూలమునం దిట్లున్నది.

అయం సమాజః సుమహాన్ రమణీయతమో భువి
ఉపస్థితః పశుపతేర్నగరే వారణావతే.... —వ్యా.భా. ఆది. 143-3,4

సమాజ మనగా నుత్సవము, తిరునాళ్లు, ఇట పశుపతిపూజామహోత్సవము.

అర్జునుడు తీర్థాటనము చేయుచు నాదిపశుపతిస్థానమయిన గోకర్ణక్షేత్రమును దర్శించినాడు.

చిత్రాంగదా మేవముక్త్వా గోకర్ణ మభితోఽగమత్ ।
ఆద్యం పశుపతేః స్థానం దర్శనాదేవ ముక్తిదమ్॥ —వ్యా భా. ఆది. 216-35

అర్జునుడు ద్వారకానగరము చేరుసరి కచ్చట పశుపతిపూజలు జరుగుచుండెను.

"పశుపతిపూజామహోత్సవవ్యాజంబున నఖిలయాదవభోజాంధకవృష్ణివరులతో నంతర్ద్వీపంబునకుం జని

అం దమరబృందవంద్యున కిందుకళాభరణునకు నుమేశ్వరునకు
నందంబొందగ నందఱు నందకధరు డుత్సవం బొనర్పగ ..'
—నన్నయ, ఆది. ।

శివభక్తుడయిన జరాసంధుడు శత్రురాజులను జెఱపట్టి గిరిప్ర నందలి పశుపతిమందిరమున నిత్య మొక్కనిని బలి యొసగుచు ను పూజించుచుండువాడు

"నీ యట్లు క్రూరులై నృపతులం జెఱంబెట్టి పశువరించుచుం బశుపతి నుమేశు వరదుం బూజించిన వారును గలరె ?" అని శ్రీ కృష్ణుడు జరాసంధు నాక్షేపించినాడు. —నన్నయ. స.భా. 1-189*

---

* "ప్రోక్షితానాం ప్రమృష్టానాం రాజ్ఞాం పశుపతేర్గృహే ।
పశూనా మివ కా ప్రీతి ర్జీవితే భరతర్షభ॥" —వ్యా.భా. సభా, 15-17

## రుద్ర పూజా ఫలము

ఏ మేమ మున్ను పూజింపుదుము రుద్రు నిం దని వేడ్క
తో మునికోటి దారున్న నీశుఁ డందొఱుకును బ్రీతి
గా మతిలోఁ గోటిరుద్రరూపముల్ గావించె నదియు
భూమిఁ బ్రసిద్ధమై రుద్రకోటి నాఁ బొలిచి వెలింగె,

అందు రుద్రుఁబూజ సేసి రుద్రలోక ప్రాప్తులగుదురు.[1]

సువర్ణాఖ్యం బను తీర్థంబున రుద్రుం బూజించి రుద్రలోక గతులగుదురు ఇచట విష్ణువు రుద్రు నారాధించినాఁడు.[2]

వారణాసి యందు రుద్రు నర్చించి రాజసూయ ఫల ప్రాప్తులగుదురు [3]

భద్రకర్ణేశ్వరంబున రుద్రపూజయు. సర్వసిద్ధికరము.[4]

సరకం బను తీర్థంబాడి కృష్ణచతుర్దశినాఁడీశ్వరుం బూజించి యెల్ల కోర్కులం బడయుదురు.[5]

మృగధూమంబున గంగాస్నాతులై మహాదేవు నర్చించిన మహాత్ము లశ్వమేధఫలంబు వడయుదురు.[6]

---

1. నన్నయ. ఆరణ్య. 2-256 57 · వ్యా.భా. వన. 82-124

స్రుష్టా కోటిరుద్రాణా మృషీణా మగ్రతఃస్థితా॥

2 నన్నయ. ఆరణ్య. 2-270 : వ్యా,భా వన 84-18-21

తతో గచ్ఛేత్ సువర్ణాఖ్యం త్రిషు లోకేషు విశ్రుతమ్।
తత్ర విష్ణుః ప్రసాదార్థం రుద్ర మారాధయత్ పురా
తత్రాభిగమ్య రాజేంద్ర పూజయిత్వా వృషధ్వజమ్॥

3. నన్నయ. ఆరణ్య 2-274 : వ్యా.భా. వన. 84-77

తతో వారాణసీం గత్వా అర్చయిత్వా వృషధ్వజమ్॥

4. నన్నయ. ఆరణ్య. 2-272 వ్యాభా. వన 84.39

భద్రకర్ణేశ్వరం గత్వా దేవ మర్చ్యం యథావిధి।
న దుర్గతి మవాప్నోతి నాకపృష్ఠే చ పూజ్యతే॥

5. నన్నయ. ఆరణ్య. 2-262 : వ్యా.భా. 83-75, 76

కృష్ణపక్షే చతుర్దశ్యా మభిగమ్య వృషధ్వజమ్।
లభేత సర్వకామాన్ హి స్వర్గలోకం చ గచ్ఛతి॥

6. నన్నయ. ఆరణ్య. 2-254 : వ్యా.భా. వన. 83-101

## దేవీసహితుఁడైన మహాదేవుఁడు

కొన్ని పుణ్యక్షేత్రములందు మహేశ్వరుఁడు దేవీ సహితుఁడై యున్నట్లు వర్ణింపఁబడినది.

"చంపకారణ్యంబున దేవీ సహితు నీశ్వరుం బూజించి మిత్రా వరుణలోకంబు వడయుదురు." —నన్నయ. అరణ్య. 2-276

చంపకారణ్యమునందు జ్యేష్ఠిల తీర్థమున దేవీసహితుఁడై యున్న విశ్వేశ్వరుని దర్శించిన మిత్రావరుణలోకములు ప్రాప్తించుననియు నందు మూఁడు రాత్రు లుపవాసమున్న నగ్నిష్టోమఫలము లభించు ననియు వ్యాస భారతము నందున్నది.

> తత్ర విశ్వేశ్వరం దృష్ట్వా దేవ్యాసహ మహాద్యుతిమ్ ।
> మిత్రావరుణయోర్లోకా నాప్నోతి పురుషర్షభ ।
> త్రిరాత్రోపోషిత స్తత్ర అగ్నిష్టోమఫలం లభేత్॥ —వన. 84-1356

## శ్రీశైలక్షేత్రము

> పరమమైన తీర్థంబు శ్రీపర్వతంబు నందు దేవహ్రదం బాడి యాదిదేవు
> నీశు నర్చించి వడయుదు రిష్టఫలము నశ్వమేధఫలంబును నవనిజనులు.
> —నన్నయ అరణ్య 2-277

శ్రీపర్వతమున మహాదేవుఁడు దేవీసహితుఁడై యున్నాడు.

> శ్రీపర్వతం సమాసాద్య నదీతీర ముపస్పృశేత్ ।
> అశ్వమేధ మవాప్నోతి పూజయిత్వా వృషధ్వజమ్॥
> శ్రీపర్వతే మహాదేవో దేవ్యాసహ మహాద్యుతిః ।
> న్యవసన్ పరమప్రీతో బ్రహ్మా చ త్రిదశౌ సహ॥—వ్యా భా. వన. 85-18-20

ఆంధ్రదేశమునందలి శ్రీశైలమే యీ శ్రీపర్వతము. పార్వతీపరమేశ్వరు లిచ్చట శ్రీ భ్రమరాంబామల్లికార్జునులుగా వెలసియున్నారు.

శ్రీశైలక్షేత్రమునందలి శివలింగము ద్వాదశజ్యోతిర్లింగములలో నొకటిగను భ్రమరాంబాలయము శక్తిపీఠములలో నొకటిగను పరిగణింపఁబడుచున్నవి.

> కల్యాణీం కమలాసనస్థచరణాం గౌరీం ఘనశ్యామలాం ।
> గ్రైవేయాకృతహారనూపురధరాం కంజాతపత్రేక్షణామ్ ।
> గంగాతుంగతరంగభాసవదనాం గంధర్వగానప్రియాం ।
> శ్రీశైలభ్రమరాంబికాం శివయుతాం చిన్మాత్రమూర్తిం భజే॥

## శివపూజావిధానము

యజుర్వేదోక్త శతరుద్రీయస్తోత్రముతోఁ గాని వ్యాసప్రోక్త శివసహస్రనామాదులతోఁ గాని రుద్రుని పూజింపవలయును.

వేదే చాస్య సమామ్నాతం శతరుద్రియ ముత్తమమ్।
నామ్నా చానన్త రుద్రేతి హ్యుపస్థానం మహాత్మనః॥

—వ్యా భా. ద్రోణ. 202-120

శతరుద్రీయము నే నరుఁ డతిభక్తిని శివుని మనమునందు నిలిపి యం
చితముగఁ బఠించు సులభం బతనికి సర్వంబు నిందు నందు నరేంద్రా.

—తిక్కన అను 5 386

నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవె నమః।
నుమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః
నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమః॥

—శతరుద్రీయము

ఓ రుద్రా ! నీ క్రోధమునకు, నీ బాణమునకు నీ ధనుస్సునకు, నీ బాహువులకు నమస్కారము చేసెదను వీనిని మాయందుఁ బ్రయోగింప వలదు; మా శత్రువులయందే ప్రయోగింపుము.

రక్త వర్ణుఁడును (వాచకరూపమగుశబ్దమునకు వాచ్యరూపమున నున్నవాఁడును) శిల్పియు (అంతటనుండి యన్నింటిని రక్షించువాఁడు) నగు రుద్రునకు నమస్కారము. వృక్షములను బాలించునట్టి రుద్రునకు నమస్కారము. [1]

భారతమునందలి శివసహస్రనామస్తోత్రము నందు పుష్కరః స్థపతిః అను నామ మున్నది.

పుష్కరస్థపతి యన బ్రహ్మాండరూపమైన పుష్కరమును నిర్మించువాఁ డని టీకాకారుఁడు వివరించినాఁడు.[2]

---

1. చూడు :- చదలవాడ సుందరరామశాస్త్రులు : ఆంధ్ర రుద్రభాష్యము - పు 58-59

"స్థపతయే = గృహములు మొదలగునవి చేయువానికొఱకు లేక,
యత్రస్థాతా చ సర్వస్య పాతా చ స్థపతిః, అంతటనుండువాఁడును
అన్నింటిని రక్షించువాఁడు నగు రుద్రుని కొఱకు నమః నమస్కారము.

2. చూడు :- వ్యాసభారతము - హిందీ టీకాసహితము - గీతాప్రెస్. ప్రతి.

నమ స్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః ॥ —శతరుద్రీయము.*

రుద్రులారా! తక్షకుల కొఱకు తక్షకరూపమున నున్న మీ కొఱకు నమస్కారము. రథకారుల కొఱకు రథకారరూపమున నున్న మీ కొఱకు నమస్కారము.

ఉపమన్యుఁడు కృష్ణున కుపదేశించిన మహాదేవసహస్ర నామస్తోత్రము నందు శివునకు త్వష్ట, వర్ధక్యాది శిల్పినామములున్నవి.[1]

త్వష్ట = ప్రజాపతి, విశ్వకర్మ —(నామము. 623)
వర్ధకి = సంసారరూపవృక్షమును ఛేదించువాఁడు. —(నామము. 167)

దక్షకృత శివసహస్రనామస్తోత్రమునందు మహేశ్వరునకు పంచాలుఁడు, శిల్పికుఁడు, శిల్పిశ్రేష్ఠుఁడు, సర్వశిల్పప్రవర్తకుఁడు అను నామములున్నవి.

పంచాలాయి సితాంగాయ నమః శమశమాయ చ॥ —శాంతి. 284-98

పంచాల శబ్దము శిల్పి పర్యాయవాచకము. జగన్నిర్మాతయగు విశ్వశిల్పి కొఱకు నమస్కారమని భావము.[2]

శిల్పికః శిల్పినాం శ్రేష్ఠః సర్వశిల్పప్రవర్తకః ॥ —శాంతి. 284-243

విశ్వకర్మకృతమగు శిల్పకళలు[3] నీ కొఱకే యావిర్భవించిన వని శ్రీమన్నారాయణుఁ డాదిదేవుని ప్రస్తుతించినాఁడు.

"....త్వాష్ట్రం కర్మ సౌమ్యం చ తుభ్యమ్" —ద్రోణ. 202-73

నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే॥ —శతరుద్రీయము

ఉష్ణీషవే సువక్త్రాయ సహస్రాక్షాయ మీఢుషే॥ —ద్రోణ. 202-32

సహస్రాక్షాయ = వేయికన్నులు కలిగి యింద్రరూపుఁడయిన రుద్రుని కొఱకు నమస్కారము. ఇంద్రుఁడు శిల్పియే - సహస్రాక్షుఁడన నింద్రుఁడని కాక సహస్ర శిల్పాధిపతి యగు విశ్వకర్మ యనియుఁ జెప్పికొనవచ్చును.

ఈవిధముగా భక్తులు శిల్పిరూపుఁడగు రుద్రుని పూజించుచున్నారు.

---

* కృష్ణయజుర్వేదము. 4-5. శుక్లయజుర్వేదము. 16

1. చూడు :- వ్యాభా. అనుశాసన. అ. 14 - గీతాప్రెస్ ప్రతి. పు. 5171

2. చూడు :- వ్యాభా. శాంతి. 284-98 - గీతాప్రెస్. ప్రతి
"జో ఇన్ విశ్వకా నిర్మాణ కర్‌నేవాలే కారీగర్,
....ఉన్ మహేశ్వర్ కో ప్రణామ్ హై॥"

3. చూడు :- వ్యా.భా ద్రోణ 201-73 - గీతాప్రెస్ ప్రతి. పు. 3742
"విశ్వకర్మాకీ సుందర శిల్పకలా ఆదికా ఆవిర్భావ్ భీ ఆప్‌సే హీ హుఆ హై॥"

## విశ్వేశ్వరుఁడు : విశ్వకర్మ

విశ్వేశ్వరం విశ్వనరం కర్మణామీశ్వరం ప్రభుమ్ ।
శంభుం స్వయంభుం భూతేశం భూతభవ్యభవోద్భవమ్॥

—ద్రోణ. 202-14

శివుఁడు శంభువు. సుఖములను కూర్చువాఁడు.
విశ్వకర్మ విశ్వశంభువు. విశ్వమునకు సుఖమునుగూర్చువాఁడు.

విశ్వశంభూ రవసే విశ్వకర్మా॥ —ఋగ్వేద. 10-81-7

అతఁడే ధాత, విధాత, విశ్వాత్మ, విశ్వ సృష్టికర్త.

ధాతా చ విధాతా చ విశ్వాత్మా విశ్వకర్మకృత్॥ —ద్రోణ 202-105

శివుఁడు ప్రపంచరచనారూపమగు కర్మమునందు కుశలుఁడు.

"విశ్వకర్మ మతిః ॥" —వ్యా భా. అను. 17-98

రుద్రుఁడు త్వష్ట (విశ్వకర్మ); సర్వతోముఖుఁడు.

నీవే బ్రహ్మవు, రుద్రుఁడవు, వరుణుఁడవు, అగ్నివి, మనుబ్రహ్మవు, ివుఁడవు, ధాతవు, విశ్వకర్మవు, విధాతవు, సర్వతోముఖుఁడవు నని శ్రీకృష్ణుఁడు రమేశ్వరుని ప్రశంసించినాడు.

త్వం వై బ్రహ్మా చ రుద్రశ్చ వరుణోఽగ్నిర్ మనుర్భవః
ధాతా త్వష్టా విధాతా చ త్వం ప్రభుః సర్వతోముఖః ॥

—వ్యా భా. అను. 14-408

విశ్వకర్మయు విశ్వతోముఖుఁడే.

విశ్వతః చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్॥

—ఋగ్వేదము. 10-81-3

విశ్వకర్మ స్వరూపుఁడయిన మహేశ్వరుని హృదయమునందు నిలిపి, ్యానించి విశ్వకర్మ తత్త్వమును తెలికొనువారు అమృతత్వసిద్ధి పొందుదురు.

ఏష ఏవ పరో దేవో విశ్వకర్మా మహేశ్వరః ।
హృదయే సన్నివిష్టం తం జ్ఞాత్వైవాఽమృతమశ్నుతే॥

—శివపురాణ. వాయుసంహిత. *

---

* పోల్చు :- శ్వేతాశ్వతరోపనిషత్తు. 4-17

## మహాదేవుని రూపము

వరదుఁడు పార్థుశౌర్యవిభవంబున కాతని ధైర్యవృత్తి క
ప్తరుదుగ మెచ్చి సన్నిహితుఁ డయ్యె జటామకుటేందు రేఖయుం
గరమున శూలమున్ గరళకాలగళంబు బృహద్గజాజినాం
బరముఁ దృతీయలోచనముఁ బన్నగహారము నొప్పుచుండుగన్.

ఇట్లు విరూపాక్షుండు నిజరూపములో నర్జునునకు సన్నిహితుండై...... నా స్వరూపంబు సూడు మని దివ్యదృష్టి యిచ్చినాఁడు.

—నన్నయ. ఆరణ్య. 1-321, 22

మహాదేవుఁడు దేవీసహితుఁడై ప్రత్యక్షమై నట్లు మూలము నందున్నది.

తతో దేవం మహాదేవం గిరిశం శూలపాణినమ్ ।
దదర్శ ఫాల్గున స్తత్ర సహదేవ్యా మహాద్యుతిమ్॥

—వ్యా భా. వన. 39-72

అర్జునుఁ డీశ్వరుని 'చంద్రధారీ... విరూపాక్ష... లలాటేక్షణోగ్రాగ్ని భస్మీకృతానంగ భస్మానులిప్తాంగ గంగాధరా'యని ప్రస్తుతించినాఁడు.

'నీ వీ రాత్రి స్వప్నమునందు నీలకంఠునిఁ జూతు' వని ధర్మరాజుతోఁ గృష్ణద్వైపాయనుఁడు చెప్పినాఁడు.

స్వప్నే ద్రక్ష్యసి రాజేంద్ర క్షపాంతే త్వం వృషభధ్వజమ్ ।
నీలకంఠం భవం స్థాణుం కపాలిం త్రిపురాంతకమ్ ।
ఉగ్రం రుద్రం పశుపతిం మహాదేవ ముమాపతిమ్ ।
హరం శర్వం వృషం శూలం పినాకిం కృత్తివాసనమ్॥
కైలాసకూటప్రతిమం వృషభేఽవస్థితం శివమ్॥

—వ్యా భా. సభా, 46-13-15

ఈ వర్ణనము లన్నింటి వలన పరమేశ్వరప్రతిమా లక్షణములు తెలియుచున్నవి.

జటాజూటము, తలపైనెలవంక, శిరసుపై గంగ లలాటేక్షణము, గరళకంఠము, చేతిలో త్రిశూలము, కపాలము, సర్పహారము, భస్మానులిప్తాంగము, గజాజినధారణము, వృషభధ్వజము, వృషభవాహనము, ఇత్యాది లక్షణములు గల శివుని రూపమే నేటికిని శిల్పచిత్రలేఖనము లందుఁ గనిపించుచున్నది.

## మృణ్మయ ప్రతిమలు

పూజయేత్ విగ్రహం యస్తు లింగం చాపి మహాత్మనః ।
లింగం పూజయితా నిత్యం మహతీం శ్రియ మశ్నుతే॥
—వ్యా భా. ద్రోణ 202-140*

శివలింగమును గాని విగ్రహమును గాని పూజించిన మనుజునకు సకలైశ్వర్యములు గలుగును.

విగ్రహపూజకంటె లింగపూజ శ్రేష్ఠతర మని వేదవ్యాసుడు తెలిపినాఁడు.

కృష్ణార్జునులు పూర్మజన్మమున నరనారాయణులుగ నుండి శివలింగమును బూజించినారు. అశ్వత్థామ పూర్వజన్మమున మృడుని మృణ్మయ ప్రతిమను బూజించినాఁడు.

శుభ్రమగు నుర్వి మృత్తిక సురుచిరంపుఁ
బ్రతిమఁ గావించికొని యందుఁ బరము నావ
హించి పూజావిశేషంబు లెల్లఁ జేసి
నీవు దొలుమేనఁ గొలిచితి నిష్ఠతోడ.

వారలు లింగాధిష్ఠానారూఢుంగా నొనర్చి యర్చించిరి భ
వ్యారాధనపరులై మును గౌరీపతి నతులనియమకల్పనవెలయన్.**

"ఎత్తెఱంగున జేసినను బరమేశ్వరారాధనంబు సర్వార్థసాధనంబగు నందును లింగంబునందుఁ బూజించుట యర్చ యందారాధించుకంటె ననేకగుణంబు లెక్కుడు గావున లింగార్చనపరులగు వారల నర్చారాధకుండవగు నీకు నెట్లు జయింపవచ్చు మీ మీ పూర్వజన్మంబుల యర్చనఫలంబులు దారతమ్యంబులతో ననుభవింపవలదే" యని కృష్ణద్వైపాయనుం డశ్వత్థామకు కృష్ణార్జునులకు గల యంతరమును అశ్వత్థామకుఁదెలియ బలికెను.

ఈ వర్ణనములను బట్టి భారతదేశమునందు శివలింగపూజయు, శివుని మృణ్మయ ప్రతిమారాధనము నతిప్రాచీనకాలము నుండియు నున్నట్లు తెలియుచున్నది.

---

* పోల్చు - వ్యాభా. అనుశాసనిక, 161-16

** తిక్కన. ద్రోణ. 5-416, 17 : వ్యా.భా. ద్రోణ. 201-90-92

"శుభ్రమత్రి భవాన్ కృత్వా మహాపురుషవిగ్రహమ్ ।
ఈజివాం స్త్వం జపైర్ హోమై రుపహారై శ్చ మానద॥
తాభ్యాం లింగేఽర్చితో దేవ స్త్వయార్చాయాం యుగే యుగే

## గుడిమల్లము - శివలింగము

ఆంధ్రదేశమున చిత్తూరు జిల్లా గుడిమల్లము గ్రామము నందుఁ గల పరశురామేశ్వర దేవాలయము నందలి శివలింగ మతి ప్రాచీన మైనది. విశిష్టమయినదియును.

" క్రీ॥ పూ॥ రెండవశతాబ్ది నాటిది కాదగు గుడిమల్లములోని ప్రఖ్యాత శివలింగము సాతవాహనకళకు నిరుపమానో దాహరణము. ఇది ప్రాయికముగా శివప్రతిమలలోనెల్ల అత్యద్భుతమైనది. ఈ విగ్రహము వైదికసంప్రదాయాను గుణమైన రుద్రాగ్నుల అంశలయొక్క ఐక్యభావమును సూచించుచున్నది. విగ్రహనిర్మాణరీతి ఉత్తరహిందూస్థానములోని సమకాలిక శిల్పము నందలి యక్షప్రతిమను పోలియున్నది. ఇదియును, 'భీత' లో దొరికిన శివలింగమును, శైవమతప్రారంభకాలపు శిల్పచరిత్రాన్వేషణకు చాలముఖ్యమైన పరికరములు"[1]

" లింగ మనఁగా చిహ్నము. ఏ చిహ్నము వలన జగత్కారణ ప్రకృతి పురుషవిషయమైన జ్ఞానము కలుగునో యదే శివలింగము."[2]

శివలింగము నందలి పానవట్టము శక్తిస్వరూప మనియు లింగము శివస్వరూప మనియు నందువలన శివలింగము శివశక్త్యాత్మక మనియు పలువుర భావన.

శివలింగము త్రిమూర్త్యాత్మక మని కాశ్యపశిల్పము చెప్పుచున్నది.

చతురశ్ర మధోభాగం బ్రహ్మభాగం సముచ్యతే ।
మధ్యే తు వసుకోణం స్యా ద్విష్ణ్వంశం తత్ ప్రకీర్తితం
ఊర్ధ్వభాగం తు వృత్తం స్యాత్ తచ్ఛివాంశేతి విద్యతే॥

—కాశ్యపశిల్పము పటలము 47-114-15

"పాదపీఠములో దిగవేయు చతురశ్రభాగము బ్రహ్మ స్వరూపము తరువాత నుండు ఎనిమిది కోణములభాగము విష్ణుస్వరూపము. మన కగపడు వర్తులమగుభాగము శివస్వరూపము. ఇట్లు త్రిమూర్తుల నొక్క లింగాకారములోనె సంతరించిన మన శిల్పసంస్కృతి ఎంత గొప్పదో చూడుడు."[3]

---

1. చూడు - సి. శివరామమూర్తి : ఆంధ్రశిల్పకళాపరిణామము.
—విజ్ఞానసర్వస్వము - మూడవసంపుటము. తెలుగుసంస్కృతి. —పుట. 663
తెలుగు భాషాసమితి - హైదరాబాదు.

2. చూడు :- ఈశ్వర సత్యనారాయణశర్మ : దేవపూజారహస్యము. — పు. 203

3. చూడు :- దర్శనాచార్యకలాప్రపూర్ణ డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు :
శ్రీ వీరరాఘవవ్యాసావళి. —2 భాగము. పు. 166

# మాతృదేవతారాధనము

విశ్వసృష్టికి మూలకారణమగు పరబ్రహ్మస్వరూపమును మాతృమూర్తిగ నారాధించు సంప్రదాయ మీలోకమునం దనాదిగానున్నది.

హరప్పాలో లభ్యమైన యొకముద్ర (Seal) పయి పద్మనాభియై తలక్రిందుగా నున్న నగ్న స్త్రీమూర్తి యున్నది. అది వైదికార్యుల అదితి, పృథ్వి, శ్రీ మున్నగు దేవతలకు మూలరూప మని పండితుల యభిప్రాయము.[1]

వైదికయుగమున అదితియే జగన్మాత.

మహీ మూషు మాతరం సువ్రతానామ్।
ఋతస్య పత్నీ మవసే హువేమ॥ —శు.య. 21-5*

ఒకానొకప్పు డింద్రుఁడు దేవతావిజయమునకు కారణభూతమయిన యద్భుత శక్తిని తెలిసికొనుటకు ప్రయత్నింపఁగా నది యదృశ్యమై పరమసౌందర్యవతియైన యుమాదేవిరూపమున దర్శన మిచ్చినది. ఆ శక్తి పరబ్రహ్మస్వరూపిణి.

"స తస్మిన్నాకాశే స్త్రియమాజగామ బహుశోభ మానా
ముమాం హైమవతీం........" —కేనోపనిషత్తు

---

1. Cf :- Radha Kamal Mukerjee : The Flowering of Indian Art. -p. 35
"From Aegean to the Indus and the Satleg, female Statuettes symbolising the Divine Mother have been discovered in large numbers indicating the unusual character of the worship of the Mother Goddess. One of the Harappa seals shows the Goddess as nude and upside down with lotus plant issuing from her navel This is the prototype of the Earth Goddess Pridhvi, Aditi, or Srimata of the Vedic Aryans and of Srilakshmi, Gajalakshmi, Yakshi, there we came acrsos in Bharhut Savehi and Orissa caves

* Cf :- A. C. Bose : The Call of the Vedas —p 199.
The Mighty Mother of those whose sway is just,
The Queen of the order - we call on for our help,

The expression 'Mighty Mother' carries the idea of Supreme Diety in terms of motherhood. (This idea has been popularised in later times by Tantra.

# దేవీ పూజా స్థానములు

మహాభారతకాలము నాటికి ప్రసిద్ధికెక్కిన పుణ్యతీర్థములలో దేవీపూజాస్థానములు కొన్నియున్నవి.

## రుద్రపత్ని

తతో గచ్ఛే దనరకం తీర్థసేవీ నరాధిప।
సాన్నిధ్యం తత్ర రాజేంద్ర రుద్రపత్న్యాః కురూద్వహ।
అభిగమ్య చ తాం దేవీం న దుర్గతి మాప్నుయాత్॥
తత్రై వ చ మహారాజ విశ్వేశ్వర ముమాపతిమ్।
అభిగమ్య చ మహాదేవం ముచ్యతే సర్వకిల్బిషైః॥

—వ్యా.భా. వన, 83-170-71

అనరక తీర్థమున రుద్రపత్ని - దుర్గాదేవి - సాన్నిధ్యముచేరి కొలిచిన వారి కెట్టి కష్టములు నుండవు. అచటనే వెలసియున్న మహాదేవుని సేవించిన సర్వపాపములు హరించును.

## శాకంభరి

తతో గచ్ఛేత రాచేంద్ర దేవ్యాః స్థానం సుదుర్లభమ్।
శాకంభరీతి విఖ్యాతా త్రిషు లోకేషు విశ్రుతా॥ —వ్యా.భా. వన. 84-13

"తొల్లి పార్వతి యెందేని శాకాహారియై దివ్యసహస్రవర్షంబులు తపంబు సేసె నట్టి శాకంభరీతీర్థంబాడి యొక్కదివసంబు శాకాహారులయిన వారు పండ్రెండేండ్లు శాకాహారతపంబు సలిపినవారి ఫలంబు వడయుదురు."

—నన్నయ. ఆరణ్య. 2-270

## గౌరీశిఖరము

తతో గచ్ఛేత ధర్మజ్ఞ తీర్థసేవనతత్పరః।
శిఖరం వై మహాదేవ్యా గౌర్యా స్త్రైలోక్య విశ్రుతమ్॥
సమారుహ్య నరశ్రేష్ఠ స్తనకుండేషు సంవిశేత్।
స్తనకుండముపస్పృశ్చ వాజపేయఫలం లభేత్॥

—వ్యా.భా. వన. 84-151, 52

"గౌరీశంకర (శిఖర) కుండం బాడిన... నశ్వమేధఫలం బగు"

—నన్నయ. ఆరణ్య. 2-276

దుర్గాదేవి ఘోరారణ్యములందు, దుర్గమస్థానములందు భక్తుల గృహములందు, పాతాళమునందు నిత్యము నివసించి భక్తుల పూజలందుకొనుచుండును.

కాంతారభయదుర్గేషు భక్తానాం చాలయేషు చ।
నిత్యం వససి పాతాళే యుద్ధే జయసి దానవాన్॥ —భీష్మ 23-14

వనవాసానంతరము పాండవు లజ్ఞాతవాసార్థము విరాటనగరము ప్రవేశించునపుడు యుధిష్ఠిరుఁడు దుర్గాస్తోత్రము చేసినాఁడు ఈ స్తోత్రమునందు దుర్గాదేవి చతుర్భుజగను, అష్టభుజగను వర్ణింపఁబడినది.

నమోస్తు వరదే కృష్ణే కుమారి బ్రహ్మచారిణి।
బాలార్కసదృశాకారే పూర్ణచంద్రనిభాననే॥ 7
చతుర్భుజే చతుర్వక్త్రే పీనశ్రోణిపయోధరే।
మయూరపిచ్ఛవలయే కేయూరాంగదధారిణి॥
భాసి దేవి తథా పద్మా నారాయణపరిగ్రహః॥ 8
స్వరూపం బ్రహ్మచర్యం చ విశదం గగనేశ్వరి।
కృష్ణచ్ఛవిసమా కృష్ణా సంకర్షణసమాననా॥ 9
బిభ్రతీ విపులౌ బాహూ శక్రధ్వజసముచ్ఛ్రియౌ।
పాత్రీ చ పంకజీ ఘంటీ స్త్రీ విశుద్ధా చ యా భువి॥ 10
పాశం ధను ర్మహాచక్రం వివిధాన్యాయుధాని చ
కుండలాభ్యాం సుపూర్ణాభ్యాం కర్ణాభ్యాం చ విభూషితా॥ 11
చంద్రవిస్పర్ధినా దేవి ముఖేన త్వం విరాజసే
ముకుటేన విచిత్రేణ కేశబంధేన శోభినా॥ 12
భుజంగభోగవాసేన శ్రోణిసూత్రేణ రాజతా।
విభ్రాజసే చాబద్ధేన భోగేనేవేహ మందరః॥ 13 -వ్యా భా. విరాట. అ. 6*

---

* చూడు :- వ్యా భా. విరాటపర్వము. అ. 6 - నీలకంఠీయ భారతభావదీపికా సహితము చిత్రశాలాప్రతి.

చతుర్భుజే చతుర్వక్త్రే ఇతి విష్ణుబ్రహ్మరూపత్వముక్తమ్॥
మయూరపిచ్ఛా యాని ఇంద్రనీలాదిమణిఖచితాని వలయాని యస్యాస్తథావిధే॥ 8
పద్మా లక్ష్మీః అతఏవ నారాయణ పరిగ్రహో విష్ణుకాంతా॥
అష్టభుజామాహ - బిభ్రతీతి విపులౌ వరాభయప్రదత్వేన ఊర్జితౌ ద్వౌ బాహూ తతః ఏకం పాత్రీ పాత్రవాన్ పంకజీ పంకజవాన్ ఘంటీ ఘంటావాన్ పంచమః॥ 10
పాశం ధను ర్మహాచక్రం చ బిభ్రతీతి పూర్వేణాన్వయః ఏతాన్యేవ వివిధాన్యాయుధాని॥

# దేవి విగ్రహములు

**చతుర్భుజదుర్గ :** బాలసూర్యసదృశాకార. వాసుదేవసోదరి, చతుర్భుజ, చతుర్వక్త్ర, పూర్ణచంద్రనిభానన, పీనశ్రోణిపయోధర, ఇంద్రనీలమణిఖచితము లయిన కంకణములు, కేయూరాంగదములు ధరించి లక్ష్మీదేవి వలె ప్రకాశించు చుండును. దివ్యమాల్యాంబరములు ఖడ్గఖేటకములు ధరించియుండును. ఇది యొక రూపము,

**అష్టభుజదుర్గ :** కృష్ణునివలె శ్యామసుందరవిగ్రహ. ఎనిమిదిహస్తములందు వరదాభయముద్రలు, మధుపాత్ర, పంకజము, ఘంట, పాశము, ధనుస్సు, మహాచక్రము ధరించియుండును. విచిత్రముకుటధారిణి. సంకర్షణనిభానన. కర్ణకుండలవిభూషిత. కటిసూత్రమువఱకు వ్రేలాడు సర్పాకారవేణి గలది.

త్రిలోకరక్షణార్థము మహిషాసురుని వధించిన దుర్గాదేవి నా యెడ ప్రసన్నురాలవై నాపయిదయఁజూపుదువు గాక యని యుధిష్ఠిరుఁడు ప్రార్థించినాఁడు.

త్రైలోక్యరక్షణార్థాయ మహిషాసురనాశిని ।
ప్రసన్నా మే సురశ్రేష్ఠే దయాం కురు శివా భవ॥ —విరాట. 6-15

దుర్గాదేవిని పూజించునరులకు బంధనము, మోహము, ధనపుత్రనాశనాది సంకటములు, వ్యాధిమృత్యుభయములు నుండవు.*

**మృణ్మయప్రతిమలు :** పూర్వము రాజ్యభ్రష్టుఁడైన సురథుఁడు, ధనము పోఁగొట్టుకొనిన సమాధి మృణ్మయమయిన దేవీమూర్తిని రచించికొని పూజలు సలిపి కృతార్థులైనట్లు మార్కండేయపురాణము నందు వర్ణింపఁబడినది.

తౌ తస్మిన్ పులినే దేవ్యాః కృత్వా మూర్తిం మహీమయీం ।
అర్హణాం చక్రతు స్తస్యాః పుష్పధూపాగ్నితర్పణైః ॥
—దేవీమహాత్మ్యము. 13

నాటినుండి నేటివఱకు ప్రజలు శరత్కాలము నందు మృణ్మయ ప్రతిమలు చేసి దుర్గాదేవిని పూజించుచున్నారు.

యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణసంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః ॥

---

* దుర్గాత్ తారయతే దుర్గే తత్ త్వం దుర్గా స్మృతా జనైః ॥
వ్యాధి మృత్యుభయం చైవపూజితా నాశయిష్యసి॥ —విరాట. 6-20-24

## బ్రహ్మ పూజ : బ్రహ్మోత్సవము

మహాభారతకాలము నాటికి దేశము నందు బ్రహ్మపూజయు, బ్రహ్మోత్సవములు జరుగుచుండెడివి.

విరాట నగరవాసులు శరత్కాలమునందు బ్రహ్మోత్సవములు జరిపికొనిరి.

అథ మాసే చతుర్థే తు బ్రహ్మణః సుమహోత్సవః ।
ఆసీత్ సమృద్ధో మత్స్యే పురుషాణాం సుసమ్మతః ॥
సమాజే బ్రహ్మణే రాజన్ యథా పశుపతేరివ॥ —విరాట. 13-14-15*

## పుష్కరతీర్థము

బ్రహ్మదేవుని పూజాస్థానములలో పుష్కరము ప్రసిద్ధమైనది.

నృలోకే దేవదేవస్య తీర్థం త్రైలోక్య విశ్రుతమ్ ।
పుష్కరం నామ విఖ్యాతం మహాభాగః సమావిశేత్ ।
తస్మింస్తీర్థే మహారాజ నిత్యమేవ పితామహః ।
ఉవాస పరమప్రీతో భగవాన్ కమలాసనః ॥ —వ్యా భా. వన. 82-20-25

" నమితవిరోధి పుష్కరమనంగ జగద్విదితంబు పుణ్యతీ
ర్థము మునిసిద్ధసేవ్యము ముదంబున నందుఁ బయోజసంభవుం
డమరులతోడ సన్నిహితుఁడై వసియించుఁ ద్రిపుష్కరంబులన్
సమములు వాని నెప్పుడును సంస్మృతిఁజేసినఁబాయు పాపముల్ "

అని పులస్త్యుఁడు భీష్మునితోఁజెప్పినాడు. —నన్నయ. ఆరణ్య. 2-245

" పుష్కరమునఁ బడియేండ్లు వసియించిన వారికి సర్వక్రతు ఫలమును బ్రహ్మలోకప్రాప్తియు నగు. " —నన్నయ, ఆరణ్య. 2-249

కార్తిక పూర్ణిమ నాఁడు పుష్కరతీర్థమును సేవించి, బ్రహ్మదేవుని పూజించిన మనుజునకు బ్రహ్మపదప్రాప్తియు నక్షయలోకములు గలుగును,

కార్తికం తు విశేషేణ యోఽభిగచ్ఛతి పుష్కరమ్ ।
ప్రాప్నుయాత్ స నరో లోకాన్ బ్రహ్మణస్సదనేఽక్షయాన్॥
—వ్యా భా. వన. 82-31

---

* చూడు :- వ్యా.భా. విరాటపర్వము - చిత్రశాలాప్రతి.

" బ్రహ్మణః ఉత్సవః శరది నవధాన్యోత్పత్తౌ స చ దేశవిశేషే ప్రసిద్ధః ॥ 14
యథాబ్రహ్మణః సమాజే బ్రహ్మలోకే కైలాసే వా పశుపతేః
సమాజే ఇవ మత్స్యేషు సమాపేతు రితిసంబంధః ॥ —నీలకంఠ.

# బ్రహ్మ - విశ్వకర్మ

విశ్వోత్పత్తి సూక్తములందు వేదర్షులు విరాట్ పురుషుని విశ్వకర్మగను, హిరణ్యగర్భునిగను, ప్రజాపతిగను భావించినారు.[1]

"ప్రజాపతియు, విశ్వకర్మయు, బరమేష్ఠియు ముచ్వురు నొక్కరే - మూర్తిభేదములు మాత్ర మగు నని సాయణభాష్యానుసారము నిరంజన శాస్త్రి" వ్రాసినారు [2]

విష్ణుమూర్తి నాభికమలమునం దుద్భవించిన బ్రహ్మ చతుర్ముఖుడు.

స్వపత స్తస్యదేవస్య పద్మం సూర్య సమప్రభమ్ ।
నాభ్యాం వినిఃసృతం దివ్యం తత్రోత్పన్నః పితామహః ॥
సాక్షాల్లోక గురుర్ బ్రహ్మా పద్మే సూర్యసమప్రభః ।
చతుర్వేదశ్చతుర్మూర్తి స్తథైవచ చతుర్ముఖః ॥

—వ్యా.భా. వన. 202-14, 15*

1. Cf :- (a) J. H. Dave : Immortal India. — Vol 1 p 159.
"In the later Vedic Hymns the highest position is given to Visvakarma (R. V. 10-81,88)....
He is an all-seeing God with faces in all directions. He is t' creator of heaven and earth
Prajapati is called the Creator and identified with Hiranyagar and ka. [R. V. 10-121]
(b) Swami Harshananda : Hindu Gods and Goddesses. p
"From the cosmological point of progeny he is Pitar the Patriarch. He is Vidhi, the Co-ordinator and the Lc the master of the worlds, as well as Dhatar, the Sust He is also Visvakarma, the architect of the worlds."
(c) Miss Nileswari V. Desai : Ancient Indian Society Reli and Mythology as depicted in the Markandeya Purana. -p
"Brahma is Svayambhu and as such is generally identified v ....Dhatar, Vidhatar (Maker and Disposer) and Visvakarm the All-maker.

2. చూడు :- నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము. —పుట. 41
'ప్రజాపతి ర్విశ్వకర్మా పరమేష్ఠీత్యేతే త్రయో ప్యేకస్యైవ మూర్తి భేదాః ॥' -సాయణ

* పోల్చు :- వ్యా.భా. వన. 291-17
తతోదేవో విశుద్ధాత్మా విమానేన చతుర్ముఖః
పద్మయోని ర్జ గత్స్రష్టా దర్శయామాస రాఘవమ్॥

## బ్రహ్మ - విశ్వకర్మ - విగ్రహములు

బ్రహ్మదేవుని కొఱకు ప్రత్యేకముగా నిర్మింపఁబడిన యాలయములందు బ్రహ్మవిగ్రహము విశ్వశిల్పియగు విశ్వకర్మాకృతిగా నిర్మింపఁబడుచున్నది. ఈ రూపమున బ్రహ్మ చతుర్ముఖుఁడు. నాలుగుతలలు, నాలుగుచేతులందు అక్షమాల, పుస్తకము, కుశ, కమండలువు గలిగి హంసవాహనుఁడై యుండును.[1]

ఋగ్వేదాది ప్రభావేన కృతాదియుగభేదతః ।
విప్రాదివర్ణభేదేన చతుర్వక్త్రం చతుర్భుజమ్॥
దక్షిణాధః కరాన్ సృష్ట్యా జయమాలాం తథా స్రుచమ్ ।
పుస్తం కమండలుం ధత్తే స కూర్చః కమలాసనః॥

—రూపమండనము. 2-6, 7

భూలోకశ్చ భువోలోకః స్వర్లోకోఽథ మహత్తథా ।
జన స్తపశ్చ సత్యం చ సప్తలోకాః ప్రకీర్తితాః ।
యే లోకా స్తే రథే హంసా బ్రహ్మణః పరమేష్ఠినః ॥

—విష్ణుధర్మోత్తరమ్, 46-12, 13

విశ్వకర్మా చతుర్బాహు రక్షమాలాం చ పుస్తకమ్ ।
కంబుం కమండలుం ధత్తే త్రినేత్రో హంసవాహనః ॥

—రూపమండనము. 2-10

ఈ శిల్ప శాస్త్రముల ననుసరించియే శిల్పులు. బ్రహ్మ - విశ్వకర్మ - విగ్రహములను నిర్మించుచున్నారు.

పుష్కర తీర్థమునందు నేటికిని బ్రహ్మ - విశ్వకర్మ - పూజ జరుగుచున్నది,[2] కార్తిక పౌర్ణమాసి బ్రహ్మోత్సవము జరుగుచున్నది.

---

1. Cf :- Swami Harshananda : Hindu Gods and Goddesses. —p 26.
"In temples exclusively dedicated to Brahma, his aspect as Visvakarma (the architect of the universe) is adopted. - In this form he is shown as having four heads, four arms holding the rosary the book, the kusagrass and the water-pot and riding on his Swan."

2. Cf :- J. H. Dave : Immortal India —Vol. 1 p, 159
"Puskara is one of the very rare Thirthas where Brahma one of the Gods of the Hindu Trinity is being worshipped today."

# ప్రసన్న సరస్వతి

భూసతికిన్ దివంబునకుఁ బొల్పెసగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
ద్భాసితరాజహంసగతి భాసి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు నబ్జజయానముతో సమానమై.
—నన్నయ. అరణ్య. 4-141*

శరదృతువు వచ్చినది. ఆ శరదాగమనము ద్యావాపృథివీదంపతుల కింపుఁగూర్చుచు, సప్తర్షిగణోపాసిత రాజహంస [పరమాత్మ] వలె రమణీయమై, పద్మజుయానమగు హంసవలె స్వచ్ఛమగు జలములతో నొప్పుచు సరోజ భవోల్లసితయగు సరస్వతి నది (బ్రహ్మతోఁగూడిన సరస్వతీదేవి) తో సకలజనులకు సంతోషము గలిగించు చున్నది.

సంహితాభ్యాసుఁడగు నన్నయ తన వైదికవిజ్ఞానము నంతయు నీ పద్యము నందు నిక్షేపించి శరత్కాలప్రసన్నసరస్వతిని మూలాతిశాయిగా వర్ణించినాఁడు.

ఈ వర్ణనమునందు నన్నయ,

1. ద్యావాపృథివీ దాంపత్యమును, తన్మూలముగా స్వర్గమర్త్యలోకముల సృష్టికి మూలకారణమైన విశ్వకర్మను.[1]
2. సప్తర్షులచే నుపాసింపఁబడు రాజహంసను (పరమాత్మను)[2]
3. హంసయానముపై శోభిల్లు సరస్వతీహిరణ్యగర్భులను

స్మరించుచున్నాడు.

---

* వ్యా.భా. వన. 182-14-15

ఆకాశనికాశతటాం తీరవానీరసంకులామ్ ।
బభూవ చరతాం హర్షః పుణ్యతీర్థాం సరస్వతీమ్ ।
తే వై ముముదిరే వీరాః ప్రసన్న సలిలాం శివామ్ ।
పశ్యంతో దృఢధన్వానః పరిపూర్ణాం సరస్వతీమ్ ॥

1. అ) ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః॥ —ఋగ్వేద. 10-81-3
ఆ) ఆదిద్ ద్యావా పృథివీ అప్రథేతామ్॥ ,, 10-82-1

2. బీభత్సూనాం సయుజం హంసమాహు రపాం దివ్యానాం చరంతం॥—ఋగ్వేద. 10-124-9
"They call him Swan, the abhorrent floods' companion, moving in friendship with celestial waters." — Griffith.

## సరస్వతీ గీత

తార్క్ష్యుం డను మునివరుండు భారతి నారాధింపఁగా నాదేవి ప్రత్యక్షమై యతనికి సంశయవిచ్ఛేదనము చేసినది.

"అగ్నిహోత్రం బస్మదాత్మకం బని యెఱుంగుము. సకలయజ్ఞముల యందుఁ గల్పింపఁబడు శిష్టద్రవ్యంబు లన్నియు మదీయంబుల నేను మహనీయంబయిన యగ్నిముఖంబున ననుభవింతు నాత్మజ్ఞులయిన మహాత్ము లకు నఖిలసంశయవిచ్ఛేదనంబు సేయుదు ననవరతస్వాధ్యాయదానవ్రత పరాయణులైన తపోధనులెందేని విగతశోకులై వసియింతు రట్టిది మామకంబైన పరమపదంబు..." అని సరస్వతీదేవి తార్క్ష్యమునికిఁ దెలిపినది.

మూలమునం దిట్లున్నది.

అగ్నిహోత్రా దహ మభ్యాగతాస్మి
విప్రర్షభాణాం సంశయచ్ఛేదనాయ।
త్వత్ సంయోగా దహ మేత మబ్రువం
భావే స్థితా తథ్య మర్థం యథావత్॥ —వ్యా భా. వన 186-22*

పరాపరవిద్యారూపిణి యగు సరస్వతి అగ్నిహోత్రము నుండి యావిర్భవించుచున్నది. కనుక అగ్ని నుపాసించుట యన వాగ్దేవి నుపాసించుటయే. అందువలన పరాపరవిద్యలు సిద్ధించును.

శ్రద్ధా బుద్ధిః కలా మేధా తుష్టిః పుష్టిః ప్రభా మతిః।
ఓంకారాద్యా నమోఽంతాశ్చ సరస్వత్యాశ్చ శక్తయః॥
—గరుడపురాణ. 1-7-9

ఈ విషయమునే వేదమంత్రము లిట్లు చెప్పుచున్నవి.

పావకా నః సరస్వతీ వాజేభిర్వాజినీవతీ।
యజ్ఞం వష్టు ధియావసుః॥ —ఋగ్వేద. 1-3-10
చోదయిత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనామ్।
యజ్ఞం దధే సరస్వతీ॥ —ఋగ్వేద. 1-3-11

---

* "అగ్నిహోత్రాత్ సత్కర్మణః సకాశా దహం పరాపరవిద్యా రూపా సరస్వత్యభ్యాగతా ఆవిర్భూతా అస్మి త్వత్ ప్రయోగాత్ త్వత్సన్నిధిం ప్రాప్య ఏత మర్థం కర్మణాం పారంపర్యేణ కైవల్య హేతుత్వం సగుణబ్రహ్మవిద్యాం చాబ్రువమ్ అతోఽహం భావే స్థితా శ్రద్ధావా నగ్నిహోత్రాదినా దేవతా ప్రసాదం ప్రాప్య కర్మోపాసిజ్ఞాన ఫలాని విందతీత్యర్థః॥" —నీలకంఠ. చిత్రశాలాప్రతి. పు. 298

## సరస్వతీమూర్తి

పరాపరవిద్యారూపిణియైన సరస్వతి కమలాక్షమాలా కమండలు పుస్తకహస్తగా భావింపఁబడినది.

పూర్వము ప్రజ లట్టి చతుర్భుజసరస్వతీమూర్తిని మృత్తికతో చేసి పూజించుచుండెడివారు.

శ్రద్ధయా పరమయా యుక్తో ధ్యాయమానః సరస్వతీమ్।
తత స్తూర్ణం సమాదాయ మృత్తికాం స నదీతటాత్॥
చకార భారతీం దేవీం స్వయమేవ చతుర్భుజామ్।
దధతీం దక్షిణే హస్తే కమలం సుమనోహరమ్।
అక్షమాలాం తథాఽన్యస్మిం జితతారక వర్చసమ్॥
కమండలుం తథాఽన్యస్మిన్ దివ్యవారిప్రపూరితమ్।
పుస్తకం చ తథా వామే సర్వవిద్యాసముద్భవమ్॥....

—స్కందమహాపురాణ, నాగరఖండ. 46-16-19

ఈ విగ్రహనిర్మాణము విష్ణుధర్మోత్తరపురాణానుసారముగ నున్నది.

## వీణాపాణి

'పుస్తాక్షమాలికాహస్తా వీణాహస్తా సరస్వతీ'

— అగ్నిపురాణము. 50-16

ద్వాదశ సరస్వతీమూర్తులలో నాలుగుహస్తము లందును కమలము, అక్షమాల, వీణ, పుస్తకము గలది మహావిద్య.

ఏకవక్త్రా చతుర్హస్తా ముకుటేన విరాజితా।
ప్రభామండలసంయుక్తా కుండలాన్విత శేఖరా॥
అబ్జాక్షవీణాపుస్తకం మహావిద్యాప్రకీర్తితా॥ —రూపమండనము 5-61 62

వీణాపాణి యగు దేవతావిగ్రహము శుంగకాలపుశిల్పములలో నిర్మింపబడినది. భారహుత్ శిలాస్తంభము పయి గల వీణాపాణి విగ్రహము కళాధిదేవత యగు సరస్వతిదేవికి మూలరూపము కావచ్చును.[1]

---

[1] Cf :- Jitendra Nath Benergea : Development of HINDU ICONOGRAPHY. —p. 303.

"Vina in the Sunga art of the Central India is known as a stringed instrument like the Greek harp or lyre; the harp-like Vina appears for the first time in a Bharahut rail piller, it being placed in the hand of a devata, probably the prototype of SARASVATI, the Goddess of fine arts and learning."

## హంసవాహన

సరస్వతీసమేతుండయి పరమానందంబునం బరమేష్ఠి పద్మాసనంబున నుండు నని నన్నయ వర్ణించినాడు. (సభా. 1-81) అబ్జజుయానము హంస యని మఱియొకచోనున్నది.

పురాణములందును శిల్పాగమశాస్త్రములందును సరస్వతీ చతుర్ముఖులు హంసవాహనులుగనే చెప్పఁబడినారు.

బ్రహ్మదేవుని విగ్రహమును హంసవాహనుఁడుగా గాని. కమలాసనుఁడుగా గాని నిర్మింప వలె నని మత్స్యపురాణము.

హంసారూఢం క్వచిత్ కార్యః క్వచిత్తు కమలాసనః ॥—మత్స్య. 259-40

ద్వాదశసరస్వతీమూర్తులలో[1] బ్రాహ్మి హంసవాహన.

హంసారూఢః ప్రకర్తవ్యా సాక్షసూత్ర కమండలుం।
స్రువం చ పుస్తకం ధత్తే ఊర్ధ్వహస్త ద్వయే శుభా॥

....రూపమండనము. 5-63

బ్రహ్మణి యగు సరస్వతి - బ్రాహ్మి - హంసవాహనయగుట సంప్రదాయ సిద్ధముగనున్నది. పెక్కు విగ్రహములలో సరస్వతి హంసవాహనగనే కన్పడుచున్న దని నలినీకాంతభట్టశాలి వ్రాసినాఁడు.[2]

ఆరూఢా శ్వేతహంసా భ్రమయతి చ గగతే దక్షిణే చాక్షసూత్రం।
వామే హస్తే చ దివ్యాంబరకనకమయం పుస్తకం జ్ఞానగమ్యా।
సా వీణాం వాదయన్తీ స్వకరకరజపైః శాస్త్రవిజ్ఞానశబ్దైః।
క్రీడంతీ దివ్యరూపా కరకమలధరా భారతీ సుప్రసన్నా॥

—సరస్వతీస్తోత్రమ్

---

1. చూడు :- డా॥ బలరామ్ శ్రీవాత్సవ : 'రూపమండన' -భూమిక పు. 88.

ద్వాదశ సరస్వతీమూర్తులు :- 1. మహావిద్య 2. మహావాణి 3. భారతి 4. సరస్వతి 5 ఆర్యా 6. బ్రాహ్మి 7. మహాధేను 8. వేదగర్భా 9. ఈశ్వరీ 10 మహాలక్ష్మి 11. మహాకాళీ 12. మహాసరస్వతీ.

2. Cf :- C. Nalinikanth Bhatta Sali : Iconography of Buddhist and Brahaminical Sculptures in Deccan Museum. —p. 18.
"The Swan which is the vehicle of the Brahma is found as the Vehicle of Sarasvathi, in many of her images; a fact that unmistakably points to her original place in the Indian Mythology as Brahmani or wife of Brahma."

## విష్ణువు : పరమపదము

బ్రహ్మణః సదనాదూర్ధ్వం తద్విష్ణోః పరమంపదమ్ । *
శుద్ధం సనాతనం జ్యోతిః పరం బ్రహ్మేతి యద్విదుః ॥
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా సంయతేంద్రియాః ।
ధ్యానయోగపరాశ్చైవ తత్ర గచ్ఛంతి మానవాః ॥

—వ్యా.భా. వన. 262-37*

విష్ణుని పరమపదము బ్రహ్మలోకమున కంటె మీఁద నున్నది. అది శుద్ధము సనాతనము నైన జ్యోతిర్మయలోకము. అదియే పరబ్రహ్మస్వరూపము.

మమతాహంకారములు రాగద్వేషాది ద్వంద్వముల కతీతులు, జితేంద్రియులు, ధ్యానయోగనిరతులు తప్ప తక్కిన వారటకుఁ బోఁజాలరు.

వేదర్షు లిట్లే భావించినారు.

తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః ।
దివీవచక్షు రాతతమ్॥** —ఋగ్వేద. 1-22-20

ఆకాశమునకు నేత్రము వలె నున్న విష్ణుపరమపదమును విద్వాంసు లెల్లప్పుడు జ్ఞాననేత్రముతో చూచుచుందురు. అందు మధు (అమృత) కూపమున్నది.[1] [విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః ॥ —ఋగ్వేద. 1-154-5]

---

* పోల్చు :- కఠోపనిషత్తు.

విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్ నరః ।
సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదమ్॥

** Cf :- Jeanine Miller : THE VEDAS. —p 77.

Whatever is perceived inwardly by the Psyche is automatically projected outwardly into the cosmos. Thus sages (Surayah) behold (Pasyanti) 'the highest step in the seat of Vishnu' as an eye fixed in heaven (divivacakshur atatam.)

1. చూడు : వే. శా. స్వామీ వేదానంద - దయానంద - తీర్థ :
స్వాధ్యాయ సందేహ (హిందీ) —పు. 255.

"The heaven contemplated for average humanity is a fountain full of honey in the highest step of Vishnu; where rejoice those who are devoted to the Gods. [R. V. 1-154-5]

— Jeanine Miller : The Vedas. -p 132.

పరమపద మన వైకుంఠము. విశ్వకర్మ వినిర్మితము.

సత్యలోకస్య వై చోర్ధ్వే విశ్వకర్మవినిర్మితా ।
పురీ చాస్తి సభా రమ్యా దేవానాం హితహేతవే॥

—పద్మపురాణ. సృష్టిఖండ. 49-154

'త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః ॥' -

అను పై ఋగ్వేదమంత్రమునందు సూరు లన పండితులు జ్ఞానులు ననియే కాక సప్తర్షు లనియు కొందఱు పండితులు భావించుచున్నారు.

పరమపద మయిన వైకుంఠము. ఆకాశమున సప్తర్షిమండలమునకు మీఁదై యున్నది. విష్ణుపదమునకు పశ్చిమదిక్కునందు సప్తర్షులు ఆకాశచక్షు వయిన విష్ణువును నిరంతరము చూచుచుందురు.

సప్తర్షిమండలమునకు మీఁదై యుండు పరమేశ్వరుఁడు జగత్స్రష్టయు, విశ్వశిల్పియు నగు విశ్వకర్మయే యని ఋగ్వేదము చెప్పుచున్నది. [1]

విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సందృక్ ।
తేషా మిష్టాని సమిషామదంతి యత్రా సప్త ఋషీన్ పర ఏకమాహుః॥

—ఋగ్వేద. 10-82-2*

కావున సర్వజగత్కారణుఁ డగు, విశ్వకర్మయే విష్ణు వని స్పష్ట మగుచున్నది.

---

1. Cf :- G V. Raghava Rau : Scriptures of the Heavens. —p. 75.

"Some Scholars interpret this word 'Surayah' as referring to the eminent sages, or the Seven Rishis of the great Bear. If may be resonably said that as the Sevən Rishis that constitute the seven bright stars of the great Bear lie to one side to the West of VISHNUPADAM —the Rishis that constitute that group always see Him and can be rightly described as ever more beholding Him."

....If clearly and unequivocally locates the position of the Maker and disposer of the Universe in these terms." [R. V 10-82-2]

* The all-creator, all-knower and almighty, preserver, dispenser loftiest Overseer! Beyond the seven sages, where they rejoice together in the fruit of their offerings, they speak of the One.'

Jeanine Miller : The Vedas. —p. 224.

విష్ణు సహస్రనామములలో విశ్వకర్మ, త్వష్ట యనునామము లున్నవి.

విశ్వకర్మా మను స్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥

—వ్యా భా. అనుశాసనిక. 149-20*

విశ్వం కర్మ యస్య : విశ్వము తనచే చేయఁబడినదిగాఁ గలవాఁడ
విశ్వములు కర్మగా గలవాఁడు; విశ్వమును నిర్మించినవాఁడు.
విశ్వకర్మ అనగా నిర్మాణశిల్పము నెరిగినవాఁడు; పరమాత్ముఁడు.
విచిత్రమగు నిర్మాణశక్తి కలవాఁడు, కావున విశ్వకర్మయనఁబడును.

త్వష్ట యనువాడు దేవతల విశ్వకర్మ. పరమాత్మునకు అతనితో సాదృశ్యము చెప్పినచో 'విశ్వకర్మ' యనఁబడును.

త్వష్టా - తక్షతి ఇతి. త్వక్షూ తనూకరణె అనుధాతువు నుండి 'తృచ్' ప్రత్యయముచేరఁగా 'త్వష్టా' అను రూపసిద్ధి. సంహారసమయమునందు సర్వభూతములను క్షీణింపఁజేయును.

గరుడపురాణోక్త విష్ణుసహస్రనామములందును, విష్ణువునకు 'శిల్పకృత్' 'శిల్పః' అను నామములున్నవి.

ప్రాణిస్థః శిల్పకృ చ్ఛిల్పో హస్తయోశ్చనియామకః ॥

—గరుడ. అ. 15-137

"...సాంఖ్యము, యోగతంత్రమును శిల్పవేదశాస్త్రములుఁ గర్మములు జనార్దనుని వలన సముద్భవించె" [1]

విష్ణువు మత్స్యావతారమునందు మనువునకు వాస్తువిద్యను బోధించినట్లు మత్స్యపురాణమునందుఁ జెప్పఁబడినది. [2]

విశ్వకర్త యగు విష్ణువే సమస్తశిల్పకళలకు మూలకారణుఁ డనియు నతఁడే విశ్వకర్మ యనియు భావింపవచ్చును.

---

* చూడు :- శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రమ్ — శ్రీమచ్ఛంకరభగవత్ పాద విరచిత భాష్యానువాదసహితము. —పు. 44, 45.

అనువాదకులు : పాతూరి సీతారామాంజనేయులు.

** Cf :- The Ancient Indian Tradition and Mythology- The GARUDA PURANA -1 Eng. Tr. —p. 61.

"Silpa Krit = Creation of Arts; Silpa : The fine arts. Hastayohniyamakah = Controller of hands."

1. తిక్కన : అనుశాసన. 5-328 = వ్యా. భా. వన, 149. 40.
2. చూడు :- మత్స్యపురాణము, అ. 250.

## విష్ణుపూజాఫలము

సకలజగత్ప్రభువయిన విష్ణువును పూజించిన మనుజులకు సర్వదుఃఖములు తొలఁగును.

అఖిలజగత్ప్రభు వగు దేవదేవు ననంతునిఁ బురుషోత్తమాభిధాను
నంచితనామసహస్రకంబున సంస్తుతించుచు సంతతోత్థితమనస్కుఁ
డై యజమానుఁ డవ్యయుఁడైన యాతని నర్చించుచును దృఢధ్యాననిరతుఁ
డగుచు నమస్కృతి యాచరించుచు ననాద్యంతు నవ్విష్ణు నధ్యక్షు నెల్ల
లోకములకు బ్రహ్మణ్యుఁ ద్రిలోకకీర్తివర్ధనుని సర్వధర్మజ్ఞు వరదు లోక
నాథు భూతభవోద్భవు నమ్మి భక్తిఁ గొలిచి సర్వదుఃఖంబులఁ దొలఁగఁ ద్రోచు

అని భీష్ముఁడు ధర్మరాజునకుఁ దెలిసినాడు.[1]

విష్ణుస్థానంబున విష్ణువు నర్చించిన నశ్వమేధఫలంబగు.[2]

సాలగ్రామతీర్థము : "విష్ణుస్థానంబయిన సాలగ్రామం బను తీర్థం బాడి విష్ణు నర్చించియు నందు సన్నిహితచతుస్సముద్రం బయిన కూపంబు నాడియు విష్ణులోకగతు లగుదురు." — నన్నయ. అరణ్య. 2-276

తతో గచ్ఛేత రాజేంద్ర స్థానం నారాయణస్య చ ।
సదా సన్నిహితో యత్ర విష్ణు ర్వసతి భారత ।
యత్ర బ్రహ్మాదయో దేవా ఋషయశ్చ తపోధనాః ॥
ఆదిత్యా వసవో రుద్రా జనార్దన ముపాసతే ।
శాలగ్రామ ఇతి ఖ్యాతో విష్ణు రద్భుతకర్మకః ॥
అభిగమ్య త్రిలోకేశం వరదం విష్ణు రవ్యయమ్ ।
అశ్వమేధమవాప్నోతి విష్ణులోకం చ గచ్ఛతి॥ -వ్యా.భా. వన 84-122-125

లోకోద్ధారతీర్థము : "ఎందేని విష్ణుదేవుండు లోకంబుల నుద్ధరించె నట్టి లోకోద్ధారం బను తీర్థంబాడి కులం బుద్ధరింతురు. శ్రీ తీర్థం బాడి శ్రీమంతు లగుదురు."[3]

వరాహతీర్థము : "ఎందేని విష్ణుం డాదివరాహంబయ్యె నట్టి వరాహతీర్థం బాడిన వారికి నగ్నిష్టోమఫలం బగు."[4]

---

1. చూడు :- తిక్కన. అనుశాసన. 5-320 = వ్యా.భా. అను 149-4-6
2. చూడు :- నన్నయ. అరణ్య. 2-260 = వ్యా.భా. వన. 83-11
3. చూడు :- నన్నయ. అరణ్య. 2-264 = వ్యా.భా. వన. 83-44-46
4. ,, ,, = ,, 83-18

# విష్ణువిగ్రహములు

వేదకాలమున ప్రారంభమయిన విష్ణుభక్తి మహాభారతకాలమునాటికి విశ్వరూపము దాల్చి విశ్వవ్యాప్తి నొందినది.

మహాభారతమున విష్ణుమూర్తి దశావతార ప్రసక్తియున్నది.

ఈ దశావతారములకు మూలము శ్రీమన్నారాయణుఁడు.

"నారాయణాభిధానుండనైన యేను బాలరూపంబున శంఖ చక్ర గ దా ధ రుం డ నై యేకార్ణవంబునందు మహాయుగ సహస్రమయంబయిన కాలంబున యోగనిద్రాపరవశుండనైయుండుదు... మదీయనాభికమలకర్ణికా శయనుండఁయి యున్న చతురాననుండు మేల్కాని సృజియించు లోకంబు లేర్పడం జూచెద వని యానతిచ్చి యద్దేవుండంత ర్హితుండయ్యె"*

నారాయణుఁడు కిరీటమును కౌస్తుభమణిని ధరించి పీతాంబరధారియై యుండునని వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

శయానం శయనే దివ్యే నాగభోగే మహాద్యుతిమ్ ।
బహుయోజనవిస్తీర్ణే బహుయోజన మాయతే॥
కిరీటీ కౌస్తుభధరం పీతకౌశేయవాససమ్॥
దీప్యమానం శ్రియా రాజం స్తేజసా వపుషా తథా ।
సహస్ర సూర్యప్రతిమ మద్భుతోపమదర్శనమ్॥

—వ్యా. భా. వన. 203-17-19

మఱియొకచోట విష్ణురూపమిట్లు వర్ణింపఁబడినది.

శంఖచక్రగదాధరు శార్ఙ్గిఁ బుండరీకదళ సన్నిభాక్షుఁ గిరీటకుండ
లాభిరాము శ్రీవత్ససంశోభివక్షుఁ గౌస్తుభోజ్జ్వలుఁ గను నతండు.

చిరకాలంబున సాక్షాత్కరణంబును గల్గు దానఁ గానని పదమున్
బొరయని శుభముం గలదే కురువర నీకు నతిభక్తిఁ గొలువుము విష్ణున్॥

—తిక్కన. అనుశాసన. 4-378-79

ఇట్టి వర్ణనములను బట్టియే శిల్పులు దేవతావిగ్రహములు నిర్మింతురు.

* చూడు :- ఎఱ్ఱన. ఆరణ్య. 4-281 = వ్యా. భా. వన. 203-11-17

## వైకుంఠవాసి నారాయణుఁడు :

ఈ విశ్వమునకంతయుఁ 'గర్తయు' భర్తయు హర్తయు నై దుగ్ధాంబుధి యుత్తరంబునం గనకమయంబై యష్టచక్రంబును బ్రభూతభూతయుక్తంబును మనోజవంబును నగుచు మహనీయశకటంబున వినోదపరాయణుండైన నారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభిధానంబున విఖ్యాతుండై విహరించుచుండు' నని సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పెను.

—తిక్కన. భీష్మ. 1-27

ఇది మూలమునకు యథాతథానువాదమే.

క్షీరోదస్య సముద్రస్య తథైవోత్తరతః ప్రభుః ।
హరి ర్వసతి వైకుంఠః శకటే కనకామయే॥
అష్టచక్రం హి తద్ యానం భూతయుక్తం మనోజవమ్ ।
అగ్నివర్ణం మహాతేజో జాంబూనదవిభూషితమ్॥

—వ్యా.భా భీష్మ 8-15,16

## శ్వేతద్వీపవాసి నారాయణుఁడు :

నారదుఁడు శ్వేతద్వీపమున కరిగి యేకాంతియై విష్ణుదేవుని సంస్తుతింప సితాసిత పీతారుణ పిశంగహరిత వర్ణంబులను బహుశిరోబాహుపాదంబులను వేదికమండలు స్స్రుక్స్యువాగ్నిధారణంబున నోంకారసావిత్రీచతుర్వేదోచ్చారణంబులను మహాద్భుతంబయిన నిజదివ్యరూపంబు నారదునకు దర్శనగోచరంబుగా నిలిచి విష్ణుండు వినయసంభ్రమోపేత భక్తి వ్రణతుండగు నప్పరమముని నాదరించి యిట్లనియె.

ననుఁ గానఁబడయ రెవ్వరు ననఘా యేకాంతికులక యర్హాము మద్ద
ర్శన మీ వేకాంతికుఁడవు ననహంకారుఁడవుఁ గాన యచ్చెంజూడన్॥

తిక్కన. శాంతి. 6.378-79*

నారదుఁడు నారాయణతత్త్వమును లోకములందు ప్రచారముచేసినాఁడు.

నారదునికంటె ముందు ప్రజాపతిసుతులగు ఏకత ద్విత త్రితులను మహర్షులు శ్రీమహావిష్ణువు మాహాత్మ్యమును బృహస్పతికిఁ దెలిపిరి.[1]

---

* వ్యా.భా. శాంతి. అ. 339

1 తిక్కన. శాంతి. 6-370-27 = వ్యా.భా. శాంతి. అ, 339

శ్రీకృష్ణావతారము : ద్వాపరయుగమున శ్రీ కృష్ణుఁడు విశ్వకర్మ యగు విష్ణ్వంశమున దేవకీవసుదేవులకు జన్మించినాఁడు.

అనుగ్రహార్థం లోకానాం విష్ణు ర్లోకసమస్కృతః ।
వసుదేవా త్తు దేవక్యాః ప్రాదుర్భూతో మహాయశః ॥
అనాదినిధనో దేవః స కర్తా జగతః ప్రభుః ।
అవ్యక్త మక్షరం బ్రహ్మ ప్రధానం త్రిగుణాత్మకమ్॥
ఆత్మాన మవ్యయం చైవ ప్రకృతిం ప్రభవం ప్రభుమ్ ।
పురుషః విశ్వకర్మాణం సత్త్వయోగం ధ్రువాక్షరమ్॥

—వ్యా భా. ఆది. 63-99-101*

నన్నయ యీ వివరములన్నియుఁ జెప్పక యిట్లు వ్రాసినాఁడు.

యాదవవంశంబున జగదాదిజుఁడగు విష్ణుదేవు నంశంబున ను
ద్భాదిల్లెఁ గృష్ణుఁ దపగతఖేదుఁడు వసుదేవదేవకీదేవులకున్॥

—నన్నయ. ఆది. 4-74

శ్రీకృష్ణుఁడు కౌరవసభయందు భీష్మాదులకు దివ్యదృష్టి యొసఁగి తన విశ్వరూపమును జూపించెను.

'......వాసుదేవుని ఫాలప్రదేశంబున బ్రహ్మయు వక్షంబున విరూపాక్షుండును వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్ర యమ వరుణ కుబేరులు నాదిత్యమరుద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి... జనితనానాహస్త విన్యస్తంబులయి శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ ప్రముఖ నిఖిల సాధనంబులయి వెలింగె...'

—తిక్కన. ఉద్యోగ. 3-405

కురుక్షేత్రసంగ్రామరంగమునం దర్జునుఁడు కోరఁగా "నచ్యుతుం డతనికి దివ్యదృష్టి యొసఁగి యోగీశ్వరేశ్వరుండైన యా లక్ష్మీశ్వరుండు తన దివ్యరూపంబు సూపె-"

* చూడు :. వ్యా భా. ఆది. 63-101 : నీలకంఠవ్యాఖ్య చిత్రశాలాప్రతి.

"విశ్వకర్మాణ మితి విశ్వం పృథివ్యప్తేజోరూపం సచ్ఛబ్దవాచ్యం వాయ్వాకాశాది రూపం త్యచ్ఛబ్దవాచ్యం చేత్యేవ మాదిరూపం కర్మఘటనాదివత్ క్రియాఫల భూతం యస్యేతి విశ్వకర్మా తమ్ ఏవం విశేషణై రేవ బ్రహ్మణ ఏవ జీవ భావం ప్రదర్శ్య తన్నివృత్త్యుపాయ మపి తై రేవ ప్రత్యాయ యతి సత్వవతో బ్రహ్మభావప్రాప్తావాలంబన మాహ ధ్రువాక్షరం ప్రణవాఖ్య వర్ణస్వరూపమ్ వాచ్యవాచకయోరభేదాత్ ప్రణవమాత్రాభిరకారోకారమకారార్ధ మాత్రాభిరూపాపి తాభి స్తదర్థభూతా విరాట్సూత్రాంతర్యామి తురీయాఖ్యాః ప్రాప్యంత ఇతి భావః॥" 101 - నీలకంఠ.

ఆ విశ్వరూపుని దివ్యతేజంబు సహస్రసూర్యప్రభానిభంబనుటయు జాలకుండుం గావున వాక్రుక్కవ్వం గొలఁదిగా దట్టి మూర్తిఁ గనుంగొని ధనంజయుండు విస్మయ రోమ హర్షణ ప్రహర్షోత్కర్షంబులతో దండ ప్రణామంబులు సేసి నిలిచి కేలుమొగిడ్చి యిట్లనియె.

దేవ నీదగు దివ్యదేహంబునందు సురాసురగంధర్వు లాది గాఁగఁ
గల దేవయోనులుఁ గమలాసనుండును సచరాచరంబైన జగము నాకుఁ
దోఁచె మొగంబులు దోర్దండములును బాదములునుఁ గన్నులు ననేకములుగంటి
మకుటాదిభూషణనికరంబుఁ జక్రగదాద్యాయుధములు మాల్యాంబరములుఁ
బెక్కు గాన వచ్చె నక్కజమై యిది నడుము మొదలు దుది యనంగరాదు
తేజ మప్రమేయ దేదీవ్యమాన నిర్విశ్వకృతిమహిమ దుర్నిరీక్ష్య మయ్యె.

—తిక్కన. భీష్మ. 1-2 0-11*

శ్రీ మహావిష్ణువునంశమున జన్మించినాఁ డని కృష్ణునకును చతుర్భుజములు శంఖచక్రగదాఖడ్గములు కల్పింపఁబడినవి. కృష్ణుని విష్ణువుగా - విశ్వకర్మగా - భావించి స్తోత్రములు చేసినారు.

విశ్వకర్మన్ నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వసంభవ।
విష్ణో జిష్ణో హరే కృష్ణ వైకుంఠ పురుషోత్తమ॥ —శాంతి. 34-5

అని యుధిష్ఠిరుడు వాసుదేవుని స్తుతించినాడు.

విశ్వకర్మన్ నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వసంభవ।
అపవర్గోఽసి భూతానాం పంచానాం పరతః స్థితః॥ —శాంతి, 54-3

అని భీష్ముఁడు శ్రీకృష్ణుని ప్రస్తుతించినాఁడు.

విశ్వకర్మన్ నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వసంభవ।
పద్భ్యాం తే పృథివీ వ్యాప్తా శిరసా చావృతం నభః।
ద్యావా పృథివ్యోర్మధ్యం జఠరేణ తవావృతమ్।
భుజాభ్యా మావృతాశా స్త్వమిదం సర్వమచ్యుత॥ —అశ్వమేధ. 55-7,8

అని ఉదంకుఁడు శ్రీకృష్ణుని స్తుతించినాఁడు.

ఈస్తోత్రములను బట్టి శ్రీకృష్ణుఁడు విష్ణ్వవతారుఁ డనియు విశ్వకర్మాంశ సంభూతుఁడనియుఁ దెలియుచున్నది.

---

* చూడు :- వ్యా భా. భీష్మ. 35 (భగవద్గీత. 15)

కిరీటినం గదినం చక్రిణం చ తేజో సర్వతో దీప్యమానమ్।
పశ్యామి త్వాం నిర్నిరీక్ష్యం సమంతాత్ దీప్తానలద్యుతి మప్రమేయమమ్॥

## శ్రీ దేవి

శ్రీ రనంతర ముత్పన్నా ఘృతాత్ పాండురవాసినీ॥

—వ్యా భా. ఆది. 18-45

దేవదానవులు క్షీరసాగరమును మథించుచున్నపుడందు...... త్రిభువనవంద్య యగు శ్రీదేవి యుద్భవించినది. —నన్నయ ఆది. 2-16

శ్రీదేవి జన్మవృత్తాంతమును విష్ణుపురాణము విపులముగా వర్ణించినది.

తతః స్ఫురత్కాంతిమయీ వికాసికమలే స్థితా।
శ్రీదేవీ పయస స్తస్మా దుద్భూతా ధృతపంకజా॥ 100
తాం తుష్టువు ర్ముదా యుక్తాః శ్రీసూక్తేన మహర్షయః।
గంగాద్యాః సరితస్తోయైః స్నానార్థ ముపతస్థిరే।
దిగ్గజా హేమపాత్రస్థ మాదాయ విమలం జలమ్।
స్నాపయాంశ్చక్రిరే దేవీం సర్వలోక మహేశ్వరీమ్॥
క్షీరోదో రూపధృక్ తస్యై మాలా మమ్లానపంకజామ్॥
దదౌ విభూషణాన్యంగే విశ్వకర్మా చకార హ।
దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా।
పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః॥

—విష్ణుపురాణము ప్రథమాంశ. 9.100-105*

క్షీరాబ్ధియం దుద్భవించిన శ్రీదేవి పద్మహస్తయై వికసితాంభోజముపై విరాజిల్లుచున్నది. మహర్షులు శ్రీసూక్తముతో శ్రీదేవిని స్తుతించినారు. దిగ్గజములు హేమకుంభములతో నిర్మలజలములు గొనితెచ్చి లక్ష్మీదేవికి మంగళస్నానములు చేయించినవి. దేవశిల్పి యగు విశ్వకర్మ భూషణము లొసఁగినాఁడు. ఆ దివ్య భూషణములు దివ్యమాల్యాంబరములు ధరించి సురలెల్లరుఁ జూచుచుండఁగా లక్ష్మీదేవి విష్ణువక్షస్సుల మలంకరించినది.

---

* పోల్చు :- (1) బ్రహ్మాండపురాణము. 3-4-10 76-81

తతో వికసితాంభోజవాసినీ వరదాయినీ
ఉత్థితా పద్మహస్తా శ్రీ స్తస్మాత్ క్షీరమహార్ణవాత్
అథ తాం మునయః సర్వే శ్రీసూక్తేన శ్రియః పరామ్
భూషణాని చ దివ్యాని విశ్వకర్మా సమర్పయత్॥
దివ్యమాల్యాంబరదరా దివ్యభూషణభూషితా
యయౌ వక్షఃస్థలం విష్ణోః సర్వేషాం పశ్యతాం రమా॥

లక్ష్మీదేవి హిరణ్యవర్ణ యనియు హిరణ్మయి యనియు శ్రీసూక్తమునందు వర్ణింపఁబడినది.

హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజాం ।
చంద్రాం హిరణ్మయీం జాతవేదో మమావహ ॥

—ఋగ్వేద ఖిల. 5-87-1

[ ఓ అగ్ని దేవుఁడా! బంగారువన్నె వంటి వన్నె గలదియు, భక్తుల పాపములను హరించునదియు, బంగారముతోను వెండితోను జేయఁబడిన పూల దండలు గలదియు, చంద్రుని వలె నాహ్లాదము గలిగించునదియు బంగారే తన రూపముగాఁ గలదియు నగు లక్ష్మీదేవిని నా కొఱకుఁ బిలువుము. ]

లక్ష్మీదేవి ధరించిన సువర్ణరజతస్రజాద్యాభరణములు విశ్వకర్మ నిర్మించి యిచ్చినవే.

'కాంచనకేయూరకంకణకింకిణీకటకాదులను విశ్వకర్మ యిచ్చె.'[1]

లక్ష్మీదేవి పద్మసమానవర్ణ యనియు విష్ణువామాంకగత యనియు భారతము.

నారాయణాంకగతాం జ్వలంతీం దృష్ట్వా శ్రియం పద్మసమానవర్ణాం ॥

—వ్యా.భా. అను. 8-3

'నారాయణాంకతలమున శ్రీరాజిల్లఁగఁ జూచి చిత్తం బతి విస్మేరంబై రుక్మిణి విస్తారనయన' యైనది. —తిక్కన. అను. 1-283

మూర్తిమతినై యనన్యచిత్తముతో శ్రీమన్నారాయణునే మనమునందు నిలిపికొని యనవరతమునేను నారాయణాయాంకతలమునందే వసింతు ననియు ఏ పురుషుఁడు నన్ను భావము నందు నిలిపికొనునో వాఁడు ధర్మార్థయశఃకామ సిద్ధులతో వర్ధిల్లు ననియు శ్రీదేవి రుక్మిణీదేవికిఁ జెప్పినది.

నారాయణత్వేకమనా వసామి సర్వేణభావేన శరీరభూతా ।
భావేన యస్మిన్ నివసామి పుంసి స వర్ధతే ధర్మయశోఽర్థకామః ॥

— వ్యా భా. అనుశాసనిక. 11-19, 20

పురాణేతిహాసములం దెడనెడఁ గల లక్ష్మీదేవి రూపలక్షణముల నన్నింటిని సమీకరించి రచించిన ధ్యానశ్లోకములు ప్రతిమాకారుల కుపయుక్తములుగా నుండును.

---

1 శ్రీమదాంధ్రమహాభాగవతము. 8-270 = వ్యాసభాగవతమహాపురాణము.
"భూషణాని విచిత్రాణి విశ్వకర్మా ప్రజాపతిః ॥". —8.8-16

వందేలక్ష్మీం పరశివమయీం శుద్ధజాంబూనదాభాం।
తేజో రూపాం కనకవసనాం సర్వభూషోజ్జ్వలాంగీం।
బీజాపూరం కనకకలశం హేమపద్మే దధానాం।
ఆద్యాం శక్తిం సకలజననీం విష్ణువామాంకసంస్థామ్॥

—అథర్వశీర్షగత - శ్రీలక్ష్మీహృదయము. శ్లో. 2

శ్రీ దుర్గాసప్తశతి యందు మహాలక్ష్మిరూపము మఱొకవిధముగా నున్నది. ఆమె అష్టాదశభుజ. ప్రవాళవర్ణ. సరోజస్థిత.

అక్ష స్రక్ పరశూ గదేషు కులిశాన్ పద్మం ధనుః కుండికాం।
దండం శక్తి మసిం చ చర్మ జలజం ఘంటాం సురాభాజనం।
శూలం పాశ సుదర్శనం చ దధతీం హస్తైః ప్రవాళప్రభాం।
సేవే సైరిభ మర్దినీం ఇహ మహాలక్ష్మీం సరోజస్థితామ్॥

విష్ణ్వాలయములు విశ్వవ్యాప్తముగానున్నవి. లక్ష్మీదేవి విష్ణుమూర్తి సన్నిధి యందే యుండును. కావున లక్ష్మీదేవికి ప్రత్యేకముగ నాలయములు తక్కువగ నున్నవి.

మహారాష్ట్రము నందలి కొల్లాపురమున శ్రీమహాలక్ష్మి యాలయ మున్నట్లు కాశీఖండము వలనఁ దెలియుచున్నది.

అగస్త్యముని పదునెనిమిదిపీఠములందును బ్రసిద్ధంబైన కొల్లాపురము నకుం జని యందు...

భద్రకాళికయై ఘోరపరశుధారఁ గ్రూరదైత్యునిఁ జారిగొన్న ఘోరమూర్తి
శౌరివక్షఃస్థలీనభశ్చంద్రరేఖ శ్రీమహాలక్ష్మి భక్తి వీక్షించెఁ దపని॥[1]

కొల్లాపురమునందలి మహాలక్ష్మివిగ్రహము విశ్వకర్మశాస్త్రానుసారము నిర్మింపఁబడినది.[2]

క్షేత్రే కొల్లాపురే దైత్యే (పురాదన్యే) మహాలక్షీర్యదాऽర్చ్యతే।
లక్ష్మీవాన్ సా తదా కార్యా రూపాభరణభూషితా॥ 59
దక్షిణాధఃకరే పాత్రిమూర్ధ్వే కౌమోదకీ భవేత్।
వామోర్ధ్వేఖేటకం ధత్తే శ్రీఫలం తదధఃకరే॥ 60

—రూపమండనము. 5-59,60

1. చూడు :- శ్రీనాథుఁడు. కాశీఖండము. 3-36-38
2. Cf. ;- T N. Srinivasan : A Handbook of South Indian Imgaes. P.99

# గ ణ ప తి

గణానాం త్వా గణపతిగ్ం హవామహే ।
కవిం కవీనా ముపమశ్రివస్తమమ్ ।
జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ।
ఆ నః శ్రుణ్వ న్నూతిభిః సీద సాదనమ్॥

—ఋగ్వేద. 2.23-1

గణపతి యనఁగా గణముల కధిపతి. గణము లన రుద్రసంతతి; ప్రమథ గణములు. మరుద్గణములు కావచ్చును. లేదా శిల్పిగణములు కావచ్చును. మరుత్తులు శిల్పులే.

అందఱిలో నగ్రగణ్యుఁడైన గణపతియే బ్రహ్మణస్పతి.

బ్రహ్మణస్పతి యన బ్రహ్మజ్ఞానమున కధిపతి. అతఁడే బృహస్పతి, వాచస్పతి "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" (ఋగ్వేద. 10.81.7) అను శ్రుతి ప్రకారము వాచస్పతియు - (బ్రహ్మణస్పతి) - విశ్వకర్మయు నొక్కరే.

కవులకు కవి యైన బ్రహ్మణస్పతియే సమస్తపూజారంభము లందు గణపతిగా పూజింపఁబడుచున్నాడు

వై ది క గ ణ ప తి యే - బ్రహ్మణస్పతియే - యనంతరకాలమున గజవదనుఁడుగను విఘ్నేశ్వరుఁడుగను రూపాంతరము చెందినాఁడు.[1]

నాందీముఖేషు సర్వేషు పూజయేద్ యో వై గణాధిపం ।
తస్య సర్వో భవేద్ వశ్యః పుణ్యం భవతి చాక్షయమ్॥
గణానాంత్వేతి మంత్రేణ సర్వయజ్ఞ ముఖేషు చ ।
సర్వసిద్ధిమవాప్నోతి స్వర్గం మోక్షం లభే న్నరః ॥
మృణ్మయప్రతిమాయాం చ చిత్రే చాథ దృషన్మయమ్ ।
ద్వారదారూణి పాత్రే చ హేరంబం లేఖయేద్ బుధః ।
తస్య కార్యాణి సిధ్యంతి దయితాని సమంతతః ।
న విఘ్నం జాయతే కించిత్ త్రైలోక్యం వశమానయేత్॥

—పద్మపురాణ. సృష్టిఖండ. అ. 76-1-4

1. Cf :- Swami Harshananda : Hindu Gods and Goddesses — p. 131.
"It is quite reasonable to suppose that the Ganapati-Brahmanaspati of the Rigveda gradually got metamorphosed into the deity 'Gajavadana-Ganesa-Vighneswara.'"

**గజాననుఁడు :** గజముఖుఁడాదిమజాతుల యారాధ్యదైవము. కాలక్రమమున ఆర్యు లార్యేతరజాతులతోఁ గలిసి సామరస్యముతో గజాననరూపలక్షణములను తమ గణపతి కాపాదించికొనినారు.

అవైదికమయిన నేటి గజాననమూర్తికి మూలము వైదిక గణపతి - బృహస్పతి - బ్రహ్మణస్పతియే.[1] కుశానులకాలము [క్రీ. శ 176] తరువాతనే గణాధిపతికి గజముఖరూపము కల్పింపబడినది.

ప్రతిసంవత్సరము భాద్రపదశుద్ధచతుర్థి - వినాయకచతుర్థి దినమున భారతదేశమునం దంతటపూజింపఁబడు గజాననమూర్తి ఆర్యానార్య (ఆర్య - ద్రావిడ) సంస్కృతీసంగమమునకు నిదర్శనము.

ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజమ్।
పాశాంకుశధరం దేవం ధ్యాయేత్ సిద్ధివినాయకమ్॥

నన్నయ మహాభారతరచనారంభమున గజాననుని స్మరించినాఁడు.

**భారతలేఖకుఁడు :** బ్రహ్మదేవుని యాజ్ఞానుసారము వ్యాసమహర్షి గణేశుని పూజించి భారతలేఖకుఁడవు కమ్మని కోరఁగా గణపతి లేఖకుఁడైనాఁడు.

పూజితోఽపవిష్టశ్చ వ్యాసేనోక్త స్తథాఽనఘ।
లేఖకో భారతస్యాస్య భవ త్వం గణనాయక॥....
ఓ మిత్యుక్త్వా గణేశోఽపి బభూవ కిల లేఖకః॥ -వ్యా భా. ఆది. 1-77,76

ఈ వృత్తాంతము కల్పిత మని విమర్శకుల యభిప్రాయము.

వ్యాసభారతమునందు గణేశ, గణేశాన, గణనాయక, హేరంబ, విఘ్నేశ అను పదములున్నవి (ఆది. 1-74-77) కాని 'గజానన' యను మాట లేదు.

ప్రాచీనకాలమున లేఖకులు శిల్పులే. కావున భారతలేఖకుఁడైన గణనాయకుఁడు శిల్పిగణనాయకుఁడై యుండవచ్చును.

నన్నయకాలమునఁ గూడ లేఖకులు శిల్పాచార్యులే.
'లేఖకో గండాచార్యః' —నందంపూడి శాసనము

వ్యాసప్రోక్తమయిన భారతమును లిఖించి లోకోపకార మొనరించిన లేఖకోత్తముఁడు గణనాయకుఁడైనను శిల్పిగణనాయకుఁడైనను అభినందనీయుఁడే.

---

1. Cf. :- P L Bhargava : Vedic Age P P 309-10
"He (Brihas pati) is undoubtedly the Proto Type of the later Hindu God Ganapati".

# దేవతా ప్రతిమలు

దేవతాప్రతిమలను శిల్పాగమ శాస్త్రానుసారము సలక్షణముగ సర్వాంగసుందరముగ ప్రసన్నదృక్కులతో మనోహరముగనుండు నట్లు నిర్మింపవలెను.

సురూపా సుప్రభా చైవ సర్వాభరణభూషితా ।
స్వాయుధైశ్చ సమాయుక్తా కర్తవ్యా ప్రతిమా శుభా॥ — కాశ్యపశిల్పము

ప్రధానదైవతములగు బ్రహ్మ విష్ణు మహేశ్వరమూర్తులకు ఉత్తమ దశతాలము (124 అంగులముల పొడవు) సరస్వతీ లక్ష్మీ దుర్గాదిదేవీమూర్తులకు మధ్యమదశతాల ప్రమాణము (120 అంగుళములు) ఉచితముగ నుండును.

ఉత్తమం దశతాలేన బ్రహ్మ విష్ణు మహేశ్వరమ్ ।
మధ్యమం దశతాలేన ఉమా సరస్వతీ తథా
ఉషా భూమిశ్చ దుర్గా చ లక్ష్మీశ్చ మాతరస్తథా॥
—కాశ్యపశిల్పమ్ పటల 50-80-81

దేవీ విగ్రహము దేవుని చెవుల యెత్తుండవలయు నని మనువు - త్వష్ట, మున్నగువారు వచించినా రని మయశాస్త్రముచెప్పుచున్నది.[1]

దేవస్య కర్ణాంతసమప్రమాణాం దేవీం మను త్వష్టృముఖా వదంతి॥

దేవాలయము లందలి దేవతా ప్రతిమలు పదునాఱు హస్తముల ప్రమాణముండుట శ్రేయస్కరము.

గృహదేవతాప్రతిమల ప్రమాణము అంగుష్ఠ పర్వము మొదలుకొని ద్వాదశాంగుళముల వఱకు నుండవచ్చును.

అంగుష్ఠపర్వాదారభ్య వితస్తిర్యావదేవ తు ।
గృహేషు ప్రతిమా కార్యా నాధికా శస్యతే బుధైః ।
ఆషోడశా తు ప్రాసాదే కర్తవ్యా నాధికా తతః ॥ —మత్స్యపురాణ. 257-23

ప్రతిమా ప్రమాణముల మాట యటుంచి యర్చావైకృతి యరిష్టదాయకము.

దేవతాప్రతిమా శ్చైవ కంపంతి హసంతి చ
వమంతి రుధిరం చాస్యైః స్విద్యంతి ప్రపతంతి చ॥ —వ్యా.భా. భీష్మ 2-26

---

1 చూడు :- కళాప్రపూర్ణ డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : శిల్పదర్శనము - దేవాలయశిల్పము. పు. 153-4

# అష్టవిధప్రతిమలు

శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ।
మనోమయీ మణిమయీ ప్రతిమాఽష్టవిధ స్మృతా॥

—వ్యాసభాగవతము. 11-27-12

భాగవతమహాపురాణమునం దష్టవిధప్రతిమలు పేర్కొనఁబడినవి. కాని మహాభారతకాలమున దేవాలయముల యందలి ప్రతిమలు మృణ్మయములో దారుమయములో యైయుండవచ్చును.

గృహదేవతా ప్రతిమలు హిరణ్మయములై యుండును.

తపతి బంగారుబొమ్మ వలె నున్నట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

విభ్రాజమానా శుశుభే ప్రతిమేవ హిరణ్మయీ॥ —ఆది. 171-29

ప్రతిమాకారుఁడు శిల్పాగమశాస్త్రానుసారము నిర్మించిన దేవతాప్రతిమకు మంత్రయుక్తముగా నేత్రోన్మీలన మొనరించి ప్రాణప్రతిష్ఠ చేసి బింబమునందు దైవశక్తిని నిక్షేపించిననే గాని యా దేవతామూర్తి మహిమాన్వితము కాఁజాలదు.

దృష్టినిర్మాణకాలే చ ప్రాణసంస్థాపనేఽపి చ
మంత్రతంత్రప్రభావజ్ఞః కారయే చ్ఛిల్పికోత్తమః॥ —మయవాస్తు

వంశపారంపర్యముగా శిల్పవిద్యారహస్యములను పూర్వాచార్య సంప్రదాయమును తెలిసిన విశ్వకర్మకులోద్భవుండైన శిల్పాచార్యుఁడే యందుకుఁ దగినవాఁడని మయుఁడు వక్కాణించినాఁడు.

"విశ్వకర్మకులాచారః పూర్వాచారవిధిక్రమః॥" —మయశాస్త్ర*

"భారతీయశిల్పి సకలశాస్త్రవేత్త. యోగవిద్యారహస్యములను అనుష్ఠానముచే సాధించిన యోగీంద్రుఁడు." 1

కావుననే ప్రాచీనకాలమునుండియు దివ్యసుందర విగ్రహములు నిర్మించి భక్తజనుల దృష్టిని భగవంతునివైపు మరల్పగలుగుచున్నాఁడు. ఈవిధముగా సనాతనధర్మప్రచారమునకు సమాజకల్యాణమునకు పాటుపడుచున్న శిల్పాచార్యుఁడు చిరస్మరణీయుఁడు.

---

* Cf. :- P. N. Bose : Principles of Indian Silpa Sastra with text of Mayamata.

1 చూడు :- గడియారం రామకృష్ణశర్మ : మన వాస్తుసంపద. పు. 29

# పూర్తశిల్ప సమీక్ష

ఏకాలమునం దయినను సకలజనోపయుక్తములగు వాపీకూపతటాకాది పూర్తశిల్పము లుండకతప్పదు.

మహాభారతకాలమున వాపీకూపతటాకాదులే కాక దేవతాయతన చైత్యము లున్నవి.

పూర్తశిల్పమునందు దేవాలయములు ముఖ్యమైనవి.

రాజధానీనగరములందు, పురోపాంతముల యందు శివాలయములు దుర్గాలయములు గలవు.

దేశమునం దింద్రోత్సవములు, పశుపతిపూజామహోత్సవములు, బ్రహ్మమహములు జరుగుచుండెడివి.

తీర్థయాత్రాస్థలములందు వివిధదేవతలకు పూజాస్థానములున్నవి.

దేవస్థానములందు పూజలు సలుపుట కాయా దేవతల ప్రతీకలో ప్రతిమలో యుండవలయును. అవి భక్తజనుల పూజలందుకొని యభీష్టదాయకము లగుచున్న వనఁగా నా దేవతాప్రతిమలను పరమనిష్ఠాగరిష్ఠులు, మంత్రతంత్రార్థ కోవిదులు నగు శిల్పాచార్యులు నిర్మించి స్థాపించియుందు రని చెప్పవచ్చును.

విశ్వకర్మకులోత్పన్నులగు శిల్పిబ్రాహ్మణులే దేవతామూర్తులను నిర్మించి ప్రతిష్ఠింపఁదగినవారు.

శిల్పినాం దేవకర్తృత్వం వంశ్యానాం విశ్వకర్మణః ॥

—స్కాందపురాణము. ప్రతిష్ఠాఖండము.

సహజశిల్పకళోపజ్ఞాభినివేశనములతో సర్వజనీనములగు దేవతాప్రతిమలు నిర్మించి సామాన్యమానవుల నాకర్షించి సగుణోపాసనమున భగవంతుని సన్నిధిని జేర్చు సర్వజ్ఞుఁడగు శిల్పిబ్రహ్మ సర్వథా సర్వదా సంస్తవనీయుఁడు.

శిల్పినా కల్పితం దైవం శిల్పిబ్రహ్మమయం జగత్.



# అవలోకిత గ్రంథ పట్టిక - ఇతిహాసములు

తెలుగు :

శ్రీమదాంధ్ర మహాభారతము (కవిత్రయము వారిది)

1) వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు

2) బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు, 3) రామా అండ కో, ఏలూరు

సంస్కృతము :

1) శ్రీమద్భారతమ్ - వేదవ్యాస ప్రణీతమ్ (తెలుగు లిపి)
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్, మదరాసు

2) శ్రీ మహాభారతమ్ - నీలకంఠకృత భారతదీపికా సహితమ్
- చిత్రశాలా ప్రెస్, పూనే

3) శ్రీ మహాభారతమ్ - పండిత రామనారాయణదత్త శాస్త్రీ పాండేయ
హిందీ అనువాదసహితము - గీతా ప్రెస్, గోరఖ్‌పూర్

4) శ్రీ మహాభారత - సభాపర్వ మూల సంస్కృత శ్లోక -
హిందీ టీకా సహితము - డా॥ పం. శ్రీపాదసాతవలేకర్
స్వాధ్యాయమండల్, పారడీ

హిందీ :

1) హిందీ మహాభారత - చతుర్వేదీ ద్వారకాప్రసాద్ శర్మ
- రామనారాయణలాల్ పబ్లిషర్, ఇలహాబాద్

2) మహాభారత కాలీన సమాజ్ - సుఖమయ భట్టాచార్య
- అనువాదికా - పుష్పా జైన్. లోకభారతీ ప్రకాశన్, ఇలహాబాద్

ENGLISH :

1) The Mahabharata of Krishna Dwaipayana Vyasa.
Tr. English Prose by Pratap Chandra Roy,
-Datavya Bharata Karyalaya, Calcutta.

2) The Mahabharata - A criticism by C. V. Vaidya
- A. J Combridge & Co.' Bombay.

3) The Great Epic of India - E. W. Hopkins.

పురాణ గ్రంథములు :

అగ్ని, గరుడ, మత్స్య, విష్ణు, పద్మ, స్కంద, బ్రహ్మాండ, మార్కండేయాది పురాణములు, భాగవతమహాపురాణము,

# వైదిక గ్రంథములు

అధర్వవేదము :

1) సాయణభాష్యోపేతము - చౌఖాంబా సంస్కృత సీరీజ్, వారణాసి
2) క్షేమకరణదాస్ త్రివేదీ - భాషాభాష్యము దయానంద సంస్థాన్
3) డా॥ విద్వాన్ విశ్వం - తెలుగు అథర్వవేద సంహిత, తి. తి. దే

ఋగ్వేదము :

1) సాయణభాష్యోపేతము - చౌఖాంబా సంస్కృత సీరీజ్
2) దయానంద సరస్వతి - భాషాభాష్యము దయానంద సంస్థాన్

కృష్ణయజుర్వేదము :

1) సాయణభాష్యోపేతము - ఆనందాశ్రమ గ్రంథావళి, పూనే

శుక్లయజుర్వేదము :

1) దయానంద భాషాభాష్యము - దయానంద సంస్థాన్
2) ఆంధ్రానువాదము - ఆచార్యార్యులు ముదునూరు, కృష్ణా జిల్లా

ఆంధ్ర రుద్ర భాష్యము : చదలువాడ సుందరరామశాస్త్రులు -
తైత్తిరీయ బ్రాహ్మణము (తెలుఁగు లిపి), మైసూరు ప్రతి
శ్రీమద్వాజసనేయ మాధ్యందిన శతపథ బ్రాహ్మణము :
సాయణభాష్యోపేతము - గంగావిష్ణు శ్రీకృష్ణదాస్, కల్యాణ్
తాండ్య మహాబ్రాహ్మణము : సాయణభాష్యోపేతము - చౌఖాంబా
సామవేదీయ సుబోధినీ పద్ధతిః శుక్ల । శ్రీ శివరామ - చౌఖాంబా
కాత్యాయన శుల్బసూత్రమ్ : వ్యాఖ్యా సహితము - చౌఖాంబా
గౌతమ ధర్మ సూత్రములు : హరదత్తాచార్య మితాక్షర వ్యార్యే సహితమ్ :
పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, మదరాసు 1925
అగ్నిహోత్ర చంద్రిక : వినాయక గణేశ ఆప్టే - ఆనందాశ్రమ, పూనా
ఆధానపద్ధతి - ఆధానమీమాంసా
ఆపస్తంతీయ శ్రౌతాధాన సూత్రమ్ } వామనశర్మ - ఆనందాశ్రమ, పూనే
ఆర్షధర్మ సూత్రములు : సంకలనకర్త. చర్ల గణపతిశాస్త్రి. విశాఖపట్నం
హిందూ సంస్కార్ (హిందీ) : డా॥ రాజబల పాండేయ -
సంస్కార విధిః - దయానంద సరస్వతి : దయానంద సంస్థాన్
వేదతత్త్వ ప్రకాశము, సత్యార్థ ప్రకాశము : దయానంద సరస్వతి ,,
వేదవాఙ్మయము : ముట్నూరి సంగమేశం

## Books in English on Ancient Civilisation Culture and Religion

R. C. Mujumdar : Ancient India
Romesh C. Dutt : Early India Civilisation
P. L. Bhargava : The Vedic Age
A L. Basham : The wonder that was India
N. C Bandhopadya : Hindu Polity and Polytical Theries
E. B. Hawell : History of Aryan Rule
Dr Balinath Puri : India with time of Patanjali
E J. Rapsan (ed) : The Cambridge History of India Vol I. - Ancient India
Dr. A. B. L. Awusthi : Studies in Skanda Purana Part I.
Miss. Nileswari V. Desai : Ancient Indian Society (Religion and Mythology as depiceated an Markandeya Parana
The Cultural Heritage of India : Ramakrishna Mission.

## శిల్పశాస్త్ర గ్రంథములు

కాశ్యపశిల్పమ్ : కశ్యపబ్రహ్మర్షి ప్రణీతమ్
మయమతము : మయకృతము
విష్ణుధర్మోత్తరము : విగ్రహశిల్పరహస్యము (Hindu idols & Symbolisim) దేవరకొండ శేషగిరిరావు
రూపమండనము : మండరమిశ్ర
భారతీయ దేవాలయము : డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి
మనవాస్తుసంపద : గడియారం రామకృష్ణశర్మ
శిల్పదర్శనము, వీరరాఘవ వ్యాసావళి : డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు
ఆంధ్ర శిల్పకళా పరిణామము : వి. శివరామమూర్తి విజ్ఞానసర్వస్వము, తెలుగుభాషాసమితి
విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము : వడ్డెపాటి నిరంజనశాస్త్రి
భారతీయ వాస్తుశాస్త్ర – ప్రతిమావిజ్ఞాన (హిందీ) : ద్విజేంద్రలాల్ శుక్లా

## Books in English on Art and Architecture

P. K. Acharya (1) An Encyclopaedia of Hindu Architecture
(2) Manasara

M. A. Ananthelwar (ed) : Indian Architecture

P. N. Bose : Principles of Indian Silpa Sastra with text of Mayamata

D. N. Sukla : Silpasastra

G. K. Pillai : The Ways of Silpis

V. S. Agrawala : Studies in Indian Art

Joseph Campbell : (ed). The Art of Indian Asia

Radha Kamal Mukerjea : The Flowering of Indian Art

Stella Krammishch : Hindu Temple

V. S. Agrawala : Evolution of Hindu Temple

Swami Harshananda : (I) All about Hindu Temples
(2) Hindu Gods and Goddesses

J. Jitendranath Benergea : Development of Hindu Iconography

N. K. Bhatta Sali : Iconography of Buddhist and Brahmanical Sculptures in Decca Musium

T. N. Srinivasan : A Hand book of South Indian Images

T. H. Dave : Immortal India

Krishna Deva : Temples of North India

Arabinda Chatterjee : Konark at a glance

Debala Mitra : Konark

N. Ramesan : Temples and legends of Andhra Pradesh.

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 4 | 8 | శ్రేష్ట | శ్రేష్ఠ |
| 6 | 11 | మహోత్సంబులు | మహోత్సవంబులు |
| 8 | 16 | యజ్ఞమేవోపయోజ్యం | యజ్ఞమేవోపయోజ్యం |
| | 20 | సృష్టించనాఁడు | సృష్టించినాఁడు |
| 12 | 21 | సద్గంబున | సర్గంబున |
| 19 | 14 | ఏనసాఽహురిత్వగ్రీధ్రి | ...త్యగ్నీధ్రే |
| 21 | 4 | వడిసె | వడసె |
| 30 | 8 | సంవీతాన | సంవీతాన్ |
| 36 | 9 | స్నాతకుండు | స్నాతకుండును |
| 37 | 5 | నభిషికః౦ జేసి | నభిషిక్తుంజేసి |
| 38 | 2 | నిర్మత | నిర్మిత |
| 41 | 26 | యెక్కడుగా | యెక్కుడుగా |
| 45 | 26 | తగఁజెసి | తగఁజేసి |
| 49 | 1 | అశ్వమేధమాగ | ...యాగ |
| 51 | 20 | యజ్ఞవాసమునకు | యజ్ఞవాటమునకు |
| 56 | 1 | ప్రపవర్గ్యము | ప్రవర్గ్యము |
| 57 | 13 | పి్రయః | ప్రియం |
| 59 | 7 | ప్రతిదశమేకాంమధ్యే | ప్రతిదిశమేకాం మధ్యే |
| | 19 | యనువీయేగురు | యను నీ యేగురు |
| | 19 | దేవతలులకు | దేవతలకు |
| | 21 | హిరణ్యేష్టకులు | హిరణ్యేష్టకలు |
| 63 | 3 | ఇష్టకోపధానక ్రమ | ఇష్టకోపధానక్రమ |
| 65 | 11 | 21. యూపములు | 21 యూపములు |
| 66 | 9 | వొనర్చు | నొనర్చు |
| | 26 | నిర్జితస్వర్గత్వభాసి | నిర్జితస్వర్గత్వభాసి |
| 69 | 14 | బ్రాహ్మబులకు | బ్రాహ్మణులకు |
| | 24 | హిరణ్మకారులు | హిరణ్యకారులు |
| 70 | 5 | ఊర్వలోకములు | ఊర్ధ్వలోకములు |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 70 | 19 | దక్షణా | దక్షిణా |
| 71 | 21 | అగ్నిష్ఠోమము | అగ్నిష్టోమము |
| | | ఉర్థ్యము | ఉక్థ్యము |
| | 28 | పంచాగుప్తల | పంచాగ్నుల |
| | 29 | షొడరీ | షోడశీ |
| 72 | 10 | స్థండిలముతో | స్థండిలములతో |
| 73 | 11 | సరస్వతీరము | సరస్వతీతీరము |
| 75 | 18 | ప్రతిక | ప్రతీక |
| 76 | 2 | నసురుల | నసురులు |
| | 5 | పురష్తాత్ | పురస్తాత్ |
| 77 | 5 | చెప్పఁబడినది | చెప్పఁబడినది |
| 78 | 22 | దేవనాం ముఖ్యః | దేవానాం ముఖ్యః |
| 79 | 8 | వ్రజమును | స్రజమును |
| | 17 | శ్రేష్టత్వము | శ్రేష్ఠత్వము |
| | 18 | నంతియును | నంతయును |
| | 23 | భ్రాహ్మణము | బ్రాహ్మణము |
| | 27 | స్రజం | స్రజం |
| 80 | 4 | ఏకాహమైన... యాగక్షేదము | ఏకాహమైన... యాగభేదము |
| 82 | 3 | ద్విజాన్ | ద్విజాన్ |
| 83 | 24 | నధ్వర్యున కొనఁగవలెను | నధ్వర్యునకొసఁగవలెను |
| 87 | 9 | రాజసూయః యజ్ఞ దీక్షితుః డయినట్లీ | రాజసూయయజ్ఞ దీక్షితుఁ డయినట్లు |
| 88 | 3 | వాజలేయేన | వాజపేయేన |
| 90 | 26 | ...వె ప్రజాప్రతిః | ...వై ప్రజాపతిః |
| 91 | 11 | కర్తవ్యాని త్యయా | కర్తవ్యాని త్వయా |
| | 26 | హిరణ్యపుగాషుని | హిరణ్యపురుషుని |
| 95 | 1 | సంజ్ఞకము | సంజ్ఞకము |
| | 2 | నెఁబది | నేఁబది |
| 96 | 17 | దేవలకు | దేవతలకు |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
| --- | --- | --- | --- |
| 96 | 20 | య్యసాసా | యస్యాసా |
| 100 | 4 | నీరిలోమండి | నీరిలోనుండి |
| 101 | 11 | జామద్న్యః | జామదగ్న్యః |
| 102 | 6 | జనాధిపుఁదంత | జనాధిపుఁడంత |
| 106 | 9 | దుద్భవించినట్లు | నుద్భవించినట్లు |
| 107 | 9 | మాపథర్మా | మాపద్ధర్మా |
| | 14 | తతస్తా మనవద్యాంగీం | ...మనవద్యాంగీం |
| 117 | 17 | జౌలోపనమంబు | జౌలోపనయంబు |
| 118 | 11 | గృహాంతర్భాగముందు | గృహాంతర్భాగమంద |
| | 17 | మరుద్భ | మరుద్భ్య |
| 124 | 22 | పశిష్ట | వశిష్ట |
| 126 | 4 | మంత్రలముతో | మంత్రములతో |
| 132 | 15 | దక్షణ | దక్షిణ |
| 133 | 23 | ధౌమ్యుండు | ధౌమ్యుఁడు |
| | 24 | మంత్రాముతులన్ | మంత్రాహుతులన్ |
| 135 | 8 | కనాద్యాము | కన్యాదానము |
| 136 | 9 | ప్రరత్యం | ప్రకర్తవ్యం |
| 138 | 12 | యాపస్తంభములు | యూపస్తంభములు |
| 143 | 17 | వినుతభుగి | వినుతభంగి |
| 144 | 6 | మానవపతి | నా మానవపతి |
| 145 | 4 | కడాగారామ | తడాగారామ |
| 146 | 7 | వెలయు | వెలయ |
| 147 | 5 | దానవు లుద్దత | దానవు లుద్ధత |
| 151 | 23 | ప్రోక్షితానాం | ప్రోక్షితానాం |
| 160 | 9 | స్దపతికి | స్థపతికి |
| 161 | 7 | షారగః | పారగః |
| 162 | 9 | వేదావేత్త | వేదవేత్త |
| 168 | 5 | వేటలుగల | పేటలుగల |
| 169 | 9 | రాజద్వారే | రాజద్వారే |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
| --- | --- | --- | --- |
| 173 | 14 | నారదుండు వడ | నారదుండు వడసె |
| | 15 | వేను | నేను |
| 176 | 5 | సేయుచున్న | సేయుచున్న |
| 182 | 3 | నీశు౹డందొఱకును | నీశుఁడందొఱకును |
| 183 | 4 | చంవకారణ్యంబున | చంపకారణ్యంబున |
| 184 | 11 | నుమస్తే | నమస్తే |
| 185 | 19 | మిధుషే | మీఢుసే |
| 186 | 14 | సర్వతోముఖు౹డవు | సర్వతోముఖుఁడవు |
| 187 | 6 | చుండుగన్ | చుండఁగన్ |
| 188 | 29 | రుపహారెశ్చ | రుపహారైశ్చ |
| 191 | 7 | మాప్నుయాత్ | మవాప్నుయాత్ |
| 194 | 19 | బడియేండ్లు | బదియేండ్లు |
| | 27 | బహ్మణః | బ్రాహ్మణః |
| 195 | 31 | స్థాయణ | సాయణ |
| 250 | 17 | శ్వేతహంసా భ్రమయతి చ గగతే | శ్వేతహంసే భ్రమతి చ గగనే |
| 206 | 22 | యచ్చెంజూడన్ | యబ్బెంజూడన్ |
| 211 | 20 | దపని | దపసి |

పయి పట్టికలో కొన్ని సవరణలు చూపితిమి. మా దృష్టి గోచరము కానివి మఱికొన్ని యుండవచ్చును. సహృదయులు వానిని సవరించుకొని చదువుకొన ప్రార్థన.

SRIMADANDHRA MAHABHARATA
SILPAKALADARSANAMU Part - II Rs. 50/-
*BY Dr. Sobhirala Satyanarayana*

"A Research work Par-excellence"
"...a work which cannot be ignored by any one interested in our ancient heritage and in the Sciences of Sculpture, architecture, wood-work and rituals"

★ ★

సుప్రసిద్ధ కవి పండితులు, కళాప్రియులు
ఆంధ్రాంగ్ల సాహిత్యాల లోను,
తత్త్వ మనస్తత్త్వ శాస్త్రాల లోను
ఎమ్. ఏ. పట్టభద్రులు,
పరిశోధనపరిణితులు
ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా
పనిచేసి పదవీవిరమణ చేసినారు.



"విశ్వజ్ఞ" బిరుద విభూషణ
వాస్తు జ్యోతిష విద్యాప్రవీణ డా॥ శోభిరాల సత్యనారాయణ

★ ★ ★

అదృష్టపూర్వమైన వీరి సిద్ధాంత గ్రంథము
"ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు సువర్ణపదకంతో మెచ్చిన
ముచ్చటైన బంగారు నగ"
"అఖిలాంధ్రం ఆమోదంగా అలంకరించుకునే మణిహారం"

శ్రీ విశ్వకర్మా విజ్ఞాన కేంద్ర
1-4/6-7 శాంతినగర్ : : శ్రీకాకుళం - 532 001